# కవిరాజ దర్శనం

కవిరాజ సాహితి సమితి,
విజయవాడ-2

ప్రథమ ముద్రణ
ఫిబ్రవరి 1964



వెల : రూ. 6-00

ముద్రణ :
వెంకటరత్నా ప్రింటర్సు,
విజయవాడ-2.

# మా మాట

ప్రస్తుతము మానవప్రపంచం భావ విప్లవము ద్వారా పురోగమనము చెందుతూ వున్నది. దీనికి కొందరు మేధావులు భావ విప్లవ బీజములను అప్పుడప్పుడు నాటుచు వచ్చిరి. దేశ కాల పరిస్థితులను బట్టి, యీ భావ బీజములు మొలకలెత్తి చిగిర్చి, వృక్షాకారములను పొందుతూ వచ్చినవి. ఈ బీజ నిర్మాతలలో ముఖ్యులు రామమోహన రాయ్, దయానందుడు, దేవేంద్ర ఠాగూర్, కందుకూరి, వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నం నాయుడు, గురజాడ అప్పారావు మొదలగువారు. వీరి మేధా సంపత్తివల్ల గొప్ప విప్లవ సాహిత్యము, భారతదేశములో సృష్టించబడినది. అదే వరవడిలో కవిరాజు మరింత భావోద్రేక పూరితుడై, తెలుగు సాహితీ రంగములో ఒక విలక్షణమైన స్థానములను సంపాదించినారు. ఈయన గొప్ప కవి. గొప్ప సంఘ సంస్కర్త. తాను చెప్పిన ప్రతిభావము వ్రాతలలోనే కాక, ఆచరణలో కూడ చేసి చూపెట్టిన కార్యాచరణ పరుడు. సంఘంలో జరుగుచున్న సాంఘిక దురన్యాయములను, మూఢ నమ్మకా

లను, జంతు బలులును నిర్మూలించుటకు ఆయన మనస్సు ఆరాట పడినది. దేవుని పేరుతో జరిగే మతాచార్యుల, మోసపు ఎత్తుగడలను పటా పంచలుచేసి, సాంఘిక న్యాయ మును చేకూర్చ ప్రయత్నించిన యుగ ప్రవక్త. నిరాడంబర మైన దేశ భక్తుడు.

కవిరాజుగారు చెప్పిన భావాలు ఆనాటి సంఘం పూర్తిగా అర్థం చేసుకో గలిగిన అంతస్థు లేకపోవటంచేత, వారు ఆశించినంత భావ విప్లవ చైతన్యము ప్రజానీక ములో ఆనాడు జరిగి యుండలేదు. రానురాను, సంఘంలో జరిగిన భావ చైతన్యము వల్ల యీనాడు వారి రచనలలోని భావాలను పూర్తిగా అర్థం చేసుకొనే పరిస్థితులు వచ్చినవి. ఆయన సాహిత్యాన్ని సమాజము అర్థంచేసుకొన గలిగిన సమయానికి, ఆయన లేకపోవడం దురదృష్టకరం. ఇంచు మించు ఆయన సాహిత్యమును తెలుగు ప్రజలు మరచి పోతున్నట్లున్నది.అందుచేత కవిరాజు సాహిత్యాన్ని వెలుగు లోనికి తేవడం అవుసరమనే తలంపుతో యీ కృషి ప్రారం భించినాము.మరియు, వారి భావాలను రచనలను యితర భాషలలోనికి అనువదింపజేసి అన్యభాషా వాసులకు కూడ అందించటము మా సంకల్పం.

ఏ భావ విప్లవాన్ని ప్రపంచ ప్రజలలో కలిగించవలె నని కవిరాజుగారు తహ తహలాడారో, అంతేగాక దేని

కొరకై అహర్నిశలు శ్రమించినారో; వాటిని విశేష ప్రచారము గావించి, వారి ఆశయ సిద్ధి కొరకై యీ సమితివారు పూనుకున్న తొలి ప్రయత్నమే యీ కవిరాజ దర్శనం. కోరినంతనే తమ అమూల్య రచనలు పంపిన కవులకు, రచయితలకు మరియు మా యీ ప్రయత్నమునకు సహాయ, సలహాల నందించిన శ్రీయుతులు ఆవుల గోపాలకృష్ణమూర్తి, త్రిపురనేని గోకుల్‌చంద్, కన్నెగంటి జగ్గయ్య, గుడివాడ కవిరాజ సాహిత్య విహార్ సభ్యులకు, అడిగినంతనే తొలి పలుకు వ్రాసియిచ్చిన శ్రీనార్ల వెంకటేశ్వరరావుగారికి, మా కృషికి తోడ్పడిన సహృదయు లందరుకు మా నమోవాకములు. పైన తెలిపిన మా ఆశయ సాఫల్యతకు విజ్ఞులందరు చేయూత నిత్తురు గాక !!

ఇట్లు,

కలపాల సూర్యప్రకాశరావు

అధ్యక్షులు

కవిరాజ సాహితి సమితి,

విజయవాడ-2.

# నమోవాకాలు

పాతబాట వెంట నడిస్తే కొత్త చోటుకు చేర గలమా? చేరమని చిన్నపిల్లవాడికైనా తెలుసు. అయినా పాత విశ్వాసాలతో, ధర్మాలతో, నీతులతో వేదాంతా లతో కొత్త సంఘాన్ని నిర్మించగలమని పెద్దలైనవారే భ్రమపడుతున్నారు.

కొత్త సంఘాన్ని నిర్మించుకోవాలంటే, ముందుగా కొత్త వేదాంతాన్ని-ఫిలాసఫీని- రూపొందించుకోవాలి. ఈ విషయాన్నే శ్రీ త్రిపురనేని రామస్వామిగారు పదే పదే చెప్పారు. పరిపరి విధాల చెప్పారు. పద్యం ద్వారా, గద్యం ద్వారా ఆయన దీన్ని చెప్పారు. పురాణాల ద్వారా, ప్రబం ధాల ద్వారా చెప్పారు. నాటకాల ద్వారా, శతకాల ద్వారా చెప్పారు. సూత్రాల ద్వారా, భాష్యాల ద్వారా చెప్పారు. సభా మండపాలనుంచి చెప్పారు; వివాహ వేదికల నుంచి చెప్పారు. సూతాశ్రమం నుంచి చెప్పారు; రాజకీయశిబిరం నుంచి చెప్పారు. హేళనగా చెప్పారు; లాలనగా చెప్పారు. ఆగ్రహపడుతూ చెప్పారు; అనున

యిస్తూ చెప్పారు. దీన్ని చెప్పడానికే ఆయన జీవించారు; ఇందుకొరకే మరణించారు.

కొత్త భవనాన్ని నిర్మించాలంటే, పాతదాన్ని పడగొట్టాలి; కొత్త ఫిలాసఫీని రూపొందించాలంటే పాతదాన్ని త్రోసిపుచ్చాలి. ఎండకెండి, వానకు తడిసి, ఎంత చివికిపోయినా, ఎంతగా చవుడు కారుతున్నా, పాత భవంతిని పడగొట్టడానికే చేతులురావు. అయినప్పుడు పాత ఫిలాసఫీని త్రోసిపుచ్చడం మాటలా ? దాన్ని గురించి పల్లెత్తుమాట అన్నా, ఎందరికో మనస్సు చివుక్కుమంటుంది. ఏదో మహాదపచారం జరిగినట్లు వారు బాధపడతారు.

అయినా, మానవవికాసాన్ని కోరేవారు, సంఘపురోగతిని కాంక్షించేవారు, నవజీవనాన్ని లక్షించేవారు, ఎవరేమనుకొన్నా సరే, పాత ఫిలాసఫీని విమర్శించడానికి జంకరు; కొత్తదాన్ని ప్రతిపాదించడానికి వెనుదీయరు. తమను లోకం వెర్రివానికింద జమకట్టవచ్చు; తమపై రాళ్ళురప్పలను విసరవచ్చు; సంఘ విద్రోహిగా భావించి తమను రూపుమాపడానికే ప్రయత్నించవచ్చు. వేమన్నను వెర్రివానిగా లోకం నిరసించలేదా ? సోక్రటీస్‌ను సంఘ విద్రోహిగా భావించి, విషమిచ్చి చంపలేదా? అయినా, పాత ఫిలాసఫీ స్థానంలో కొత్తదాన్ని ప్రతిష్ఠాపించడం ద్వారా సాంఘిక విప్లవాన్ని సాధించగోరే ధీరులు తమ కృషినుంచి చలించరు; దాన్ని విరమించరు. నూటికో కోటికో తలయెత్తే ఇట్టి ధీరవర్గానికి చెందినవారే రామస్వామిగారు.

మత మౌఢ్యాలకు స్వస్తి చెప్పి మానవతకు పట్టాభిషేకం చేయాలని రామస్వామిగారు కోరారు. అది ఆయన తరంలో జరగలేదు. ఈ తరంలోను జరగకపోవచ్చు. కాని, అది జరిగే తరం రాకపోదు, ఆయన జీవితకాలంలో కంటె ఈ నాడు ఆయన సందేశం మరింత వ్యాప్తి చెందుతున్నదన డానికి ఈ విస్తృత వ్యాస సంకలనమే ఒక ప్రబల తార్కాణం. యువకులైనవారు దీని ప్రచురణకు బాధ్యత వహించడం మరింతగా గమనించదగు విశేషం. కవిగా, పండితునిగా రామస్వామిగారిని హర్షించి, గౌరవించి, తత్త్వవేత్తగా ఆయనను నిర్లక్ష్యం చేసిన పాతతరానికి వీరు, చెందరు. రచయితగా కంటె, రివల్యూషనరీగా వీరు రామస్వామి గారిని హెచ్చుగా ప్రేమిస్తారు, గౌరవిస్తారు. ఆయన పట్ల నా కున్నది సరిగ్గా ఈ గౌరవభావమే.

రివల్యూషనరీ రామస్వామిగారికి నా నమోవాకాలు.

20-2-1964
విజయవాడ.

నార్ల వెంకటేశ్వరరావు

# విషయసూచిక



సూతాశ్రమమ్ — తెనాలి.

# వీ ర గ ం ధ ము

వీరగంధముఁ దెచ్చినారము
వీరుడెవ్వడొఁ దెల్పుడీ!
పూసి పోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో !!

తెలుగుబావుట కన్నుచెదరఁగ
కొండవీఁటను నెగిరినప్పుడు,
తెలుగువారల కత్తి దెబ్బలు
గండికోటను కాంచి నప్పుడు,

తెలుగువారల వేడినెత్తురు
తుంగభద్రను గలిసినప్పుడు
దూరమందున నున్న సహ్యజ
కత్తినెత్తురు కడిగినప్పుడు,

ఇట్టి సందియమెన్నఁడేని యుఁ
బుట్టలేదు రవంతయున్:
ఇట్టి ప్రశ్నల నడుగువారలు
లేకపోయిరి సుంతయున్.

నడుముగట్టిన తెలుఁగు బాలుఁడు
వెనుక తిరుగండెన్నఁడున్
బాసయిచ్చిన తెలుగుబాలుడు
పాఱిపోవండెన్నఁడున్,

ఇదిగొ! యున్నది వీరగంధము
మైనలంచుము మైనలందుము;
శాంతిపర్వముఁ జదువవచ్చును.
శాంతి సమరంబైన పిమ్మట,

తెలుఁగునాఁటిని వీరమాఁతను
జేసిమాత్రము తిరిగి క్రమ్మఁక
పలుతుపాకులు పలుఫిరంగులు
నారి కడ్డము రాకతప్పదు.

వీరగంధముఁ దెచ్చినారము
వీరుఁడెవ్వఁడొఁ దెల్పుడీ!
పూసిపోదుము మెడనువైతుము
పూలదండలు భక్తితో !!

—కే ప రా జు

# విప్లవ కవిరాజు

పాతదారినే నడిచే
"పవిత్రులకు" తలవంచని
ఓ విప్లవ కవిరాజా!
ఓ వినూత్న రవితేజా!

క్రొత్తదారిలో తొలినే
మెత్తని దిండ్లుండవుగా!
ముండ్లుండును రాళ్ళుండును,
ముద్దుగొనును పాదములను.

ముండ్లకు రాళ్ళకు జడియక
ముందుకు సాగిన వాడవు,
నీవు వేసినట్టి బాట
నేడు మాకు రాచబాట.

నిశితముగా చూడగలుగు
నీ కన్నుల లోతులలో
కోటి కోటి భానుబింబ
పాటవ మున్నది, స్వామీ!

త్రిపురనేని రామయ్యా!
త్రిపుర హరుడ వీవయ్యా!
పాతబూజు దులిపినావు
లేత జాజు నిలిపినావు

మడిగట్టినట్టి మూఢ
మనస్తత్వ పిశాచము
నడ్డివిరుగ గొట్టినావు
గొడ్డలి వంటి విమర్శల

జడుపు గిడుపు లేనివాడ!
మడిగట్టుట రానివాడ!
జడ జీవుల మనసులలో
బడబాగ్ని రగుల్పువాడ!

మృత్యువు నెరుగని వాడా!
నిత్యం కనుపించువాడా!
మాతేడా! మావాడా!
మహాజలధిలో ఓడా!

—దాశరధి

# కవిరాజు జీవితరేఖలు

అది 1887 సంవత్సరం పుష్యమాసం. బంతిపూల దొంతరలు ఇంటివాకిళ్ళకి శుభపత్రికల్లా వ్రేలాడుతూ ఆహ్వానిస్తూ వున్నాయి. ముంగిట సంక్రాంతి ముగ్గులు అనురాగ బంధాల్ని పెనవేసుకోటానికి గీచిన గీతల్లాగ కొట్టవస్తున్నాయి. ముగ్గులలో చిక్కుకొన్న గొబ్బిళ్ళు దాంపత్య లతలు కాసిన కాయల్లాగా మురిపిస్తున్నాయి. సంసారసాగరాన్ని యీదడానికి తోడునీడల్లాగ వున్న దంపతుల తపస్సిద్ధికి మెచ్చి దేవదేవుడు యిచ్చిన పసిడి నిగ్గులా యున్నట్లు పండినిండిన ధాన్యపు రాసులు కనులకానందం కల్పిస్తూ వున్నాయి. అంగలూరు గ్రామం ఉషస్సంధ్యా సౌందర్యములో పాలగచ్చుల కాంతుల్ని వెదజల్లుతూ వుంది. కృషికులు ఇంటికివెళ్తూ మునసబ్ గారింట ముంగిటనిల్చి రామయ్యనొకింత పలుకరించి ముందుకు సాగిపోతూ వున్నారు. ప్రశాంతంగాలేని మునసబ్ గారిల్లు కొంచెం కలవరపాటు కల్గిస్తూ వుంది. చలమయ్య అరుగుమీద కూర్చుండి పరధ్యానంగా పలకరించే బంధుగులపై చిరునవ్వులు చిలకరిస్తూ వున్నాడు. ఇంతలో పెద్దమునసబ్ రామస్వామి కుమార్తె కాంతమ్మ

బయటకు వచ్చి పినతండ్రితో పిన్నబ్బ పంటపండిది. ఐదో బిడ్డకూడ మగబిడ్డయే యైనాడు. పెద్దన్న రామస్వామి తమ్ముని కడుపున బుట్టాడు కాబోలు అని పినతండ్రి చల మయ్యతో జెప్పింది. ఇంతలో చందమామ పైదలెక్కింది. ముసుగుచీకట్లు పటాపంచలై పారిపోయాయి. విజ్ఞానకాంతులు వెల్లువలై ప్రవహించినయి. విశ్వం అంతా పిండియారబోసి నట్లయింది. కవిరాజు రామస్వామి భువికి అవతరించిన శుభ ముహూర్తం అదే-15-1-1887 -

1895 సంవత్సరం జులై నెల ప్రథమ పాదం ప్రవేశించింది. పంటచేలు తొలకరి జల్లుల్లో పులకరిస్తూవుంది. మోసులెత్తిన గరిక లేతపచ్చని చీర సింగారం ఒలకపోస్తూవుంది. నాగేటిచాళ్ళలో మిలమిల లాడే నీటితుంపరలు తెల్లగళ్ళ చీరకుచ్చెళ్ళులాయి ఇ అటు కదుల్తూవున్నాయి. కాడిదప్పిన దుక్కిటెడ్లు దుముకుచు దానాకోసం చావిళ్ళకు పరుగులెత్తుతూవున్నయి. దొడ్లల్లో వున్న పాడిపశువుల పాలు తీయడానికి యిల్లాండ్రు ఉబలాట పడుతూవున్నారు. లేగదూడలు గెంటుకుంటూ పొదుగు పాలకోసం ఆరాటపడ్తూవున్నయి. రామస్వామి నెమ్మదిగా తండ్రి దగ్గరకుజేరి అయ్యా! నన్ను బడికి పంపించవా యని ప్రతిమాలుతూ వున్నాడు. అన్నలు ఇంట్లో కాకిగోలన్నా వదుల్తుంది అయ్యా! తమ్ముణ్ణి తీసికెళ్ళి మంగయ్య పంతులు దగ్గరకు పంపిరావే అన్నారు. దాంతో చలమయ్య వెదురుకఱ్ఱను చేత్తో పుచ్చుకొని కిఱ్ఱు చెప్పులు కాళ్ళకు తొడుక్కొని పదరాబుల్లియ్యా పంతు

లుకు అప్పచెప్పి వస్తాను అని బయలుదేరాడు. రామస్వామి అయ్యా అడుగుల్లో అడుగు వేసుకుంటూ వెంట నడిచాడు. ఇద్దరూ మంగయ్య పంతులింటికిరాచేరు. రామస్వామి అయ్య వారికి పప్పుబెల్లం అర్పించి దణ్ణంబెట్టి నిలబడ్డాడు. ఏం చల మయ్యా బాబూ మన బుల్లియ్యను నాకు అప్పచెప్పటానికి వచ్చావా అంటూ ఆప్యాయంగా రామస్వామి తల నిమిరి దగ్గరకు లాక్కొన్నాడు. ఏటికి పుట్టెడొడ్లు పంతులూ! ఏమిచేస్తావో జాగ్రత్తగా చదువుచెప్పాలి అని చెప్పి ఒప్ప గించి ఇంటికి తిరిగి వెళ్ళాడు. "శ్రీరామం దశరధాత్మజం" అంటూ బుల్లియ్యకు ఓంకారం చెప్పిన వెంటనే నూరిపోస్తు న్నాడు మంగయ్య పంతులు. ఆనాడు కవిరాజు రామస్వామి పునర్జన్మ. ఆనాటి విద్యాబీజాలేగదా వటవృక్షంలా వ్యాపించి ఆంధ్రదేశాన్నంతా ఉర్రూతలూపింది. షోడశ వర్షం ప్రాయంవచ్చేవరకు రామస్వామి చదువుసంధ్యలు అంగలూరు గుడివాడలకే పరిమితమైనాయి. ఆకతాయి తనంగా తిరుగుతూ వుండేవాడు మంగయ్యపంతులు చెప్పిన పాఠం యేరోజు కారోజు అప్పచెప్తూ వుండేవాడు. పలుకు బళ్ళు పలకటం వరవళ్ళువిద్దకం రామస్వామి నోటికి చేతికి పిష్టపేషణం అయింది. తోడిబాలురందర్ని అదుపులోపెట్టి తాను మాత్రము అల్లరిచిల్లరి పనులుచేస్తూ వుండేవాడు. కాని అల్లారు ముద్దుగా పెరిగాడు అయ్యదగ్గర. అయ్యగారి దగ్గర పంతుళ్ళకే పాఠాలుచేప్తూ వుండేవాడు. పెద్దవాళ్ళు... కొంటం పరిపాటైపోయింది. నాటికి 19 శతాబ్దం పరిసమా ప్తం అయింది. ఆంగ్లభాషా వ్యామోహం ఆంధ్రదేశా

న్నంతా అలముకొంటూవుంది. ఆంగ్లభాష నభ్యసించాలనే కోరిక రామస్వామి మనస్సులో కలిగింది. కాని కొద్దికాలం క్రింద తండ్రి చలమయ్య గతించాడు. అన్నల అదుపులో పెరుగుతున్నాడు. ఒకరోజు పెద్దన్న గోపాలకృష్ణయ్యదగ్గరకు వెళ్ళి అన్నా నాకు ఇంగ్లీషు చదవాలనుంది అని తన కోరిక బయటపెట్టాడు వెంటనే తమ్ముని కోరికను తీర్చడానికి గుడివాడ వెళ్ళి అక్కడ ఒక పంతులుదగ్గర ట్యూషన్ ఏర్పాటు చేసి వచ్చాడు. రోజూ రామస్వామి ఐదుమైళ్ళ దూరంలో నున్న గుడివాడకు ఉదయం వెళ్ళి సాయంకాలానికి యింటికి తిరిగివస్తూ ఆంగ్ల విద్యాభ్యాసం మొదలుపెట్టాడు. కాని గుడివాడలో ఇంగ్లీషు చక్కగా నేర్పగల సమర్థుడొక్కడూ లేకపోవుటచే అచ్చట చదువు పంటపరిగె ఏరుకున్నట్లయింది. అచ్చటచ్చట తిరిగి ఆంగ్లభాషయందు ప్రవేశం మాత్రం కలగచేసికొన్నాడు. కాని తెనుగు భాషనుమాత్రం అంతేవాసిగా కాకపోయినా స్వయం కృషి మూలంగా మూలముట్టిగా నేర్చుకోగలిగాడు. సంస్కృత భాషలోపంచ కావ్యాలు క్షుణ్ణంగా చదివాడు. ఇంటిదగ్గర పెద్దన్న తీయని కంఠంలోంచి కవితామృతం చిలకరిస్తూ వుంటే పరవశమై పాలుపొంగినట్లుపొంగిపోయే వాడు రెండో అన్న "వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే" అని వల్లె వేస్తూఉంటే "అస్త్యుత్తరస్యాందిశిదేవతాత్మా" అని చదువుచు ముందుకు పోయేవాడు. ఇలా సంస్కృతాంధ్ర భాషల్లో ప్రతిభగల పండితుడై కవిత్వంచెప్పడం అవధానాలుచేయడం మొదలు పెట్టాడు ఆంగ్ల విద్యాభ్యాసానికి అనువైన పట్టణం గుడివాడ

కాదని తెలుసుకున్నవాడై ఉన్నత పాఠశాల కళాశాలలూ గల బందరు పట్టణంపైకి మనస్సుపోయింది. తన కుటుంబ సంబంధమైన పనులు పైరు పంటలు నలుగురన్నలు చూచు కుంటూవుంటే తాను స్వేచ్ఛగా సరస్వతీ పూజచేసి కృతార్థుడు కావడానికి ఆటంకం ఏముంది. 1905 సంవత్సరంలో రామస్వామికి ఉన్నత పాఠశాల విద్యప్రారంభమైంది.

కృష్ణా మండలానికి ముఖ్యపట్టణం బందరు. మండలంలో పండినపంటంతా ఆ పట్టణానికి చేరవలసిందే. అప్పు కావాలన్నా ఉప్పు కావాలన్నా బందరు వెళ్ళవలసిందే. లావాదేవీలు తీర్చుకోవాలన్నా హూణవిద్యాభ్యాసంచేయాలన్నా అక్కడకు చేరవలసిందే. పల్లెటూళ్ళో పెళ్ళిచేసుకోవాలంటే విలువైన బట్టలకు బంగారానికి బందరు వెళ్ళక తప్పదు. అప్పటికి బెజవాడ బందరు రైల్వేలైను లేకపోవుట చేత ప్రయాణమంతా ఎడ్లబళ్ళమీదా, నడిచి చేయవలసిందే గదా. అట్టి పరిస్థితుల్లో రామస్వామి బందరులో హూణ విద్యాభ్యాసానికి హిందూ హైస్కూల్లో నాలుగవఫారంలో చేరాడు.అప్పుడుహిందూ హైస్కూల్లో వెంకటశాస్త్రిఆంధ్రోపాధ్యాయుడుగా పనిచేస్తూవున్నాడు. బందర్లో ఆంధ్రకవితా కన్యకకు పట్టాభిషేకంచేసి. నిత్యకళ్యాణం పచ్చతోరణంగా అనుదినము అవధానాలు ఆశుకవిత్వాలు సభావేదికలపై జరిపి వన్నెదెచ్చిన భాగ్యంవెంకటశాస్త్రికే దక్కింది.ఆంధ్ర కవితా కన్యకల కంఠనిస్వనములు ఆంధ్రదేశం అంతా క్రిక్కిరిసిపోయిన సారస్వత స్వర్ణయుగమదే గదా. తిరుపతి వెంక

శ్వర కవుల శిష్యుల ప్రతిజ్ఞాప్రతిధ్వనులనుండిబందరుపట్టణ మంతయు వసంతకాలమందలి కోయిల కంఠాల్ని మరిపిస్తూ ఉండేవి. బందరు నుంచి కృష్ణాపత్రిక ద్వారా కృష్ణారావు శంఖానాద మాంధ్రదేశం నలుదిక్కులా పిక్కటిల్లిపోయింది. ఆ సమయంలో రామస్వామి కవితాశ్రమ స్వీకారంచేసి వెంకటశాస్త్రి ప్రియతమ శిష్యుడైనాడు. ఆంధ్ర సంస్కృత సాహిత్య సాగరాన్ని మథించి కవితామృతం వెల్లువలుగా ప్రవహింపజేసాడు. వెన్నతో బెట్టిన విద్యయాటచే జాతీయతా భావాల్ని రంగరించి కవితాసృష్టిలో పెద్ద బిడ్డగా "రాణా ప్రతాప్"నాటకాన్ని ప్రచురించాడు. రాజకీయ ద్రోహాన్ని మొలకెత్తించేభావాలు ఆనాటకంలో వున్నయ్యని జిల్లాకలెక్టర్ అచ్చులో వున్న పుస్తకాల్నిస్వాధీనంచేసికొని భస్మీపటలంచేసారు."రాణా ప్రతాప్"నాటకం ఎచ్చట ఆడగూడదని మద్రాస్ప్రభుత్వంజి వో. ప్రకటించింది. అది1911 సంవత్సరం. క్రితసంవత్సమే రామస్వామి మెట్రిక్యులేషన్ప్యాసయ్యాడు. బ్రిటిష్ప్రభుత్వం, అధికారం చేతులో వుంది కాబట్టి"రాణా పతాప్"నాటకాన్నిబహిష్కరించేరేగాని రామస్వామికవితా స్రవంతికిఆనకట్టవేయుగలరా? 1912 సంవత్సరంకురుక్షేత్రసంగ్రామము రెండవనాటకంగా ప్రకటించాడు. తొలి నాటకం ప్రభుత్వంమీద తిరుగుబాటయితే మలి నాటకం పురాణాల మీద తిరుగుబాటయింది. ఇందులో పాండవులకు రాజ్యాధికారము లేదని నిర్ధారణ చేయబడింది. ఆ సంవత్సరంతోనే విద్యార్థిగా బందరు జీవితానికి భరతవాక్యం చెప్పాడు. బందరులో చదువుకొన్నంతకాలం భాషావిషయంగా బహు పరి

శ్రమచేసి సంస్కృతంలో ఆంధ్రంలో ముక్కాకలు దేరిన పండితుడయ్యాడు. రామస్వామి కవితాలతలు కుటుంబక్షేత్రమందు మొలకలెత్తి పరిసరముల ప్రభావంవల్ల ఏపుగా ప్రాకువెట్టి వెంకటశాస్త్రి శుశ్రూషవల్ల మారాకు తొడిగి ఆంధ్రదేశాన్నంతా అలముకొని గుత్తులుగుత్తులుగా పూలు పూయసాగినవి రామస్వామికి ప్రతి కండరమంతా జాత్యభిమానం పొంగులు వారిముందుకు పరుగులెత్తుతూ వుండేది. శారీరకంగా భుజబల సంపన్నుడు. శాలిబంతి ఆటలో మేలు బంతిగా పేరుపొందాడు. నోబుల్ కాలేజీ ఫుట్ బాల్ టీముకు కెప్టెన్ సెంటర్ ఫారవర్డుగా ఆడుతూ వుండేవాడు. ఆ సంవత్సరం నోబుల్ కళాశాలకు బెల్సురప్ మొదలైనవి ఎన్నో సంపాదించిపెట్టాడు. 1912 సంవత్సరం బందరులో ఇంటర్మీడియట్ పూర్తిచేసి 1913 సంవత్సరం బొంబాయివెళ్ళి ప్లీడర్ షిప్ పరీక్ష చదివాడు.

1914 సంవత్సరం నవంబరు నెల - కాలువల్లో నీరు తేరుకొని నిర్మలమైన మనస్సులోని వూహాల్లాగా పరుగులెత్తుతూవున్నాయి. రెల్లు దుబ్బులు వికసించి తెల్లని వెన్నెలతో సరసాలాడుతూ వున్నాయి. వానల్తో చిందరవందరైన వీధులన్నీ ఎండి చిరుపగుళ్ళు వాటి మెత్తని మన్నుతో అనువైన బాటలుగా మారిపోయాయి. పండువారిన మాగాణిచేలు బంగారు కాంతుల గ్రక్కుతూ వింత సోయగాన్ని వెదజల్లుతూ వున్నాయి. బొంబాయినుంచి వచ్చిన రామస్వామి పల్లె

వెళ్ళి బారిష్టరు చదివే కోరికను అన్నలముందు బయట పెట్టాడు, కొద్దికాలంక్రింద రామస్వామి మామగారైన అమరయ్యగారుకూడా స్వర్గస్థుడయ్యాడు. రామస్వామికివి దేళ్ల కుమారుడు భార్య చౌటపల్లిలో వున్నారు. ఏదో సంసార పక్షంగా జీవయాత్రలు చేయుచున్న కుటుంబం యిరవయి వేల ఖర్చు భరింపగలదాయని యాలోచన చేసారు. తమ్ముని పురోభివృద్ధికన్న మనకు కావలసింది యేమిటని అన్నలందరు తలలూపారు. ఇంకేముంది ఆటంకము. సరేనంటే సరేయని యున్న లభయహస్తమిచ్చేటప్పటికి రామస్వామి ప్యాస్‌పోర్టు ముదలైనవన్ని తెప్పించి ప్రయాణోన్ముఖుడయ్యారు. ఒక మంచిరోజున చుట్టపక్కాలు వచ్చి రామస్వామిని దీవించి కొందరు బొంబాయిదాకా వెళ్ళి స్టీమరెక్కించి వచ్చారు.

అది ప్రపంచ ప్రథమ యుద్ధం జరిగే రోజులు. ప్రయాణం చాలా వొడిదుడుకులతో కూడియుండేది. చదువుపైనుండే అపేక్షచే పట్టినపట్టు విడువకుండ దీక్షతో ప్రయాణం చేసి అవాంతరాలను లెక్కచేయకుండా డబ్లిన్‌నగరం జేరాడు అచ్చట చేరిన తర్వాత "నా డబ్లిన్ ప్రయాణము" అనే శీర్షికతో కృష్ణాపత్రికకు కొన్ని వ్యాసాలు వ్రాసాడు. అచ్చట బారిష్టరు పరీక్ష చదువుచున్నా మాతృభాషపై మమకారం మాత్రంవదలలేదు, ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో మన ప్రాచీన సంస్కృతులనుగూర్చి పరిశోధన చేసాడు. దాని ఫలితమే శంబుకవధ నాటక రచన. బారిష్టరు చదువుచున్న పుడే కొండవీటి సామ్రాజ్యశతసము, కారంపూడి యుద్ధము

అనే కృతులను రచించాడు. అక్కడకూడా శాకాహారిగా నుండి పాశ్చాత్యభామినీ శృంఖాల్లో చిక్కుకోకుండా బారిష్టరు పరీక్షయం దుత్తీర్ణుడై 1917 సంవత్సరం నవంబరు నెలలో తిరిగి వచ్చాడు.

విదేశాలకుపోయి విద్యను పూర్తిచేసివచ్చిన కుమారుని తన యొడిలోనికి తీసికొని ఆనందపడే కన్నతల్లిలా బందరు పట్టణం రామస్వామికి స్వాగతం యిచ్చింది. ఎంతో కాలం విడిపోయిన కన్నతల్లిని చూచినంతనే ఉబ్బితబ్బిబ్బులయ్యే కొడుకులా తల్లి పిలుపు నందుకొని తన జీవిత యాత్రను సాగించడానికి బందరులో బారిష్టరు ప్రాక్టీసు ప్రారంభించాడు. పూర్వస్నేహితులంతా కమ్ముకొని చుట్టూ మూగారు. తన ప్రతిభను వెదజల్లే కవితా సన్నివేశాలు విశృంఖలంగా దిమ్మరిగిన కళాశాలా పరిసరాలు ఆటలలో మేటియై కీర్తినందుకొన్న కందుక క్రీడాస్థలాలు చేదోడు వాదోడుగా నిలిచి తన్నెంతో ప్రేమించి సహకరించిన పౌర సముదాయము మనస్సునకెంతో యాత్మీయత కల్పింపగా ప్రాక్టీసు మొదలుపెట్టాడు. ఇంతలో అనిబిసెంటు హోమ్ రూల్ ఉద్యమం భారతదేశమంతా వ్యాపిస్తూ వుంది. "వందేమాతరం మందేరాజ్యం" అనే నినాదాలు బందరు పట్టణంలో మారుమ్రోగిపోతూవున్నాయి. రామస్వామి ఆ వుద్యమం చేపట్టి వేదికయెక్కి వుపన్యాసాలివ్వడం మొదలు పెట్టాడు. ప్రభుత్వంపై సవాళ్ళు విసరడంతో రామస్వామిని లోబరచుకొంటానికి పథకం వేసికొంది ప్రభుత్వం. మొదట

నీవు ఉన్నతపదవిలోకి వెళ్ళవలసినవాడవు. ఈ ఉద్యమంలో అడుగుపెట్టవద్దు. నిన్ను వెంటనే సబ్ జడ్జీగా ఎపాయింటు చేస్తాము అని ఏవేవో ఆశలు కల్పించింది. కాని రామస్వామి దేనికి లోబడలేదు. ఇట్లా కొంతకాలం జరుగుతూవుంటే కవిరాజుకు గొప్ప దుస్సంఘటన జరిగింది. 1920 సంవత్సరం జనవరి 15 తేదీన మొదటి భార్య పున్నమాంబ ప్రసవమయి ఇద్దరబిడ్డలను వదలిపెట్టి యిహలోకయాత్ర చాలించింది. దాంతో కవిరాజు బందరు పట్టణాన్ని వదిలిపెట్టి బెజవాడ వెళ్ళి ప్రాక్టీసు పెట్టాడు.

ఆ సంవత్సరమే రెండోవివాహం చేసికొన్నాడు. 1921 - 1922 రెండు సంవత్సరములు బెజవాడలోనే యున్నాడు. "భార్యాదుఃఖమ్ పునర్భార్యా" అనేది రామస్వామి కన్వయించటానికి వీల్లేకుండాపోయింది. ప్రథమ కళత్రంపై మమకారం ప్రతి నిమేషం మనస్సులో బాధిస్తున్నండేది. ఇప్పటికి దాదాపు కవిరాజు రామస్వామి జీవితపథంలో ముప్పదియైదు సంవత్సరాలు వయస్సు నిండడంతో పూర్వార్థం ముగిసింది.

1922 నుంచి 42 వరకు ఈ యిరువయి సంవత్సరములు రామస్వామిజీవితం ఉత్తరార్థంగా పేర్కొనవచ్చును. ఉత్తరార్థ జీవితయాత్రకు రంగస్థలము తెనాలి పట్టణమే. బెజవాడలో కింకర్తవ్యతామూఢుడై యున్న కవిరాజు దగ్గరకు గుంటూరు మండలనాయకులు కీ॥ శే పాములపాటి వెంకటకృష్ణయ్య, జాగర్లమూడి కుప్పుస్వామి, సూర్యదేవర

రాఘవయ్య మొదలైనవారు వచ్చి రామస్వామిని తెనాలి పట్టణములో ప్రాక్టీసు పెట్టవలసిందిగా బలవంతముచేసిరి. అంతేకాకుండా కవిరాజు రెండవ భార్య కన్నవారూరు తెనాలికి ఐదుమైళ్ళలోవున్న కూచిపూడి. రైతుపత్రికను తెనాలినుండి ప్రకటించి రైతులోకమునకు సేవ చేయవలయు ననియు సంఘసంస్కరణకు కొల్లూరు మొదలైన పల్లెటూళ్లు చాలా యుపయోగపడు ననియు రాజకీయములలో పాల్గొను టకు గుంటూరు మండల మనుకూలముగా నుండుననియు నిర్ణయించుకొని బెజవాడనుండి తన మకామ్ 1922 చివరలో తెనాలికి మార్చివైచెను.

రాజకీయములలో తెనాలి రంగస్థలంగా చేసికొని పాల్గొనడం ప్రారంభించాడు. రాజకీయ జీవిత పథంలో వృత్తమస్థాయినందుకొని గుంటూరు జిల్లానుంచి ఎన్నికైన శాసనసభ్యుడు స్థానికంగా గొప్ప పలుకుబడి కలిగి తెనాలి పురపాలక సంఘాధ్యక్షుడైన శ్రీపిల్లలమర్రి ఆంజనేయులుతో ఢీకొని ఓడించి 1925 సంవత్సరంలో తెనాలి పురపాలకా ధ్యక్షుడై రెండు మూడు సారులాస్థానాన్ని అలంకరించాడు. తరువాత గుంటూరు పురపాలకాధ్యక్షుడై మంచి పలుకు బడికలిగిన బారిష్టరు యస్. వి యల్. నరసింహారావు నాంధ్ర విశ్వవిద్యాలయ సభ్యత్వంలో పోటీపడి రెండు మూడుసార్లు ఓడించాడు. ఇక సంఘ సంస్కరణోద్యమము గుంటూరు మండలంలో మూలమూల గ్రామాలకు కూడా వ్యాపించేటట్టుచేసి సంఘ పౌరోహిత్వాన్ని నెలకొల్పి వివాహక్రతువులందు ఎంతో మార్పు తీసికొనివచ్చిదానాపు

ప్రతిగ్రామమునందు ఒక్కొక్క శిష్యుని తయారుచేసి అపూర్వచైతన్యం తీసికొని వచ్చాడు. రైతు పత్రికను స్థాపించి నిద్రాణమైయున్న కృషికలోకమును మేలుకొలిపి సిద్ధహస్తుడైనాడు. ఆ రోజుల్లో కవితా వ్యవసాయం నుంచి మంచి పంటను పండించాడు. సూతపురాణం జన్మించింది యీ దశలోనే. ఈ విధంగా యిన్ని రంగాల్లో ఎదురులేని విజయాలు సాధిస్తూ తెనాలిలో సూతాశ్రమం నెలకొల్పాడు. తెనాలి పట్టణంలోవున్న న్యాయవాదులు డాక్టర్లు కవులు సూతాశ్రమం ఒక పవిత్రస్థలంగా నెంచుకొని సందర్శిస్తూ వుండేవారు. కోర్టు వ్యవహారాలు ఒకప్రక్కన వొత్తిడి చేస్తూవుంటే పురపాలక ఎలెక్షన్ మంత్రాంగాలు మరొక ప్రక్కన జరుగుతూవుంటే శ్రవణానందంగా పురోహితులు వైవాహిత మంత్రాలు మరొకచోట వల్లెవేసూవుంటే కల కంఠకూజతంబులకన్న శ్రావ్యంబుగా కవికోకిలలు ఇంకొక వైపు గానముచేస్తుంటే సూతాశ్రమమొక మునిసార్వ భౌముని యాశ్రమముగాను రామస్వామి బ్రహ్మతేజస్సు మూర్తీభవించుచున్న కులపతిగాను కానవచ్చుచుండెను. ఆ విధంగా 1922 నుంచి 32 వరకు రామస్వామి జీవితంలో ఒక గొప్ప మహాదశయని చెప్పవచ్చును.

నాడు పర్జితగర్జన్యమునుండి ఫెళఫెళార్భటులతో ఒక పిడుగు పడినట్లైంది. సూతాశ్రమంలో ప్రక్కిరిసి ముందు పందిరిపై ప్రాకిన సన్నజాజి తీవెలనుండి విచ్చిన పువ్వులు నేలపైరాలి చిందరవందరగా పడిపోయినవి. గులాబీల

పువ్వులనుండి రేకులు దూరంగా ఎగిరి గంతులు వేస్తూ వున్నయి. చిన్నారి పిట్టలు గూళ్ళలోనించి బయటకు రాలేక భయముతో కూనిరాగాలు తీస్తూ వున్నాయి. నిటారుగా పెరిగి ద్వారాన్ని కాస్తూవున్న సరకుడు మొక్కలు వంగి వంగి నమస్కరిస్తూ వున్నయి. రామస్వామి నిద్దరలో పీడకల కలవరపెట్టగా ఒక్కసారిగా త్రుళ్ళింతలో లేచాడు. ప్రక్క మంచంపై పరున్న కులకాంతను కళ్ళనీళ్ళు గ్రుక్కుకుంటూ చూశాడు. నెలరోజుల్నించి రాత్రింబవళ్ళు పడుచున్న బాధల్నించి విముక్తిగాంచావా చంద్రమతీ యని ఉద్విగ్నుడై చూచాడు. నీలీరాగవతి చంద్రమతి సూతాశ్రమంలో తన ప్రియునివీడి తారాపథాన్నందుకొంది. కవిరాజ విచలిత చేతస్కుడై మహామాయతో కప్పబడిన యోగి పుంగవునివలె సామాన్య మానవుడై ఆక్రందించడం ఆరంభించాడు. ప్రారబ్దం అనుభవింపక తీరదుగదా. పూతాశ్రమమైన సూతాశ్రమము భీతాశ్రమైపోయింది క్షుభితమనస్కుడైన నాటి కవిరాజు ఒక కన్నీటిచుక్కనర్పించి ముందుకు పోదాము.

నేటికి రామస్వామి కవిరాజుకు నలభై సంవత్సారాల ప్రాయం వచ్చింది. సూతపురాణం రెండు భాగాలు ప్రచురింపబడినయి. బారిష్టరు ప్రాక్టీసుపై బాగా విరక్తి కలిగింది. తనయందు స్నేహవాత్సల్యాలు కలిగిన శిష్యులు తెనాలిలో చాలామంది ప్లీడర్లుగా ప్రాక్టీసు చేస్తున్నారు. ఆ అదను చూచుకొని తన కేసులన్నీ వాళ్ళకు అప్ప

చెప్పేసి చేతులు కడుక్కొన్నాడు. మునిసిపల్ ఎలక్షన్లలో తన పార్టియందే అంతఃకలహాలు బయలుదేరినయి. ఒకరి మీద యింకొకరికి విశ్వాసం లేకుండా పోయింది. అందుచే స్థానిక రాజకీయములు తన శిష్యులకప్పచెప్పి రాజధాని రాజకీయాల్లో పాల్గొనడం మొదలుపెట్టాడు. రామస్వామి జాతీయాభిమానియై సత్యాగ్రహ యోధులకు విందులిచ్చి "వీరగంథము తెచ్చినాడను వీరుడెవ్వడో తెలుపుడీ" యంచు వీరపూజ చేసాడు. సూత్రాశ్రమంలో యా యాతిథ్య మిచ్చినందులకు ప్రభుత్వం నోటీసుయిచ్చి అరెస్టు చేయాలని ప్రయత్నించారు. తంజావూరు జస్టిస్‌పార్టీ మీటింగ్‌కు రెండువేలమంది సైకిలతో వెళ్ళి బొబ్బిలి రాజా నధ్యక్షస్థానమునుండి క్రిందికి లాగి ఆస్థానాన్ని ఆక్రమించాడు. హిందూమతంలో వర్ణవైషమ్యాన్ని రూపుమాపడానికి రామస్వామియే తగినవాడని హిందూ మహాసభ అఖిలభారత కార్య నిర్వాహక సభ్యునిగా చేయగా శుద్ధి సంఘాలనిపెట్టి చాలమందిని హిందూ మతంలోకి మార్చాడు. ఈ విధంగా వివిధ రంగాల్లో కవిరాజు ప్రతిభ ఉన్నత పథాలనందుకుంటూ వైవిధ్యం కానవస్తూవున్నా కవితా సరస్వతిపై కన్నెరవేయుటగాని విస్మరించడం గాని కలగలేదు, విదేశ సంస్కృతులు విభిన్నత్వంతో వరదలు వరదలుగావచ్చి భారతీయ సంస్కృతిని కబళించడానికి ప్రయత్నము చేసి దానిలో లీనమైనట్లు రామస్వామి కవితాకన్యకు ఒక్కొక్క వుద్యమం పూర్తి అయ్యేటప్పటికి నొక్క శయ

లంకారముతో పరిష్కరింపబడి నూతనోత్తేజముతో ధ్రువ తార వలె నిలిచిపోయింది.

ఈదశలో కవిరాజు ప్రచురించిన "సూతపురాణము", "మానవశతకము", "భగవద్గీత", మొదలైన కవితాఖండాలు ఆంధ్రదేశాన్నంతా ఉత్తేజిత లూపినవి పత్రికలు పండితులు విమర్శకులు కవిరాజు గ్రంథాలు సమీక్ష చేస్తూ ఆంధ్ర సారస్వతమునందువుత్తమ తరగతికిజెందిన కావ్యములుగాపరిగ్ణ యించారు. అది 1942 సంవత్సరం. పొంగులువారే చైతన్యంతో నురుగులు గక్కుచూ తాను ప్రారంభించిన సంస్కరణోద్యమం ముందుకుపోతూవుంటే కన్నులార చూచి యానందించాడు కవిరాజు. దాస్యశృంఖలాల్లోంచి బయటపడ్డ భారతీయ యువకులు ప్రభుత్వ స్థానాలాక్రమించి నైపుణ్యాం చూపిస్తూవుంటే మురిసిపోయి ఆశీర్వదించాడు. ఇంకా తన కర్తవ్యం సారస్వతక్షేత్రమందు కవితా తపస్సు చేయడమే అని నిర్ణయించుకొన్నాడు. ఇంతలో కృష్ణామండల ప్రజానీకాన్నించి తమ పూజాపురస్కారా లందుకొమ్మని పిలుపువచ్చింది. ఇంకేం కన్నతల్లి కమ్మని పిలుపుల్లోంచి వూటలూరే తేనెసోనల్లో తేలిపోవటానికి లొట్టలు వేసుకొంటూ బయలుదేరాడు. గుడివాడలో సన్మానం బ్రహ్మాండంగా జరిగింది. ఏనుగంబారీ యెక్కించారు మెడనిండా పూలదండలు వేసారు. ఏబనియారు ఎడ్లబళ్ళు మువ్వల మోతలతో బరాబరలు చేస్తూవుండగా గుడివాడ వీధుల్లో వూరేగింపు చేసారు. రెండు వేల రూప్యములు హారతి

పళ్ళెరం అర్పించి కృతకృత్యులయ్యారు. సన్మానంనుంచి తిరిగి తెనాలి వచ్చినంతనే పట్టణ ప్రముఖ ప్రజలు తమ కృతజ్ఞతను కృష్ణామండల ప్రజలకు తెలియజేసారు.

కొద్దిమాసములకే దేవదేవుని పిలుపు వచ్చింది. వేదనలేని తెగులు శరీరంలో ప్రవేశించింది. అంతులేని ఆవేదన ఆవేశించింది. ధిక్కరింపరాని ప్రకృతి శాసనం సూతాశ్రమంలో నిండి నిబిడీకృతమైంది. "బలీయసీ కేవలమీశ్వరేచ్ఛా" అదిగో సూతుడు "రమ్మోయీ త్రిపురనేని రామస్వామీ" అంటూ ఎలుగెత్తి పిలుస్తున్నాడు 1943 సంవత్సరం జనవరి 16 తారీఖు. పుష్యమాసంలో విచ్చిన బంతిపువ్వులు వాడి రేకులు వీడి మాడిపోతున్నాయి. దక్షిణాయనంలోంచి సూర్యభగవాన్ మకరరాశిలో ప్రవేశించి ఉత్తరాయణంలో ప్రయాణం సాగించపోతున్నాడు. కవిరాజు రామస్వామి అవతారం పరిసమాప్తమయింది. కవిరాజు దివ్యతేజస్సు భువినుండి దివికి జేరి తళుక్కున మెరసింది. సూతాశ్రమమునుండి ఒక విద్యుత్తు అంతులేని ఆకాశంలో లీనమైపోయింది. భారతభూమిపై చీకటి కెరటాలు తెరలు తెరలుగా వచ్చి కప్పేస్తున్నాయి.

—త్రిపురనేని చలమయ్య

# కవిరాజు

## ఆయన పూర్వులు — సమకాలీనులు

చ॥ మరచితిఁగొల్లి పుణ్యకవిమాన్యుల
నెంచుచు మత్కృతీనుడు,
బిరుదు మగండు,నా యసము
వేంకటనాథ కవీంద్రు చంద్రు సం
స్మరణ మొనర్పనైతిని
ప్రమాదవశంబున, గాన నిప్డు డీ
కొరతను దీర్చుకొంటి, నిదిగో
కుసుమాంజలి నెత్తి వానికిన్ ॥

అని శతావధాని, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి తన "సుజన సంజీవనము" అని ఉల్లేఖించెను. అట్టి కవిరాజును దలంచి నే నీ వ్యాసమును వ్రాయుచున్నాను.

ఒక రచయిత జీవించి యుండఁగా ఆయన యొక్క అత్యంత దుష్ట రచనల చేత, చనిపోయిన తర్వాత ఆయన యొక్క ఉత్తమ కావ్యముల చేత, ఆయన శక్తుల నంచనా వేయుదుమని 'జాన్సను' కవీంద్రుడు నుడివెను. "While an author is yet living,we estimate his powers by his worst performance and when he is dead, we rate them by his best" కవిరాజు కీర్తి శేషు డగుటచేత, ఆయన ఆలోచనాపరకళిని ఉత్తమ కావ్య

ముల,రచనల పరామర్శ లేక సమీక్ష చేయుట కదను లభించినది.

20 వ శతాబ్దము 'కవిరాజ యుగము' అని చరిత్ర పేర్కొనుట కేమాత్రము సందేహించబోదు. మానవకోటి చరిత్రలో,ప్లేటోయుగమని పేర్కొనుటకు ప్లేటో కదృష్టము పట్టినట్లు, (Emerson-"Plato has the fortune in the history of mankind,to mark an epoch.")కవిరాజు కదృష్టము గలిగినదని చెప్పవచ్చును. నూత్నభావములతో గూడిన వీరి కృతులు, వీరి శరీరము దుమ్ము, బూగ్గులైపోయినను, శాశ్వతముగా నిల్చుట సత్యము (Smiles- "The printed book lives, while the author is dust and ashes:- The authors die, while their works live on.")

కవిరాజు మహాపురుషుడు. మహాపురుషులు తమ ఆలోచనను, తమ కాలమును జాతిపైన ప్రసరింపజేయుదురు అని 'స్మైల్స్' వచించెను. (Smiles- Great men stamp their mind upon their age and nation) కొందరు మహనీయులు విషయ సంగ్రహణములో నిపుణులు,కొందరు ఆలోచనకు బ్రసిద్ధిగాంచినవారు;ఈ యన్ని తరగతుల మహనీయుల నేను ప్రశంసించెదను.

ఈ మహనీయులు మనకు సమీపములో నున్నారు. వారిని జూచినంతనే మనము గుర్తించగలము. అని 'ఎమర్సన్' పల్కినది సత్యమే. (Emerson-"I admire great men of all classes, those who stand for facts

and for thoughts - But the great are near, we know them at sight") కవిరాజు రెంటిలోను నిపుణుడు. "ప్లేటో ఎవరు? ఆయన భౌతిక కాయము దుమ్ము ధూళిలో మిళితమైపోయెను. కాని ఆయన ఆలోచనలు, ఆయన ఘనకార్యములు శాశ్వతముగా నిల్చిపోయినవి" అని 'స్మైల్స్' వచించిన సూక్తి సత్యమే. (Smiles- "What is Plato? He has long been resolved into dust'but his thoughts and his actions still survive") అట్లనే, బ్లయిసే పాస్కలు (Blaise Pascal) అను విఖ్యాత రచయిత, ఒక వ్యక్తి యొక్క గొప్పతనము అతని ఆలోచనను బట్టియే ఉండునని పల్కెను. ("Thougt constitutes the greatness of man.") ఈయన భావము లే ఈయన గొప్పదనము. ప్రతి మహాపురుషునివలె, 'ప్లేటో' తన కాలములో మిన్నయై నిలిచెను. మహాపురుషు డెవ్వరు? మహత్తరమైన వాటితో సంబంధముగల్గి.తనలో నికిసమస్త కళలను,శాస్త్రము లను తెలిసికోదగిన యన్నిటిని "ఆహారముగా పరిగ్రహించు వారు"అని ఎమర్సను చెప్పినది సత్యముగా నున్నది.(Emerson-"Plato too, like every great man, con sumed his own times.What is a great man,but one of great affinities, who takes up into himself all arts, sciences, all knowables as his food") కవిరాజు పైవానినన్నిటి తనలో జీర్ణించుకొనెను. "మహాపురుషుల పేర్లు, వారి స్మరణ జాతి కొక కట్నమే" యని ఒక రచయిత వ్రాసెను. ("The names and

memories of great men are the dowry of a nat-
-ion.")నాత్మనైన ఆలోచనా సరళి, ఆయన కార్యములు మతాచార్యుల ముఖప్రీతిని గాంక్షించకుండ వ్రాసిన కవి రాజు వ్రాతలు, ఒక నూతనశకమును స్థాపించిపోయినవి. క్రీ. శ. 1603 లో 'మిల్టన్' అను ఆంగ్లకవి 'ప్యూరిటన్' వుద్యమములోజేరి ప్రజా స్వాతంత్ర్యమును గాపాడుచు నిరంకుశ పాలకుడగు 1వ చార్లెసు నెదుర్కొనెను. అట్లనే కవిరాజుకూడ, మతాచార్యుల, సాంఘిక నిరంకుశత్వముల నెదుర్కొనెను. (Priestly and social tyranny) కాని కవిరాజు గొప్పతనమును సాహిత్యవేత్తలు విషపూరితమైన కుల అహంకృతి చేత, అప్పకవి సూక్తి ననుసరించి, గుర్తించలేకపోయిరి. శూద్రునిచే వ్రాయబడిన కావ్యము; శునకముచే దాకబడిన పాయసము వర్జనీయంబులని అప్పకవిసూక్తి.అంధవిశ్వాసముతో నీ సూక్తిని వేదతుల్యముగా భావించిన సనాతనులు కవిరాజు రచనా వైశిష్ట్యమును గుర్తించరైరి. 'జాన్సన్'సూక్తి నేటికి సత్యమైనది.అసూయ చేత నిరాకరించబడిన గౌరవము చివరకు కాలముచేత గుర్తించబడును" అను సూక్తి సత్యసమ్మతముగా నున్నది. (Johnson-"That the regard which is yet benied by envy, will be at last bestowed by time.") ఒకవేళ అల్పబుద్ధులుగల మనుజు లేవగించుకొన్నారుకనుక, దేవతలు ప్రేమించెదరు అను"ఎమర్సన్"సూక్తియందు నాకు నమ్మకము గలదు. (Emerson-"The Gods love him because men hated him"). నేటికి సమాజము కండ్ల

తెరచి కవిరాజు గొప్పతనమును గుర్తించడము గొప్పదే. వీరిని అమరజీవులుగా చేసిన దేదియో వెనుకనుండుటచేతనే వారి పేర్లు ప్రపంచ చరిత్రలో యుగయుగములు నిల్చి యుండునని స్మైల్స్ వచించినది సబబుగానే యున్నది. (Smiles-"These men shall live in the history of mankind for ages because they have something that makes them immortal")

మధ్యయుగములో ఇటలీకవీంద్రుడైనడాంటే(Dante) వలె, నవ్యాంధ్ర భూమియొక్క వాణిని 25 ఏండ్లకాలము పద్యరూపముగా ప్రచార మొనర్చిన మేటి 'కవిరాజు' (Carlyle - "Dante is the spoksesman of the middle ages.) ప్రపంచ సాహిత్యములో 'డాంటే' నూత్నశక మారంభించెను. నైతికముగా నందరికంటె గొప్పయని మనము పిల్వవలెనని డాంటేనుగూర్చి 'కార్లయిల్' అను ప్రఖ్యాత రచయిత వచించెను. (Carlyle - Morally great above all we must call him"). బుద్ధి సంబంధ మగు ఆంతరిక దృష్టి, హేతువాద బుద్ధి, మానవ కారుణ్యము నైతికబలము,డాంటేవలె ఈయనకు గలదు. "రష్యా చక్రవర్తి 'జారు'యొక్క మర ఫిరంగులు, రష్యాకులోబడ్డ తురుష్కజాతి పాలకులు వారి అశ్వికదళము,—అన్ని అదృశ్యమైపోయినను, 'డాంటే' యొక్క వాణి యింకను స్పష్టముగా వినబడుచున్న'దనికార్లయిల్ వచించెను. (Carlyle- "His(Czar"s)cannons and cossackes will all have rusted into nonentity, while that Dante's voice still audidle.")

డాంటే(క్రీ.శ.1265-1321) యొక్క నయవిద్య (Ethics) ఆయన కవనములో గాన్పించుచున్నది. అట్లనే నవ్యాంధ్ర వాణి,కవిరాజు ప్రయోగించినది, నేటికి వినబడుచున్నది. దేశములో మతాచార్యుల వలన నీతి క్షీణించినది (The atro phyof the moral sense.) ప్లేటో యొక్క గొప్పదన మంత ఆయన నీతి, ధర్మపథములలో నిమిడియున్నది. అందుచేతనే ఆయన మానవకోటి కంతటికి అత్యంత ప్రియతము డగుచున్నాడని ఎమర్సన్ చెప్పినది సత్యమే. (Eme--rson- "The secret of his popular success is the moral aim,which endeared him to mankind) అట్లనే కవిరాజు, దేవుని పేరుతో దోపిళ్ళుగాని,మతము పేరుతో జంతుబలులుగాని, స్తోత్ర పాఠములతో ధనార్జన చేయకుండ న్యాయవాదవృత్తి చేత ఆర్జించెను.యజ్ఞసమయములలో మేకల వధించకుండ బుద్ధునివలె రక్షించెను. మెకాలే, జాన్సన్‌లవలె కలముపోట్లతో ఛాందసములను,మూఢ నమ్మకములను ఖండించి గౌరవ జీవనము చేయగలెను. ఈయన నీతిపథమును గూర్చి సమకాలీను లందరు తెలిసికొని యుండిరి. ఆయన భావములచేత మనం ముప్పొంగినపుడు, మనము ప్లేటోకు ఋణపడియుండుట లేదు.ఆయన భావములకు ఋణపడియున్నాము. అటులనే 'ప్లేటో'కూడ అని ఎమర్సను నుడివెను. (Emerson-"When we are exalted by ideas, we do not owe this to Plato, but to the idea, to which also Plato was debtor) కవిరాజు భావములలో కుల భేదములు లేని మానవకోటి యను

భావము, లేక భూతదయ ప్రస్ఫుటమగుచున్నది. అన్ని ప్రతిభా విశేషములకంటె యిదిమిన్నయని 'ఎమర్సను' చెప్పినది సబబుగానే యున్నది. (Emerson - There is in all poets a wisdom of humanity which is superior to any talent they exercise.) ప్రాచీన కావ్యము లన్నిటిలోను వర్ణాశ్రమధర్మముల పోషణ, పర లోక భావము, కర్మ సిద్ధాంతములు హెచ్చు. కవిరాజు రచనలలో నివి మచ్చునకైన కానరావు. పైగా వీని ఖండన ముండనములు హెచ్చు. నీతికోవిదుడైన కవిరాజు, పర ద్రవ్యమున కాశించలేదు. కామినీ కాంచనము లందాశ లేమి, ఈయనపేరు ఆంధ్రదేశములో చిరస్థాయిగా నిల్చి యుండును. ఈయన భావములు, 'ప్లేటో' డాంటేల' భావ ములవలె చరిత్రలో చిరస్థాయిగా నిల్చును. ఆంగ్ల విద్యా ప్రభావమువలన స్వతంత్రాలోచన, వ్యక్తి స్వాతంత్ర్యము గాన్పించును. తత్పూర్వము మతాచార్యులకు, శాస్త్రములకు, ఆచారములకు ప్రజలు దాసులుగా నుండిరి. స్వతంత్రముగా బ్రతుకుదుమన్న వెలివేయుచుండిరి. ఈ విధముగా సమాజ ములో పీడనము (Social tyranny) కాన్పించును. పర మాత్మనుగూర్చి ఉపనిషత్తులలో ఉన్నత భావములున్నను, శతాబ్దముల తరబడి దేశములో వర్ణవ్యవస్థ, విగ్రహారాధన నిల్చిపోయినవి. వీనినే కవిరాజు విమర్శించినది.

కవిరాజు సత్యవంతుడు. ప్రతిసత్యవంతుడు కారణము- దేశము - యుగము నగు చున్నాడని అమెరికాయోగి, ఎమ

ర్శను పక్లైను. (Emerson - Every true man is a cause, a country and an age") మతాచార్యులకు జడవకుండ కవిరాజు తన కృతులన్నిటిలో మానవ కోటి కందరి కుపయోగించు విమర్శనా సాహిత్యమును ప్రసాదించెను. ఈ విధముగా క్రీ. శ. 1920 నుండి కవిరాజు సాహిత్యమొక నూతన్న యుగమును సృష్టించెను. విక్టోరియారాణి కాలమునుండి, ప్రపంచములో ప్రజాస్వామికాభివృద్ధి, మానవచైతన్య సంస్కరణాభిలాష, (Human Consciousness), విజ్ఞానశాస్త్రాభివృద్ధి, నూతన్నమైన ఆలోచనాసరళి— సాహిత్యములో ప్రవేశించినవని 'హడ్సను' మున్నగు పాశ్చాత్య లేఖకులు వ్రాసినారు. తురుష్కులు 1453 లో కాన్సంటు నోబులు నాక్రమించిరి. క్రీ. శ. 15 వ శతాబ్దమునుండి విద్యాపునరుజ్జీవనము, మతసంస్కరణోద్యమము, విమర్శన, విజ్ఞానశాస్త్ర సంబంధమగు మనసు, ప్రజాస్వామికము, జాతీయభావము, మున్నగునవారంభ మాయెను. సర్వవిషయ జ్ఞానమును (Liberal education.) బొందిన ఈ కవిరాజ శిఖామణి అమెరికా స్వాతంత్ర యుద్ధమును, ఫ్రెంచి విప్లవమును గూర్చి చదివిన ఈ కవి నూతన్నమైన ఆలోచనా సరళితో దన గ్రంథముల విభజించెను. అందుచేతనే 'ఆధునికి యుగకర్త' యాయెను. ఫ్రెంచి విప్లవనినాదములు స్వాతంత్రత, సమత్వము, భ్రాతృభావము ఈయన కృతులలో మెండు. ఆర్య సమాజ స్థాపకుడైన దయానందుడిట్లు నుడివెను. 'సత్యమును ప్రకటించవలదు. ఉద్యోగులకాగ్రహం

గల్గును; ప్రభుత్వము శిక్షించును; అని జనులను చుందురు. కాని అమాయిక ప్రజలారా!' రారాజగు చక్రవర్తికి కోపం వచ్చుగాక! నేను మాత్రము సత్యమునే వెల్లడింతును — ఈ నా శరీరము క్షణ భంగురము. దీని రక్షణార్థమై, అకృత్యము లాచరించుట హాస్యాస్పదము. ఎవ్వరైన ఈ శరీరమును జంపగోరుదురేని, అట్లు చేయవచ్చును. కాని నా యాత్మను వధింతునని చెప్పగల వీరపురుషు నొక్కని జూపుడు; అట్టి వీరుడు జగతిలో నుద్భవించు దనుక, సత్యము నణచిపెట్టుట నేను తలంపనైన జాలను. "అట్లనే కవిరాజుకు కూడ సత్యమును బ్రకటించుటలో గాఢమైన అభిమానము గలదు. "మనుజు లనేక విధముల దుష్టులే! కాని ఒక్క మార్గములో మాత్రము మంచివారని"' 'అరిస్టాటలు' పల్కుచుండెను. (Aristotle - For men are good in but one way, but bad in many.) వక్రబుద్ధిగల మతాచార్యుల నెదుర్కొని సమాజమును సన్మార్గములో, నూత్నపంథాల్లో నడపటమే ఈయనగొప్పదనము. 'రస్సెల్' అను తత్వవేత్త యిట్లువచించెను. "మనము నూత్నమార్గములో నాలోచించుట నేర్చుకోవలెను."(Russel - We have to learn to think in a new way.) ఈ పద్ధతిలోనే ఈయన కవనము నడచినది. అదియునుగాక ఈయన బుద్ధిబలమును, పారంపర్యావచ్చు సాంప్రదాయముల చేత, ఆచారముల చేత, బురదపాలు చేయకుండ కాపాడిన కవీంద్రుడు.

కవిరాజు ఒకమేధావి. "మధ్య తరగతి వారి చిన్న

యిండ్లలోనే ఆంగ్ల దేశములోని ధీశక్తి సదానిల్చియుండు నని "చార్లెసు విలియమ్సు" వచించెను. (Charles Williams- Genius in England has always resided in the smaller houses of the middle classes.) భారత భూమిలోగూడ నంతియే, కృష్ణామండలములోని "అంగలూరు" అను గ్రామమున ఒక మధ్యమ తరగతి గృహస్థుని యింట ఈ ధీశాలి ఉద్భవించెను. ఒక తరము కాలమువరకు ఆంధ్ర సాహిత్య క్షేత్రములో నీయన కలమున కెదురులేదు. మనుజుడొక ప్రవాహమని, దీని మూలము దాగియున్నదని ఈయన విషయములో చెప్పవచ్చును. (Man is a stream, whose source is hidden.) ప్రతి మహా పురుషుడు అద్వితీయుడు' అని విదితమైనది. (Every great man is a unique.)

కవిరాజు వీరుడు. ప్రఖ్యాతిగాంచిన రచయితలెల్లరు వీరులే. ఈయన సంస్కృతాంధ్రాంగ్లేయ భాషలలో బండితుడు, పాండిత్య సంబంధమగు సర్వ విషయ జ్ఞానము పొందిన ప్రతిభాశాలి. (Scholastic and liberal education.) పండితుడుగాను, కవిగాను ఈయనను వీరుడని చెప్పవచ్చును. వీరులు సదానిల్చెదరని, కొందరెపుడును వీరిని బూజింతురని 'కార్లయిలు' పల్కినది వాస్తవమే. (Carlyle - Heroes, it would seem exist always, and a certain worship of them.) 'జాన్సను' జీవిత చరిత్ర వ్రాయుటకు, 'బాస్వెలు' వీరపూజ కంకితార్పణ చేసెను. 'రూసో' జీవిత రచనకు అనేకులు ముందుకు

వచ్చిరి. నిష్కర్షగలమనసుతో బయలుదేరినవీరునికి ఈ 'జేజేలు పట్టుటకు, వీరగంధము పూయుటకు, జీవిత చరిత్ర వ్రాయుటకు సమాజము భయపడినది. లేనిచో ఒక 'బాస్వెలు' కూడ ఆంధ్ర భూ మండలములో బయటకు రాలేదేమి ? కవిరాజు తన చిత్తమును ఆంధ్రదేశముపైన ఆంధ్రభాషపైన హత్తుకొనునట్లు జేసెను. సమాజమున కుపదేశించి బాగుచేయుడమే రచయితా ధర్మముఅని 'జాన్సను' వ్రాసెను. (Johnson - The end of writing is to instruct.) కవిరాజట్టి కార్యమునే చేసెను కాని కుల భేదములలో నభోరిజనుల వలెనున్న ఆంధ్ర దేశము, కవిరాజు మహత్తును గుర్తించలేదు. ఈయన ద్వితీయ కృతి 'శంబుక వధ' వెలుగును జూచుటతోడనే, ఆవరకే ఏర్పడ్డ తప్పు అభిప్రాయములు (Preconceived notions) ప్రబలమై, ఈయన బ్రాహ్మణ ద్వేషియని 'గోబెల్సు' ప్రచారము సాగినది. వాస్తవముగా ఈయన మధ్య కాలములో నేర్పడ్డ బ్రాహ్మణ మతమునకు, పురోహితుల కర్మకాండకు విరోధికాని, బ్రాహ్మణవైరి కాదు, ఉన్నవ లక్ష్మీనారాయణగారివంటి సద్బ్రాహ్మణు లీయన మిత్రులు.

ఈయనగొప్ప కవి, విమర్శకుడు. మూఢనమ్మకములను, ఛాందస భావములను ఖండించుచు పద్యములలో హృద్యముగా వ్రాసి శాశ్వతయశః కాయుడాయెను. ఆంగ్ల కవి "ఆండ్రూలాంగ్" (Andrew Lang) వలె సాహిత్య విమర్శకుడు; విద్వాంసుడు. ఇటాలియనులు "డాంటేను" గూర్చి నేడుకూడ విశేషముగా మాటాడుదురు, లిఖించెదరు, ఆలోచించెదరు, కలలు గందురు; ఇది చూచిన పరి

హాస్యాస్పదముగా నుండును కాని ఆయన వారి పొగడ్తల కర్హుడే యని 'బైరను' వచించెను. (Smiles - "The Italions" wrote Byron in 1821, "talk Dante, write Dante, and think and dream Dante at this moment to an excess which would be ridiculous, but that he deserves their admiration.) ఆంధ్ర దేశములోగూడ 'కవిరాజును' గూర్చి యిట్లే మాటాడుచున్నారు. అమరజీవియైన కవిరాజు యిట్టి పొగడ్తల కర్హుడే. ఈయన విమర్శన ఉత్తమమైనది, అరుదు; అందుచేత విలువయైనది. 'థూరో' అను అమెరికా తత్వవేత్త యిట్లువ్రాసెను. (Good criticism is very rare and always precious.

'కవిరాజు' మెకాలేవలె మితభాషి. "భోజన సమయములలోదప్ప నేనెవరితో మాటాడి ఎరుంగను," అని మెకాలే పల్కెను.(Macaulay—"Except at meals, I hardly exchanged a word withany human being") "మనసును విప్పిచెప్పకుండ బిట్టుగానుండుట, భద్రముగా గూర్చిన గ్రంథ జాలము,—యివి 'మెకాలే' ద్రవ్యసాధనములని 'చార్లెసు విలియమ్సు' వ్రాసెను.(Charles Williams-"His resources were the reserves of his mind and the preserves of his books.") కవిరాజు ద్రవ్యసాధనము లివియే.

కవిరాజు, ఈశ్వరచంద్ర విద్యాసాగరునివలె నిర్భీతిగల ఆలోచనాపరుడు, సంస్కర్త. ("A fearless thinker and a reformer") భావ విప్లవకారుడు. వేదకాలము

తర్వాత భారతీయ సమాజములో కుళ్ళుబయులు చేరినది. సాంఘిక న్యాయములేదు. కులభేదములు, స్త్రీలను బాని సలుగా చేయుట, సతి ఆచారము, విగ్రహారాధనము, సమాన చట్టము లేకుండుట (Common law nil), దేవుని పేరుతో దోపిళ్ళు, కర్మసిద్ధాంతము, వెట్టి ఆచార ములు, మూర్ఖనమ్మకములు, దేవుళ్ళు, దయ్యములు, స్వప్న ఫలితములు, శకునములు, జంతుబలులు, నరబలులు, పర్దా పద్ధతి, బాల్యవివాహములు, వితంతు వివాహములు లేకుం డుట, బహుపత్నిత్వము, పసిబిడ్డల గంగలో బడవేయుట (Intanticide),సముద్ర ప్రయాణముల నిషేధము-అవతార కథనము, తీర్థయాత్రలు, మంత్రములకు ధనమొసంగుట— వ్రతములు, పూజలు, స్త్రీవిద్య నిషేధము-మున్నగునవి ప్రచారములోనికి వచ్చినవి. ఇవియన్ని మతాచార్యుల ప్రచారము. దేవుడే కొందరు ఏజంట్ల ద్వారా, మానవ కోటికి దారిచూపుటకు చట్టముల నేర్పరచిరని, కొందరు చెప్ప సాగిరని 'పండిత శివనాథశాస్త్రి' వ్రాసెను. ("There are others, who say that God has accredited agents through whom he has published infallible laws for the guidance of man kind.)" మతసంస్కరణవాదులు, సంస్కర్తలు వీరిని పూర్వమే ఖండించిరి. మహమ్మదు విగ్రహారాధనను తీవ్రముగా నిరసించెను. కార్లయిలు దీని నుదాహరించెను. ("One of Mohommed's characteristics which indeed belongs to all prophets, is unlimited implacable Zeal against idolatry. Why is idolatry so hateful to prophets ?")

17 వ శతాబ్దములోని భక్తుడు 'మాలూక్ దాసు' విగ్రహ పూజ నపహాస్యము చేసెను. "If God could be reached by worshipping the stone, I should worship the mountain." 'రాళ్ళు దేవుళ్ళైన రాసులు మింగవా?' అని వేమనయోగి పల్కెను. వేదకాలమునాటికి విగ్రహ పూజలేదు. రాజారామమోహన రాయలు, వీరేశలింగము, మున్నగువారు విగ్రహారాధనను విమర్శించినట్లే కవిరాజు విమర్శించెను.

1906లో కలకత్తాలో 'శివాజి పూజ' జరిగినపుడు, రవీంద్రనాథ టాగూరు నాహ్వానించగా విగ్రహారాధన జరిగే ఏ ఉత్సవమునకు తాను కాని తన కుటుంబీకులలో చిన్నవారుగాని రారని, టాగూరు పల్కెను. "Not even a stripling of the Maharshi's family would join in a festival in which an idol was worshipped.")
గురజాడ అప్పారాయ కవికూడ యిట్లు వ్రాసెను.

"మనిషి చేసిన రాయి రప్పకు
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషు లంటే రాయిరప్పల కన్న
కనిష్టంగా చూస్తా వేల బేలా ॥

కుల భేదముల గూర్చి ఈయన నిరసించెను

మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ, రెండె కులములు
మంచి యన్నది మాల యైతే
మాలనే యగుదున్ ॥

ఎల్ల లోకము వొక్క యిల్లై
వర్ణ భేదము లెల్ల కల్లై
నేల నెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియ,

మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలచి వెలుగును
అంత స్వర్గ సుఖంబు లన్నవి
యవని విలసిల్లున్. ॥

కవిరాజుకూడ జాతీయతా భావమున కడ్డము వగులు కుల భేదముల నిరసించెను. వివేకానందుడు, జదునాథ సర్కారు మున్నగు మహా పురుషులెల్లరు కులభేదముల నిరసించిరి. సనాతన హిందూ సమాజమునకు గావలసినది విగ్రహారాధన, కులవ్యవస్థ—యివి రెండు పునాదులైనవి. (Tarwabhushana-"But as to orthodox Hindu Society, Idolatry and castes lie at its very foundation") వీరి నదురొక్కన్నవారలను సంస్కర్తలనుటకంటె, విప్లవకారులని ప్రజలు పిల్చెదరు. మతాచార్యుల కపట నాటకముల, ధూర్తవాక్కుల నెల్లరు నిరసించిరి. 'ఒక దుష్టుడు కాగోరినచో, నీ కుమారుని ఒక మతాచార్యుని జేయుము' అని సామెతకలదు. (If you wish your son to be a wicked man make him a Priest.") 'జాత్య

విమోచనము' అనునది నాగరికత అధికార పూర్వకముగా కోరునట్టిది. ("Emancipation is demand of civilization.") కనుక స్త్రీ, శూద్రులకు, హరిజనులకు, శాస్త్ర దాస్యమునుండి విముక్తి కావలెను. కవిరాజీ భావముతోనే తన సాహిత్యము నారంభించెను. ప్రాచీన సమాజములోని సాంఘిక అసమానత్వముల, అందరికీ ఒకే న్యాయ చట్టములు లేకుండుట, దోపిడీ విధానమెక్కు వగుటచూచి వానిని నిరసించెను. అందరికి సరిసమానావకాశముల గావలెనని కోరెను. స్త్రీలకు జరిగిన అన్యాయమును (Social injustice) గాంచి హృదయము కరగిపోయెను. ఇవియన్ని మతాచార్యుల దుష్టచర్యలని 'కవిరాజు', రాజారామమోహనరాయలు మున్నగు పూర్వులవలె తెలిసికొనెను. తత్వభూషణ యిట్లు వ్రాసెను. 'మతాచార్యులు, మత మంత్రులు ప్రజలనజ్ఞానము, మూఢనమ్మకములలో నుంచుటకు ప్రయత్నించి, వారిమీద వీనిని రుద్దుటకు ధూర్తమానవులై పోయిరి. "The priests and ministers of religion have systematically tried to keep people in ignorance and superstition, and have, as was inevitable, themselves become the dupes of the superstition, they have attempted to perpetuate." కవిరాజు ఉద్దేశ్యము సాంఘిక నిరంకుశత్వముల తొలగించుటయే. చరిత్రకారులు పురోహితుని వర్ణించుచు, ఆయన రాజకీయ, ఆధ్యాత్మిక సలహాదారని, యుద్ధ భూమిలో పురోహితుడు ప్రార్ధనలు జరిపి, గేయములు పాడి, రాజు జయమును గోరుచుండిరని వ్రాసిరి.

నూతన్న విద్యా విధానము వలన సర్వవిషయ జ్ఞానం వలన విచారణ, విమర్శన, మతము మీాద, పౌరోహిత్యము మీాద ఏహ్య భావము, హేతుబద్ధము కాని విషయముల విమర్శించుట, మధ్య కాలీన సనాతనాచార పద్ధతుల వలన గల్గిన సంకుచిత మానసిక నిరోధముల భేదించుట అనునవి గల్గెనని 'శివనాధశాస్త్రి గారు వ్రాసిరి' ("Among the characteristic features of the new movement may be included(a A spirit of enquiry and criticism (A great hatred against-priesthood and religion-They criticised whatever came in their way and against reason· Shattered the narrow mental barriers imposed by madiaeval orthodoxy. కవిరాజు అభిప్రాయము మతాచార్యుల అనృతములో నున్న భారతీయ సమాజమును స్వతంత్ర సమాజముగా జేయుటయే ("From a priest-ridden Hindu sect to a broad and free society.") నవ్య భారత వర్షమును కోరు ఏ వ్యక్తి దీనిని అడ్డగించదు.

ఇంకను ఇతర విద్వాంసులుకూడ అనేక హిందూ మత కర్మకాండను, కులభేదముల, కుల అహంకారమును ("Caste Pride") బలువిధముల విమర్శించిరి. ("Great handicap of Hinduism loadofritualism and ceremonial observances, caste developed to fantastic length ("See U. P. Vist Society-Vol XIX-A new approach - D. P. Sarma, M. A.,") Now it is noteworthy thatwhile the priesthood had fully succeeded in enslaving the people in chains

of a net work of ritualism and superstitions, miscalled religion—The priesthood were generally the most unbending, irrational and intolerant and they were the intellectual guides of a credulous laity.")

"మోక్షముల్లరు" అను జర్మను విద్వాంసుడు, "టైమ్సు" పత్రిక కొక వ్యాసము వ్రాయుచు సతి ఆచారమును ధిక్కరించెను. "భారతీయ వితంతువుల దుస్థితిని గూర్చి ఆయన విచారించుచు అంధ విశ్వాసముల నుండి, మూర్ఖ నమ్మకములనుండి వారిని రక్షించ వలసినదిగా పరోపకారబుద్ధి గలవారిని ఆయన కోరెను. ("He depicted the miserable lot of the Hindu widow in true colours and feelingly appealed to philanthropists to save them from the tyranny of blin and superstitous customs.")

ఫ్రెంచి విప్లవము తర్వాత మతాచార్యు లొకరి తర్వాత ఒకరువచ్చి తమ జీవితమంతా అబద్ధాల పుట్టయని, పొట్టకూటికి చేసిన తంత్రమని, స్పష్టముగా అంగీకరించిరని, "మెకాలే" వ్రాసెను.

(Macaulay-"All our readers know, how, at the time of the French revolution, priest after priest came forward to declare that his doctrine, his ministry, his whole life, had been a lie, a mummery during which he could scarcely compose his countenance sufficiently to carry on the imposture.' This was the case of a false,

or at least of a grossly corrupted religion.") ఈ మతపు వేషదార్లను వేమనకూడ యిట్లు విమర్శించెను.

"మతపు వేషదార్లు మహిమీద పదివేలు
మూఢజనుల గలుప మూగుచుంద్రు ! !"

'మాక్సుముల్లరు' భారతీయ పవిత్ర గ్రంథజాలమును 51 సంపుటములుగా ఆంగ్లములోనికి మార్చెను. ఇందు మూడు మాత్రము ఈయన యజమాన్యముక్రింద జరిగెను. 1849 లో ఋగ్వేదము మొదటి సంపుటము ప్రకటిత మాయెను. ఈ వేదము మ్లేచ్ఛ రచితమని, దానిని జదువరాదని మతాచార్యులనేకులు ప్రచార మారంభించిరి. ("Attempts were made in various places to set a religious ban on my Veda, allegating that it had been written by a 'Mleccha' with Cow's blood.") 'అల్బరూని' కాలములోగూడ శూద్రులు వేదములు వినరాదని, ఉచ్ఛరించరాదని నియమములుండెను. అట్లుచ్ఛరించినదండ విధాయి ఎనుటికి లాగి శిక్ష వేయించుచుండిరి. ఈ విధముగా మతాచార్యుల ఆధిపత్యము ప్రాచీన కాలమున ప్రబలముగా నుండెను. తక్షశిలా విద్యాలయమున అగ్రజులకు మాత్రమే ప్రవేశము. దీనికి కారణములు లేకపోలేదు. మతాచార్యులు స్వప్రయోజనము కొరకు చేయు బేడిజమును (Priest craft) సర్వవిషయజ్ఞానమును బొందిన ఆంగ్లవిద్యాప్రవీణులు విమర్శించిరి. సత్యము, న్యాయము, దాక్షిణ్యములు లేని మత పౌరోహిత్యమును సంస్కర్తలువిమర్శించిరి. కవిరాజువిమర్శనప్రాచీనులగుబుద్ధుడు,

అరిస్టాటలువిమర్శనలబోలియున్నది. విమర్శనకూడఒకశాస్త్ర మేయనిగుర్తెరుంగుడు. కపిరాజు రచనలలో బుద్ధదేవునివిభజ్జ వాదము (how and why) విశ్వన్యాయము లేక ఆత్మ వాదము (Universal reasoning) కాన్పించును. భావము స్వేచ్ఛగానుండవలెనని ఈయన కోర్కె.("Thought must be absolutly free.")

## బ్రా హ్మ ణ దే శ ము

క్రీ. పూ. 14 శతాబ్దముల క్రితము ఆర్యులు ఈ దేశములో ప్రవేశించిరి. వారు శీతల దేశవాసులు; శ్వేత వర్ణులు. నల్లని వారైన ద్రావిడులను వారు పారదోలి, వారి పురముల నాశనముజేసి, వారి స్త్రీలను బెండ్లాడి, ఆర్య నాగరికతను ప్రవేశపెట్టిరి. వృత్తినిబట్టి వీరిలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులని పేర్లు ఏర్పడెను. బుద్ధిసంపన్నులైన బ్రాహ్మణులు అనేకరంగములలో బాల్గొని, ప్రవీణత నందిరి."22శతాబ్దముల కాలము బ్రాహ్మణులు రచయితలు గాను, పండితులుగాను భారతభూమిలో విలసిల్లిరి. హిందూ రాజులకు సలహాదార్లుగాను, హిందూ ప్రజలకు గురువు గానువుండిరి." అని హంటరు వ్రాసెను. (Hunter - "But through out 22 centuries Brahmins have been the writers and learned men of India, the counsellors of Hindu princes and the teachers of the people.")

"I వ ప్రవరసేనుని కాలములో వర్ణాశ్రమ ధర్మ ముల పునరుద్ధరించుటచే హిందూ సనాతనత్వము విజృంభిం

చెను. ఆ కాలపువాణి అదియే. భారత దేశమున కంతటికి హిందూ సామ్రాజ్యమును వ్యాప్తి చేయుట, శాస్త్రములకు పట్టముగట్టుట — అనునవియే ఆయన ఆశయములు." (K. P. Jayaswal-"His thesis was a Hindu empire for the whole of India and enthronement of the Sastras.") ఈ ప్రకారము ఆర్య రాజ్యపాలనా కాలములో సనాతనుల కత్యధిక గౌరవము లుండెను. వారి ఆధిపత్యము అన్ని రంగములలో చలామణి అగుచుండెను. ఇట్టి కారణముల చేత ఈ దేశమునకు బ్రాహ్మణ దేశమని పేరుండెను "హానూలూస్సాంగు" యిట్లు వ్రాసెను. "అన్ని కులములు, జాతులలో బ్రాహ్మణులు అత్యంత పరిశుద్ధులై ఎక్కువ గౌరవమును బొందుచుండిరి. వారి ప్రతిష్టనుబట్టి ఈ దేశమునకు 'బ్రాహ్మణ దేశము' అను పేరు వాడుకలో నుండెను. ("Among the various castes and clans of the country the Brahmins were purest and in most esteem. So from their excellent reputation, the name Brahmana Country had come to popular one for India.")

ఇట్లనే చైనీయ లేఖకుడు 'ఇత్సింగు' కూడ ఐదు భాగములుగా నున్న ఈ దేశమున కంతటికిని బ్రాహ్మణ రాజ్యమని పేరుగలదని వ్రాసెను. (Itsing—"Further we ought to note that the whole country comprising the five parts of India is called the Kingdom of the Brahmins.)" ఈలాగుననే బౌద్ధమతము ప్రబలముగానున్న కాలమును 'రైసుడేవిడ్స్' బౌద్ధ హిందూ దేశమని (Buddhist India) పేర్కొనెను. చరిత్రకారులు

Muslim India, British India అను పదములు వాడిరి.

ఎవరి రాజ్య కాలములో వారు తమ ఆధిపత్యమును చెలాయించుచు, తమ కులస్థులకు, మతస్థుల కనుకూల చట్టముల వ్రాసికొనిరి. మిగతా వారిని విద్యాగంధము లేకుండా అణగద్రొక్కిరి. మతాచార్యులు అమాయక జనులను శాస్త్రముల పేరుతో మోసగించిరి. 'థూరో' అను అమెరికా యోగి కాయకష్టమును జేసి జీవనోపాధినిగడపుకొనగా, మన వారు చెమటకార్చకుండ లోకులను మోసగించిరి.(Thorean "I earned my living by the labour of my hands only. All honest men are daily straving to earn their bread by their industry.") బ్రిటిషువారి కాలములోనే అందరికి, కులవిచక్షణ లేకుండ విద్య, వైద్యము మున్నగు సౌకర్యములు గల్పించబడెను.

'పుష్యమిత్రశుంగుని' కాలమునుండి బౌద్ధమతము అణగగొట్టబడి. బ్రాహ్మణ మతము విజృంభించెను. అనేక నూతన్నగ్రంథములు వ్రాయబడెను. ఇవియన్ని స్వార్థపరుల గ్రంథజాలమని దయానంద సరస్వతి మున్నగువారు ఆక్షేపించిరి. ఈయన యిట్లు వ్రాసెను. పురాణములోని మాటలన్నియు నబద్ధము లేనా? లేకనిజమేమైన గొంచెమున్నదా? "చాలవరకు నబద్ధములును, గొంతవరకు సత్యములునున్నవి. సత్యమైన వన్నియు వేదాదిసత్య శాస్త్రములలోనివి. అబద్ధములన్నియు బోపుల పురాణ రూపములగు స్వంతయింటిలోనివి." "తంత్ర గ్రంథములు, పురాణములు, దపపురాణములు, తులసీదాసకృతి రామాయణాది భాషాగ్రంథములు-

ఇవియన్నియు గపోల కల్పిత మిథ్యాగ్రంధములు. ఓయ బద్ధపు వేదాంతులారా! మీరు సత్యస్వరూపుడును, సత్య కారణుడును, సత్యసంకల్పుడు నగు పరమాత్మను మిథ్యా వాదిగా జేసివేసిరి. ఏమి? ఇది మీ దుర్గతికి కారణము కాదా?"

"పరంపరను బట్టి వచ్చుచుండిన అర్థసహిత వేదాది శాస్త్ర పఠనాప్రచారము లుప్తమయి బ్రాహ్మణులు కేవలము తమ పొట్టకొరకు బఠించుట మాత్ర మొకటి నిలిచెను—తమ జీవనార్థము పన్నుగడ నొక్కటిని జన్నులకు యత్నించి, బ్రాహ్మణు లందఱును జేరి, క్షత్రియాదులను నీ తీరున నుపదేశించ నిశ్చయించుకొనిరి "మేమే మీకు బూజనీయ దేవతలము, మా సేవ చేయక ముక్తి లేక స్వర్గము మీకు దొరకదు. మాసేవ జేయకపోయిన మీరు ఘోర నరకమున బడుదురు."

"నామమాత్ర బ్రాహ్మణులు—"మేము భూదేవతల మనియు, మాసేవ చేయక ఎవరికిని దేవలోకము లభించదు."

ఈనవీన కపోలకల్పిత శ్రీమద్భాగవత శివపురాణాది మిథ్యాదూత గ్రంథముల కన్వయింపదు.

"భాగవతాదుల రచించిన పోపులు. పోపులని ఎవ్వరినందురు?

"పోపనగా రోమను భాషలో గొప్పయను, దంగ్రీకిసి

బేరు-కాని యిప్పుడు ఛలకపటముచేత నితరులను మోస పుచ్చి, దమ ప్రయోజనము సిద్ధి చేసికొనువారికి బోపులను చున్నారు."

"కాని బ్రాహ్మణులు సాధువులు దమతమ గుణ కర్మ స్వభావములను బట్టియు బరోపకారమును బట్టియు నగుచున్నారు.

ఋషులు విద్వాంసులును, శాస్త్రవేత్తలును,ధర్మా త్ములు నయియున్నారు.

ఋషులు కానివారు పక్షపాత సహితమగు నాత్మ గలిగి అల్ప శాస్త్రిములను జదివి యుండినారు. కాబట్టి వారు రచించిన గ్రంథములును అట్టులే యుండును; గనుక వానిని చదువకూడదు.

మూర్తిపూజ జైనులవలన వారిలోని మూర్ఖుల వలన గల్గెను, పోపులందరు తమ జీవనార్థము మాయోపాయముల బన్ని విగ్రహముల స్థాపించిరి - ఇత్యాది శ్లోకములు పోపుల పురాణములందున్నవి.

(రామనుజాచార్యులు) ఈయన శంకరాచార్యులను జాలవరకు నిందించియున్నాడు." ఈ వచనములన్ని దయా నందుని, సత్యార్థ ప్రకాశిక, తెలుగు అనువాదము లోనివి.

'స్టూవర్టు' అను విద్వాంసుడుకూడ మొత్తము సంస్కృత గ్రంథజాలమంతయు మతాచార్యుల ఫోర్జరీయని నిందించెను. (Dugald Stewart (1785-1810)- "The wholesanskritliteraturemind a literature extend-

ding over 3000 years and larger than the ancient literature of either of Greece or Rome- was a forgery of these willy priests.")

దయానందుని వలె కవిరాజులోకమునకు సత్యమును ప్రసాదించి, సాహిత్యము ద్వారా మతాచార్యులను నిరసించి, మానవ చైతన్యమును ప్రసాదించెను. "తొమ్మిది మంది కన్యాకుబ్జవాసులకు పది వంటపాత్రలుండునని, ఒకరి కొకరు కలసి భుజించరని, దగ్గరబంధువులతో కూడ భుజించరని," సామెతగలదు. ("For Nine Kanyakhubjas, you will have ten cooking places,each refusing to dine with the other, often with his nearest relations" Proverb.) ఇట్టివాని నెల నిరసించి మానవ చైతన్యమును ప్రసాదించగమే నాగరికత లక్షణమని, సాహిత్యము ద్వారాదీనినెదుర్కొనవలెనని,అపుడుమతాచార్యుడు సెలవుపుచ్చుకొనునని,పరమాత్మ వచ్చునని'మాక్సులెర్నర్' వ్రాసినాడు. (Max Lerner—"The problem of humanity all over the civilized world is social and religious and is to be finally met and treated by literature.The priest departs,the divine comes.")

ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు కూడ, ఈ దయ్యపు ఆచారముల కాడిని దొలగించవలెనని; హేతువు,పవిత్రతతో గూడిన పిలుపులకు జవాబు నివ్వవలెనని,అంతరాత్మ అంగీకరించునట్టి మతమున విధించు పద్ధతి ననుసరించవలెనని వ్రాసెను. ("to cast off the yoke of fiendish customs to respond to the calls of reason and virtue, and to adopt a course which conscience appro-

ves and religion enjoins.") కవిరాజు భావములుకూడ ఇట్లు హేతుబద్ధమై, జాతీయమై Rational and National) స్వార్థపరులకు దావులేకుండ యున్నవి. ఇదియే నిజమైన సంస్కృతి. మతాచార్యులకు ధన భావము తప్ప మరియొకటి లేదు. (Dominance of money mentality). సంస్కర్త లందరు నిట్టి దురాచారముల ఖండించిరి కాని జ్ఞానయోగ మును ఖండించలేదు.

భారతభూమిలోనికి అలెగ్జాండరు వచ్చినపుడు ఆయన దండమీసు యోగిని, కల్యాణయోగిని దీసికొనిపోవ యత్నించెను. దండమీసు నిరాకరించుచు, బ్రహ్మవేత్తలు మరణ మన్న భయపడరు, ధనమన్న ఆశపడరు' అని వచించెను. 'సోక్రటీసు' కూడ ఇట్లే పల్కెను. 'మరణమన్న గడ్డిపోచ వలె' లక్ష్యము చేయను. ("I cared not a straw for death.") ఈ యోగులు చివరకు పరమాత్మలో లీనమై పోవుదురు. మనుష్య భావము పోయి, పరమాత్మ భావము గల్గును.(Final reunion - Full consiousness of divi nity-unconscious as man.") క్రీ. శ. 1837 లో రంజిత సింగు ఎదుట ఒక ఫకీరు భూమిలోనికి ప్రవేశించి, 40 దిన ముల తర్వాత బయటకు వచ్చెను. డాక్టరు 'హానిగ్ బెర్గర్' పరీక్ష చేయగా ఈయన యథాప్రకారముగ నుండెనని తేలెను. ఆబూజైద్ అనువారు ఒక యోగిని జూచెను. 16 ఏండ్ల తర్వాత వచ్చి చూడగా యోగి అదేస్థితిలోనుండుట గాంచి ఆశ్చర్యచకితుడాయెను. ("What astonished me was that he as not melted by the heat of the

Sun."). ఉల్ఫ(Wolf) ఒక యోగిని గాంచి, 'ఈశ్వర జ్ఞానము నెట్లుపొందగలరని యడుగగా ఆయన యిట్లు వచించెను. "నన్ను ప్రశ్నలడుగవలదు. నీవు నావంకచూడుము ఏలనన నేను పరమాత్మనై యున్నాను" అని పల్కెను. (Wolf-How can-one obtain the knowledge of God? He replied, "Do not ask me questions, you may look at me for I am God.") ఇట్టివారే నిజమైన బ్రహ్మవేత్తలు లేక బ్రాహ్మణులు. హృదయాంతర్వర్తియగు పరమాత్మను గాంచినవారు వీరే పూజ్యనీయులు. కవిరాజు యిట్టి వారినెన్నడు దూషించ లేడు. 'థూరో' చెప్పినట్లు, వేదాంతమును ప్రచారము చేయుటకన్న ఆచరించుటగొప్పమేలు. (Thoreau -"There are now a days professors of philosophy, but not philosophers. Yet it is admirable to profess because it was once admirable to live. To be a philosopher is not merely to have subtle thoughts, nor even to found a school but so to love wisdom as to according to its dictates, a life of simplictiy, Indepence magnanimity and trust. It is to solve, some of the problems of life, not only theoretically but practically.— The philosopher is in advance of his age even the outward form of his life. He is not free sheltered clothed, warmed like his contemporaries."

Emerson—"The sainted soul is always elegent and passes unchallenged into the most guarded Mind.

## కవిరాజు పూర్వులు - సమకాలీనులు

కవిరాజు రచించిన గ్రంథములు సంస్కరణ, చారిత్రక భావముల సూచించును. శంబుకవధ, కురుక్షేత్ర సంగ్రామములలోని పీఠికలు చూడతగినవి. సూతపురాణములు, మూఢ నమ్మకముల ఖండించునట్టివి ఈయన వివాహ విధిని బట్టి వేదములయందు నమ్మకముగాన్పించును. ధూర్త మానవా! మున్నగు గ్రంథములు మహాచార్యులపైన దాడులు.

కవిరాజు పూర్వులగు వారికిట్టి భావములే కలవు. భారతదేశములో మొట్టమొదటి సంస్కర్త ("The first all round reformer in India.") బ్రిటిషువారి పాలనలోనివాడు. (1) 'రాజరామమోహనరాయలు (1774-1831) అను బెంగాలీ బ్రాహ్మణుడు మూఢ నమ్మకముల, ఆచారముల, కర్మ కాండ నీయన నిరసించెను. సాంఘిక, మత సంస్కర్త; రచయిత, విద్వాంసుడు. వేదసారము, వేదశిరసు, వేదాంతము-అను హిందూమత సిద్ధాంతములలో నమ్మకం గలవాడు. 1830 లో సతి ఆచారమును శాసనము ద్వారా మాన్పించినవారు, ఏకేశ్వరవాదమును సమర్థించుచు 1828 లో బ్రహ్మ సమాజము స్థాపించెను. విగ్రహారాధన, కుల భేదములపై దాడి వెడలిన వారు. పరమాత్మ ఒక్కడే అను భావము, అరబ్బీ భాషలోని 'కొరాను'ను జదివిన తర్వాత ఈయనకు గల్గెను. సముద్రయానముపనికి రాదను కాలములలో నీయన 1830 లో ఇంగ్లాండుకేగి అచటనే ఉండి, 1833 లో

యసువుల వ్రాసెను. విగ్రహారాధనమీద గ్రంథము (బెంగాలీ వచనము) 1790 లో బయల్పడెను. సతి ఆచారము, ఇతర సాంఘిక సమస్యలపైన బెంగాలి, ఇంగ్లీషులలో అనేకములు రచించెను. మానవ సేవాసంఘమున చేరి 'జెరిమిబెంథాము' తోకూడి ఇంగ్లాండులోపనిచేసెను. "వజ్రసూచికోపనిషత్తు"ను బెంగాలీ భాషలోనికి మార్చెను. సమాజములోని నిరంకుశత్వముల పోగొట్టి, ఉపనిషత్తుల కాలమునాటి సమాజమును స్థాపించటమే ఈయనలక్ష్యము. రజస్వలానంతర వివాహము సమర్థించుటయే కాక తన మనుమరాలి వివాహమును 15వ ఏట జరిపించెను. ఇంగ్లీషు భాష విలువనుగురించి, మెకాలే రాకకు 12 ఏండ్ల పూర్వమే ఈ దేశీయులకు ఇంగ్లీషు విజ్ఞాన శాస్త్ర జ్ఞానము అవసరమని ప్రబోధించెను. స్త్రీల విషయములో ఈయన చేసిన కృషి ప్రశంసనీయము. బ్రాహ్మణులకీయన స్వతంత్ర భావములు నచ్చలేదు. నూత్న భారత వర్షమున కీయన ఆరంభకుడు.

మహర్షి దేవేంద్రనాథ టాగూరు :— (1818–1905) బెంగాలులోని రెండవ సంస్కర్త. బ్రహ్మసమాజ మతమును ప్రచార మొనర్చెను. 1828 లో స్థాపించబడిన బ్రహ్మసమాజము 25ఏండ్లతరువాత ఈయనచే పునరుద్ధరించబడెను. ఉపనిషత్తులు మున్నగువాని నుండి కొన్ని సూక్తులు గైకొని 1848 లో నొక గ్రంథము రచించి, బ్రహ్మసమాజ మతమునకు బలము గల్గించెను. సనాతన బ్రాహ్మణులయందు ఈయునకు గౌరవము లేదు; కాని ఉపని

పత్తులయందు గొప్ప గౌరవముండెను.

రామమోహనరాయలు డఫ్' చేత స్థాపించచేసిన ఆంగ్ల పాఠశాలలో నీయన విద్యార్థి-విజ్ఞానశాస్త్ర భావముల చేత,బ్రహ్మసమాజములో గొన్ని మార్పుల నంగీకరించిరి. బహుదేవతలందు నమ్మకము, విగ్రహారాధన - వీనియందు మహర్షికే మాత్రము నమ్మకము లేదు, కులమునందు నమ్మకము లేనివాడై యజ్ఞోపవీతమును దీసివేసి, మరల ధరించ లేదు. బ్రాహ్మణేతరులతో కలిసిమెలసి,భుజించుచు త్రాగుచుండెను. ఉపనయన సమయములో గూడ తన కుటుంబ సభ్యులకు జన్నిదము లిచ్చుట మానివేసెను. వివాహములలో గూడ సంస్కారముల జేసెను.

కేశవచంద్రసేన్-(1838-1884) ఈయన యజమాన్యము క్రిందబ్రహ్మసమాజములో నొకక్రొత్తశాఖ 1866లో ఏర్పడెను. ఇది యింకనువిప్లవాత్మకమై యుండెను.(More radical)కులమును సూచించు జన్నిదముల తెంచివైచెను కులమే రద్దుకావలెనని, ఈయన ఆశయము- వర్ణాంతర వివాహముల చేయసాగెను, కాని నైతిక వర్తనముపై అధికముగా బోధించసాగెను. వితంతు వివాహముల, అంతర్వర్ణ వివాహముల ప్రోత్సహించెను. పర్దా పద్ధతిని రద్దుచేసెను. 1864 లో స్త్రీలకు సభల నేర్పాటుచేసి, 1871 లో స్త్రీలకు వయోజన పాఠశాల నేర్పరచి,తర్వాత ఆర్య నారీ సమాజమును స్థాపించి స్త్రీలకు విక్టోరియా కాలేజిని స్థాపించెను. ఇంకను అనేక యితర సంస్థలను స్త్రీలకు ప్రత్యేకముగా స్థాపించెను. ఈయన కృషి వలన 1872 లో, 14 ఏండ్లకు

ముందుగా బాల్య వివాహములు చేయగూడదని శాసన మేర్ప రచబడెను. (Act III) వర్గాంతర, వితంతు వివాహములు చేయవచ్చని శాసనము లేర్పడెను. కాని బహుపత్నీత్వము నిషిద్ధమాయెను. ఈకృషి కీయనయే కారకుడు. రెయిడ్, (Reid) హామిల్టన్ (Hamilton that unrivalled thinker) విక్టర్ కజిన్ (Victor Cousin) మున్నగు తత్వవేత్తల ప్రభావ మీయనపైన అధికముగా గానవచ్చెను.

బ్రహ్మసమాజ స్థాపనను గూర్చి ఈయన యిట్లువచించెను. "దీని పునాది ఉపనిషత్తులపైన ఆధారపడినది. మేము ముందుకు నడచినను, పునాది అదియే." ("The foundation of Brahmaism was laid upon the upanishads. Although we have advanced, the foundation remains the same.") మామూలు ప్రజానీకము మూర్ఖత్వములో బడకుండ వారికి విద్యాగంధము గల్గించవలెనని 'సులభ సమాచారము' అను పత్రికను స్థాపించి బహుళ ప్రచారము చేసెను. క్రీ. శ. 1870 లో నీయన ఇంగ్లాండు కేగి అనేకమంది ప్రముఖులను గలసికొనెను. అచట జాతీయ భారతీయ సమాజస్థాపన జరిగినపు డందుపాల్గొనెను. సనాతనులు సముద్రయానమును నిషేధించినను ఈయనలక్ష్య పెట్టలేదు. భారత దేశమునకు వచ్చిన తర్వాత Indian reform association స్థాపించెను.

4. శశిపాద బెనర్జీ:- 'కేశవ చంద్రసేను' సమకాలీనుడు. ఈయనకూడ గొప్ప సంస్కర్త. క్రీ.శ. 1871లో తన భార్యతో గూడ ఇంగ్లాండు కేగెను. ఇంగ్లాండు కేగిన మొదటినారి

మణి ఈమెయే. ఈమె కృషి వలన పర్దాపద్ధతి, క్రమముగా తగ్గిపోయెను. ఈమెవలన స్త్రీవిద్యాభివృద్ధి గల్గెను. ఈమెతర్వాత అనేకమంది భారత నారీమణులు విదేశముల కేగిరి. స్త్రీలకు ఉన్నత విద్యాభ్యాసము కూడ సాగెను. ఈయన మొదటి భార్య చనిపోయిన తర్వాత 1861 లో రెండవ వివాహాము నకు ఒక వితంతువును పెండ్లాడెను. హిందూ వితంతు శరణాలయమును స్థాపించి, వితంతువులకు సేవ చేసెను. ఆర్. జి. భాండార్కరు వలె, స్త్రీలకు ఉన్నత విద్య కావలెనని ప్రోత్సహించెను. (R. G. Bh.-"That necessarily implies that the study of English literature is considered to be beneficial to our women") శివనాథశాస్త్రి కూడ వీరి మార్గమునే నడచెను.

5. ఈశ్వర చంద్ర విద్యాసాగరు - 1820 - 1891 ఈయన పండితుడు. ఒక కళాశాలాధ్యక్షుడు. ఈయన కాలము నందే క్రీ. శ. 1856 లో స్త్రీ పునర్వివాహములకు XIV ఆక్టు ఏర్పడెను. కలకత్తా నగరములో 1865-12-7 న మొదటి స్త్రీ పునర్వివాహము జరిగెను. 1866 లో బొంబాయి నగరములో స్త్రీ పునర్వివాహముల కొరక సంఘము స్థాపించబడెను. 1830 లో సతి ఆచారము పోయిన తర్వాత స్త్రీ పునర్వివాహముల చేయసాగిరి. 'బాబు శ్యామ చరణదాసు' అను బెంగలీవాసి తన కుమార్తె భర్తను గలియకయే వితంతువాయెను. పునర్వివాహము చేయవచ్చునా ? యని తండ్రి పండితుల నడుగ వారు 'రాజా శ్రీ రాధాకాంత దేవ్' యింట సభ జరిపి, శూద్రులకు స్త్రీ పునర్వివాహ

ముల కర్త్వత గలదని, ఒక సర్టిఫికేట్ నొసంగిరి. తని ఈ విషయములో శాస్త్రము లేమి తెల్పుచున్నవో చెప్పుమని కోరగా, ఈశ్వరచంద్రుడు పరిశోధించి, 'పరాశర స్మృతి'ని జూచి స్త్రీలు పునర్వివాహము చేసికోవచ్చునని ఒక కర పత్రమును ప్రకటించెను. సనాతనులు దీనిని ఖండించ యత్నించ, మరియొక కరపత్రమును ప్రకటించెను. తన కుమారునికే ఒక వితంతువును దెచ్చి వివాహమొనర్చెను. ఆంగ్ల విద్య వలన, నవీన యుగములోని సంస్కారము వలన 1855 నుండి సంఘ సంస్కరణము ఈశ్వర చంద్రుని కాలములో బయలుదేరెనని జదునాథసర్కారు వ్రాయుచున్నాడు.

(J. N. Sircar-"As surely as the renaissance in Europe was followed by the reformation, so in India too a modification of our social relations, our general out look upon life, and our religious doctrines and practices was bound to result from the action of English education.")

6. దయానంద సరస్వతి :- (1827-1883) ఆర్య సమాజ స్థాపకుడు. గొప్ప సంస్కర్త, విమర్శకుడు. కవి రాజుకు పూర్వమే విగ్రహారాధనను, వర్ణ వ్యవస్థను విమర్శించెను. వేదములు గాక మిగత గ్రంథ జాల మంతయు స్వార్థపరుల కుక్షింభరిత్వమునకు వ్రాయబడిన గ్రంథ జాలమని ఈయన విమర్శించెను వేదములలో సంహిత భాగమును ప్రమాణముగా నంగీకరించును. వర్ణాంతర వివాహమును, వితంతు వివాహములను, రజస్వలానాంతర వివాహములను ఈయన బలపరచెను. కర్మను ఖండించెను. స్త్రీ విద్యను ప్రోత్సహిం

చెను. శుద్ధి సంఘములస్థాపించి, అన్యమతస్థులను ఆర్య సమాజములో జేర్పించెను ఈయన 'అస్ఖలిత బ్రహ్మచారి.'

7. వివేకానందస్వామి :- (1863-1902) మానవ సేవయే మాధవ సేవ అను సిద్ధాంతమును, ఉపనిషత్సమ్మతమైన మతమును ఆధునిక భావసంపద కనుగుణ్యముగా ఈ స్వామి నవ్య హిందూమతమును బోధించెను. కులభేదముల నిరసించెను; కాని విగ్రహారాధనను సమర్థించెను. 'ఇది ఆంగ్ల విద్యా పునరుజ్జీవనము వలన నేర్పడిన నవ్యహిందూమతమని' జదునాథ సర్కారు పేర్కొనెను. (J. N. Sircar -"This neo Hinduism is clearly a fruit of the English renaissance.")

ఇక ఆంధ్రదేశములో గురజాడ అప్పారావు, కందుకూరి వీరేశలింగము, రఘుపతి వేంకట రత్నము నాయుడు, కాశీనాధుని నాగేశ్వరరావు, ఉన్నవ లక్ష్మీనారాయణ, గోపరాజు రామచంద్రరావుగార్లు కవిరాజు సమకాలీనులు. పైవారెల్లరు అస్పృశ్యతను, బాల్య వివాహములను, నిరసించిరి. వితంతు వివాముల, రజస్వలానంతర వివాహముల, వర్ణాంతర వివాహముల ప్రోత్సహించిరి. మనోశుద్ధత కొరకు విగ్రహ పూజ మామూలు జనుల కవసరమని పైవారిలో గొందరికి నమ్మకము గలదు. 'లోకోభిన్నరుచి' అనుసూక్తి సత్యమైనది. 'ఇంకను వేమన, బ్రహ్మముగారు' మున్నగువారు కులభేదముల, నిరసించిరి. కవిరాజు కూడ ఈ కోవకు చెందినవారే. మృతినొందిన తర్వాత కూడ కవిరాజును, సంకుచిత కులభేదములలో గుర్తించకుండుట విచారణీయము. జాన్సను చెప్పినట్లు ఉన్నత స్థానమునకు గౌరవము, జీవించియుండగా గల్గిన

ఖ్యాతికి మృదుత్వము, మేధాశక్తికి పాండిత్యమునకు పూజ్యత నిచ్చుట' మనము నేర్వవలెను (Johnson-"Respect is due to high place, tenderness to living reputation and veneration to genius and learning."

"ఒక మహాపురుషు డస్తమించుట తోడనే, ఆతని వారసుని కొరకు ప్రజ లాకసమువంక జూతురు. కాని ఎవరు రారు. వచ్చుటకిష్టపడరు - ఇంకొక భిన్నమైన రంగములో, తరువాత వారు వచ్చును. అని 'ఎమర్సను' నుడివెను. (Emerson - When nature removes a great man people explore the horizon for a successor; but none comes and none will- in some other and quite different field, the next man will appear.)

ఇది సత్యముగానే యున్నది. ఈశ్వరచంద్రుని వర్ధంతులు 'వంగదేశమున' ప్రతి ఏడు జరుపుచుందురు. "ఆయనను మాటలతో బొగడిన లాభములేదు. ఆయన ఏమి చేయవలెనని చెప్పెనో, ఏమి చేసెనో ఆ పనినే మనము చేయవలెను." అని ప్రతి వంగదేశీయుడు దృఢనిశ్చయముతో ముందుకు నడచును. కవిరాజు కీర్తిశేషుడైనను, ఆయన చారిత్రక దృష్టికోణము, శాస్త్రీయ దృక్పథము, కర్మకాండ నిరసన, అంధ విశ్వాసముల బోగొట్టుట, అస్పృశ్యతా నిర్మూలన—మున్నగు వానిలో మనము బనిచేసి, సాహిత్యరంగములో గూడ స్వేచ్ఛా వాయువుల బీల్చి మన విద్యుక్త ధర్మమును నెరవేర్చుకొందుము గాత. లేనిచో నవ్యాంధ్రభూమి ఏర్పడదు. కేంద్రప్రభుత్వము ఈయన బొమ్మతో ఒక తపాలు బిళ్ళను జారీ చేయుట ఉచితము.

—కొడాలి లక్ష్మీనారాయణ.

# కవిరాజు త్రిపురనేని

సాహిత్యే సమతా ఏవ స్థాపనీయా ముహుర్ముహుః
అభిలష్య ప్రజాక్షేమం రామస్వామీ సమబ్రవీత్.

దురాచారాంధతిమిర నిర్మూలన ప్రభాకరః
సాహితీ గగనే నిత్యం రామస్వామీ విరాజతే

విద్యాహీనాః దరిద్రాశ్చసము ద్ధార్యాః దినే దినే
ఇత్యువాచ కవిస్వామీ కరుణా పూర్ణమానసః

ఆంధ్ర సాహిత్య సుక్షేత్రే రామస్వామి కృషీవలః
సంఘ సంస్కార బీజాని చిక్షేప కవితాజలైః

మానవోఽత్మవిశ్వాసీయః మహాకార్య ప్రసాధకః
కవిరాజ సుసాహిత్య సందేశే నాను బోధితః

—జాస్తి వెంకటనరసయ్య


గోపాలకృష్ణయ్య


నరసయ్య


క వి రా జు


శ్రీరాములు


సుబ్రహ్మణ్యం

కవిరాజు, వారి సోదరులు

# యుగకర్త

ఆ రేండ్లకు మున్ను—విద్యాశాఖలో విశేషప్రతిభ గడించిన ఒకానొక "విశ్వవిద్యాలయోపాధ్యక్షుల"నుగలిసికొని, నా వ్రాసిన "కవిపురాణ" కావ్యములు సమర్పించితిని. ఆయన అప్పుడే వానిని కొంతవట్టు పరిశీలించి, యీ యంశము లన్నియు వచన రచనలో వున్నచో హెచ్చు ప్రయోజనము వుండునేమో అని నా వంకకు దిరిగి ప్రశ్నించిరి.

తెలుఁగు వాఙ్మయములో ఏ యంశములు లోక కల్యాణమును గాక, "వర్గవైమనస్యమును" తెచ్చి పెట్టుచున్నవో అవి యన్నియు పద్యకావ్యములలోనే నిబద్ధములైన వనియు, వచనము కన్న పద్యమే కవిత్వమన్న భావం లోకములో గాటముగా నాటుకొన్నదనియు, ఆ భావముచే ఇట్టి యంశములను పద్యకావ్యములలో ప్రకటించితిననియు సమాధాన మిచ్చితిని.

ఈ దేశములో 'గీర్వాణములో' ఏది చెప్పినను-అది ఒక కారికగా, చట్టముగా ఆచరింపవలెనన్న సంప్రదాయము పుట్టియున్నది. ఆపై— తెలుఁగులో పద్యములలో చెప్పినవే కంఠస్థములు చేసి ఆచరణకు తేవలెనన్నంత ఆచారము ఏర్పడినది. కాఁగా-గణిత శాస్త్రము-ఆయుర్వేద వైద్యము

ఆంధ్రనామ సంగ్రహము-ఆంధ్ర వ్యాకరణము వంటివి కూడ ప్రాచీనులు పద్యములలో ప్రకటించి యున్నారు. వచన రచనకే ప్రాభవము బాధముగా నున్న ఈ రోజులలో భౌతిక శాస్త్రాదికము, వచనములో నడపించుట మంచిది కావచ్చునుగాని, కొన్ని 'యంశములు' 'సాహిత్య' రీతిగా పద్య వాఙ్మయములోనే ఉండుట ప్రయోజనమని నా భావము. కాని, కవిత్వమను పదనుగల కత్తి చేతిలో ఉన్ననాఁడే ఈ సంకల్పము చక్కఁగా నెఱవేరును. ఈ దృష్టితో చూచి నచో ఈ ధోరణిలో మున్ముందట తెలుఁగు వారిలో దారి చూపిన "మహావ్యక్తి" శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరి.

అఖండమైన ఈ భరతఖండము యొక్క సర్వతో ముఖ వైఖరిని వివరించి "భావచిత్రము"గా ప్రదర్శింపవలె నన్న మూల స్తంభమువంటి ముఖ్యమైన ఘట్టములు "స్మృతులు - పురాణములు." వేదములకు, వీనికిని కొన్ని ఘట్టములలో సంబంధమే కానరాదు. కాని, వేదమార్గములోనే ఇవి నడచినవన్న ఒకానొక బలమైన ప్రచారము వీని కన్నింటికిని అనుస్యూతమాగుచు వచ్చుచున్నది. ఈ రెండింటిని చేతిలో పెట్టుకొనియే నోరుగలవాఁడు, నోరు లేనివానిని నేఁటివఱకు ఆడినది ఆటగా, పాడినది పాటగా నడిపించు చున్నాఁడు. ఏదో రూపముగ ఆ శాసనము తాకిడికి రవ్వంతైన ఒగ్గనివాఁడు ఈ హైందవములోఁ గానరాఁడు. ఆ చండప్రచండ శాసనమే మున్ముందట సర్వజన ప్రబోధముగా బయలుదేరి, ఆచారముగా పేరువడసి, 'సంస్కృతి'గా

బలపడి, సంప్రదాయముగా పరిథవించి, చట్టముగా కట్టు దిట్టముచేసి పెట్టఁబడియున్నది. గైర్వాణిలో వ్రాసిన "కాంత కో"లే, మధురాతి మధురమైన పురాణ వాఙ్మయ కవితలో కథా రూపముగఁ దూరి నాజూకుగ బోధింపఁబడినవి.

సంస్కృతమే ఎఱుఁగని, ఎఱుఁగుటకు వీలు లేని జాతులకు, ఈ పురాణ సంతతియే శరణ్యమాయెను. ఈ "పురాణము"ల గొడవ ఎత్తినచో అదియొక పెద్ద "రగడ." ఈ బెడద పరిశీలించియే "బహుధా విప్రతిపత్తి ధీవిభవముల్ పాడైన శాస్త్రార్థముల్" ఇత్యాదిగ "శ్రీనాథు"దులు సైతము చెప్పవలసివచ్చినది. ఇందలి తికమకలు గుర్తించి పుట్టు పూర్వములు పరిశీలించి దేశచరిత్ర సమన్వయించి, ఆచారములు - సంప్రదాయములు - కట్టుబాటులు గమనించి ఒకానొక పెద్ద "ఉద్యమము"ను సృష్టించినవాఁడే ఈ "త్రిపురనేని కవిరాజు."

ఆ స్మృతులే - ఆ పురాణములే, మన సంస్కృతికి, మన సభ్యతకు, మన యుత్కర్షకు మూలస్తంభాయమానములని విశ్వసించి, ఆ భావమునే పదిలపరిచి బ్రదుకుట— ఇందొక విచిత్రము. ఆ బ్రతుకులు బ్రతుకువారి ప్రయత్నములలోని కీలకమును గుర్తెఱుంగక 'విప్రన్న చెప్పినదే వేదమని,' ఆ మాటలే చెవిలో వైచుకొని నోటవల్లించి, చిలుక పలుకులు పలుకుచు, ప్రచారకాండలో నడుము కట్టుకొను అమాయిక బ్రహ్మలు ఈ దేశములో ముప్పాతికముప్వీ

సము ఉండుటచేసియే 'కవిరాజు ఉద్యమ' మనగా ఈ జీవులకు వింతగాదోచి 'గంగవెర్రు' లెత్తించినది.

ఈ దేశములో ప్రధానముగా క్రొపెత్తనము కావించిన స్మృతులలో 'మనుస్మృతి' మొదటిది. హెచ్చుగా కలియుగమునకు అన్వయింపజేసినది. 'పరాశరస్మృతి' ఆంధ్రుని చేతిలో వెలసినది 'ఆపస్తంబము.' ఇట్లే చిల్లరమల్లర. వీనికి అనుబంధముగా 'వజ్రసూచికోపనిషత్తు—శూద్రకమలాకరము - వైశ్యకమలాకరము - నీతిశాస్త్రము' వంటివి పుట్టగొడుగులవలె, చెదలు పుట్టవలె వేలకు వేలుగా పుట్టుకొని వచ్చినవి. వీని సర్వతోముఖ వైఖరి సాంగోపాంగముగ జూచినవారికి 'సనాతన' మేదో—'ఆధునాతన' మేదో, వైదికమేదో అవైదికమేదో అర్థమగును. ఇందు వర్ణవ్యవస్థ—జాతి భేదములు—కులగోత్రములు—నిమ్నోన్నతములు, ఎట్లెట్లు మేకుబందిగా బిగించి పెట్టబడినవో స్పష్టము కాగలదు. మనము నేడు కంటికెదుట జూచి లాంఛనముగా అనుకొనుచున్న ఈ జాతులనుగూర్చి ఆ స్మృతులు ఏమని శాసించెనో, దిక్సూచిగా దెలిసికొన వచ్చును. వీనిలో పరస్పర విభేదములు, ఖండనమండనములు సైతము ఎట్లు సాగినవో, ఎంతటి తికమకలు కలిగించుచుండునో గమనింప వచ్చును.

ఏది నిశ్చయమో, ఏది సందిగ్ధమో నిర్ణయింపరాని విడ్డూరములెన్నో పురాణములలో గానవచ్చును. అవియే శాస్త్రార్థములుగా మారి లోకులను దికమకపెట్టు ఘట్టములు అనేకములున్నవి. పురాణ గాథలలో సూతుడిట్లు వచించి

నాఁడనఁగా, లోకము నమ్మవలసినదే అన్నంతమైకము ఈ దేశములో పుట్టుకొనివచ్చినది. ఆ సూత్రములను బట్టి సాంఘికముగా ఎన్నెన్నో తబ్బిబ్బులు న్యూనాధిక్యములు వెల్లుగ ఉద్భవిల్లి చేయవలసినంత 'ఘోరకలి' చేసి చూపినవి. ఆ రహస్యములు మూలముట్టుగ అవగాహనము చేసికొన్న 'కవిరాజు' సూతశాస్త్రమును నెలకొల్పి, ఎందఱో ఎన్నేండ్లో చేయలేని పనిని తానొక్కఁడే తన యాయుస్సమును జేతఁబట్టి చేసి చూపెను. కవిరాజు సంకల్పించుకొన్న మహోద్యానమును మహావృక్షము మనకిచ్చిన మంచి పండ్లె 'సూతపురాణము'లన్నమాట తెలుఁగువాఁడు మరచిపోలేఁడు.

కవితారీతిలో రాజసము మెదపి, జాలువాఱు కమ్మ తేనియలు పాదులో పదిలపఱిచి, స్వాతంత్ర్య వాయు వీచికలలో-దోబూచులాడించి, పై పరావఱికలో ఏమఱుపాటు పడక కవితాక్షేత్రమున "రాజనాలు" పండించిన కవిరాజును తెలుఁగువాఁడు మఱచిపోవుటెట్లు? ఆ పొలములో పాలు పాసిన అంకురములు కొంగ్రొత్తలు, ఏఱియేఱి, ఏరి మనికి ఏయవి యితవో వానినే "అంటుత్రొక్కి" కొమ్మలు రెమ్మలు చిలవలు పలవలు పూవులు కాయలు పెంచుట, పండించుట అనుయాయులకు విధ్యుక్తమని భావింతును.

భౌతికముగా "త్రిపురనేని" బ్రదికి యున్నరోజుల్లో, ఆయన విశిష్టత పెక్కుర కగ్గము కాకపోవచ్చును. ఒకచోట ఆశ్రమములో సూతమహాసభ. ఒక్కకేవ ఒడ్డోలగములో

ఉద్దండవాది. ఒకదిక్కు వైవాహిక రంగములో "వశిష్ఠుల" వారు. ఇంకొక్కయెడ మత సంస్కరణములో శిక్షా దక్షుఁడు. వేఱొక్కదెస రాచ పనులలో ఆరితేఱిన ప్రాత కాఁపు.

అష్టాదశపురాణములతో "కుస్తీ పట్టులు" పట్టి, అపూర్వములగు శాస్త్రములకు వాకట్టులుపొనరించి, అవైదికములగు ఆచారములకు ఉద్వాసన చెప్పి, యుగయుగాల ధర్మములను పేరుపేరున వేఱువేఱుగ విశదపఱిచి నవ్యులకు ఒకబాట చూపిన దివ్యమూర్తి ఈ "కవిరాజు." కరచరణాది రూపముగ, ఆ మూర్తి మనలో నేఁడు కానరాకున్నను, ఆయశస్వి-అచ్చు పోసియిచ్చిన ఆ "మూసలు" కలకాలము ఈ నేలలో నిలిచి చేఁయవలసిన పనిని జేయుచున్న వనుట అక్షరాల నిజము.

మొన్న - ఆ మొన్న దక్షిణాపథములో ఆత్మగౌరవ సంఘము ఓమ్మువిరిచి, అధర్మ భూయిష్ఠములని నిర్ణయించి ఏవో కొన్ని మతగ్రంథములను మట్టుపెట్టుటకై పట్టుపట్టఁగా నలుదెసలనుండి నానారీతుల ఎందరో అక్కసు వెడలఁగక్కిరి. "సూతపురాణము" చేతి కీయఁగా చూచియుఁ జూడకయే "తెలుఁగు వాల్మీకి" ఒక్కఁడు, ఉస్సురని నిట్టూర్చి కస్సుబుస్సుమని ముక్కులుచేసి కకావికలు కావించెనఁట. ఆయన సామాన్యుఁడా మఱి! ప్రపంచమునకే అసామాన్యుఁడై పదిమందిచే "మహాత్మా"యని పిలువఁబడ్డ గాంధిజీకి "అల్పాత్మ"యని బిరుదమిచ్చిన "ఆంధ్ర వాల్మీకి" కి సూత పురాణములెట్లు సరిపడును ? ఇట్టి కస్సు

బుస్సలు-ఆవేశములు - "అసహ్యాములు" "పూర్వవాఙ్మయము" వలన ఈ రోజులలో ఎందఱకు కలుగుచున్నవో "వాల్మీకుల"కు ఆకళింతకాదు.

పురాణమంతయు సాధువని పలుకు 'బుజ్జల' మాట కేమిగాని, నేఁడు పెక్కురు సూతాశ్రమ సూక్తులకు భావ విప్లవమునకు ధర్మసమన్వయమునకు అత్తతిచూచి వీనులార వినుచు మనసార నమ్ముచు శోహారు సేయుట అందఱెఱిఁగినమాట. తానేమి తలంచునో,ఎయ్యది పరిశీలించి రాద్ధాంతము కావించునో, ఏది గుఱితించి సిద్ధాంతముచేసి యుపదేశించునో అదియే కాగితమునఁ బెట్టుట 'కవిరాజున'కు నైజము. పరోపదేశ పాండిత్యమున కచ్చట ప్రవేశమే లేదు. ఆచరణలో అక్షరాల అయ్యవి ప్రత్యక్షము కావలెను. సూతాశ్రమము తోఁటలో మొఁగమోటమి యను బాటయే లేదు ఇది సంపన్నుల వేదిక యని పంపక మసలే కానరాదు. ఎత్తువారి చేతిబిడ్డల కచ్చట పాత్తె పొసఁగదు. అడ్డమైన దేవురుగొట్లు నాశ్రయించి కవితా కన్యను వీధి వీధికిఁద్రిప్పు వెర్రిబాగుల జోగులకు రామస్వామి శ్రీరామ రక్ష!

అవధానము నేర్చి రంగములో నిలిచి ప్రత్యర్థులను ఢీకొనుట కుద్యమించు తన్ను—తనగురువులు,'మూఁడుఁడ' వీవని ఈసడించి 'వేగమ యేఁగుమ అంగలూరి'కని మందలించిరట.నాఁడె ఆమాటకు యీ శిష్యుని మదిలో కుదురు చిక్కెను. జగమెల్ల ఒక్క - హిందూదేశమే యనుట కూప

కూర్పుల ధోరణి. ఇది 'త్రిపురనేని' గుఱుతించి బాంధవుల నిరోధమైనను బాటింపక లాంతి దేశములలో చదువులకు మొదలిడెను. స్వదేశము—స్వవేషము—స్వభాష మఱువకుండుట, ఇచ్చకములకు మెచ్చుకోలుకు బూటకములకు దూరమగుట, ఆత్మగౌరవమునకు సర్వదా భద్రత సమకూర్చుట యీ మహావ్యక్తికే చెల్లినవి. ప్రకృతిలో ఇట్టి వ్యక్తు లెందరుందురో!

ఈ పరిశ్రమలో పాలుపంచుకొన్న యువజనము నేడు పెక్కురు ఉన్నారు. దోషభూయిష్ఠమగు పూర్వపురాణ వాఙ్మయమను దుర్గమారణ్యమును ఛేదించి సరిదిద్దుటకై కుఠారమును గేలఁబట్టిన యోధులు పెక్కురకు, ఈ కవిరాజు పరిశ్రమము ఆచార్యకమయ్యెను. ఆ త్రోవలో నడచి, పూర్వాపూర్వము సంస్కరించి కైతవములు మట్టుపెట్టి సత్యమును నిర్ణయించి ప్రజానీకమున సౌహార్ద మేర్పరిచి ప్రాతివాసనలే ప్రధానమని పట్టుపట్టక ప్రాచ్యములోని మంచిని నవ్యములోఁ జొనిపి, జాతీయతకు ప్రాముఖ్య మిచ్చుటయే నేఁటి యువజనుల విద్యుక్తము.

భారతీయుల బుద్ధికి పరిపక్వతా సంస్కారమును సమకూర్చిన వాఙ్మయము "రామాయణ-భాగవత - భారతము"లను మాట మఱువరాదు. అందును పవిత్రతలో పూర్వాపూర్వము బలీయము. కవిత్వరీతిలో కార్య ధోరణిలో తెలుఁగువారికి తెలుఁగు భారతమును మించినది మఱి లేదు.

భారతేతి వృత్తమున ప్రవర్తించిన వింతలు అనంత ములు. సర్వము సమన్వయించి సర్వతోముఖమగు సౌహార్ద మున ప్రజాక్షేమమును అరయఁజాలు ధోరణి లోకములో కరవైనది. కొందఱి కది దివ్యజ్యోతి. మఱికొందరికి చీఁకటి బ్రతుకు. పురాణమన్నది అంతయు సాధువే యనరాదని అభియుక్తోక్తి. మానవధర్మములోని క్రమిక పరిణామ స్వరూ పమే యుగధర్మమనుట న్యాయము. అపక్వబుద్ధులకు అసం స్కృతులకు పరిణామమన్నమాట తలకు మీరిన బాట. తాత త్రవ్వించినదేగదా యని పెరటి నూతిలోని యుప్పునీటినే త్రాఁవుట ఒప్పిదముగాదు అయిదుగురుకు ఒక్కతే ఇల్లాలు భారతములో కలదుగదా యని వర్తమానమున సమన్వ యింపలేము. సంతానములేని అభాగ్యులకు 'నియోగము' కలదు గదాయని నేఁడు ఉవ్విళ్లూరుట ఒప్పనిత్రోవ. ఆ జాతివారి యోగక్షేమమే ఈ జాతివారి జీవిత పరాయణ మనుట పసలేని పలుకు.

పూర్వాపరములు చక్కఁగా సమన్వయించి సమ యోచితములగు రాచబాట లేర్పరిచి ప్రపంచ కల్యాణ దృష్టిని బచరించి సంచరించుటయే పండితుఁడైన వానికి పరమధర్మము; ముఖ్యవిధియు. కేవలము పర ప్రత్యయనేయ బుద్ధితో మింటివంక ఎగాదిగఁ జూచుట మూఢమానవుని వాలకము.

ఇట్టి పరిశీలనతో తేనెసోనలు వెలార్చు తేట మాట లతో తెలుఁగు మాగాణమున త్రిపురనేని పండించినపంటలు

ఆరగించిన కొలఁదియు నోరూరఁ జవులు పుట్టించునవి లెక్కకు మిక్కిలిగాఁ గలవు.

శంబుక వధ—సూతపురాణము - కురుక్షేత్రసంగ్రామము, వీనికి మాతృకలు పూర్వోక్త కావ్యములే. చక్కని చిక్కని వేదాంత సారమును తెలుఁగు పలుకులలో చెప్ప నేర్చిన తిక్కనమంత్రి తెలుగు భారతములో విడనాడిన 'భగవద్గీతను', కవిరాజు తెలుఁగువారికి కానుకగా నొసఁగెను. 'వేనరాజు నాటక'మను కుక్కకాటునకు సరియైన చెప్పుదెబ్బయే 'ఖూనీ' నాటకము. తక్కినవి ఆయన సంతరించినవి ఆయన దృష్టిలో అల్పాల్పములు.

మృతశిశువు కోసమై, నిరపరాధియు నిరుపమాన తపస్వియు నగు శంబూకుని మట్టుపెట్టుట మూలముట్టుగా మాన్యమని పల్లెత్తుమాట చాలు-అంటిరా!'అబ్రహ్మణ్యము' ఘోషించెడి ఆ రోజులలో 'కవిరాజు' వ్రాసినది 'శంబూక వధ'.అదియే రామరాజు ధర్మమనియుతన్మూలముననే'రామ రాజ్య'మను చల్లని మాట పుట్టినదనియు సంబరపడు ఒకానొక వర్గము ప్రబలముగా ప్రచారము చేసెడి రోజులు-అవి. ఏ పాశ్చాత్య భాషాభిజ్ఞునకుగానీ ఏ నవనాగరికునకుఁగానీ అది కాదనుటకు 'నోమ్నోలు' చాలని పాపిష్ఠ 'కలికాలము.' ప్రతిభాశాలియగు కవీశ్వరుఁడు 'వివాదాస్పదమగు ఘట్టమ ఇది'యని పైదొలఁగి వేఱుత్రోవ చూచుకొను సమయము అయ్యది. అట్టి దశలో అత్యంత మధురమగు తన కవితా స్రవంతిని 'కవిరాజు' ఇట్టి ఘట్టముల వంకకు పరువులెత్తిం

చుట పరమ సాహసమే కాదు; తెలుఁగు నేల నోఁచిన నోముల ఫలమనియుఁ జెప్పవచ్చును.

అనంతములగు ప్రక్షిప్త పరంపరలకు ఆలవాలమై ఒకపాటునకు రాఁజాలని మహాభారత గాథలలో కురుపాండవుల దాయ విభాగమున అంధపరంపరగ అనేకములగు తలఁపులు వెలసినవి. కర్ణుని శీలమిది యనిగానీ ధర్మజుని త్రోవ లిట్టివనిగానీ దుర్యోధనుని సంకల్పము లీ దృశ్యములనిగానీ నిరాక్షేపముగ నిర్ణయించుటకు వీలులేని వందల కొలఁది ప్రతులు భారతమునకుఁ గలవందురు అట్టివి చిత్రించుటలో వేదవ్యాసులకు విభిన్నములైన త్రోవలే నన్నయ తిక్కన్నలు త్రొక్కినవియుఁగలవు. రాచఠీవిలో అభిమానధనములో అన్నింటను పాండవులను మించిన సుయోధనునకు 'మచ్చ' తెచ్చిన 'ద్రౌపదీ వస్త్రాపహరణ ఘట్టము' ప్రక్షిప్త భాగమనుటకు నిదానములైన ప్రతులనేకములు గలవని అభిజ్ఞులు నిర్ణయించిరి. ఇట్టివన్నియు గుర్తించిన 'కవిరాజు' కలము వాడివి వేడివియగు పోటుమాటలతో 'కురుక్షేత్రసంగ్రామము'ను ప్రసాదించినది.

ఇఁక భాగవతములోని చిద్విలాసములకు అష్టాదశ పురాణములలోని అనంతములగు అనుభవములకు ప్రత్యుత్తరము లీయఁబూనినది 'సూత పురాణము.' ఆధ్యాత్మిక కథలకు అంతరాయము లెందులకు రాయని,కలిగిన తెలంపులను గడుపులో దాఁచుకొని కలకాలము గ్రుక్కుచుండు కుహనాకూర్మములకు 'సూతపురాణము' భీతావహము కావచ్చును. శుష్కించని శక్తిరక్తులు కలవ్యక్తులుఆరగించిన కొలఁదికొలఁదిక

లీరికలెత్తించుఘట్టములుగల కావ్యరాజముసూతపురాణము. నాకుఁజూడ, కవిరాజు దివ్య జీవితమునకు భవ్యసంకల్ప సిద్ధికి అఖండ ప్రతిష్ఠను గూర్చి పెట్టునది 'సూతపురాణ' మనియే తోఁచినది. కవిరాజును కవిసామ్రాట్టుగా ఈ కావ్యమెన్నడో చేసి యుంచినది. సంస్కర్తలలో తలమానికముగా ఈ పురుష పుంగవుని ఈ పురాణము తీర్చి దిద్దినది. ప్రజానీకమునకు జ్ఞానభిక్షను ప్రసాదింప నేర్చిన 'కులపతి'గా ఈతని 'సూతాశ్రమము' ఏనాఁడో మనకుఁ జూపినది.

శ్రీ రామస్వామి చౌదరి పండితులలో పండితుఁడు. విమర్శకులలో ప్రాగ్రసరుఁడు. సంస్కర్తలలో శిరోమణి. కవులలో పూర్వకవులను మఱపింపఁ జాలిన మేటికవి. ఆత్మ గౌరవమును గాపాడుకొనుటలో అందెవేసిన చేయి. కాసు వీసములకు గ్రాసవాసములకు మడిమాన్యములకు ఎత్తువారి చేతిబిడ్డలగు విత్తవంతుల పంచలను పడిగాపులు పడి తిరుగు దేబెల కీతఁడు కుఠారము వంటి ధీరుఁడు. చరిత్రి ఎరిఁగి రచనచేసిన చతురుఁడు. రాజకీయములలో చొచ్చియు దర్పము వీడకహుందా తనముతో మెలఁగిన మహావీరుడు. విదేశ విద్యలో ప్రాభవము గడించియు స్వదేశ ముద్రి రవ్వంతేని వీడని దేశభక్తుఁడు. శతవధాన విధానముల చవి చూచిన అవధాని. మూఁడు భాషలలో పాండిత్యము గడించి మహాకవిగా దివ్యసంస్కర్తగా రాజకీయ వేత్తగా శతావధానిగా రాణించిన రామస్వామి చౌదరి 'యుగకర్త'గా ఎన్నిక కెక్కుటలో ఆశ్చర్యమేమున్నది? ★

— కొత్త సత్యనారాయణచౌదరి.

# కవిరాజు—హేతువాద దృక్పథం

కవిరాజు రామస్వామి హేతువాద దృక్పథంతో లోకాలోకనం చేశారు. కవిరాజు హేతువాద దృక్పథాన్ని గూర్చిన పరిశీలనకు పూర్వం హేతువాదాన్నిగూర్చి కొంత సమీక్షించటం సముచితం.

హేతువాదం (Rationalism) అంటే ఏమిటి ? ప్రపంచ హేతువాద ఉద్యమ పరంగా 1899లో ప్రకటితమైన ఒక నిర్వచనలో హేతువాదమంటే "నియమ రహితమైన ఊహలతో అధికార ప్రామాణికత అనేదానితో నిమిత్తం లేకుండా అనుభవంతో సరిచూచుకోగల తత్త్వశాస్త్రాన్నీ, నైతిక విలువలను నెలకొల్పుకొనుట లక్ష్యంగా వివేచన యొక్క ఉన్నతిని అరమరలు లేకుండా అంగీకరించే ఆలోచనా రీతి"గా వివరింపబడింది. లక్ష్యంలో తత్త్వం, నైతిక విలువలు ఉన్నవి. వివేచన ప్రధానాంశం. అనుభవ పరిశీలనకు తాత్త్వికత, నైతిక విలువలు నిలబడాలి. ఎంత వివేచన మున్నా, అది అనుభవానికీ, శాస్త్రీయ పరిశీలనకూ అందనప్పుడు ప్రయోజనకారి కాదు. (What is this Rationalism") అనే గ్రంథంలో స్వేచ్ఛాయుతంగా వివేచన (Reason )ను వినియోగించటమే హేతువాద లక్ష్యమనీ, హేతువాద సమన్వితం కాని విషయమంటూ ఏదీ వుండదనీ ప్రసిద్ధ రచయిత చార్లెస్ గోర్హామ్ వ్రాశారు. హేతువాద

మనేది ఒక విషయం కాదు; అదొక ఆలోచనా విధానం మాత్రమే. లక్ష్యం కాదు; లక్షణం మాత్రమే "వివేచనా శక్తిని మానవ వ్యవహారాలకు, సమస్యలకు అన్వయింపజేయటమే హేతువాద"మని 1960 లో జరిగిన అఖిల భారత హేతువాదుల సదస్సులో ఎలెన్ రాయ్ ఉద్ఘాటించారు.

"ఆధునిక శాస్త్ర పరిజ్ఞాన ఫలితంగా మానవునిలోని హేతుత్వం (Rationality) జీవ సంబంధమైన ఆస్తి (biological property) గా నిర్ణయింపబడింది. వివేచన అన్నది దార్శనిక (metaphysical) లక్షణానికి చెందింది కాదు. నియమ బద్ధమైన భౌతిక జగత్తునుండి ఆవిర్భవించే మానవుడు ప్రాయికంగా హేతువాది. విషయ విచార యత్నము మానవ స్వభావంలో ప్రధానం." ఇవి సుప్రసిద్ధ హేతువాది మానవేంద్రనాథ్ రాయ్ అభిప్రాయాలు. నైతిక విలువల ప్రాతిపదికపై మానవునిలో అంతర్నిహితంగా వున్న హేతుత్వం ప్రయోజనకారిగా పర్యవసిస్తుంది. నీతి వాదం, హేతువాదం అంగాంగీ భావం కలిగి వుంటాయి. హేతువాది అయిన మానవుడు నీతివాదిగా మనటం సహజము. ఈ విషయాన్నే యం. యన్. రాయ్ "Man is moral because he is rational" అని అన్నారు.

హేతువాద మనేది పరంపరాగత అంధవిశ్వాసాలకు, మౌఢ్య ప్రవృత్తులకు చుక్కెదురు. మతానికి ముందే హేతువాద చరిత్ర ఉన్నట్లు ఆధారాలున్నాయి. ఆది మానవుని హేతువాద చింతనలో భాగంగానే దేవుడు, మతం

అనేవి ఆవిర్భవించాయి. అయితే తరువాత చరిత్ర పరిణామాలు తద్భిన్నం. దారీ తెన్నూ తెలియని నిద్రాణ స్థాన వాళిని జాగరితం చెయ్యగల మార్గాన్ని హేతువాద విధానము సుగమం చేస్తుంది. వికృత రూపంలో వికటాట్టహాసాలు సాగిస్తున్న జాతి, మతం, కులం, వర్గం, వర్ణం మొదలైన విషవృక్షాలను ఛేదించటానికి హేతువాద మొక కుఠారం వంటిది. లోకాతీత విషయాలన్న వానిని, అనుభవాతీత పరిశీలనలకు అందని విషయాలను హేతువాదులు అంగీకరింపరు, దేవుడు, పరలోకం మున్నగునవి స్వార్థావలంబకుల అవసరాలకు ఆసరాగా సృష్టింపబడ్డవి. "మానవుడే అన్ని విషయాలకు కొలమానం" అనే భావనకు మూలం హేతువాద దృష్టి. "మానవ సమాజానికి మానవుడే మూలం" అనటానికి హేతువాద అవగాహన మూల కందం. మానవుడే కేంద్రంగా వున్న మానవ సమాజాభ్యున్నతికి హేతువాద విధానం కుదురు. అధికార ప్రామాణికత, సాంప్రదాయ బద్ధత, మానవాతీత ప్రభావాలన్నవి హేతువాద సరళికి పరమ శత్రువులు. మన జీవిత పథాలన్నింటిలోను హేతువాదరీతి అనుస్యూతముగా వుంటుంది. దానిని మనం గుర్తింపగలిగి వుండవచ్చు లేకపోవచ్చు; ఒక సంఘటన లేదా ఒక సందర్భం మనకు గ్రాహ్యం కానంత మాత్రాన అది "నిర్హేతుక జాయమానం" అని భావించటంతో బుర్ర తాకట్టు పెట్టట మేజరుగుచున్నది. హేతువాదాన్ని గూర్చి వివరిస్తూ 'సర్ విలియం డ్రమ్మండ్' ఏమంటారో చూడండి : "He who will not reason is abigot; he who cannot is a fool; he who dares

not is a slave" కొంచెం ఘాటుగా వున్నా, యీ మాటలు సత్య విదూరాలు కావు. "యుక్తాయుక్త హేతువాదానికి వరపురాయి" అనిన బ్రాడ్లీ మహాశయుని సూక్తి మన నీయమూ, మాననీయమూ.

హేతువాద తత్త్వానికి సంకేతం ప్రశ్నార్థకం (?) ప్రతి విషయమూ "ఎట్లా? ఎందుకు!" అనే ప్రశ్నలకు గురి కావాలి. ప్రశ్నలోనే పరమార్థమున్నది. ప్రశ్నలోనే ప్రపంచ మంతా ఉంది. ప్రశ్నతోనే మానవుడు ప్రకృతిపై విజయ పరంపరను సాధింపగల్గు తున్నాడు. ప్రశ్నతోనే వ్యక్తి, సంఘం, శాస్త్రం అన్నీ పురోగమిస్తున్నవి. ప్రశ్న ఆగినచోట మిగిలేది గాఢ తమస్సు మాత్రమే. తమస్సును ప్రేమించే వాడున్నాడా? ప్రశ్న ప్రధానంగా నడిచే ఉద్యమం హేతు వాద ఉద్యమం. అందువల్లనే యీ ఉద్యమం ప్రధానంగా భావ సంచాలనోద్యమం. హేతుత్వం (Rationality) మాన వుని జన్మహక్కు.

హేతువాద జ్యోతిని వెలిగించి, నిద్రాణమైన మాన వాళికి జాగృతిని కలిగించిన వారిలో తెలుగు సీమలో ముఖ్య ముగా ముగ్గురున్నారు. వారే వేమన, కందుకూరి, కవిరాజు గారలు. భావ విప్లవానికి జీవితాన్నే అంకితం చేసిన వారిలో కవిరాజు త్రిపురనేని రామస్వామిగారొకరు. విజ్ఞాన చంద్రి కలను వెలార్చు కృషిలో కవిరాజు హేతువాద జ్యోతిని చేబూనారు. మానవులుగా జన్మించిన మనం బుద్ధి విశేషముతో సద సద్వివేక సంపదను పోషించు కోవాలి. స్థూల దృష్టితో దేనినీ విశ్వసింపవద్దు.

ఏ శ్రుతుల్లోనో, ఏ స్మృతుల్లోనో, ఏ పురాణాల్లోనో, మరే పవిత్ర గ్రంథంలోనో ఉన్న మాత్రాన నమ్మవద్దు. నీ బుద్ధిని ఉపయోగించాలి. స్వతంత్ర ఆలోచనకు ఉద్యుక్తుడవు కావాలి. నిర్ణయాలు నీకు నీవే చేసికో. మంచిచెడ్డల తారతమ్యం తెలిసికో. ఈమాటలు రెండువేల అయిదువందల సంవత్సరాల క్రితం బుద్ధుడు బోధించిన మాటలు. బుద్ధుడు హేతువాద జ్యోతి. కవిరాజు బుద్ధునికి వారసుడు. "విన్నన్న చెప్పింది వేదం" అనే వైతండిక వాదనపై కవిరాజు తిరుగుబాటు చేశారు. ఎవరో ఆలోచిస్తారట — ఎవరికొరకో ! కొలదిమంది ఆలోచన. పెక్కుమంది "డూ, డూ" ల అనుసరణ. "జ్ఞానం ఒకరికి చతుర్ముఖం; మరికొందరికి ఏకముఖం". ప్రశ్నించడం నింద్యం; అంధంగా అనుసరించడం వంద్యం. ఈ పోకడలపై బావుటా నెత్తినవారు మన కవిరాజులు. అజ్ఞాన తమాచ్ఛాదితమైన సమాజాన్ని చైతన్యవంతం చేయటానికి సమకట్టిన ప్రారంభ స్థితిలో తనను దుయ్యబట్టిన ఆర్యమానసపుత్రులను, "సమయబద్ధ కవిత" లల్లు కవిమన్యుల నుద్దేశించి;

> "మనసు నచ్చునెడల మన్నింపగావచ్చు
> మనసు నొచ్చునెడల మానవచ్చు
> కాన వివరమేమి కనకుండ వినకుండ
> పరుల బ్రువ్వదిట్ట ఫలము గలదె ?" —

అని సూటిగా ప్రశ్నించారు.

"వినదగు నెవ్వరు సెప్పిన" అనే రీతిలో ఉద్యమాన్ని ప్రారంభించారు కవిరాజు. మానవుడే స్రష్ట; ఆ

మానవుడే ద్రష్ట. మానవుడే మూలం. ఆ మానవుడే "నేను". కనక "నేను" అయిన తనకే నమస్సు లర్పించుకున్నారు కవిరాజు. దాంతో....

"శంకరుని యంత వేదాంత శాస్త్రవేత్త
యనియెగా 'అహమ్ బ్రహ్మాస్మి' యనుచుగాన
నాకు నేనె నమస్సు లొనర్చుకొందు
నాది మధ్యాంత రహితుండ నైతినంచు"

అని ఎలుగెత్తి చాటారు.

న్యూనతాధిక్యాలకు చిహ్నాలైన "ఆర్య వాఙ్మయ ప్రభుత్వ పతాకములం గదల్చుటలో" కవిరాజు కృతకృత్యులు కాగలిగారు. అశ్లీల విషయాలతో నైతిక సమావర్తనలకు అవరోధాలుగావున్న పాత పురాణ గోపుర ద్వార కవాట పంక్తులను తమ రచనాభిఘాతంతో బదాబదలేసిన ఘనత వారికే దక్కింది. పాతపురాణాలకు ప్రత్యామ్నాయం "సూతపురాణం." రామస్వామి గారన్నట్లు "పుణ్య పురుషావళికిన్" "పూతపురాణంబు" సూతపురాణం. పాత పురాణగాధల వ్యాజత్వాన్ని సూతుడు అవ్యాజంగా నినదించాడు. "పురాణము లార్షేయములనియు, దత్కారణమున పూజ్యములనియు, తదంతర్గత ధర్మములు, నీతులు,కథలు శిరోధార్యములనియు విశ్వసించుటచే ప్రతిఫల మాత్మ ద్రోహముగా పరిణమించునని" యెంచి పురాణముల యానుపానులను విద్వల్లోకమునకు తేటతెల్లము జేయు తలంపుతో సూతపురాణం ఆవిర్భవించింది. వివేచనాశీలురైన చదువరులకు సూతపురాణం నిజమైన నీతి పురాణం. తక్కిం

గల పురాణాలు "అహేతుకములో లేక నిర్హేతుకములో" అయిన బూతు పురాణాలు.

సాంఘిక న్యాయం మృగ్యమై పోయిన స్థితి గతులను చూచి ఆక్రోశించింది కవిరాజు హృదయం. ఆర్షధర్మ రసాయనమనే పాత పానీయాన్ని కొత్త సీసాలలో జిగేలుమనిపించేటట్లు వుంచే ఆర్ష ధర్మ ప్రతిష్ఠాపకుల ప్రభావం నేటికీ ఎంతగానో వుంది. నూతన నాంశాలను వెల్వరింపక, హేతువాద దృష్టి లుప్తమైన కవీంద్రుల ప్రస్తావనలో వారి మార్గమేదో యీ క్రింది పద్య పఠనంతో సుబోధకమౌతుంది.

"వ్రాయక పూర్వగాథలవి ప్రత్న కవీంద్రులు నేటిదాక, రా
మాయణ భారతాది కృతులన్నియు వ్రాసిరి త్రిప్పి, త్రిప్పియే
దోయొక కబ్బమంచు దలకొక్కటి యక్కట ! నూతనాంశమే
దోయొకటేనియుండెఱుప నోపని గ్రంథ సమూహమేటికో"

కవిలోకాని కిది సరియైన హెచ్చరిక అనటంలో అత్యుక్తి లేదు. వ్యాజంతో పురాణాలు వ్రాశారు పూర్వులు. "తద్విరుద్ధముల్ భ్రాజిలు" కవిరాజు సూతపురాణంలో. పురాణాల్లోని పరస్పర ఘోర విరుద్ధ గాథలను, అసంబద్ధతలను మనోజ్ఞంగా హేతువాద పథంలో చూపారు. వివేక వివేచనలున్న పాఠకునితో వారేమంటారో చూడండి :

"శ్రోత కొంతముష్పులకును గొందలకును
మానవులు పుట్టిరని చెప్పు "మాయమాట"

అన్ని కథలీపురాణములందె కలవు
పిట్ట కథలకు నివి యెల్ల బుట్టినిండ్లు"

పురాణాల్లోని వ్యాఘాతాలను తూలనం చేశారు. స్వీయ ధర్మాన్ని విస్మరించి, సాటి మానవుని ఆక్రందనకు స్పందింపని మానవాధముల గూర్చి కవిరాజొక పద్యంలో ఏమంటున్నారు!

"మలమల మాడు పొట్ట తెగమాసిన బట్ట, కలంత పెట్టఁగా
విలవిల యేడ్చుచున్న నిరుపేదకు జాలిని జూపకుండ, ను
త్తలపడి పోయి జీవ రహితంబగు బొమ్మకు నిండ్లు వాకిళుల్
పొలమును బొట్ట నిచ్చెడి ప్రబుద్ధ వదాన్యుల నిచ్చ మెచ్చెదన్"

"ఉత్తలపడిపోయి", "ఇచ్చమెచ్చుట" లు ఎంతో హృద్యంగా వున్నవి. ఈ పద్యంలో రామస్వామిగారి మానవతా ధర్మం ప్రస్ఫుట మౌతున్నది. దోసాలన్నీ రామకోటి రచనతో పరిహార మౌతాయనే భావనను మనోజ్ఞంగా వెక్కిరిస్తారు కవిరాజుగారు వారి హేతు పూరిత దృక్పథానికి సూతపురాణ ద్వితీయాశ్వాసంలోని ఈ క్రింది పద్యమొక తార్కాణం.

"వినువారలున్నఁ గథలన్
వినుపించెడి వారు గల విస్మయ మగునే?
విని కని చక్కఁగ నిజముం
గను గొన గావలయుగాని కాదనకుండన్"

చదువరులను సాంగోపాంగంగా ఆలోచింప వలసిందని కోరుతూ వారడిగే ప్రశ్నల్లో కొన్ని యివిగో: గగనంబునుండి గంగమ్మ శివమస్తమున దూకెనా? అతితపో

నియతిచే భగీరథుడు గంగను దెచ్చెనా? సగర సుత భస్మ రాసుల సరవి దడిపి స్వర్గమున కంపెనా? జిజ్ఞాసాపరులైన సభ్య మహాశయులు శాస్త్రీయ దృష్టితో గమనించాలని కవిరాజు వాదం. "పౌరాణిక గాథాప్రబంధ నిబద్ధములయిన విషయములను దత్తావధానుండవై యాకర్ణింపు" మని తమ సూతునితో చెప్పిస్తూ, వివేకస్ఫూర్తికి కారకులౌతారీ కవుల రాజు. సూతపురాణ ద్వితీయాశ్వాసంలోనే ఒకానొకచో వారి మాటలు పరిశీలించుట యుక్తం.

"ధరణీశుడైనట్టి దశరథున కరదం
బులు పది గలవంచుఁ బలుకునటుల
దైత్యేశుఁడైనట్టి దశకంఠునకుఁ గంఠ
ములు పది గలవంచుఁ బలుకు నిటుల
దితిజ సేనానియౌ త్రిశిరునకు మూఁడు
తలలు గలవటంచు బలుకునటుల
ఋషిపుత్రుఁడైనట్టి ఋష్యశృంగున కొక్క
మనుబోతు కొమ్ముండె ననెడు నటుల

వినుము ప్రాచీన బర్హికి వేయి గనులు
కలవని పురాణములు పల్కఁ గంఠమెత్తి
వేయి కన్నులు నాకుఁ గన్పింపలేదు
పొడలు మాత్రము కన్పించె నొడలి నిండ.

మరొక పద్యంలో .... ....

"మాండూక్యముని లోకమాన్యుండు మాండూక
మునకు జన్మించి నాఁడనెడి రీతి
సుశ్లోక చరితుండు శుకయోగి శుకి గర్భ
మున సంభవించినాఁ డనెడి రీతి
మౌని తల్లజుఁడైన శౌనక బ్రహ్మర్షి

శూ॥ గర్భమునఁ గల్గె ననెడు రీతి
అఖిలాస్త్ర సంవేదియైన యశ్వత్థామ
యశ్వమునకు బుట్టె ననెడి రీతి
వినుము ప్రాచీన ఋర్షికి....
..................."

హెచ్చులొచ్చులతో కంపు కొడుతూ, హృదయ విదారకంగా వున్న సమాజానికి కవిరాజుగారి ప్రశ్నల దొంతర లనేకం. వానిలో ఒకటి మచ్చుకు :

"అజ్ఞానులొనరించు నపరాధములకెల్ల
నతి మాత్ర శిక్షలు న్యాయమయ్య?
జ్ఞానులొనర్చు దోషములకన్నింటికి
నామ మాత్రపు శిక్ష న్యాయమయ్య?
ఒక్కరీతి నేరంబునకుఁ బెక్కు రకముల
దండనల్ విధియింప ధర్మమయ్య?

స్మృతికర్తను నిగ్గదీసి ఈ క్రింది విధంగా అడిగారు కవిరాజుగారు.

"ఒక్కటి యడిగెదఁ జెప్పుము
యెక్కటి "శూద్రంతు కార యేద్దాస్య" మటం
చెక్కరణిన్ స్మృతి వ్రాసితి
వక్కటికము నీకు సుంత.యైనను గలదే ?"

పాపం ! అమాయకుడు !!

మనువేం చేస్తాడు! తానెరగని విషయానికి జవాబు చెప్పలేక దిగమింగిఊరకున్నాడు. "ఆతత శేముషీ విభవ మచ్చుపడన్ దలబూది వారలున్ గైతవబుద్ధి మాటువడగా దెగవ్రాసిరి ధర్మ సూత్రముల్." ఈ ధర్మసూత్రముల కొన్ని

ధర్మంనేతి బీరకాయలోనినెయ్యి. జాత్యహంకారజనితాలైన విశ్వాసతాలను హేతువాదిగా సవాల్ చేశారు. "ఆర్యస్త్రైవర్ణికః" అని వాకొనినచో, శూద్రులను వారి ఉప పత్తియేమని ప్రశ్నించారు కవిరాజు. జాతి విభాగమునకు, స్వత్వ నిర్ణయమునకు సంబంధ మేమైనా కలదా? యను మీమాంసను పరిశీలించారు. భగవానుడు నిష్పాక్షికుడు కాదంటారు కవిరాజు. హేతువాది అయిన బుద్ధుణ్ణి దేవుణ్ణి చెయ్యటానికైనా, ఆయనకు అకృత్యాలను అంటగట్టడానికైనా సమర్థమైన దీ కర్మభూమి.

రామాయణంలోని అనౌచిత్యాలను, అస్తవ్యస్తాలను కవిరాజుగారు ఎత్తి చూపారు. రాముడు పితృవాక్య పరిపాలకుడు కాడనీ, ఏక పత్నీవ్రతుడూ కాడనీ పూర్వాపరాలతో కూడిన నిష్పాక్షిక పరిశీలనతో నిరూపింప గలిగిన ప్రత్యేకతను, విశిష్టతను సంతరించుకొన్నారు. రావణుడు దశగ్రీవుడని కదా మన మస్తిష్కాల కెక్కించిన విషయము! దశగ్రీవుడైన వానికి మానవుడే అయినచో ద్వాదశ హస్తంబులుండవలయు. అతడెట్లు అటు నిటు మసల గలడని పిల్లవాడడగిన ప్రశ్నతో అదంతా "తిరస్కృత వాఙ్మయం"గా మారిపోయింది. సూతపురాణ తృతీయాశ్వాసం "మొత్తుకోళ్ళు"తో ప్రారంభమౌతున్నది. దేవునిలోని అస్తవ్యస్తాలను, అసంగతాలను అప్రతిమానంగా ప్రశ్నిస్తారు కవిరాజు ఆర్యులనబడువారు తమ దౌర్గత్యభావాలను ప్రత్యర్థుల్లో ప్రవేశపెట్టటానికి స్త్రీలను నీచంగా ఉపయోగించు

కొని, గర్భస్థ శిశువుల భావాలను సైతం మలచ గల 'మహత్తర' చరిత్ర కలవారు. ఆహా! ఏమి సంస్కృతి !!' అన్నమో రామచంద్రా' యని యలమటించిన ప్రజలున్న రామ రాజ్యంబుద్ధిజాడ్యజనితోన్మాదుల ఆదర్శరాజ్యం. అమాయకుడు, సద్ధర్మ పథావలంబకుడు అయిన శంబుకుని, "తపస్సంపన్నుని" రామునిచే వధింపజేయుట ఏ రకపు సాంఘిక న్యాయం? దీనిని మించిన ఘాతుక కృత్యం ఉంటుందా? ప్రాథమిక స్వాతంత్ర్యానికి కూడా శంబుకుడనర్హుడా? ఆలోచనాయత్తులను చేయటానికి మేల్కొల్పినవాడు కవిరాజు. దొంగ చాటున ఎదిరిని పరిమార్చుటలో అగ్రగణ్యుడైన రాముడా ఆదర్శమూర్తి? కుల గురువు వశిష్ఠులు, దుష్టపథానువర్తులగు "శిష్టులు"—వీరా ఆదర్శమూర్తులు ?

కవిరాజు 'ఖూనీ' ఉత్తమోత్తమ దృశ్యకావ్యం. వేనుడు ఖూనీ చెయ్యబడ్డాడు. వేనుని హత్యను సమర్థించే ఆర్యమానిసులేమంటున్నారో కవిరాజు చెబుతున్నాడు. "చిన్ననాటనే వేనుడు బాలురను పశు ప్రకరంబునుబోలె నరికట్టి చంపెనట. మరి అట్టి వేనుని "ఆ తదుపరి పట్టాభిషిక్తు నేలసేయవలయు"నని వారడుగుతున్నారు. వేనుని వధించటానికి 'మానివతంసులకు' ప్రబలకారణం లేకపోలేదు. "అతడు రాజ్యాధిపత్యం స్వీకరించినతరువాత బ్రాహ్మణసంతర్పణలుమాన్పింపబడినవి. ఫలితంగా మంత్ర తంత్రములతో వేన రాజు "ఖూనీ" జరిగింది. భాగవతంలో ఉన్న "తనయందు నిఖిల భూతములందు నొక భంగి .. "కి అంతర్యమిదేనా ? "ఆస్తికత్వము

ప్రపంచ పరిణామమునకు నాటంకము కలుగజేసిన" చంద మెటువంటిదో కవిరాజు "ఖూనీ"లో వివరించారు. "భగవానుడు మూఢమానవ ప్రతిపాదితుడు" అని హేతుబద్ధమైన తమ అభిప్రాయాన్ని నిర్ద్వంద్వంగా చెప్పారు. "పరలోక చింతన మానవ హృదయ దౌర్బల్యాన్ని సూచిస్తుంద'ని నిష్కర్షగా చెప్పిన దా లేఖిని. పైగా "ప్రార్థనలు, సేవలు, కైంకర్యములు స్వాతంత్ర్యమును గోల్పొచ్చి, పురుషకారమును నశింపజేసి, మానవులను బానిసలుగా జేయుట కుపకరించు" ననికూడా వారు వివరించారు. వేనుడు గౌతమునితో "పూర్వాచారములన్నియు ననుసరణీయములనియే మీరు చెప్పగలరా? యని అడిగాడు. యజ్ఞములు వానలకు మూలమన్న అసంబద్ధ విషయాన్ని సహేతుకంగా వేనుడు-తద్వారా వేనుని వారసుడైన కవిరాజు ఖండించారు. హింసాపూరితములైన యజ్ఞములకు వివేకధనుడైన అహింసావాది వేనుడు స్వస్తి చెప్పుట ఋషుల కాగ్రహ కారణమైనది. సర్వభూత సమభావుకత్వం వేనుని ఆదర్శం. "నరకలోకమెంత దూరమున నున్నదని" వేనుడు ప్రశ్నిస్తాడు. అతడు సన్మార్గుడు. కవిరాజుగారి దృష్టిలో ప్రశ్నవేసి సన్మార్గుడైన వేనుడు బంధువు. ప్రశ్న వేసిన వేనుడు నేరస్థుడు; కనక దండనార్హుడు గౌతము, శునశ్శేఫవారసులకు. ఒకానొక సందర్భంలో వేనుడిలా అంటాడు "ఎవరి అభిప్రాయములను వారు నిరాఘాటంబుగ వెలిబుచ్చుకొనుటకు నా రాజ్యంబున నెల్లరకు సర్వాధికారం బున్నది. ఎదుటివారి అభిప్రాయాలను మన్నించే హేతువాది లక్షణా

నికీ పలుకులు ప్రబల నిదర్శనాలు. వేనుడే యింకా యిట్లం టున్నాడు "ప్రజలు వివేకంతో యుక్తాయుక్తతలను విచారించుకొని మేలు కీళ్ళను గ్రహింపజాలు స్థితియందు లేరు. ఎవరు తమకు హితులో, యెవరు కారో సుంతయు తెలిసికొన జాలరైరి. ప్రాకృత జనంబు మఱకువలో మునింగి తేలుచున్నారు, ఇది కనిపెట్టినవారై మునులు (?) పరలోక సౌఖ్యంబుల సృజించి యడియాసలు గల్పించుచున్నారు. మానుల (?) వలలో జిక్కి ప్రజలు కీలుబొమ్మలైరి" ఇవి కేవలము వేనుని మాటలు కావు. కవిరాజు తన అంతస్సు యొక్క అంతస్తును వేనపాత్ర ద్వారా సామాజికులకు తెలియజేస్తారు.

భగవద్గీతలో కవిరాజు హేతువాద దృక్పథం పరాకాష్ఠనందుకొన్నది. వారిపరిణతహృదయం "భగవద్గీతలో" స్పష్టంగా ద్యోతకమౌతుంది. అదొక పేరలల్ రచన. కమనీయ కళాఖండం. ఉత్తమోత్తమ కావ్యం. ఒక చక్కని, చిక్కని సోషల్ సెటైర్. పల్నాటి వీరచరిత్రను గూర్చి విచిత్రాలైన అభిప్రాయాలనులోకులు కలిగి వుండటానికి "మూలకంద మంధ విశ్వాసమును, పరంపరాగతమైన చిత్రకథలును" అని కవిరాజు "భగవద్గీత" తొలిపలుకుల్లో ఉల్లేఖించారు. కులముల మెచ్చులొచ్చులను దులిచిపుచ్చటానికి బ్రహ్మనాయుడు చూపిన పరిష్కార మార్గాల్లో వొకటి "చాప కూడు" కవిరాజుకు నచ్చింది. భారతకథలోని ధర్మగ్లాని పలనాటి కథలో జరగ లేదని వారుధృవీకరించారు. అంచేతనే! కవిరాజా! "రాజరాజాతనికి ధర్మరాజు నీకు నీతిబాహ్యులైరి....న్యాయ

వాదివి నిన్ను కాదనగరాదు." న్యాయవాది అంటే ఇచ్చట అర్థం ధర్మవాది అనే. "పాపుల వలన భగవద్దర్శన లాభ మందిన భక్తులు ఆ పాపులనే దూషించుట పాలు ద్రావి రొమ్ము గుద్దుట కాదా?యని కవిరాజు భక్తుల నడుగుతుంటే బెంబేలు పడిన ఆ భక్తులు నిరుత్తరులై, పలాయనం చిత్తగించారు. వర్ణములను గూర్చి ఒక గౌతమముని, ఒక మనువు, "భగవదవతారము"నాబడు ఒక శ్రీకృష్ణుడు, వారి వారి భ్రాతలు యిచ్చిన అభిప్రాయాలు పరస్పర విరుద్ధాలుగా వున్నై. వానిని సమన్వయించి పరిష్కరించుట సాధ్యంగాని పని యని చెప్పు కవిరాజు దృష్టి సహేతుకమే గదా!

మానవ ధర్మ ప్రతిపాదకుడు కవిరాజు. "త్రైవర్ణికులు కాని మనుజులు మనుజులుకారు. ద్విపాదపశువులు. ఈ వాక్యములు వ్రాసిన వాని కన్నను మానవ పిశాచులెందైన నుందురా? మనుష్య ధర్మము కొంచెమైనను నీయన యందున్నదా?" అని ఆ మానసీయుడు తన ఆవేదనను వ్యక్తం చేశాడు. భగవద్గీతలో నాయుడు కొమరుడైన బాలచంద్రునికి చేసిన ప్రబోధం ఈ దిగువపద్యాల్లో చూడండి :

"ఈ పితృలోకపు విషయం<br>
బీపిండ నివాపవారి వృత్తాంతంబే<br>
పాపాత్ములు బోధించిరి<br>
ఓ పుత్రా ! బుద్ధిజాడ్య ముదయింపంగన్<br>
మృతిని బొందిన మనుజులు పితరులౌదు<br>
రనుట. పితృలోకమున్నది యనుట, పిండ

ములకునై యందు బితగులు మొగమువాచి
యుందురంచు వా కొనుపెల్ల, హుశి, హుళక్కి"

వర్ణసాంకర్యాన్ని గూర్చి బాలచంద్రునితో బ్రహ్మనాయునిచే చెప్పించే కవిరాజు కలం పోకడ చూదాం :

"సంకరుల నెంతమంది సజ్జనులు కలరొ
పూజ్యులున్నారొ యెరుగివే పుత్ర నీవె
అంటు మామిడి పండ్లు రుచ్యములు గావె?
యెవరు బోధించినారు నీ కీ విధంబు ?
నేడు భరత భూమిలో నిలిచియున్న
వర్ణముల సంకరముకాని వర్ణమొకటి
కూడలేదని నిగదింతుఁ గొంకులేక
ధర్మపీడ రాదింత మాత్రంబుచేత"

ఆ బ్రహ్మన్న చేతనే మరొక సందర్భంలో కవిరాజు ఇలా పలికిస్తారు :

"మరణించిన వెనువెంటనె
గురుతర కర్మానుభవము కోసరమైయు
త్తర జన్మమెత్త జీవే
వెరవున నివసింపనేగు బితృలోకమ్మున్"

చైతన్య స్రవంతిని జాలువారించిన కవిరాజు హేతువాద దృక్పథానికి మరొక మచ్చుతునక :

"తొలు దొలుత భూతసృష్టిని సలుపువేళ
గులములుంగాని యెచ్చు లొచ్చులనుగాని
నేను గల్పింపగా లేదు నేడు చూడు
తారతమ్య మేవిధముగా దారుకొనెనొ"

తను భగవద్గీతలో పాత "గీత" లోని గీతలు చెరిగిపో యినవి. పాత భగవద్గీత తల్లక్రిందులై పోయింది. భావాల "పునర్జన్మ" జరిగింది. భావ విప్లవ ఉద్యమానికి జయగీతిక లాల పింపబడ్డవి. గీతలు పోయినచోట గీతలులేని స్థితి, అవధులులేని మానసిక వైశాల్యం ఏర్పడింది. దాంతో ఆర్ష విద్యాప్రబోధకులు ఖాపురుమన్నారు. తెల్ల జెండా ఎత్తారు. ఎంతో దుమారం రేగినా చలింపని ధీరోదాత్తుడు, హేతువాదభావ సంపన్నుడు మన కవిరాజు. "అఖిలలోక కల్యాణంబు సాధింప గుల భేదముల మంట గలిపినాడ" అని స్పష్టీకరించిననాయుడు బ్రహ్మన్న కవిరాజు కథానాయకుడు. బ్రహ్మనాయుడు పుత్రున కొసగిన 'జ్ఞానయోగాన్ని' అరయుట హేతువాదు లందరకు విహితమే కదా!

"వృత్తులనుబట్టి వర్ణముల భేదమువచ్చె నిజంబటంచు వా
క్రుత్తుడు కొందరట్టి పలుకుల్ నిజమే యగుచో ధరాస్థలిన్
వృత్తుల సంఖ్య యెంతొవినివింపుము వర్ణము లెన్నియున్నవో
యిత్తరి నిర్ణయింపుమిది యెల్ల మృషావచనంబు, పుత్రకా!"

కవిరాజు గారి దృక్పథానికి దిగువ పద్యం ఉచిత

ఉదాహరణం :

"శాస్త్రములనెల్లఁ జదివి విజ్ఞాన మెఱిగి
సంశయింపక సర్వథా చర్చఁజేసి
నిజమెఱుంగవలయు నిది నేర్వకున్న
మూఢ విశ్వాసమునఁ జేటు మూఁగుచుండు"

ఇంకా - "మతమను మాట మోసము సుమా యిదె మూలము ధర్మపీడకున్". కవిరాజు హేతువాద దృక్పథాని కివన్నీ ప్రబల తార్కాణాలు. భగవద్గత తుది భాగంలో "సానులలో నార్వెల్లి నాగసాని నేనే" అని వర్ణించటం వారి విశ్వమయత్వానికి సంకేతం. ఈ చరణంతో స్వపరభేదం పోయింది. కవిరాజు సమదర్శకత్వం శిఖర స్థాయినందు కొన్నది.

కవిరాజు రచనలన్నింటిలోనూ హేతువాద రీతులు కొల్లలుగా వున్నాయి. ఆయన కవుల్లో కవి. హేతువాదు ల్లో హేతువాది. హేతువాద కవులకు కవిరాజు సుకవిరాజు.

భావదాస్య ప్రలోడితమైన సమాజానికి ఒక ఎపి క్యూరస్, ఒక థామస్ పెయిన్, ఒక చార్వాకుడు, ఒక బుద్ధుడు, ఒక కణాదుడు, ఒక ఎం. ఎన్. రాయ్, ఒక ఇంగ ర్సాల్, ఒక వేమన, ఒక కందుకూరి, ఒక కవిరాజు, ఒక గోరా మరెంద రెందరో కావాలి. వారందరికీ హేతువాద ఉద్య మం ఎంతగానో ఋణపడివుంది.

కవిరాజు హేతువాది; కనక నీతివాది. హేతువాది గానే వారు జీవితయానం సాగించారు. హేతువాదిగానే మరణించారు. తెలుగు దేశంలో హేతువాద దృక్పథంతో భావపునర్వికాసోద్యమానికి జవ, జీవముల సంతరించిన వైతాళికుడవో కవిరాజా! మీకివే మా ప్రణతులు.

విస్మరింప వీలుగాని హేతువాద మార్గగామి - కవిరాజును యీ క్రింది పద్యంతో మరొక్కమారు సంస్మరిస్తాను.

ప్రాతపురాణగాధలవి పాక్షిక భావముతోడ నుండగా
చేతము నందొకింతయును చింతన చేయక విశ్వసించు నీ
భూతలమందు మానవుల-మూఢతమస్సును భావవిప్లవ
జ్యోతిని పారద్రోలితివి; జోతలివే కవిరాజ శేఖరా :

—అచ్యుతరామ్



# కవిరాజు పథం

కవిరాజు పథం కనరండోయ్ !
క్రాంతి పథంలో నడువండోయ్!

యుగ యుగాల
తరతరాల నరనరాల
జీర్ణించిన పురాణ
భావదాస్యమే
పోవాలని చాటిన ॥కవి॥

అగ్రజాతి నిరంకుశత్వం
అజ్ఞానపు ఛాందసత్వం
పుక్కిటి పురాణాల దాస్యం
వీడగ సూతపురాణాలే
శరణ్యంబని చాటిన ॥కవి॥

దేవుడు - దయ్యం
స్వర్గమ్ - నరకమ్
కులమత భేదాల్
ఆర్యకవి కౌటిల్యపు
దుస్తంత్రాలని చాటిన ॥కవి॥

చీకటి బ్రతుకుల నై దేశ్యం
భజన పరుల భండారం
అజ్ఞానం - అవినీతి
స్వార్థం స్థబ్దత సత్వరమే పో వాలని
విప్లవాగ్ని జ్వాలలవలె ॥క్రాంతి॥

శిధిలాలయపు శివరూపాల్
అజ్ఞానపు టంధుల భజనల్
స్వార్థపరుల మోసపు పన్నాగాల్
ఇంకా నా ఇకపై సాగవనీ
యుగధర్మం గుర్తించాలంచే ॥కవి॥

సంస్కారం-సమభావం
స్వాతంత్ర్యం - అభ్యుదయం
చైతన్యం - శిలాక్షరాలుగ
సత్యాన్వేషణ సాగిస్తూ;
ప్రగతి పథంలో పయనించాలంచే;

క్రాంతి పథంలో నడువండోయ్ !
కవిరాజ పథం కనరండోయ్ ! !

— కోగంటి నరసింహారావు.

# నిహిలిజము - కవిరాజు

అంధ విశ్వాసములను, దుష్ట మతాచారములను, అభ్యుదయ నిరోధక భావములను ఖండించి, భావ విప్లవమును రేకెత్తించి, నవ సమాజ నిర్మాణము చేయుటయే, నిహిలిజము. రష్యాదేశములో విప్లవము రాకపూర్వము, ఈ నిహిలిజము ఎక్కువ వ్యాప్తిలో నుండెడిది. ప్రజలలో భావ విప్లవము కలుగజేయుట, తద్వారా, రాజ్యాంగములో మార్పుదెచ్చుట దీని ముఖ్యోద్దేశ్యము. నిద్రాణమై నిస్తేజమై, నిర్వీర్యమై యున్న రష్యన్ ప్రజల, హృదయ తంత్రులను మీటి, మేల్కొలిపి, విప్లవానికి దారి చూపినది ఈ నిహిలిజమే! రష్యన్ విప్లవమునకు అది ఒక మూలకారణము. అప్పటి రష్యన్ రచయితలందరు, నాటి ప్రజల నవ జీవన నాడుల స్పందింపజేసి, భావ విప్లవమును రేకెత్తించిరి. నాటి కవి శేఖరులు, ప్రముఖ రచయితలందరు నిహిలిస్టులే. వీరికి మూలపురుషుడు టర్గనివ్ అని చెప్పవచ్చును.

అట్లే మన ఆంధ్ర జగతిని, భావ విప్లవమును రేకెత్తించినది కవిరాజు త్రిపురనేని రామస్వామిగారు. ఈ కవిచంద్రుడు తన రసవత్తరమైన కవితా స్రవంతియందు, ఆంధ్రుల

ఓలలాడ జేసి, అంధ విశ్వాసముల పైన కరడుగట్టిన మూర్ఖత మీద పోరాటము సాగించిన మహనీయుడు. కవిరాజు ప్రభ వించునాటికి, అగ్రజాతి నిరంకుశత్వము బుసలు కొట్టు చున్నది. నిమ్నజాతులు మౌఢ్యము, అజ్ఞానము, బానిసత్వ ముచే క్రుంగిపోవుచున్నవి.

ఆ రోజులలో భూతములు, పిశాచములు, దయ్య ములు మెండు. ఎచట చూచినా భూతవైద్యుల బిందునా దము విలయ తాండవ మాడుచుండును. మశూచి,విషూచి మొదలైన భయంకర వ్యాధులన్ని క్షుద్రదేవతల కోపము వలననే యని ప్రజల మూఢ విశ్వాసము. మూర్ఛ, హిష్టి రియా అపస్మారకము మొదలైన మానసిక వ్యాధులచే బాధ పడుచున్నవారిని, దేవతలుగా కొల్చెడివారు.

బాల్యవివాహములు, కన్యాశుల్కములు, సర్వ సామాన్య విషయము. పురుషుడు వృద్ధుడైనా, నాల్గో వివాహము నిరభ్యంతరముగా చేసికొనవచ్చును. స్త్రీలు యౌవ్వనములో నున్నను పునర్వివాహము చేసుకొన కూడదు. సహపంక్తి భోజనములు పూర్తిగా నిషేధము. విదేశ యాత్రలు, సముద్రప్రయాణములు శాస్త్రవిరుద్ధ ములు. హరిజనులను ముట్టుకొంటే అపవిత్రత. హరిజనులు గుడులలోనికి పోవుట పాపము, బడులలోనికి పోవుట కూడదు. సూక్ష్మములో చెప్పవలెనంటే ఆనాటి సంఘ మునకు, విశాల భావములు లేవు; విశాలహృదయ మంత కన్నలేదు. మానవత్వము మందునకైనా కానరాదు. ఇటు

వంటి జటిల, దుస్తంత్రసారమైన నాటి సంఘమును ఎదు ర్కొని కవిరాజు పోరాడవలసి వచ్చినది.

కవిరాజు గభీరుడు, అద్రిధరుడు, చండశాసన కవితా పిచెండిలుడు. బ్రహ్మచెవులూడ పొడిచెడి పండితుడు. పలుకులు దారుణాఖండల శస్త్రతుల్యములు. హృదయము వెన్న కన్న మృదువు. కవులు, పండితులు, నాయకులు సైతము, వారి సన్నిధికి పోవుటకు భయపడెడివారు. రణోత్సాహము మెండు. మూఢ విశ్వాసములమీద అధర్మములమీద "దుర్గము, దురంబటంచు రణదోహలమును ప్రకటించును" మార్షల్ స్పిరిట్ బాగా ఉన్న సర్వస్వతంత్రుడు. అంతా కోటముట్టడి పద్ధతి.

వీరి మొదటి దండయాత్ర దయ్యములమీద, భూతములమీద. ఒకనాడు కవిరాజుగారు మొహముపుల్లలకని వేపచెట్టు దగ్గరకు వెళ్ళగా, ఆ చెట్టుకి మేకులు, మేకులకు జుట్టు చుట్టి వుంది. చెట్టుక్రింద డబ్బులు, పసుపు కుంకుమ, నిమ్మకాయలు, ఒక బెత్తము పడివున్నవి. వెంటనే డబ్బులు తీసుకొని, జేబులోవేసుకొని, బెత్తము తీసుకొని ఊర్లోకి వెళ్ళటము జరిగింది. ఇది వారి భావ విప్లవమునకు బీజాంకుర మని చెప్పవచ్చును. ఈ విప్లవ బీజములు వారి జీవితములోనే గాక, ఆంధ్రదేశ చరిత్రలోనే భావ విప్లవ యుగమునకు ప్రారంభమని వర్ణించవచ్చును.

కాలచక్రము దొర్లినకొలది, భావ విప్లవ సిద్ధాంత

ములను ప్రచారముచేయ మొదలుపెట్టిరి. పురాణములు హేతువాద విరుద్ధములని, దేవుడు లేడని, దెయ్యము అంతకు ముందే లేదని అగ్రకులములవారికి, అధమ కులములవారు లొంగి బ్రతుకవలసిన పనిలేదని, అందరు సమానులేనని, కానిస భావములను ప్రతి మానవుడు పోగొట్టుకొనవలయు నని, ఊరూర, తిరిగి, పెక్కు ఉపన్యాసములిచ్చి ప్రజలను పండితులను ఆలోచనా నిమగ్నులను చేసిరి.

కవిరాజుగారు ఒక క్రొంగ్రొత్త మార్గమును త్రొక్కి నప్పుడు తిరోగమన మనునది ఆయన జీవిత చరిత్రలోనే లేదు. "పదండి,ముందుకు త్రోసుకు పదండి" అని శంఖారావము పూరించిన మహావీరుడు. ఆయన పోరాటము సామాన్య మానవులతో కాదని, తరతరములనుండి కరడుకట్టిన మూఢ విశ్వాసములమీదనని, తనకు విశ్రాంతిలేదని ఆయనకు తెలుసు. ఆంధ్రలోకమంతయు నొక్కటియై తన్ను శపించి నను జంకని వజ్రసంకల్పుడై, తన పోరాటమును యేకా కియై కొనసాగించినధీశాలి. ఒకేసారి, బహుముఖంగా విప్లవ జ్యోతులను వెలిగించిన విప్లవకవి.

స్వయంవ్యక్తులను తయారుచేయు సంఘమును స్థాపిం చి, అగ్రజాతి ప్రత్యేక హక్కులను ఊడగొట్టి, సహపంక్తి భోజనములను (చాపకూడు సిద్ధాంతమును) ప్రచారము జేసి తిరి. హరిజన బాలికలను, గాంధిగారి హరిజనోద్యమమునకు ముందే, 1910 లో, అంగలూరు బాలికా పాఠశాలలో ప్రవేశపెట్టిరి. వాగ్వాదాలు, తిరస్కారములు జరిగినవి. కవి

రాజుగారి కుటుంబము సంఘ బహిష్కరణకు కూడా గురి యైనది. అయినా జంకలేదు తుదకు విజయమునే సాధించితిరి.

కుల, మత వర్గములు నశించాలి. "మనసు లొక్కటియైన మతేతరము లేమిచేయగలవు" అని మతాంతర వివాహములను ప్రబోధించుచు రాణా ప్రతాప్ అను నాటకమును వ్రాసితిరి ఈ నాటకము విప్లవాత్మకమైనదని ప్రభుత్వము నిషేధించుట, పుస్తకమును ముద్రణాలయాధికారులే అగ్నిసంస్కారము జేయుట జరిగినది.

పాండవ ఉద్యోగ విజయములకు వ్యతిరేకముగా కురుక్షేత్ర సంగ్రామము వ్రాసితిరి. ధర్మరాజు పెనవేపవిత్తు అనియు సుయోధనుడే నీతిపరుడు, రాజ్యార్హుడనియు ఈగ్రంథముయొక్క సారాంశము. ఒక్కసారి అగ్రజాతి ప్రళయ ఝంఝూమారుతము వలే విసరి కొట్టినది. సంఘము భగ్గుమన్నది. తిట్టారు. శపించారు. మూఢ మానవ నిబడీకృతమైన జాతి విషమును వెళ్ళగ్రక్కినది.

సముద్ర ప్రయాణము శాస్త్ర విరుద్ధము కాదని ఋజువు చేయుటకు, ఉన్నత విద్యాభ్యాసమునకు 1914 సం॥ న యింగ్లాండు ప్రయాణము నిశ్చయించితిరి. అది అతిదారుణమైన మొదటి ప్రపంచ యుద్ధసమయము. బంధువులు స్నేహితులు వెళ్లవద్దని గట్టిగా నిరోధించిరి. పైగా ఆయన ప్రయాణ సమయమునకు ఎవరో తుమ్ముటకూడా జరిగినది. వినలేదు. లండన్ వెళ్లి బి. ఎ. చదువుటకు ఆక్సుఫర్డు విశ్వ

విద్యాలయములో జేరుట. అచ్చటనుండియే, కృష్ణా పత్రికలో మూఢ విశ్వాసములపైన, పూర్వాచారము పైన అనేక వ్యాసములు వ్రాసిరి. వైజ్ఞానికముగా, పాశ్చాత్య దేశములు పురోభివృద్ధి చెందుచున్నను వారికికూడా కొన్ని అంధ విశ్వాసములు కలవు. వారికి 13వ నవంబరు మంచిది కాదు. కవిరాజుగారికి ఆ నంబరే ఉత్తమమైనది. ఆ నంబరే కావాలి. ఏ హోటలుకు వెళ్ళిన, ఏ హాస్టల్‌కు వెళ్ళిన 13వ నంబరు గదిలో ఉండేవారు. డబ్లిన్‌లో శంబుకవధ పీఠిక వ్రాయడము జరిగినది. ఇంగ్లాండునుంచి తిరిగిరాగానే శంబుక వధ ప్రచురణ. రామరాజ్యములో అందరకు సమాన హక్కులు లేవని, ద్రావిడులకు భగవంతుని ప్రార్థనచేసి కొనుటకు కూడ హక్కు లేదని, శంబుక మహర్షిని వధించుట పక్షపాత భూయిష్టమని, అన్యాయమని ఈ పుస్తకము సారాంశము. ఈ గ్రంధము కల్గించిన చైతన్యము, తెలుగులో మరే పుస్తకము కలుగజేయలేదు, ఉద్రేకములను పెంచినది. ద్వేషము పరాకాష్ఠ నందుకొన్నది. అగ్రకులము వారు రామస్వామిగారిని పాషండుడనియు, నాస్తికుడనియు మత ద్రోహియనియు తెగడిరి.

ఎన్ని అడ్డంకులు వచ్చినా జంకు గొంకు లేదు. చేపట్టిన ఉద్యమాన్ని కొనసాగించుతూ వచ్చిన ధీరోదాత్తుడు కవి రాజు. స్వసంఘ పౌరోహిత్య తీర్మానమును ప్రతిపాదించి, సఫలీకృతుడయ్యెను. పురోహితులనుసృష్టించి పెళ్ళిళ్ళు చేయించారు. రేపల్లెతాలూకా వెనిగళ్ళవారి పాలెములో, వెలగపూడి

రామకృష్ణ చౌదరిగారి అధ్వర్యము క్రింద ఒక పాఠశాలను స్థాపించి, కొంతమంది పురోహితులను తయారు చేసిరి. పచ్చల తాడిపర్రు, అంగలకుదురు, ఎడ్లపల్లి మొదలైన గ్రామములలో స్వసంఘ పౌరోహిత సంఘములను ఏర్పాటు చేసితిరి. ఇప్పటి కిని ఆ ఉద్యమము నిర్విఘ్నముగా కొనసాగుచునేయున్నది.

ఆ కాలములో సంస్కృత భాషాధ్యయనము, నిమ్న జాతులకు చాలా కష్టముగ నుండెడిది. అలా బహు కష్టము లకు లోనైన వారిలో కవిరాజుగారు ఒకరు. ఈ విషయమున కొల్లూరులో శంకర పీఠాధిపతులతో వివాదము. ఆ వివాద ములో శంకర పీఠాధిపతుల పలాయనము.

తెనాలిలో కవిరాజుగారు చైర్మన్‌గా ఉండగా (1925 సం॥) ఒక వింత సంఘటన జరిగినది. కొంతమంది మూఢ విశ్వాసపరులు అమ్మవారికి బలియివ్వాలని, దానికి చైర్మన్ గారైన కవిరాజు గారిని పర్మిషన్ అడిగారు. కౌన్సి లులో మెజారిటీ గట్టి పట్టు పట్టింది. కవిరాజు వినలేదు జీవ హింస ఎట్టి పరిస్థితులలోను నిషేధమని కవిరాజుగారి సిద్ధాం తము. అయితే విశ్వాస రాహిత్య తీర్మానమే నన్నారు. వెను కంజ వేయలేదు. ఏమైనాసరే నన్నారు కవిరాజుగారు. విశ్వాసరాహిత్య తీర్మానము పెట్టారు. కవిరాజుగారు విజ యము పొందిరి. కొలుపులు ఆగిపోయినవి. జీవహింస జరగలేదు.

హేతువాద యుగమునకు కవిరాజు మూలపురుషుడు. పురాణములు హేతువాద విరుద్ధములనియు, పక్షపాతభూయి ష్టము లనియు, అభ్యుదయ నిరోధకములనియు సహేతుక

ముగా విమర్శించి సూత్రపురాణమును రచించిరి. నాటితో పురాణ గోపురద్వార కవాట పంక్తులు బదాబద లైనవని చెప్పవచ్చును. ఆంధ్రదేశములో యీ తిరుగుబాటు అనన్యము, అసమాన్యము. పురాతన సంఘ వ్యవస్థ, వర్గ ఆధిపత్యము ధ్వంసమగుట ప్రారంభించినదని చెప్పవచ్చును.

దైవభావము కేవలము ఊహ అని కవిరాజుగారి అభిప్రాయము. విజ్ఞానములేని రోజులలో మానవుడు దేవుని ఒక మత్స్యముగను, కూర్మముగను, వరాహముగను ఊహించి తరువాత నరసింహముగను, మానవునిగను, మానవాతీతునిగను,నిర్వికారునిగను,నిరంజనునిగను వూహించినాడు. విజ్ఞానవంతుడయిన నేటి మానవుడు చివరకు శూన్యమే కలదనియు, అనగా యేమి లేదని నిర్ధారణ జేసినాడు. ఇది భగవంతుని జీవితచరిత్ర అని సోదాహరణముగా చెప్పుచూ, సంఘాభివృద్ధికి భగవంతుడు ఆటంకమనియు, లోకము నాస్తికమయముకావలెననియు ఆస్తిక్యము పురుషకారమును లోపింపజేసి ప్రజలను అంబేదలుగజేయుననియు వారు "ఖూనీ" అను పుస్తకములో ఉద్ఘాటించిరి.

మంత్రతంత్రములతో వివాహము జేసుకొనుటకంటె, మధురమైన తెలుగు భాషలో వివాహము జేసుకొనుట, ఉత్తమమార్గమని వివాహవిధియని ఒక పుస్తకమును రచించిరి. మంత్రములను మామూలు తేట తెలుగు మాటలలోనికి మార్చి వారే స్వయముగా వివాహములను చేయించిరి. ఒక వివాహము చేయుట, ఒక ఉపన్యాసమిచ్చి ప్రజ

లను చైతన్యవంతులనుచేయుట. ఈ వివాహపద్ధతిలో ఖర్చు చాలా తక్కువ. వీరి ఆధ్వర్యము క్రింద నా వివాహము చేయించుకునే భాగ్యము నాకు లభించినది.

పవిత్ర గ్రంథమని ఎంచబడుచున్న భగవద్గీత, కవిరాజుగారిచేతిలో పరిహాసాస్పదమైనది. దానిలో లోపాలు, అవకతవకలు, అసంగతములు, అసంబద్ధములు కలవని విమర్శించుటయేగాక, "కోరికలను చంపుకోనుము" అను గీతా వాక్యము, పురుషత్వమును నశింపజేసి దేశమును అథోగతి పాలు చేయుచున్నదని, చక్కని వ్యంగ్యముతో ఈ పుస్తకమును రచించిరి.

కవిరాజుగారు ఒక సాంఘిక విప్లవమునేగాక, సాహిత్యమునందుకూడ భావవిప్లవమును రేకెత్తించిరి హరినామ స్తుతి లేని కావ్యము, కావ్యము కాదనియు, ఇష్టదేవతా ప్రార్థన లేని గ్రంథము నిరుపయోగమైనదనియు, శ్రీకార ముతో నారంభములేని కావ్యము అరిష్టదాయకమనియు పూర్వకవుల అభిప్రాయము అందుచేతనే పురాతన కవులు యిష్టదేవతా ప్రార్థనతో కావ్యమును ప్రారంభించెడివారు. పూర్వగ్రంథములన్నియు శ్రీకారముతో ప్రారంభింపబడినవి. కాని కవిరాజుగారు అట్టి హేతువాద విరుద్ధములైన సాంప్రదాయములను పరిత్యజించి, చంపకమాలతోనో ఉత్పలమాలతోనో కృత్యారంభము జేసెడివారు. దైవప్రార్థన లిచ్చుట కానరాదు. నిరుపేదలను పోషించకుండా, దేవాలయ

ములను కట్టించువారిని న్యాజస్తుతి జేసి. పరిహాస మొనర్చెడి వారు. ఉదా ॥

చ. మల మల మాడు పొట్ట తెగమాసిన బట్ట కలంత పెట్టగా
విల విల యేడ్చుచున్న నిరుపేదకు జాలినిఁ జూపకుండ ను
త్తల పడిపోయి జీవరహితంబగు బొమ్మకు నిండ్లు వాకిళుల్
పొలమును బొత్ర నిచ్చెడి ఆ బుద్ద వదాన్యుల నిచ్చ మెచ్చెదన్.

కవిరాజుగారి కవిత్వము లలిత ధ్వని సంభృతమై, మధురాతి మధురమై, శబ్దాలంకార శోభితమై, గంగోత్తుంగ తరంగ రింగణ సదృశమై, విప్లవాత్మకమై మిక్కిలి మనోరహముగా నుండును.

కవిరాజుగారు గొప్ప పండితులు, కవులేగాక చారిత్రక పరిశోధకులు, విమర్శకులు. వారు శంబుక వధ పీఠికలో రామాయణకాలమును గూర్చి, భారతకాలమును గూర్చి జేసిన విమర్శ అపూర్వమైనది, అప్రతి హతమైనది. సూత పురాణమునందలి యదార్థ ప్రహ్లాద చరిత్ర, సర్గ్వలోక వర్ణన, శ్రీకృష్ణుని రాజనీతిజ్ఞత, విమర్శకులనే నివ్వెరపాటు చెందునట్లు జేసినది.

కవిరాజుగారు రచించిన సూతాశ్రమ గీతములు, కుప్పుస్వామి శతకము, ధూర్త మానవ, నరకము అంపకము యిత్యాది పుస్తకములు చిన్నవయ్యు భావ విప్లవ పూరితములే!

కవిరాజుగారు మామూలు సంఘసంస్కర్తవలెగాక, ఒక్క దేశకాలములకే పరిమితముగాక, సమగ్రమయిన

విమర్శ చేసెడివారు. వేదము వేంకటరాయశాస్త్రి వంటి మహా పండితునకు భౌగోళిక, చారిత్రక జ్ఞానము లేదని ఈ గేయములలో విమర్శించిన విమర్శకాగ్రేసరుడు. గంగ ఒడ్డున ఢిల్లీ లేదని, ప్రతాపరుద్ర చరిత్రలో చాకలి పేరి గాడు లేడని, అవి యన్నియు కల్పితములని సహేతుకముగా విమర్శించిరి. తెలుగుభాషకు జాతీయగీతము వ్రాసి, జాతీయ కవిగా పేరుగాంచినాడు. "పీరగంధము దెచ్చినారము పీరు డెవ్వడో తెల్పుడీ" అను గీతము, జాతీయగీతముగా పేరు పొంది ప్రథమ బహుమతి నందుకున్నది.

ధూర్త మానవ శతకము మిక్కిలి వ్యంగ్యపూరిత మైనది. దీనియందు భగవంతుని పేర జరుగు అత్యాచారము లును, దుష్కృత్యములు ఖండింపబడినవి. మానవులందరు సమానులేనని నిరూపింపబడినది.

కవిరాజుగారు శతక కవిగా వేమనను మించినాడని చెప్పవచ్చును. మన తెనుగుభాషలో అనేక నీతులు బోధిం చెడి శతకములు గలవు కాని భావవిప్లవమును ప్రబోధించు శతకము ఒక్కటియును లేదు. కుప్పుస్వామి శతకము ఆకొఱ తను దీర్చినది. ఈ శతకమునందు తెనుగు నుడికారము ఉట్టిపడుచుండును, దీనితో వీరు ప్రజా కవిగా పేరుపొందిరి. సాంఘిక సేవలో, సాహిత్య సేవలో, ప్రజాసేవలో, నాగ ర్ధంబులలో, ప్రమాణములలో, వాదంబులో, భావ విప్లవ ములో, కవిత్వ మధుధారావేగ విభ్రాంతిలో బాగోయి కవి రాజ ! నీ కివే మా సువర్ణ సుమాంజలులు.

సమగ్రముగ పరిశీలన జేసినచో, కవిరాజు హేతువాద యుగమునకు మూలపురుషుడు. మూలపురుషుడేగాదు, అధినేత. అధినేతయేగాదు, నవ్యాంధ్ర నిర్మాత. భావవిప్లవమును రేకెత్తించి ఆంధ్ర మహాజనులను చైతన్యవంతులను జేసి తాను కృతకృత్యుడయ్యెను.

కవిరాజు మరణించి నేటికి యిరవై సంవత్సరములగుచున్నది. కాని మరల దుష్ట మతాచారములు, మూఢ విశ్వాసములు విజృంభించి బుసలుకొట్టుచున్నవి. మ్రొక్కుబడులు మొదలగు అంధవిశ్వాసములు యిటీవల ప్రాబల్యము వహించుచున్నవి. ఈ తరమువారైన మనము, కవిరాజుగారి మార్గమునబోయి, సంఘమును సంస్కరించ వలసియున్నది. కవిరాజుగారి జీవితమునుండి మనము నేర్చుకొన వలసిన గుణపాఠము యిదే!

—డాక్టర్ వెంకటేశ్వరరావు.

# కవిరాజు తాత్త్వికదృక్పథం

ప్రతి కవికీ ఏదో ఒక తాత్త్వికదృక్పథముండుట సహజం. ఆయన కృతులలో ఆ తాత్త్వికదృష్టి నిహితమై యుండుటయు సాజమే. ఉదాహరణకు తిక్కన భారతంలో హరిహరులకు అద్వైతమును, పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయములో విశిష్టాద్వైతమూ నిక్షిప్తమైయున్నవని పండితుల అభిప్రాయం. అష్టశతావధాని, భావవిప్లవ విధాత, సంఘ సంస్కర్త, కవిరాజు అయిన త్రిపురనేని రామస్వామిచౌదరి కృతులలో మానవతావాదము ప్రతిపాదింప బడినదని విజ్ఞుల తీర్పు: సూతపురాణము, భగవద్గీత, శంబుక వధ, ఖూని యిత్యాది కవిరాజు గ్రంథాలను పరిశీలించిన సహృదయులకు యిందలి యథార్థం గోచరింపక పోదు.

మానవతావాదమంటే యేమిటి ? "మానవ జాతి చరిత్ర పరిణామాలు మానవకృషి ఫలితములుగా యేర్పడిన వని వివరించు తాత్త్విక సిద్ధాంతమే" మానవతా వాదమంటాడు ఫెర్నాండ్ రాబర్ట్. మానవతా తత్త్వమునకు ప్రాతిపదికలుగా చెప్పదగిన రెండు సూత్రాలు పూర్వమే చెప్పబడినాయి. అవి యేవన: మానవ జాతికి మానవుడే

మూల పురుషుడు. (2) ప్రతి విషయమునకు మానవుడే ప్రామాణికుడు. జగం మాయ, బ్రతుకు మాయ అని గానీ, మానవులు భగవంతుని చేతిలోని కీలుబొమ్మలని గానీ మానవతావాదులుఅంగీకరింపరు. మానవతావాదంప్రాచ్య, పాశ్చాత్య దేశాలలో అనాదినుంచీ అభివృద్ధి చెందుతూ వచ్చింది. ప్రాచీన కాలంలో గ్రీసు దేశంలో ప్రొటాగరస్, ఎపిక్యూరస్ మానవతావాదమును ప్రచారం చేసినారు. మధ్యయుగానంతరం యూరపులో వెల్లువగా విజృంభించిన రినైజాన్సు ఉద్యమం మానవతా తత్వమునకు నూతన జవ సత్వాలను చేకూర్చింది. ఇక మన దేశంలో లోకాయత వాదులు, జైనులు మానవతావాదమునకు అంకురార్పణ చేశారు. గౌతమబుద్ధుడు,అతని అనుయాయులు మానవతా భావాలను బహుళంగా ప్రచారం చేశారు. ఆ తర్వాత హైందవ మత విజృంభణవల్లనే గాక, విదేశీయుల దండ యాత్రల కారణంగా కూడా యీ తత్వం మరుగున పడి నప్పటికీ, తిరిగి 10వ శతాబ్దిలో రాజా రామ మోహనరాయ్ నడిపిన భావవికాసోద్యమం ద్వారా వెలుగులోకి వచ్చింది ఆంధ్ర దేశంలో ఆర్యనాగార్జునుని కాలంనుండీ మానవతా భావాలు పాదుకొన్నట్లు చెప్పవచ్చు. యోగి వేమన,కందు కూరి, గురజాడ, రఘుపతి వెంకటరత్నం, త్రిపురనేనిరామ స్వామి ఆ కోవకు చెందినవారే, అయితే కవిరాజుపై గౌతమ బుద్ధుని జీవకారుణ్య దృష్టి, హేతువాదం, అజ్ఞే యతావాదం బాగా ముద్రవేసినట్లు కనపడుతుంది. ఆయన ఒకచోట ఇలా వ్రాశారు :

భారత భూతధాత్రికల దాగము
　　　　సర్వము సొంతయిల్లుగా
నారసి సర్వ భూతములందు
　　　　సమత్వము విజ్జిరాల్చినే
వారమణీయభూతదయ వర్ధిలఁ
　　　　జేసి ప్రపంచమందుఁ బెం
పారిన బుద్ధదేవుని పదాబ్జము లోఁ
　　　　దల దాల్చుటొప్పదే

(నూత పురాణము 1 వ భాగము)

గత శతాబ్దిలోనే రాజా రామమోహనరాయ్ భావ వికాసోద్యమమును మహోచ్ఛస్థితికి తీసుకొని వెళ్ళారు. ఈ ఉద్యమం వ్యక్తికీ వ్యక్తికీ నడుమ నున్న గోడలను పడ గొట్టింది. కుల మత వ్యత్యాసాలు వ్యక్తి జ్ఞాన వికాసమునకు అవరోధాలు కాకూడదని స్పష్టపరచింది. అంతేగాక రాజా రామమోహనుని ఉద్యమం భారతీయ సంస్కృతి సంప్రదాయాలను కూలంకషంగా, సహేతుకంగా పరిశీలించి మంచి యన్నది పెంచవలెనని ఉద్ఘోషించింది. అది వ్యక్తిస్వేచ్ఛకు అగ్రతాంబూల మిచ్చి, తన్నిరోధకాలయిన దురాచారములను మూఢవిశ్వాసాలను ముందటంట పెల్లగించటానికి ప్రయత్నించింది. ఈ ఉద్యమ లక్షణాలను కృష్ణశాస్త్రిగారు ఇలా వర్ణించారు : "ఈ జగత్తు మానవుడు, వాని అనుభవాలు, ఇన్నీ గట్టి పరమార్థాలేననే శాస్త్రీయ దృక్పథం, వాస్తవికత కూడా ఈ ఉద్యమ లక్షణాలే ........ నా జాతి మానవ జాతి అన్నీ బ్రతుకుతే స్వతంత్రములై బ్రతుకుతాను. లేకపోతే ఉండనే ఉండను. అవన్నీ రాగల ప్రతి

మానవుడు చాటుతాడని ఈ ఉద్యమం అంటుంది" రామ మోహాన రాయలు లేవనెత్తిన మానవోద్యమాన్ని తెలుగు నాట తొలుదొల్త వీరేశలింగంగారు ఆదుకున్నారు. ఆయన బ్రహ్మ సమాజమును ఆంధ్రదేశంలో స్థాపించి దానిద్వారా సంఘ సంస్కరణ కార్యాలు జరిపారు. ఆయన నడిపిన సంఘ సంస్కరణోద్యమమే క్రమేణా ఏకేశ్వరాధన విగ్రహారాధన నిరసనం, బాల్య వివాహ ఖండనం. కన్యాశుల్క. నిరసనం. వర్ణవ్యవస్థా ఖండనం, వితంతు వివాహకరణం మున్నగు అనేక శాఖలుగా విస్తరించింది. సంఘ సంస్కర్తగా కవిరాజు బ్రహ్మసామాజికుల బాటలోనడిచినప్పటికీ, ఆయనలో ఒక ప్రత్యేకత ఉంది. అదేమిటంటే సాంఘిక పరిణామాలకు మూలమైన భావ విప్లవంకొరకు ఆయన అనర్గళంగా కృషిచేశాడు. నవీన సాంఘిక దురాచారాలకు నిబంధత్వ సాకరణ భూతమైన హైందవ సంస్కృతిలోని లోపాలను ఆయన తన రచనలలో నిర్భయంగా నిశితంగా విమర్శించి ప్రజలలో ఒక నూతన భావ చైతన్యమును కల్గించినాడు. కవిరాజు కలం పట్టిననాటికి మన దేశ పరిస్థితి ఎలా వున్నదో చూడండి.

"విద్యా పక్షపాతము నశించినది. ధర్మ పక్షపాతము శిథిలమైనది. సత్యనిరతి కృశించినది. "యథాగురుస్తథా శిష్య" యనునట్లు ప్రజా సామాన్యమునందు ధర్మచ్యుతి ఏర్పడినది. చిత్తశుద్ధి లుప్తమైనది. చిత్త సంస్కారములేని శుష్కాచారమే మోక్షసాధనమను గాథలు తలయెత్తసాగి

నవి.........ధర్మాభిమానము, కులాభిమానము, ఆత్మాభిమానముగా మారినది. ఇవన్నియు నుత్కృష్ట స్థానమునుండి పతితమైన జాతియొక్క బహిర్లక్షణములు" (సూతపురాణం 1వ భాగము)

చదివితిఁ బుణ్యభూమియని
శాస్త్రములన్ మన భారతంబు నేఁ
డది విపరీతమైన జనుల కందఱికిన్
బొడఁగట్టుచుండె నే
విధముగ, సత్యశౌచములు లేవు
దయారతి లేదు ధర్మసం
పదయును లేదు ఘోర కలిమాయరె
ఈ గతియేమి ఈశ్వరా ?

(సూ. పు. 3 వ భాగము)

అంతేగాక వేదార్థము నుట్టంకించి మహర్షులు పురాణాలు వ్రాసినారని మూఢలోకం విశ్వసించి, తత్కారణమున పురాణాలు పూజ్యములనియు, అందలి ధర్మములు, నీతులు శిరోధార్యము లనియు విశ్వసిస్తోంది. ఈ విశ్వాసం ఆత్మ ద్రోహంగా పరిణమించుటచేత పురాణాలు యెంత వరకు నీతిబాహ్యములో- పక్షపాత భూయిష్టములో చూపించ వలసిన అవశ్యకత యేర్పడింది. కాగా కవిరాజు పురాణేతిహాసాలను, స్మృతులను మత గ్రంథాలను క్షోద క్షమంగా పరిశీలించి సత్యమును నిరూపించారు. యుగ విభజన అర్థరహితమని తేల్చినారు. పిట్టకధలకు పుట్టినిల్లయిన పురాణాల గుట్టుమట్టులను రచ్చకెక్కించినారు. స్వర్గ

లోకపు బండారమును బయటకు లాగినారు. ఆర్యుల మంత్రాంగమును, కూటరణ నీతినివిమర్శించినారు. యథార్థ రామాయణ గాథను వివరించి, రామరాజ్యంలో మత స్వాతంత్ర్యం మృగ్యమని, అందువల్లనే శంబుకవధ జరిగిందని రుజువు చేసినారు. అడవులలో ఆటలాడి, కోమరాం డ్రను గూడి మనోహరంగా సయ్యాటలాడి, పసివాడి నమ్రోళ్ళు చిగుర్పగా పాటలుపాడి, యావద్భారతవర్షములో తన పలుకుబడినినిలుపుకొని కురుక్షేత్ర యుద్ధమునకు మూల కారకుడైన శ్రీకృష్ణుని రాజనీతిని కవిరాజు మనోజ్ఞంగా చిత్రించినారు. వర్ణవ్యవస్థలోని కుళ్ళును తెగడినారు. భగవద్గీతను కృష్ణభగవానుడు చెప్పలేదనీ, వివిధ శ్లోకాల క్రోడీకరణమే గీతయని తేల్చినారు. అందువల్లనే గీతావాక్యాలకు అనేక అర్థాలు, గూఢార్థాలు, వజ్రార్థాలు, బహిరర్థాలు, అంతరార్థాలు. అతీంద్రియార్థాలు చెప్పుట కనువైనదని ఆయన తాత్పర్యం. మన అవతారవాదమును అపహాస్యం చేసినారు. హిందూ మతమునకు మూలస్తంభాలుగా చెప్పదగిన కర్మవాదమును, పునర్జన్మ సిద్ధాంతమును ఆయన త్రోసిరాజన్నారు. ఈ క్రింది పద్యాలే అందుకు తార్కాణం :

"విభుడొకడు చేయునంత పై పెత్తనంబు ;
కర్మమొకడు సంసార చక్రంబు ద్రిప్పు
నంట ; ద్వంద్వ ప్రభుత్వ మిందమరలేదె ?
ఎంతకాలంబు సాగునో యిట్టి చిట్ట ;"

"ఎన్ని పుట్టువుల్ దాల్చినేనెత్తితినొ
యెరుకలేకయున్నదదృష్టగరిమచేత
నదియె కల్గినఁ దలిదండ్రు లందరకును
వట్టిపోవుదు దండముల్ పెట్టలేక"

(సూత పురాణము 1 వ భాగము)

మరొక విశేషమేమంటే కవిరాజు మతం, ఈశ్వర వాదం నిరర్థకాలని భావించాడు 'ఖూనీ' పీఠికలో ఆయన ఈ విధంగా వ్రాసినాడు:—"మతము ప్రతిదేశమునందు సౌజన్యము, సౌభ్రాతృత్వము సమానత్వమును జిందర వందర చేసి, మానవుల నల్లకల్లోలము జేసి, ప్రపంచ శాంతి లేకుండఁ జేయుటయే కాకుండ మహాపురుషుల నెందరినో తన పొట్టబెట్టుకొన్నది .... ప్రజా సామాన్య మజ్ఞానాంధకార బంధురముగా నున్నప్పుడుబుసు పోకకో, చిత్తశాంతికో దేవుడను మారొకటి కావలసి యుండును. ప్రజలు జ్ఞానచక్షువు లందెరచి, తమలోఁదాము తర్కించుకొనుచున్న కొలఁది భక్తి విశ్వాసములు నశింప భగవంతు డున్నాడా లేడా యను తర్క వితర్కములు బయలుదేరుట సహజము. మానవుడు మృగదశలో నున్నప్పుడే కొండగానో, ఏ ఏరుగానో వెలసిన దేవుడు. మానవ విజ్ఞానము పరిణామముఁ బొందుచున్నకొలది, భగవంతుడే కొండల రూపమును వదలి, మృగమై మృగము నుండి మనుష్యుడై, మనుష్య దశనుండి యదృశ్య రూపుడై, యదృశ్య నిరాకారుడై, నిరంజనుడై నిర్వికల్పుడయ్యెను. ఇక దగు

వాతి దశ ఏమి? శూన్యత్వము అనగా నాస్తికత్వము. ఇదియె మూఢ మానవ ప్రతిపాదితుడయిన భగవంతునకు నేడు వాటిల్లుచున్న దశ."

ఈ విధంగా కవిరాజు ఈశ్వరత్వంనుండి గంగానమ్మ జాతరల వరకూ వున్న మన మత సాంప్రదాయాలను బూతుల బుంగలైన మన పురాణ గాథలను, సమానత్వమును నాశనము చేసిన మన సాంఘిక వ్యవస్థలను సహేతుకంగా ఖండించి సత్యపథమును చూపెట్టినాడు. ఆయన రచనలు చదివినవారికి "భూత ప్రీతియుఁజిత్తశుద్ధియు దమోలుంటాక వైరాగ్యముఁ నీతిప్రోత వివేచనంబు గలుగున్ నిత్యంబు సత్యంబుగన్"

పైన ఉదహరించిన విషయాలనుబట్టి కవిరాజు ఒక పాషండుడో, అబ్రాహ్మణుడో, నాస్తికుడో లేక నిహిలిస్టో అయినందున పురాణాలపై, మతగ్రంథాలపై దండెత్తలేదని స్పష్టమవుతుంది. ఆయనకు మనిషి ముఖ్యం. ఏ వంకతోనైనా సరే మనిషి స్వేచ్ఛను, అతడిలోని మానవత్వాన్ని కుంచించటాన్ని ఆయన అంగీకరింపడు. మానవ స్వేచ్ఛకు అవరోధాలైన మన సాంఘిక వ్యవస్థలను, పాత భావాలను తూర్పారబట్టి ఆయన మానవతా ఉద్యమానికొక క్రొత్త బలమును సమకూర్చినాడు. అకుంఠిత దీక్షతో అపనిందలకు వెరుపక, అర్థము నాశింపక, యిట్టి మహత్తర కృషిని కొనసాగించుటలో కవిరాజు ఆత్మబలమేగాక, మనిషిలోను, అతని హేతు శీలములోను ఆయనకుగల అచంచల విశ్వాసం ద్యోతక మవుతుంది. మానవుడు జన్మతః హేతు స్వాభావి

కుడు; స్వేచ్ఛాప్రియుడు. అతని హేతుశీలమే జ్ఞాన సముపార్జనకు, స్వేచ్ఛాపథంలో అతని పురోగతికి ప్రధాన కారణం. హేతుశీలమువలన అతడు యుక్తాయుక్త వివేచనచేసి యేది నీతిబద్ధమో, ధర్మబద్ధమో యేది కాదో తెలుసుకొనగలడు. హేతుశీలము విస్మరించిన మానవుడు స్వార్థపరుల చేతిలో కొరముట్టుగాక స్వేచ్ఛామార్గంలో సుఖప్రయాణం చేయగలడు. ఈ నమ్మకంతో కవిరాజు మానవునిలోని హేతుశక్తిని పురిగొల్పినాడు. కాగా ఆయనను హేతువాదిగా—ఆంధ్ర సాహిత్య చరిత్రలో హేతువాద యుగానికి మూలపురుషునిగా—అభివర్ణించుట కద్దు. అయితే హేతువాదమంటే యేమిటి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. "మానవుని హేతుశక్తివలన సత్యము నెరుగగలమని చెప్పు తత్వమే హేతువాద"మని ఎన్సైక్లోపీడియా బ్రిటానికా నిర్వచనం. మానవాతీతమయిన కర్మలకుగాని, యితర అమానుష శక్తులకుగాని హేతువాదంలో స్థానంలేదు. మానవుని హేతుశీలమునుండియే జ్ఞానం, నీతి, ధర్మం మున్నగునవి నిష్పన్నమవుతున్నవి. కాగా హేతువాది మానవుని హేతుశక్తికి మకుటంపెట్టి దానిద్వారా చరాచర జగత్తు నర్థంచేసుకొనుటకు, జీవితపు విలువలను గ్రహించుటకు యత్నంచేస్తాడు. రహస్యవాదమును, ప్రకృతికి బాహ్యమైన విషయాలను అతడు అధిక్షేపిస్తాడు.

క్రోచెమహాశయుడు హేతువాదమునుగురించి యిలా వ్రాస్తున్నాడు: " హేతువాదం దురాగ్రహపూరితమైన ఈశ్వరవాదమును తర్కబుద్ధితో పరిశీలించి మానవ జీవి

తంపై దాని దుష్ప్రభావమును తగ్గిస్తుంది. అలౌకిక సంఘటనలకు, కారణాలకు ఇందు అవకాశం లేదు" ఈ లోకమును యదార్థమని భావించు హేతువాదానికి, అలౌకిక కర్మలకు ఆశ్రయమిచ్చు ఈశ్వరవాదానికి ప్రతి దేశంలోను సంఘర్షణ జరిగింది. హేతువాదం జయించినప్పుడు ప్రజల్లో విజ్ఞానం వికసించి వారు పురోభివృద్ధిని సాధించారు. ఈశ్వరవాదం మత దృష్టి బలిసినప్పుడు జ్ఞానజ్యోతి కొడిగట్టి ప్రజలు మూఢ విశ్వాసాల్లో మునిగిపోయారు. తమదృష్టి కరుడుగట్టి వివేచన నశించి ప్రజలు అజ్ఞానాంధకారంలో దారి తెలియక తికమకలు పడుతూవున్న సందర్భంలో జ్ఞాన వీరుడయిన కవిరాజు కలంపట్టి తన రచనలద్వారా అజ్ఞాన తిమిరమును పారద్రోలి హేతువాదమును పునరుజ్జీవింప చేసినాడు.

మానవతావాది, హేతువాది అయిన కవిరాజు వ్యక్తికి ప్రాధాన్యం యిచ్చాడు. వ్యక్తి స్వేచ్ఛను సంఘానికో, వర్గానికో బలిపెట్టటం ఆయన అంగీకరింపలేదు. స్వేచ్ఛాపిపాస మానవునకు ప్రకృతి సిద్ధమని ఆయన మతం.

"పుట్టనున్నపాము బుసకొట్టి పోబోవు
వేలుచిక్కినపుడు వేగిరించి
సకల భూతములకు స్వాతంత్ర్యకాంక్షయే
యెప్పు సహజమునను గుప్పుసామి"

(కుప్పుసామి శతకం)

కరుణ, మైత్రి, సమతాభావం ప్రాతిపదికలుగా గల నీతిబద్ధమైన జీవితవిధానమును కాంక్షించినాడు త్రిపురనేని కవిరాజు.

జీవహింసచేసి జీవింతు ననుకంటె
జెట్లయందుగూడ బుట్టబోదు
జీవహింసమాని జీవింపరాదొకో!
కొంతమేలుదాన గుప్పుసామి"
"నీతిలేనివాని నిరసించు జగమెల్ల
నీతిశాలి కెపుడు నెగడులేదు
నీతిశాలి నెపుడు నీతియే కాపాడు
గుజను బారినుండి కుప్పుసామి"

ఒక్కమాటలో చెప్పాలంటే జాతిలో జీర్ణించిన మూఢ విశ్వాసాలను, ఛాందసాచారాలను నిర్మూలించి భావ విప్లవాన్ని సాధించిన యుగకర్త కవిరాజు. చాతుర్వర్ణ్యాన్ని, వర్గసమాజాన్ని కాదని ఎచ్చులొచ్చులు లేని ప్రజాస్వామ్య ధర్మాన్ని ప్రబోధించి, మానవతకు, నీతికి పట్టంగట్టిన మహా మనీషి కవిరాజు. *

—కల్లూరి బసవేశ్వరరావు.

# సంస్మరణ

1 కం॥ సూత పురాణము పేరున
సీతుల నెల్లటికి గఱపు నేర్పరితన మీ
భూతలమున మీ కబ్బిన
హేతువునకు సంస్తుతింతు మెల్లపు డెదలన్ ॥

2 కం॥ పౌరాణిక గ్రంథములను
చారిత్రక దృష్టితోడ సాకల్యముగా
పారాయణ మొనరించెడు
వీరా వేశంబు మీకు విజృంభించెన్ ॥

3 కం॥ బారిష్టరు వై యుండియు
భారత భువిలోన బరగు భాషలనెన్నో
కూరిమితో వల్లించిన
సారస్వత వేత్తవీవు సరసగుణాఢ్యా ! ॥

4 గీ॥ త్రిపురనేని వంశమునకు విపులమైన
ఖ్యాతినార్జించి పెట్టిన ఘనుడ వీవు
కొమరునిగ నుద్భవించిన గోపీచందు
నిరుపమైన భాషాసేవ నెఱపినాడు ॥

5 కం॥ భాషా సాహిత్యమున. న
శేషముగా కృషియొనర్చి స్థితప్రజ్ఞుడవై
భాషా యోషని నూతన
భూషల సమకూర్చినావు మురిపెంబొప్పన్ ॥

—జి. జె. సామ్యుయెల్

# కవిగా - కవిరాజు

కవిత్వమునకు భాష, భావము, వస్తువు, రసము, వర్ణనములు అనునవి పంచ ప్రాణములు. ఇవన్నియు యదార్థముగాఁ బోషింపఁబడినపుడే కవిత్వ ముత్తమ శ్రేణికిఁజెందినదై వన్నె వాసిగాంచఁజాలును. కొందరు సంప్రదాయ ప్రియులు లాక్షణిక నిర్దిష్ట మార్గము ననుసరించియే వీనిని నిర్వహింతురు. కొందరు ప్రతిభామహితులై దేశకాలపాత్రముల ననుసరించి వాని విషయమునఁ గొంత స్వతంత్ర మార్గము నవలంబింతురు. స్వాతంత్ర్యము ప్రతిభా చైతన్యములకు సూచనయగుటచే దానిని ప్రదర్శించుటలో దోషము లేదు. అది కావ్యమున సౌందర్య సంధాయకమై యుండు నంతవర కెల్లరు దాని నభినందింతురు. ఆధునికాంధ్ర కవిచంద్రులలోఁ బై యెదింటి విషయమున స్వాతంత్ర్యము వహించినవారు పలువురున్నారు. వారిలో భాషాస్వాతంత్ర్యము ప్రకటించినవారి సంఖ్య యధికము. భావస్వాతంత్ర్యము వహించినవా రల్ప సంఖ్యాకులు కలరు. వారిలో నగ్రేసరులని చెప్పఁదగినవారు కవిరాజు రామస్వామి చౌదరి గారు.

కవిరాజుగారి జీవితమున బాల్యమునుండియు స్వాతం

త్త్యము గోచరించును. జీవితమున వివిధ పరిస్థితులలోఁ గలి గిన వింత యనుభూతులు వారి యీ స్వతంత్ర భావములకు దోహదము చేకూర్చినవి. వారు పురాణము లన్నియు శ్రద్ధతోఁ బఠించిరి. వారికిఁ బెక్కు సందేహము లుదయించెను. ఆసందేహములను దీర్చుకొనన్ంచి వారు విజ్ఞాన ధురంధరు లనిపించుకున్న మహనీయులఁ బలువురి నాశ్రయించిరి. వారి సమాధానము లేవియు వారికి యుక్తిసహములుగాఁ గనఁబడ లేదు. ఆ సందర్భమున వారు గావించిన ప్రయత్నముల ఫలితమే సూతపురాణముగాఁ బరిణమించినది. పూర్వులు వ్యాజముతోఁ బురాణములు వ్రాసిరని నిశ్చయించి వారందలి కథావృత్తాంతములకే తమకుఁదోచిన రీతి వ్యాఖ్యానములు చేయ సమకట్టిరి. అవి యొక్కొక్కతరి పురాణోక్త విషయములకు విరుద్ధములుగా నుండవచ్చును. అందుచేతనే వారు, "కాంచినంతనే యోజనసేయ మాని పరుషోక్తులకుఁ జొరవద్దు కొందరన్" అని పఠితలకు విజ్ఞప్తి గావించినారు.

మనసువచ్చునెడల మన్నింపఁగా వచ్చు
మనసునొచ్చునెడల మానవచ్చుఁ
గాని వివరమేమి కనకుండ వినకుండఁ
బరులఁ బ్రువ్వఁదిట్ట ఫలముకలదె?

అనునది వారి యీ విజ్ఞప్తి పరమార్థము. "జాతిమాత్రోప జీవులు నీతిదప్పి" స్వోత్కర్ష చాటుటకై పురాణములు వ్రాసిరనియుఁ, గొందరందు ప్రక్షిప్తంబులఁ బొందించి" లోకులను మోసపుచ్చిరనియు వారి యభిప్రాయము. ఏతాదృశాభిప్రాయములకు సంబంధించిన యనుమానము

లను సూతమహర్షికి నివేదించి వారు సదుత్తరములు పడయఁ గాంక్షించిరి. ఆ యుత్తరముల సమాహారమే సూతపురాణము.

సూతపురాణమునం దెల్లయెడలఁ గానిపించు గుణవిశేషము భావస్వాతంత్ర్యము. ద్వితీయ భాగమునందలి మను బృహస్పతుల సంవాదము, చతుర్థ భాగమందలి శ్రీకృష్ణుని చర్యలు, యాదవులు, గోపకులు, ప్రాచీనబర్హి, త్రివిష్టపము, సురాసురులు మున్నగు వానికి సంబంధించిన విమర్శలు పరికించిన నీ విషయము తేటతెల్లము కాఁగలదు. సంప్రదాయమును గాఢముగా విశ్వసించి తదనుసారము గా వర్తించువారి కిందలి భావములు విప్లవాత్మకములుగా గోచరింపవచ్చును. భావములు విరుద్ధములుగాఁ దోఁచినంత మాత్రముచేతఁ గవిత్వ మహత్త్వమును గొంచెపరుచుట యుక్తము కాదు. అందుచేతనే విమర్శకులు కావ్యరసానుభూతి విషయమున 'నహంత' ను గొంతవఱకు విసర్జింపవలయునని చెప్పుదురు. అహంతా పరిమార్జనము వినా మహాకవుల కవిత్వము ననుభవించి యానందించుట కవకాశ ముండదు. శ్రీ కవిరాజుగారికి నన్నెచోడ కవిరాజుపైన పరిమితమైన యభిమానము. నన్నయకంటె నతఁడే పూర్వుఁడైయుండునని వారి విశ్వాసము. ఆ కవిరాజశిఖామణి తన కుమారసంభవమున "కింకవేస్తస్య కావ్యేన" అను సంస్కృత శ్లోకమును,

ముదమున సత్కవి కావ్యము
నదరఁగ విలుకాని పట్టి నమ్ముననుఁబరహృ

దృఢమై తల యూఁపింపని
యది కావ్యమె, మరియుఁ బట్టి నదియుఁగా శరమే

యని యనువదించెను. ఇందుఁ గవి కావ్యమునకును విలుకాని యమ్మునకును సామ్యము చెప్పఁబడినది. అమ్ము శత్రువుల హృదయమును భేదించి కొంత వైరుధ్యము గలిగించినను ప్రయోగపాటవముచే మాత్రము వారి తలలూఁపింపఁ జేయవలయునఁట! దెబ్బతిన్న శత్రు వుదాత్త ప్రకృతియైనచో బాధపడుచునే శత్రు శరప్రయోగ పాటవమును మెచ్చుకొనును. అట్లే కావ్యమునందలి కొన్ని భావములతో నేకీభవింపఁజాలకపోయినను దద్వ్యక్తీకరణ సౌందర్యమును గ్రహించి యానందించుట రసజ్ఞతకు లక్షణము. శ్రీ కవిరాజుగారి భావములతో సంప్రదాయానుసారులు పలువు రేకీభవింపలేక పోవచ్చును. కాని రసజ్ఞులైనచో వారి పదప్రయోగౌచిత్యము, ధారాశుద్ధి, భావప్రకటనము, వర్ణన నైపుణ్యము మున్నగువానిని మెచ్చుకొనకుండఁ జాలరు. శ్రీ కవిరాజుగారి కవిత్వమునందలి యాగుణవిశేషములనే యిందు సంగ్రహముగాఁ బ్రదర్శింప యత్నింతును.

తెలుఁగన్న కవిరాజుగారి కపరిమితమైన యభిమానము.

మాతృభాషవలని మమకారమునఁ జేసి
తెలుఁగుబాసచదివి దేశకవిత
నుడులకూర్పు నేర్పు నోరూరునట్టుగాఁ
బలుకనేర్చువారె తెలుఁగుకవులు

అని వారి యభిప్రాయము. తెలుఁగు దేశమునఁబుట్టి తెలుఁగు దేశమున జీవించుచు తెలుఁగును నిరసించు వారన్న వారికిఁ బట్టరాని యాగ్రహము. పూర్వ మెవరో చెప్పిన దానినే మరల త్రిప్పి త్రిప్పి చెప్పుటలో గొప్పతనము లేద నియు, "నూతనాంశ మేదో యొకటేనియుం దెలుపనోపని గ్రంథము" గ్రంథముకాదనియు వారితలంపు. ఇట్టి నూతన్న త్వము సూతపురాణమున సర్వత్ర గోచరించును. "రసిక శేఖరులకు నెల్లరకు రుచించు- కమ్మతనమునె చూపింతుఁ గైతలందు" అని కవిరాజుగారి ప్రతిజ్ఞ. ఆ "కమ్మతనము" సూతపురాణమునందలి ప్రతిపద్యమునందును గోచరించును. వ్యాసశౌనక సంవాదమును జెప్పిన పిమ్మట సూతుఁడు కవిని సంశయము తీరెనా! యని యడిగెను. అప్పుడు కవి

అనఁటి పండువిప్పి యఱచేత నిడినట్లు
తెల్పినపుడు నాకుఁ దెలియకున్నె

యని సమాధాన మొసంగెను. ఇందు సూతుఁడు కథా విషయ కథనము గావించిన క్రమము ప్రశంసింపఁబడినది. ఈ ప్రశంస సూతునికే కాక కవిగారికిని అన్వయించును. వారే విషయమంత క్లిష్టమైనది చెప్పినను అంటిపండొల్చిపెట్టినట్లు చెప్పుదురు. అది వారి భావ-వ్యక్తీకరణ కౌశలమునకు నిద ర్శనము.

కవిరాజుగారి వర్ణనలునాతిదీర్ఘములయ్యు భావనిర్భర ములై దృశ్యములను బఠితల కన్నులకుఁగట్టుచుండును ప్రథ మాశ్వాసమున వారుప్రయాగక్షేత్రమునందు గంగాయమునా నదులు కలసి ప్రవహించు దృశ్యములను వర్ణించిరి. గంగ

నీరు తెలుపు, యమున నీరు నలుపు. ఇచ్చట వారొసంగిన యుపమానములు వారి భావనా మహిమను వేనోళ్ళఁజాటుచు బరమాచిత్ర్య భాసురములై యలరారుచున్నవి. అవి భస్మ మలందిన పశుపతి యొడలిలైఁ గృష్ణ సర్పావళీఘృణుల యట్లును, శ్వేతవర్ణుఁడైన సీరి దేహముపై నలరు కృష్ణోత్తరీయము నట్లును, ఆకాశవీధిపై నటిటు నెలకొన్న స్వచ్ఛ శరన్మేఘ సంఘమట్లును, పాలసంద్రముమీదఁ బవ్వళించి యోగనిద్రా స్థితిఁగూర్కు మాధవుని యట్లును వారికి సాక్షాత్కరించినవి. ఈ వర్ణన మొక్కటియె చాలును వారి కవిరాజత్వమును సార్థకము చేయుటకు! ప్రథమాశ్వాసమందే సంధ్యాకాలమును వారిట్లు వర్ణించిరి.

సంజనీ రెండ పుష్పమంజరుల నెల్లఁ
బొల్పు మీరెడి మంకెన పూలొనర్చెఁ
బర్ణ సంతతులను బల్లవములఁ జేసె
నేమి చెప్పుడు నా వనసీమ గోము.

ఇందు సంజకెంజాయ ప్రభావము ప్రధానముగా గ్రహింపబడినది. దాని యెఱ్ఱఁదనము పూలనెల్ల మంకెన పూవులుగను, బర్ణసంతతుల నల్లఁ బల్లవములుగను నొనరించెను. ఇది కవిగారు నిశిత పరిశీలనమునకు దృష్టాంతము. ఇట్లే వారు "పరమ పావన గాంగ పాథస్సమూహంబు పుష్కరిణీ కూప పుష్కరంబు ("పుట 91") అను సీసమున మునిపల్లెకును బట్టణములకును గల తారతమ్యము వివరించిరి. ఇదియు రమణీయ భావ శోభితమై వారి సూక్ష్మేతి సూక్ష్మ పరిశీల

నమును జాటుచున్నది. అర్జునుఁడు సూర్యుఁడస్తమింపక ముందే సైంధవుని తలఖండించెదనని ప్రతినవట్టెను. సూర్యుఁ డస్తగిరిశిఖరమునధివసించెను. అప్పటి సింధురాజు సంభ్రమమును వర్ణించుచుఁ గవిరాజుగారి క్రిందిపద్యమును రచించిరి.

పొడ్డు క్రుంకుచుండఁ బొడతెంచె బెడగొంద
వలమె నెఱ్ఱచాయ లభ్రవీధి
మెడను సాచిసాచి పడమటి దిక్కును
సింధురాజు చూచి చెలఁగు చుండె (4-153)

ఇందు మెడను సాచిసాచి యను దానియంతలి పునరుక్తి సైంధవుని యాత్రమును భయమును జక్కగా సూచించు చున్నది. గగన వీధిని వాయువేగముతోఁ బఱచు చుండిన కవికి

నదులు నల్లని త్రాచుల నంగఁ దోఁచె
మలలు పిల్లల బొమరిండ్ల మాడ్కిఁదోఁచె

నను వర్ణన సహజమై కడు సుందరముగా నున్నది.

కవిరాజుగారి భావములుగంభీరములైనవి. నిర్భరతయు నైశిత్యమును వాని లక్షణము. ద్వితీయాశ్వాసము మొదట జోతల రూపమునఁగల పద్యము లిందుకుఁ జక్కని దృష్టాంతములు. ఇందు వారి యాశయముల నైర్మల్యమును, దాంభికులనుగూర్చిన హేళనయు మనోహరముగా సూచింపఁ బడినవి.

అతిసుకుమార సౌరభసమన్విత పేశల పుష్పమంజరీ
వితతినిగాంచి వెగ్గలపు వేడుకఁ బొందక తోఁటమాలి పం

డిత పరుఁడైన బ్రాహ్మణుఁడు నిక్కము కాదని బైసిమాలి దు
ష్కృత మతిఁద్రోసి పుత్తునని రిత్తలు పల్కెడు మూర్ఖుఁ డుండునే

(1-116)

అను పద్యమునఁగాన్వరసం నాస్వాదించుటకుఁగావ్య సౌందర్యముతోడనే కాని తద్రచయిత వర్ణముతో సంబంధము లేదను కవిగారి భావము స్పష్టముగా వివరింపఁబడినది. ఆంధ్ర సంస్కృత కావ్యములం దచ్చరల వర్ణనలు పలుచోట్లఁ గానవచ్చుచుండును. వారి కేళీ విహారాదులును వర్ణితము లగుచుండునుగాని వారు ప్రసవించిన బిడ్డల నెచ్చటను దమతోఁదీసికొనిపోయి పెంచుట మాత్రము కానఁబడదు. అందుకుఁ గవిరాజుగారు ద్వితీయాశ్వాసమున నిక్రింది సమాధానము చెప్పించినారు.

స్వైర విహార నిష్ఠమెయి సర్వదిగంతర దివ్యదేశ సం
చారముఁ జేయుమాకు గ్రహచారము చాలక సంతు గల్గినన్
వారలనెల్లఁ గన్న మగవారికి నిత్తుముకాని పెంచు నా
చారములేదు స్వర్గమున సత్యము చెప్పితి నంచు నామెయున్.

స్వర్గమున నిట్టి వింత యాచారములింకను గొన్ని కలవు. కవిరాజుగారు వానిని హేళనపూర్వకముగా ద్వితీయాశ్వాసమున వెల్లడించినారు.

సూత పురాణమున నవరసములును నాయా సందర్భలందుఁ బోషింపఁబడినవి. అందు చతుర్థాశ్వాసమున రాధాకృష్ణ ప్రణయ వర్ణన సందర్భమున శృంగార రసముచక్కగా బోషింపఁ బడినది.

జాఱుపయ్యెటసర్దె సవరించు నెపముచే
వలుఁద పాలిండ్లఁ గన్పఱుచుచుండు (4-54)

పున్నగు పద్యము లిందుకు దృష్టాంతములు.

చరణాబ్జ యుగ్మ లాక్షారసం బొకమాటు
పగవారి క్రొన్నెత్తురువాక యొకట (4-62)

ఇందు శృంగార వీర రసముల కలయిక రమ్యముగా వర్ణింపబడినది.

అడవి పూలగబ్బు నపహరించి భరించి
కుంటినడక తోడఁ గొంటె గాలి
యొడలికెక్కి ప్రాకి పొడుగు గడ్డము లూఁచు
చుండనిట్లు పల్కె నొక్క తపసి (1-96)

ఇందొక్కించుక హాస్యరసముస్ఫురించు చున్నది. ఇట్లే కవిరాజుగారు సూతపురాణము నందలి యితర ఘట్టములం దితర రసములను సమర్థతతోఁ బోషించియున్నారు.

కవిరాజుగారు విప్లవ భావములను బ్రదర్శించినను బూర్వ మహాకవుల రచనలఁ బఠించుటయందు మాత్ర ముపేక్ష ప్రదర్శించి యుండలేదు. వారి రచనలోఁ బెక్కు చోట్ల నన్నయాది మహాకవుల పద్యములకుఁ బ్రతిబింబములు గోచరించు చుండును.

వీరెవ్వరు ద్రుపద ధరా
వరులా ? యిట్లేలవచ్చి పడినారలు భూ
సురపదములపై ? తగునే
మఱి యం చుడికించి పెక్కుమాటల చేతన్ (2-90)

అను పద్యము నన్నయగారి "వీరెవరయ్య ద్రుపద మహారాజులె" యను పద్యమును దలపించు చున్నది. ఇందలి ప్రాస భంగము ప్రామాదిక మైనది.

సిరి సంపత్తులు భోగభాగ్యములు దాసీదాస సంతానముల్
మెఱుపుందీవలు నీటిమీఁది బుడగల్ పీసాలపై఼ దేనియల్

వంటి పద్యములలో ధూర్జటి పెద్దనాదుల ఛాయలు గోచరించు చున్నవి. సూత పురాణమునందలి యాయాఘట్టములను బఠించునప్పుడు కవిరాజుగారికిఁ బూర్వ కవి కావ్యములతోఁగల గాఢపరిచయము పలుచోట్ల వ్యక్తమగుచుండును.

కవిరాజుగారు శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల శిష్యులు. ఆ శిష్యత్వము వారి రచనలందెల్లెడలఁ బ్రత్యక్ష మగుమనే యుండును. వారి పద్యములెంత సులభములో యంతధారా శుద్ధి శోభితములు. కుంటి నడకగల పద్యము వారి రచనలో నెచ్చటను గానరాదు. ప్రసాదగుణము వారి కవితకు జీవగఱ్ఱ. ఎచ్చటను సమాసాడంబరము ప్రదర్శింపక వారు చిక్కని చక్కని తెలుఁగు పలుకులతో మకరంద ప్రవాహము వలె రచన సాగింతురు. అర్థాలంకారముల కైవారెచ్చటను యత్నింపరు. అయత్న సిద్ధములైన యుపమాలంకారము లచ్చటచ్చట గానిపించి వారి లోకజ్ఞతను బహుకావ్య పరిశీలనమును బ్రకటము చేయుచుండును. రెండు మూఁడుచోట్ల వారు ప్రయోగించిన శబ్దాలంకరములు రమ్యములై భాషపై వారికిఁ గల ప్రాభవమును జాటుచున్నవి.

....అత్యధిక వంజుల మంజుల కుంజ పుంజ సం
జనిత పథావరోధ పరిసర్పిత ధామకు నొక్కసీమకున్ (1·81)

నీ వారి నుజ్జగించియు
నీ వారాన్నంబు గుడిచి నిల్తువెయిచ్చో
నీ వారిఁ ద్రావి నిత్యము
నీ వారి మనంబు కుంద నివ్విడుచుటచె (1-90)

చదలఁదాఁకు బ్రూని మొదలు కుదులు పొదల
మెదలు తుమ్మెదల రొదలు కదలు నదులు
విదులు క్రొందావి విరిగుత్తి పదులుపొదలు
మొదలు తుదలేని ముదిగొండ మొదలు గంటి (2-39)
సురాంగన యంగవైచె
నంగ దట్టము విడివడ్డ నంగరాగ
మంగహారముచేఁ జాల నంగ వింప (2-40)

మున్నగునవి వారి శబ్దాలంకార రచనా వైచక్షణ్యమునకుఁ దార్కాణములు.

కుటిలకుంతలఁ జూచి కుటిలాత్మ కుందియ్యెఁ
గుటిల ప్రచారముల్ పెటిలుచుండ (4-43)

అను సీసము నందలి పదప్రయోగము వారి పాండితీ శౌండీర్యమునకు నిదర్శనము. ఈ విధముగాఁ గవిరాజుగారి కవిత యెంత స్వతంత్రమో యంత సరసమై సహృదయ హృదయానంద సంధాయకముగా విరాజిల్లుచున్నది. వారి రచనలన్నింట నేదో యొక నూతనత్వము గోచరించును. వారి భావములు నిశిత గంభీరములు; రచన మాత్రము మధుర మంజులము. వారి భావములు సంప్రదాయముపై నెంత దండెత్తునో వారి రచన దానినంతగా ననుసరించును. వారి నూత పురాణము పాత గుణములకు దొంతర.

—దివాకర్ల వేంకటావధాని

# క వి రా జు

1 గీ॥ రామరాజ్యముయొక్క నిర్వచనమేదొ ?
సర్వజనులకు నెన్నడు జాటకుండ
అట్టిరాజ్యము గోరుట యనుచితమని
శూద్రయోగి శంబుకవధ జూపినావు ॥

2 కం॥ కావ్యాంశము లన్నింటిని
సవ్యంబని యెంచుకొనుట శక్యమగుటచే
నవ్య పథంబును గవులకు
దివ్యముగా జూపినావు ధీరత్వముతో ॥

3 కం॥ యోగులు తెల్పిన దేశ. వి
భాగంబులయునికి గూర్చి పరిశోధనమున్
భౌగోళిక దృక్పథమున
సాగించెను సంతతంబు సర్వులుమెచ్చన్ ॥

4 కం॥ రామస్వామి కలవడిన
సాంఘిక దృష్టి. సంఘ సంస్కారంబున్
ఏమాత్ర మనుసరించిన
క్షేమము సిద్ధించి తీరు క్షితి నందరికిన్

— జి. జే. శామ్యుయెల్.

# నాస్తికుడుగా కవిరాజు

మతస్థులు మతవ్యతిరేకుల్ని మట్టుపెట్టడానికి వేసే ఎత్తుగడలు రకరకాలుగా వుంటై. నాస్తికుడైన బుద్ధుణ్ణి దశావతారాల్లో చేర్చి బౌద్ధమతాన్ని కాస్తా ఖూనీచేశారు. అలాగే ఆనాడు కవిరాజుగారిని నాస్తికుడని ఆడిపోసుకొన్న వాళ్ళే కొందరు యీనాడు ఆయనను ఆస్తికుడుగా చిత్రించడం కద్దు. ఈ రోజుల్లో నమ్మే అవకాశాలు లేకపోబట్టి సరిపోయింది, కాని లేకపోతే ప్రత్యేకంగా యీయనకోసం పదకొండో అవతారాన్ని సృష్టిచేసి వుండేవాళ్ళే యీపాటికి! ఏమైనా వాళ్ళు ప్రారంభించిన ప్రచారం కొంత పని చేయకపోలేదు. చివరకు కవిరాజుగారిని అభిమానించేవారిలో సైతం అక్కడక్కడ ఆయన ఆస్తికుడా, నాస్తికుడా అన్న మీమాంస రేకెత్తిందంటే అది మతస్థుల దుష్ప్రచారానికి ఫలితమే.

నాస్తికుడంటే వేద ప్రామాణ్యాన్ని ధిక్కరించేవాడనీ, దేవుడు లేనివాడనీ — రకరకాలుగా నిర్వచిస్తూ వుంటారు. వీటిలో యే రకమైన నిర్వచనాన్ని తీసుకొన్నా కవిరాజు నాస్తికుడే.

నాకు తెలిసినంతవరకు కవిరాజులో ఆస్తిక భావాన్ని లాగడానికి వీలైనచోట్లు రెండు మూడు కంటె లేవు. అక్కడైనా ఆయన భావ పరిణామాన్నో, మనోభావాన్నో, రచనా చమత్కృతినో గుర్తింపలేక పోవడం వల్లనే అలాంటి అపార్థానికి తావేర్పడుతున్నది. ఉదాహరణకు తన సూత పురాణము ప్రథమాశ్వాసంలో 'ఇష్టానిష్ట దేవతాస్తుతి' లో కవిరాజుగారు.

ఏది చరాచరం బయిన
          సృష్టికి సర్వము మూలకారణం,
బేది మునీశ్వర ప్రతతి
          కేనియగో చరమైన దొడ్డవె.
ల్గేది ల యాంతమం దయిన
          నించుక వైకృత మందకుండు, నే
తాదృశ నిత్యసత్య పర
          తత్వ మహత్వము నాశ్రయించెదన్.

అన్నారనుకోండి. దీన్ని పట్టుకొని యిందులోవున్నది ఆస్తికత్వం కాదా అంటారు కొందరు. మానవ సమాజ పరిణామ క్రమంలోవలెనే మానవ జీవితపరిణామ క్రమంలో కూడా మతరహితమైన బాల్యదశ అనంతరం, నేటి వాతావరణంలో, ఆస్తికత్వ దశ రావడం సహజం. దీన్నే ఒక వ్యక్తి జీవిత సర్వస్వంగా చిత్రించడం అవివేకం. కవిరాజు జీవితంలో కూడా ఆస్తికత్వం ఒకనాటి దశ కాకపోదు. పై పద్యంలోని 'పరతత్వం' ఆ దశలోని అత్యున్నత స్థితికి చెందిందే ననవచ్చు.

పై పద్యంలోని 'పర' శబ్దాన్ని ఒక్కదాన్ని మినహాయిస్తే చాలు, అందులోని దేవుడంతర్ధానమై పోతాడు. ఒకప్పుడొకాయన ఐన్‌స్టెయిన్‌ను అడిగాడు మీ దేవుడెటువంటివాడని. స్పినోజాగారి దేవుడే నా దేవుడని ఆయన జవాబిచ్చాడు. స్పినోజా 19 వ శతాబ్దంలో నివసించిన ఒక యూదు మేధావి. ఈ విశాల విశ్వంలో అంతర్యాప్తమైవున్న అద్భుతత్వాన్నే ఆయన ఆరాధించేవాడు. అంటే స్పినోజా దేవుడు దేవుడే కాదన్నమాట! అది పదార్థంలో యిమిడివున్న శక్తికి వినా మరేమికాదు. కవిరాజుగారి నిత్య సత్య పరతత్వం అలాంటిదే ననుకొంటే సరిపోతుంది. ఐన్‌స్టెయిన్ పరిభాషలో 'శక్తి' (Energy) అంటే విస్తృతమైన ద్రవ్యం (Matter); ద్రవ్యమంటే సంకుచితమైన శక్తి; అందుకనే విశ్వవ్యాప్తంగావున్నది కేవల ద్రవ్యమూ కాదు, కేవల శక్తి కాదు. దాన్ని ద్రవ్య-శక్తి, లేక శక్తి-ద్రవ్యం అంటాడు ఐన్‌స్టెయిన్. అలాంటి స్పష్టమైన భౌతిక శాస్త్ర దృష్టి కవిరాజులో లేకపోవచ్చు. కాని ఐన్‌స్టెయిన్‌ను ఆకర్షించిన స్పినోజా దృష్టి యిందులో కలదనడానికెట్టి సందేహమూ వుండనవసరంలేదు. పైగా కవిరాజుగారి యీ పద్యం 'ఎవ్వని చేజనించు ....' అన్న పోతన పద్యం ఫక్కీలో నడిచినా, యీ రెండింటికి ఒక ప్రధానమైన వ్యత్యాసం వుంది. పోతన పద్యంలో కర్త పుల్లింగం; కవిరాజు పద్యంలో కర్త నపుంసక లింగం. కాని పిత్రీయ కుటుంబ వ్యవస్థ (Patriarchal Family System) లో ఆధిపత్యభావంగా 'రాజు' తో బాటు పుట్టిన దేవుడు పుల్లింగంలోనైనా వుండాలి; లేదా,

'రాణీ' భావంతో ముడిపెట్టుకొన్న దేవతగా, స్త్రీలింగంలో నైనా వుండాలి. కాని కవిరాజుగారి ఆ దేవుడు పితృీయ మాతృీయ కుటుంబాలకు చెందని స్పినోజా దేవుడేనన్న మాట !

మూఢులు దేవుళ్ళు కుటుంబ వ్యవస్థలో పుట్టడం వల్లనే వాళ్ళకు కూడా మన కుటుంబ లక్షణాలు అలవడినై. మనకు వలెనే వాళ్ళలో కూడా ఆళ్ళూ, మొగళ్ళూ, పిల్లలూ జల్లలూ, జంజాటం యేర్పడ్డయ్. మనకువలెనే వాళ్ళకుకూడా రాగద్వేషాలూ, కోపతాపాలూ, సుఖదుఃఖాలూ వున్నై. అందుకే యీ దేవుళ్ళనుగూర్చి కవిరాజుగారు

ఇల్లును వాకిలిం గలిగి,
యిద్దరొ ముగ్గురొ ఆండ్రుగల్గి, పై
పిల్లలు జల్లలుం కలిగి
వెక్కసమైన కుటుంబ భారమన్
వెల్లువ నీదలేక, వల
వించెడి దైవత కోటి నా మొఱల్
మెల్లగ నాలకించి, లవ
లేశము ముక్తి నొసంగ జాలునే? (సూత-ప్రథమా)

అన్న సంశయంలో పడ్డారు; వెంటనే ఆయనకు సంశయ నివృత్తి అయింది. విష్ణువు, శివుడు, క్రీస్తు, మహమ్మదు మొదలైనవాళ్ళ వ్యక్తిగత గాథలను పేర్కొని,

వీరి పాల్పడి నే మొఱ పెట్టుకొన్న
చెంతకుం జేరి నాగోడు చెప్పుకొన్న

అర్తురా తీర్తురా అడియాస కాని
యిట్టి వారికి జోతలు పెట్టుటేల ? (సూత. ప్రథమా)

అని నదురు బెదురు లేకుండా యెలుగెత్తి చాటారు.

దేవుడు తనరూపంలో మానవుణ్ణి సృష్టి చేసినట్లు మతం—ముఖ్యంగా బైబిలు మతం—చెబుతుంది. కాని వాస్తవానికి మానవుడే తన రూపంలో దేవుణ్ణి సృష్టించుకొన్నట్లు బోధపడుతుంది. అందుకే మానవుని ఆకార వికారాలన్నీ దేవుళ్ళలో కనిపిస్తై. ఆశలు తీరని మానవుడు తన ఆశలు తీర్చగల దేవుణ్ణి కలగన్నాడు; కల్పన చేశాడు; అతగాడికి ముడుపులుకడుతున్నాడు; బలులర్పిస్తున్నాడు; లంచాలు పెడుతున్నాడు. అజ్ఞాని తన స్వార్థం కోసం యేమైనా చేస్తాడు. కాని,

ముడుపు కట్టినఁగాని సమ్మోదపడఁడు
వేట తలచూచికాని మోమోట పడఁడు
పోతరాజాదు. లేవెట్లు పూజనేతు
లంచగొండి తనమ్ము కాన్పించు చుండ ? (సూత. ప్రథమా.)

అని లంచగొండి దేవుళ్ళందరినీ ఒక్కమ్మాడి తుడిచివేశాడు కవిరాజుగారు. పోనీ తాను పూజచేయక పోవచ్చు; పూజలు చేసేవాళ్ళంతా పాపులట! చూడండి.

గుడికి తరచుపోయి గొణుగు చుండెడివాఁడు
చెడ్డపాపమేదొ చేసియుండు:
నదియె వానిఁబట్టి యట్టిట్లు పీడింప
గుడికి పోవునతడు కుప్పుసామి. (కుప్పుసామి శతకం)

చిల్లర రాళ్ళకు మొ్రొక్కితే చిత్తం చెడుతుందని

బ్రహ్మాంగారంటే, చిత్తం చెడినవాళ్ళే తరచు గుళ్లకు పోతూవుంటారని ఆయనను కొంచెం సవరించారు కవిరాజు గారు.

దేవుడొకడున్నాడనుకొన్నప్పుడు ప్రపంచంలోని మంచికీ, చెడ్డకీ ఆయనే కారకుడా అన్న ప్రశ్న వుదయిస్తుంది. చెడ్డకు కారణంకూడా దేవుడే అంటే. దేవుడు చెడ్డవాడుకూడా కావలసి వస్తుంది. చెడ్డకు కారణంకాని వాడు మంచికి యెలా కారణమవుతాడు ? అయితే అతడు దేనికీ కారణం కాదా? దేవుణ్ణి యీ ప్రమాదావస్థనుంచి తప్పించడం కోసమే కర్మసిద్ధాంతాన్ని కనిపెట్టారు హిందూ మతస్థులు. "అవశ్య మనుభోక్తవ్యమ్ కృతం కర్మ శుభాశుభమ్" చేసినకర్మ మంచిది కానీ, చెడ్డది కానీ, తప్పక అనుభవించి తీరాలి! ఈ కర్మానుభవానికి ఒక జన్మ చాలకపోతే మరో జన్మ! బుద్ధేకదా మానవుని ప్రత్యేకత ! కాని "బుద్ధిః కర్మానుసారిణీ". కనుక మానవుణ్ణి బుద్ధినడుపుతుంటే, బుద్ధిని కర్మ నడుపుతుంటుంది! దేవుడు — కర్మ యిద్దరు పెత్తనదార్లు తయారయ్యారన్నమాట!

విభుఁడొకఁడు చేయునంట పై పెత్తనంబు :<br>
కర్మమొకఁడు సంసార చక్రంబు త్రిప్పు<br>
నంట : : ద్వంద్వ ప్రభుత్వ మింద మరలేదే ?<br>
ఎంత కాలంబు సాగునో యిట్టి చిట్ట ?

(సూత-ప్రథమా)

అంటూ దేవుణ్ణీ, కర్మనూ యెద్దేవచేస్తారు కవిరాజు గారు. వేదాంతుల లెక్కలో సంసార చక్రాన్ని త్రిప్పేది

కర్మ కాబట్టి, దేవుడు నిష్ప్రయోజకుడు! కర్మమీద పెత్తనం దేవుడికే వుంటే, అది నియమం కాకుండానే పోతుంది! కర్మదోష మంటని నిర్జీవజగత్తుమీది పెత్తనం దేవుడే అట్టి పెట్టుకొని, జీవజగత్తుమీది పెత్తనం కర్మకు వదలివేశాడనుకుందామా? జీవత్వానికి ప్రాతిపదిక నిర్జీవ జగత్తులో వుంది; నిర్జీవ పదార్థం జీవజగత్తులోనూ వుంది. నిర్జీవ పదార్థానికీ, జీవపదార్థానికీ వున్న తేడా యించుమించు ఆగిన గడియారానికి ఆడే గడియారానికీ వున్న తేడా వంటిదే కదా! మరి అలాంటప్పుడు దేవుణ్ణీ, కర్మనూ ఎలా సమన్వయపరచాలి? ఎవరి పెత్తనం యెంతవరకో తెలియకుండా యెలా ప్రార్థించడం ?

చెవిటి దేవుఁ డొక్కఁడు పాప చెవుల దేవుఁ
డొకఁడు లోకపాలన చేయు చుండరట్టి
యెటుల ప్రార్థింప వలయునో యెఱుఁగరాదు
భక్తకోటుల ప్రాణాల పైకివచ్చె. (సూత చతుర్థా)

అంటూ సమస్యను స్పష్టంగా మనముందుంచుతాడు కవిరాజుగారు తానొక పెద్ద భక్తుడైనట్లు! తనకొక పెద్ద చిక్కు వచ్చిపడ్డట్లు!

పరిణామక్రమంలో ఆస్తికత్వం యొక్క అత్యున్నత దశ ఏకేశ్వరవాదమే. ఈ వాదం యిలాంటి ద్వంద్వ ప్రభుత్వాన్ని సమర్థించదు. అలాంటప్పుడు అన్నిటికీ కారణమైన దేవుడు మానవ సంఘంలో అవకతవకల్ని యెందుకు

సృష్టిచేసినట్లు? అవినీతి కార్యాలను యెందుకు సమర్థిస్తున్నట్లు? ఒకవైపు కఠినాత్ములైన కాంతులతో కాపురం చేయలేక కుమిలి చస్తున్న కులకాంతలు! మరోవైపు గయ్యాళి భార్యలతో కడగళ్ళ పాలవుతున్న అమాయక భర్తలు! అందుకే

పరమ సుశీల : బాలసుని
    పాలొనరింతువు; మూర్ఖురాలినో
సరసుని పాలుజేసెదవు;
    స్వామి: యిదేమి? ప్రపంచమెల్ల దు
ర్భరతర దుఃఖ భారమున
    గ్రుగ్గుచు నుండఁగఁ గాంచి యెంతయో
ముఱి సెదవా? యిటైన నిను
    భూస్థలి నమ్మెడు వారలుందురే? (సూత. చతుర్థా)

అని దేవుణ్ణి సూటిగా ప్రశ్నిస్తున్నారు కవిరాజుగారు. ఈ ప్రశ్న దేవునిపట్ల తన అపనమ్మకానికి ప్రతిధ్వని తప్ప మరేమీ కాదు.

ఒకవేళ దేవుడు గుళ్ళల్లో, గోపురాల్లో, తీర్థాల్లో, సిద్ధుల్లో, తల దాచుకోవడంవల్ల లోకం పోకడ ఆయన దృష్టిపథానికి రా లేదనుకుంటే—అప్పుడాయన దేవుడెలా అవుతాడు? అలా భావించడం దైవదూషణ కాదూ? అందుకే తీర్థయాత్రలకు యెగబడే వెర్రి జనానికి కను విప్పుగా కవిరాజుగారు దేవుణ్ణే అడుగుతున్నాడు:

అఖిల భువన సంవ్యాపకుఁ డంచుబుధులు
నుడువుచుందురు పినుగూర్చి నోటినిండ;

అదియె నిజమైనచోఁ దీర్థయాత్ర లెల్ల
భగవద పచారములుగావె? పరమ పురుష! (సూత. చతుర్థా.)

ప్రతి మతం ప్రపంచానికి అతీతమైన భగవత్తత్వాన్ని విశ్వసిస్తుంది. ఆ యా భగవంతుళ్ళు ఆ యా మతాలకు ప్రత్యేకంగా ప్రమాణ గ్రంథాలను ప్రసాదించారు! ఈశ్వరీయాలూ-అపౌరుషేయాలూ అయిన అలాంటి గ్రంథాలనేకము. అవి లేకపోతే మతాలేలేవు. అవి ఒకదానితో ఒకటి యేకీభవిస్తున్నవా అంటే-లేదు; పోనీ అవి అంతర్విరుద్ధాలు లేకుండా తర్కబద్ధంగా వున్నవా అంటే అదీ మృగ్యం. ఎక్కడ చూచినా గజిబిజి! తికమక! అందుచేతనే కవిరాజుగారు నిజం చెప్పరాదంటయ్యా యేడిపించక అని దేవుణ్ణి నిలవేస్తారు.

ఒకరుడు వేదమే భగవ
దుక్తమటంచు నుపన్యసించు; వే
రొకరుడు బైబిలే భగవ
దుక్త మటంచును వక్కణించు; నిం
కొకరుడు మా ఖొరాన్ భగవ
దుక్త మటంచును వాదులాడు; నీ
తికమక లేల పెట్టెదవు
తెల్పఁగరాదె నిజంబు నీశ్వరా! (సూత. తృతీయా)

కవిరాజుగారు యీ అభ్యర్థన చేసి యింతకాలమైనప్పటికీ వినిపించుకోలేదంటే ఆ దేవుడు మనుషుల మొరలు చెవి దూరనంత దూరంలో వుంటున్నాడన్నమాట! అంతటితో కవిరాజుగారు వదలిపెట్టారా దేవుణ్ణి?

మతమని వంకపెట్టి కను
　　మాలపుఁ గట్టుపకానులెందఱో
కుతుకలు బట్టి కోసకొనఁ,
　　గూడ దటంచును బుద్ధిచెప్పి, ఖం
డితముగ వారివారి యవి
　　నీతుల మానిపి, యేల సాధులన్
బ్రతుకఁగ నీవు దేవ ? ఒక
　　వారము పాటయినన్ బ్రశాంతిగా　　(సూత. తృతీయా)

అని, అవినీతిపరులైన మత దురహంకారులను శిక్షించి నీతిపరులైన మానవతా మూర్తులను రక్షింపలేని దేవుని అత్యాచారాన్ని వేలెత్తి చూపారు. అయినా దేవుడు కదలలేదు; మెదలలేదు. కవిరాజుగారి సాహసానికి నివ్వెరపాటుతో మ్రాన్పడి పోయాడేమో! చేతనత్వముడిగి జడత్వం పొందాడేమో! ఇక యీ దేవుడికి మంచిగా చెబితే లాభం లేదనుకొన్నారు కవిరాజుగారు. పైగా ఉచ్చ నీచతాభేదాలతో వర్ణవ్యవస్థను కల్పించడం, 'అగ్రజాతుల' ఆధిపత్యాన్ని ఆమోదించి, 'అల్పజాతుల' ఆత్మగౌరవానికి ఆఘాతం కలిగించడం—ఇలాంటివే యెన్నో! దేవుని దురంతాలు మితిమీరి పోతున్నై. సహింపలేకపోయారు కవిరాజుగారు.

తగవు నెఱింగి పల్కని య
　　దంతరులన్ సృజియింపనేల ముం
దుగ ? సృజియించినావు సరె
　　తోఁచియొ తోఁచకొ నేనిఁ గోరి యీ
జగమున వారినే కొలము
　　సాములఁ జేసితి ? వింక మీదనే
పగిదిని నీ ప్రపంచ పరి
　　పాలన సాగునో నేను చూచెదనే.

అని తోడ చరచి దేవుడితో స్వయంగా కుస్తీపట్ట డానికే తారసిల్లారు. కవ్వించి కాల్దువ్వే కవిరాజుగారి కని కానరాని దేవుడు కాలికి బుద్ధిచెప్పాడు. అంతటితో కవి రాజుగారికి ఆస్తికత్వమంటేనే అలుసైపోయింది. విశ్వనాథ సత్యనారాయణగారి "వేనరాజు" నాటకానికి పోటీగా "ఖూనీ" నాటకం వ్రాసేనాటికి ఆయనలో నాస్తికత్వం పరాకాష్ఠ చెందింది.

చేసినదోస మీశ్వరుని
 చింతనచే నశియించునన్న వి
శ్వాసముకల్గి రేబవలు
 పాపమొనర్చుచు తిరినప్పుడే
దో సమయమ్మునన్ కలముఁ
 దొందరగాఁ గొని రామకోటినిన్
వ్రాసెడి భక్తకోటి పద
 పంకజముల్ శరణంబు వేడెదన్. (సూత. ద్వితీయా)

అని యేనాడో 'జోతలు' రూపంలో వ్యంగ్యంగా భక్త కోటిపై విసిరిన విసురు తన నిజరూపంతో "ఖూనీ" తొలి పలుకుల్లో ప్రత్యక్షమయింది :

"ఈశ్వర ధ్యానముచేఁ పాపపరిహారము కల్గునను విశ్వాసము దోషాచరణమునకు దోహదము చేయు చుండునా? అస్తికత్వము ప్రపంచ పరిణామమునకు నాటంకములు గలుగఁ జేసెనుగాని, తోడ్పడ లేదని గట్టిగఁ జెప్పవచ్చును. నేడు ప్రపంచమున నున్న

150 కోట్ల * ప్రజలయందు నాస్తికులే యెక్కువగ నున్నారని యెఱింగినచో భగవంతుఁ డెట్టి దుర్గతి పాలగుచున్నాఁడో తెలియఁదగును."

బౌద్ధుల్నీ, మతంలేని వాళ్ళనీ, చెట్లు చేమలు పూజించే వాళ్ళనీ, కమ్యూనిస్టుల్నీ, ప్రతి మతంలోనూ పెచ్చుపెరుగుతున్న నాస్తికుల్నీ లెక్కవారిగా చూపిస్తూ తన లెక్కలు సమర్థించుకొన్నారు కవిరాజుగారు. చరిత్రలో దేవుని పేరిట మతం జరిపిన క్రూరకృత్యాల నెన్నిటినో పేర్కొని,

"భగవంతుఁ డొకఁడున్నచోఁ దనపేర జరుగుచున్న యత్యాచారములనైన మాన్పనోల్లఁడా ?"

అని ఆక్రందించారు. లేని భగవంతుడేమి మాన్పగలడు ?

తమ భవితవ్యానికి తామే కర్తలమన్న ఆత్మ విశ్వాసంలేని అజ్ఞానులే పరవిశ్వాసాలను పట్టుకొని ప్రాకులాడుతారన్న సత్యం కవిరాజుగారి ఈ క్రింది మాటల్లో ప్రకటితమవుతున్నది :

"ప్రజాసామాన్య మజ్ఞానాంధకార బంధురముగా నున్నప్పు డుబుసుపోకకో, చిత్త శాంతికో దేవుఁడను మాఱాకొకటి కావలసి యుండును. ప్రజలు జ్ఞాన చక్షువులం దెఱచి, తములోఁదాము తర్కించుకొను

---

* క్రీ. శ. 1955 కు పూర్వపు లెక్కల ప్రకారం.

చున్నకొలది భక్తి విశ్వాసములు నశింప భగవంతుఁ
డున్నాఁడా లేఁడాయను తర్క వితర్కములు బయలు
దేరుట సహజము." ("ఖూనీ"-లోలిపలుకులు)

కవిరాజుగారు తన జ్ఞాన చక్షువుల్ని తెరిచి చూచారు. తనలో తాను తర్కించుకొన్నారు. మనిషికి ఒక జీవితం వున్నట్లే దేవుడికి కూడా ఒక జీవితం కనిపించింది. మానవ పరిణామ చరిత్ర నధ్యయనం చేశారు కవిరాజుగారు. జ్ఞాన మార్గంలో పరిణామం చెందుతూ వస్తున్న మానవునితో పాటు మానవసృష్టి అయిన దేవుడుకూడా పరిణామం చెందుతూ వచ్చినట్లు ఆయనకు స్పష్టమయింది.

"మానవుఁడు మృగదశలో నున్నప్పుడే కొండ
గానో, యేయేరుగానో వెలసిన దేవుఁడు, మానవ
విజ్ఞానము పరిణామముఁ బొందుచున్న కొలంది, భగ
వంతుఁడేరు, కొండల రూపమును వదలి, మృగమై,
మృగమునుండి, మనుష్యుఁడై, మనుష్య దశనుండి
యదృశ్యరూపుఁడై, నిరాకారుఁడై, నిరంజనుఁడై,
నిర్వికల్పుఁ డయ్యెను. ఇఁకఁ దరువాతి గతిశేమి?
శూన్యత్వము అనఁగా నాస్తికత్వము. ఇదియేమూఢ
మానవ ప్రతిపాదితుఁడైన భగవంతునకు నేఁడు
వాటిల్లు చున్నదశ." ("ఖూనీ"-లోలిపలుకులు)

అని ముక్త కంఠంతో చాటారు కవిరాజుగారు అంతే కాదు.

"ప్రార్థించినంత మాత్ర, సేవించినంత మాత్ర,

కైంకర్యము చేసినంతమాత్ర భగవంతుఁడు ప్రీతుఁడై, సిరిసంపదలిచ్చి, పరలోకసౌఖ్యములు గల్పించు ననుట నమ్మదగిన దేనా? ఇట్టివి యెన్నఁడు నెచ్చట జరిగియుండలేదు. ఇయ్యది మానవహృదయ దౌర్బ ల్యమును సూచింపక తప్పదు. ఈ ప్రార్థనలు, ఈ సేవలు, ఈ కైంకర్యములు స్వాతంత్ర్యమును గోల్పుచ్చి, పురుషకారమును నశింపఁజేసి, మానవు లను నంబేదలగు బానిసలనుగా జేయుట కుపకరించును గాని మఱెందులకుఁ గొఱగావు.''

(''ఖూనీ'' - తొలిపలుకులు)

అన్నారు. కవిరాజుగారి యీ పలుకులు చదువుతుంటే ''పంచతంత్రం''లోని విష్ణుశర్మ సూక్తులు గుర్తుకు వస్తున్నై ఆయన ఒకపాత్ర చేత యిలా అనిపిస్తాడు :—

''ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీ
దైవేనదేయమితి కాపురుషాః వదంతి
దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా
యత్నే కృతేయది నసిధ్యతి కోఽత్రదోషః''

[ప్రయత్నం చేసేవాణ్ణి విజయలక్ష్మి వరిస్తుంది. కాదు, అది దైవంవల్లనే సిద్ధిస్తుందని నీచులు చెబు తుంటారు. దైవాన్ని రూపుమాపి బుద్ధిబలంతో పురుష ప్రయత్నం చెయ్యి. చేసిన ప్రయత్నం ఫలింపదా, అందులో తప్పేముంది.]

"య దభావి నతద్భావి
భావిచే న్నత దన్యథా
ఇతి చింతా విషఘ్నోఽయ
మగదః కిం నపీయతే"

[ 'కాసిది కానేకాదు; కానున్నది కాకమానదు'
అన్న విచారమే విషపూరిత మైనది. అలాంటివిషం
సోకినవాడు విరుగుడుకు మందు యెందుకు పుచ్చు
కోడు? ]

మిథ్యాదైవానికీ, పురుషకారానికీ యెప్పుడూ చుక్కెదురే. లేని దేవుణ్ణి వున్నాడనుకుంటూ, వున్న ప్రకృతిని లేదనుకుంటూ యెండమావుల్లో విహరించే అల్పబుద్ధులకు ప్రపంచం మిథ్య; జీవితం నిస్సారం. పైగా మిథ్యా దైవానికి అర్పణ అయిన మనస్సులు తోటి మానవుల్ని ప్రేమించలేవు; లేని పై లోకాలు యెటూ దక్కవు సరిగదా, వున్న ఈ లోకాన్నిగూడా చేజేతుల వదలుకుంటారు దైవభక్తులు. అంటే రెంటికి చెడ్డ రేవళ్ళు అవుతారన్నమాట! అందుకే కవిరాజుగారు,

"భగవంతునిఁ బ్రేమించుటకన్నఁ దోటిమానవులఁ
ప్రేమించుట పరమోత్తమంబు."

అని ఆ తొలిపలుకుల్లోనే తీర్మానించారు.

"ఖూనీ" నాటకంలో కథానాయకుడు వేనరా మరెవరో కాదు — కవిరాజే. వేనరాజు మునిపల్లెలో అడు

వేసిన యాగం కవిరాజుగారు తెనాలిలో మునిసిపల్ చైర్మన్‌గా వున్నరోజుల్లో ఆపివేసిన యాగమే. వేనరాజును ధిక్కరించిన గౌతమ శునశ్శేఫాదులు ఆ సందర్భంలో కవిరాజుపై కన్నెర్రచేసిన యాజక ప్రవరులే. వేనరాజును వారు ఖూనీ చేశారు; కవిరాజును వీరు పలురకాల ఖూనీ చేయ యత్నించారు. అందుకే తన తొలి పలుకుల్లో కవిరాజుగారు "ఇది నా 'ఖూనీ' జన్మకథనము" అని నర్మగర్భితంగా పేర్కొన్నారు. ఆ రోజుల్లో తనకూ, ఆ బ్రాహ్మణోత్తములకూ మధ్య జరిగిన వాగ్యుద్ధాన్నే వేనరాజుకూ, గౌతమాదులకూ మధ్య జరిగిన సంభాషణల్లో చక్కగా చిత్రించారు.

"భగవంతుఁ డొకఁడున్నచో నోరు వాయిలేని ఈ మేఁక మాంసమును గోరునా?"

అని వేనరాజుచేత గౌతమునికి చెప్పించారు. "ఋషి తిరస్కారము నరకలోకమునకు దారితీయు" నన్న శునశ్శేఫునితో వేనరాజు,

"ఎచ్చట నున్నది? ఎంతదూరములో నున్నది యా నరకలోకము? నీవుగాని, నీ గురు పరంపరలో నెవరయినఁగాని యెప్పుడయినఁ జూచివచ్చితిరా, మాటిమాటికి నెరిఁగియున్నట్టు మాటలాడుచుంటివి?"

అని ఆధునిక ఖగోళశాస్త్ర సారాంశాన్ని పరాచకంగా ప్రకటిస్తాడు. అలా పరలోకాలను తిరస్కరించడంద్వారా

దేవుడుకి తన పెళ్ళాం పిల్లలతో కాపుర మూ గేగడానికి జాగాలేకుండా చేశారు కవిరాజుగారు. అంతేకాదు, మరొక చోట శునశ్శేఫునకే సమాధానమిస్తూ వేనుడు,

"జీవహింస సల్పుచున్నందులకు మీకు స్వర్గము, దానిని బాపుచున్నందులకు నాకునరకము! ఈ దేవుని మీరు క్రొత్తగా సృజించినట్లున్నది. ఈ దేవుడు తన ధర్మమునుగూడ మఱచువాఁడుగ నున్నాడు."

అంటూ దేవుడికే కర్త వ్యాన్ని నిర్దేశిస్తాడు. భగవంతుణ్ణి పరిహాసించినందుకు గౌతముడు కల్పించుకుంటాడు. అతనికి వేనరా జిచ్చిన జవాబులో భౌతికవాదం తొంగిచూస్తున్నట్లుంది.

"దృగ్గోచరుఁడు కానివాఁడును, మానవులచే సృజింపబడినవాఁడును సృష్టి స్థితి లయకారకుఁడేమి? సృష్టి స్థితి లయములు స్వభావజన్యములు కావా?"

అంటాడు వేనుడు. అలా వేనరాజు పాత్రద్వారా ప్రకృతి యొక్క స్వయంకారణతపట్ల, స్వయం సంపూర్ణతపట్ల తన కున్న ప్రగాఢ విశ్వాసాన్ని ప్రకటించారు కవిరాజుగారు. దీనితో నాస్తిక వాదపు చరమదశ అయిన భౌతికవాదం యొక్క పొలిమేరల్లో పడ్డారు.

దేవుడు నిష్ప్రయోజకుడుకాడనీ, సర్వ కర్మలకు సాక్షి అనీ గౌతముడన్నదానికి సమాధానంగా

"కూట సాక్షియా? ఎందులకీ సాక్షిత్వము? తన కట్టెదుట జరుగుచున్న క్రూరకర్మల మాన్పనేరక

సాక్షి యగుచున్నాఁడా? ఏమి చిత్రము! ఈ సాక్ష్య
మెవ్వరి యెదుట నుపయోగపడును? ఎవ్వరికిఁ
బ్రయోజనకారి యగును? విచారణకర్త యెవ్వరు?"

అని పలికిన వేనుని మాటల్లో మనకు కవిరాజుగారు తన బారిష్టరు హోదాలో ప్రత్యక్షమవుతారు.

'నీవు పాషండుఁడవు; నీకు సుగతులు లేవు' అని శాపనార్థాలు పెడతాడు గౌతముడు. అలాంటి వేషాలు వేనుని వద్ద సాగుతాయా?

"నీ బెదరింపులు దుర్బల హృదయునిఁ గలఁగింప
నోపు. నావంటివానిని కాదు. లోకముఁ గన్నప్పి
మీ దుర్వ్యవసాయమునకుఁ దోడ్పడ భగవంతు
నొకని సృజించి లేనిపోని సర్వశక్తులు వాని కంటఁ
గట్టి జగమును నుర్రూతలూప యత్నించు చుండిరి.
మీకా సుగతులు, నాకా లేనిది?"

అన్న వేనుని సమాధానంలో కవిరాజుగారిలోని ఆత్మ విశ్వాసం పరవళ్ళు త్రొక్కుతుంది. 'రాతిగుండియరా కవిరాజ నీది' అన్న కవిబ్రహ్మ ఏటుకూరి మాటలు చెవుల్లో రింగుమంటై.

'మహాపాతక హేతువులగు నీ మాటలు వినఁజాల' నంటాడు గౌతమునిలోని తెనాలి యాజకుడు: వేనునిలోని కవిరాజు విజృంభిస్తాడు:

"చేయఁగల్గుదువు కాని విన లేవు. నిజముగ నీవుసృజిం
చిన భగవంతుఁడు కాఁడా? నీ యవసరముకొలఁది

నీ భగవంతుని యవతారము లెత్తించలేదా? వేష
భాషాదులు మార్చలేదా? ఒకప్పుడు నిరాకారుఁ
డంటివి; ఒకప్పుడు సాకారుఁడంటివి; ఒకప్పుడు భీక
రాకారుఁడంటివి; ఒకప్పుడు వికారుఁడంటివి. ఒక
ప్పుడు నరమాంసము, వేరొకప్పుడు గోమాంసము,
యింకొకప్పుడు మృగ మాంసము, మరియొకప్పుడు
ఫల పత్ర పుష్పాదులు భోజ్యమంటివి. నీ బుద్ధి
భ్రమణముతోఁ బాటు భగవంతుని యాకార భాషా
భూషా విశేషాదులు మారలేదా? మారుచుండుట
లేదా? ఏల సత్యమును మరుగు పుచ్చెదవు?"

కొండవాగులాగా దొర్లుకుంటూ వచ్చిన ఈ భావ పరంపరకు గౌతముడు తట్టుకోలేక నాస్తికునితో ప్రసంగం పాపహేతువని తప్పుకుంటూ వేనుణ్ణి వెళ్ళిపొమ్మంటాడు. ఆస్తికుల అత్యాచారాలకు ఆహుతైన అహింసావాదు లందరి తరఫున వకాల్తా పుచ్చుకున్నాడేమో అన్నట్లు బారిస్టరు కవిరాజుగారు వేనునిలో దూరి,

"నేను నాస్తికుఁడనైన లోకమునకుఁగల్గు నష్టమేమి?
నేనేమయిన లోకద్రోహముఁ జేయుచుంటినా, లోక
ప్రతారణముఁ జేయుచుంటినా? పరహింసాచరణ
మునకుఁగడంగి లోకమును దుఃఖభూయిష్టముగాఁ
జేయుచుంటినా? నాస్తికతయే, పాపహేతువంటివి.
పాపమనఁగా నేమి?"

అంటూ కవిబ్రహ్మ అన్నట్లు 'నాకొక బాకుగా విసరి'

వేస్తాడు. అవి గౌతమునికి గుండెల్లో గాఢంగా నాటుకుంటై; నోట మాటపెగలదు; ప్రశ్నకు బదులుండదు. కవిరాజు గారు ఆనాడు వేసిన ప్రశ్నకు ఈనాటి గౌతములుకూడా జవాబు చెప్పలేకుండా వున్నారు. దానికి సరైన జవాబుంటేగా!

* * * *

కవిరాజుగారి వ్యంగ్య ధోరణిని అర్థంచేసుకోలేని అల్పజ్ఞులు కొందరు ఆయన అర్థాలకు అపార్థాలంటకడుతూ వుంటారు. ఉదాహరణకు తన 'భగవద్గీత' ప్రారంభంలో

శంకరుని యంత వేదాంత శాస్త్రవేత్త
అనియెగా 'అహం బ్రహ్మోఽస్మి' యనుచుఁగాన
నాకు నేనె నమస్సు లొనర్చుకొందు
నాది మధ్యాంత శూన్యంబ నైతినంచు.

అని ప్రార్థనచేశారనుకోండి. అంతమాత్రాన కవిరాజుగారు అద్వైతవాదిగా మారి, శంకరమతం పుచ్చుకున్నాడంటామా! కాదు. శంకరాచార్యులంతవాణ్ణి తెలివిగా మోసం చేసి, ఆయన అన్ని తంటాలుపడి ఆవిష్కరించిన అద్వైతాన్ని తన అవసరానికి వాటంగా వాడుకొన్నారు కవిరాజు గారు,

అంతేకాక, తన అవసాన దశలో కవిరాజుగారు ఆస్తికులుగా మారారని చెప్పి ఆత్మశాంతి పొందాలనుకొనే వాళ్ళు ముఖ్యంగా ఒక పద్యాన్ని ఉదహరిస్తారు:

నే వచ్చి నీకు కలలో
వారివి చెప్పినవి యెల్ల వ్రాయుట కతనన్
నీవే ధన్యుఁడవైతివి
రావోయీ; త్రిపురనేని రామస్వామీ!

ఈ పద్యం 'ధూర్త మానవా' అని కవిరాజుగారు రచించిన పద్యాలలో చివర ముద్రింపబడింది. అదీ బహుశా కవిరాజుగారి అనంతర మనుకుంటాను. ఈ పుస్తకం 'మానవా' అన్న మకుటంతో వృత్తాల్లో సాగింది. కాని ఈ ఒక్క పద్యంమటుకు కందం. అంతేకాకుండా అన్ని పద్యాలలోను ధూర్తమానవుణ్ణి వుద్దేశించి పలికిన దేవుడు యీ ఒక్క పద్యంలో కవిరాజుగారి నుద్దేశించి పలికాడు. కనుక యిందులో ఏదో ప్రత్యేకత వున్నదన్నమాట! పైగా దేవుడు కలలోవచ్చి చెప్పడం! చెప్పిన పద్యాలన్నీ తనవేనని రూఢి చేయడం! ఇక ఈ వ్యంగ్యాన్ని అపార్థం చేసుకోవలసిన పని యేమిటో అర్థంకాదు. ధూర్తమానవుణ్ని ఉద్దేశించి దేవుడు పలికిన పలుకులు అసలు దేవుని వునికినే త్రోసివేస్తున్నయ్. చూడండి!

ప్రతి వర్షంబును నా వివాహ మను పే
 రన్ పెక్కుచందాల దు
ర్మతి! చందాలు వసూలు చేసి ప్రతి యూ
 రన్ గజ్జె కట్టింతువా?
గతి యీ మాత్రము లేదెనా? కరెరె! నేఁ
 గావించుకోలేనె? యీ
గతి నన్నీవు పరాభవించుటకు సం
 కల్పింతువే? మానవా!

కవిరాజుగారి ఈ పద్యం తన సూతపురాణం ద్వితీయాశ్వాసం లోని

మలమల మాడుపొట్ట తెగ
　　మాసిన బట్ట కలంత వెట్టగా
విలవిల యేడ్చుచున్న నిరు
　　పేదకు జాలనిఁ జూపకుండ ఉ
త్తల పడిపోయి జీవ రహి
　　తంబగు బొమ్మకు నిండ్లు వాకిళల్
బొలమునుఁ బొత్ర నిచ్చెడి ప్ర
　　బుద్ధ వదాన్యుల నిచ్చ మెచ్చెదన్.

అన్న 'జోతలు' పద్యంలోని వ్యంగ్యానికి పరాకాష్ట. అంతే కాదు, సృష్టి స్థితి లయాలకూ తనకూ ఏమీ సంబంధం లేదని దేవుడే చెప్పుకుంటున్నాడు!

ఏబదునాల్గు లోకములో
　　సృష్టి యొనర్చుఁ బెంచి పిమ్మటన్
దూబవలెన్ హరింతునని
　　దొంగ నుడుల్ వచియించు చుంటివే?
ఏబది మాట లేమిటికి?
　　యిట్టి ప్రచారము మానకున్న చో
గూబలు సాగఁ దీసెదను
　　కూయకు మిట్టివి ధూర్త మానవా!

అని దేవుడే తనను సృష్టిచేసిన ధూర్త మానవుణ్ని అధిక్షే పిస్తున్నాడు!

ఇలాంటి ఆణిముత్యాలు తన పేరిట కవిరాజుగారి

చేత పలికించిన దేవుడు 'కలలో' దేవుడన్న సంగతి మరచి పోతే తమను తామే మరచి నట్లవుతుంది. కలలో దేవుడంటే కల్ల దేవుడన్నమాట! కవిరాజుగారి దేవుడు కల్లదేవుడు కాక మరేమిటి ?

ఈ కల్లదేవుడే కల్పితదేవుడై బ్రహ్మనాయుడుగా మారి, బాలచంద్రునికి గీతోపదేశం చేశాడు;

ఈ పితృలోకపు విషయం
బీ పిండ నివాప వారి వృత్తాంతం బే
పాపాత్ములు బోధించిరి
ఓ పుత్రా! బుద్ధి జాడ్య ముదయింపంగన్

అని పితృలోకాలు లేవు, పిండాకూళ్ళు లేవు పొమ్మన్నాడు. వర్ణ వ్యవస్థను సమాజ పరిణామ రీత్యా వ్యాఖ్యానించి,

ఈ పరిణామవాదమును
నెవ్వడు నమ్మక మూఢబుద్ధి నా
మూఁపున నుండి యొక్కరుఁడు
మోముననుండి యొకండు తప్పవా
రాపయి నాదు గిజ్జలను
హజ్జలఁ బుట్టిరియంచుఁ జెప్పు నా
పాపికి ముక్తి చేపడదు
బాలుఁడ! జన్మము లెన్ని యెత్తినన్

అని శపించాడు. ఈ సమాజ పరిణామవాద సమర్థనతో 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణ కర్మ విభాగశః' అని అర్జునునికి గీతోపదేశం చేసిన శ్రీకృష్ణ పరమాత్మనూ, 'బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ బాహూ రాజన్య కృతః

ఊరూ తదద్వయాద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత' అన్న ఋగ్వేద పురుషసూక్త ఋక్కుకూ కలిపి ఒక్కసారే గోరీ కట్టాడు.

మతమనుమాట మోసము సు
మా! యిదె మూలము ధర్మపీడకున్

అని బ్రహ్మనాయుడులోని దేవుడు బాహాటంగా చాటాడు. ఇంకెక్కడి దేవుడు? ఇంకెక్కడి మతం?

హిందూమతంలో వేదాలకు దక్కని మర్యాదను భగవద్గీత చిక్కించుకున్నది. అందుకనే భగవద్భక్తుల పోజు పెట్టే నిలువుబొట్టువాళ్ళుగానీ, అడ్డబొట్టువాళ్ళుగానీ హస్తభూషణంగా భగవద్గీతను పట్టడం పరిపాటి అయింది. అలాంటివాళ్ళనుగూర్చి తన 'కుప్పుసామి' శతకంలో కవిరాజుగారు మనస్తత్వ వివరణతో చక్కని తీర్పు యిస్తారు:

పాతకునిచేత నెప్పుడు 'గీత' యుండు
మొగమునన్ వింత వింతగ బొట్టులుండు
చిన్నె లివియె మనస్సాక్షి సన్నగిలిన
యప్పుడు జనాళి కెందును కుప్పుసామి.

అంటారు. (కృష్ణగీతకు బ్రహ్మగీత భిన్నముండే కాకపోతే యీ పద్యంలోని 'గీత' శబ్దం దీనికైనా వర్తింపక తప్పదు!) చూచారా, ఆస్తికులన్నా, ఆస్తికత్వమన్నా కవిరాజుగారి కెంత గౌరవమో!

* * * *

తెలుగు సాహిత్య చరిత్రలో కనీ వినీ యెరుగని

ధోరణిలో వ్యంగ్య రచనను కవిరాజుగారు దక్కించుకున్నారు. ఈ దృష్ట్యా ఆయన సూతపురాణమేమి, ధూర్తమానవా మేమి, భగవద్గీతయేమి— చెకుముకి రవ్వలు! చెకుముకిరాయి కవిరాజే! చెకుముకి రాయిని చేబట్టడం చేతకాకపోతే రవ్వలు రేగవు: కవిరాజుగారి అంతర్యం అంతుపట్టకపోతే ఆయనలోని వ్యంగ్య సౌరభం దక్కదు. ఆ సౌరభాన్ని ఆఘ్రాణింపలేని అభాగ్యులకు కవిరాజు ఆస్తికుడుగా కనపడడంలో ఆశ్చర్య మేముంది?

ఓ కవిరాజ! తావక మ
హోజ్జ్వల వాక్చతురత్వ తత్త్వ మం
మందాకిని రాజహంసల వి
ధమ్మున భావవికాస వీచికా
నీకము నందుఁ దూగునెడ
నెమ్మది నిద్రయు నన్నపానముల్
జేకొన నిచ్చగింప; దెటు
చేసితి వీ రసవత్ప్రబంధముల్?

— ఎన్. వి. బ్రహ్మం.

# క వి రా జు

కవియేగాదు స్వతంత్ర జీవిత కళాగాండీవి. సంఘ ప్రజో
ద్భవ సంత్రాస నిరంతరేరిత దురభ్యాసాంధ కార ప్రభా
రవి. నిర్నిద్ర కవిత్వ తత్త్వ విభవత్ రాజ్యైక సంవర్తి త్రో
త్సవ నూత్నాంధ్ర పథానుజీవి. కవిరాజ న్మూర్తి నిక్కంబుగన్.

కులమున పేరిటన్ మనుజ కోటికి నార్తిని గూర్చు వేద ఋ
క్కులకు వినూత్న భాష్యమిడి సామ్యవివాద ప్రబోధ మార్గము
జ్వలమతి జాటనిల్చిన ప్రజాకవి. మా కవిరాజు ఛాయలో
నిలిచిన ఆంధ్ర పుత్రులకు నిండు మనమ్మున స్వాగతాంజలుల్

అదియొక భావవిప్లవము ఆంధ్రధరా తలమందు సాహితీ
పథమున నుప్పతిల్లె ప్రతిభా సముదంచిత దీప్తిరేఖలో
పొదలుచు నల్లనల్లన నపూర్వ కళావిభ వాభిరామమై.
సుధలను జిమ్మగల్గినది నూతపురాణ మనంత యోగ్యమై

ప్రాతయు క్రొత్తయున్ కలిసి పాకమునంబడి ధీజనోత్తర
వ్రాతము మెచ్చ భావబల బంధురతన్ సృజియించి మించె నీ
నూతపురాణ కావ్యరస సుందర సృష్టిని. రామస్వామి వి
ఖ్యాత చరిత్రుడార్య గుణగణ్యుడు నూత్నపథానుగామియై.

కలియుగమందు మాధవునిగా నుతికెక్కిన పల్లెనాటి బ్ర
హ్మలసద పారభావసుషమావిక సన్నవ శోభనమ్ములో
వెలయగ జేసెగీతనొక విస్తృత వృత్తిని. వ్యాస సంహితా
బలమునకైన నిల్వగల పాండితితో విజయాభిలాషియై.

తన విజ్ఞానము సర్వలోక జనతా ధర్మమ్ములం స్వాంతమం
దున జీర్ణమ్ము లొనర్చు కొన్నయదికాదో; విశ్వ కల్యాణల
బ్ధిని గాంక్షించి మహోదయాంధ్ర కవితా పీయూషధారోరు వా
హిని. నల్దిక్కుల పర్వులెత్తినది సాహిత్యాంధ్ర శాఖారతిన్

— షేక్ అలి.

# పౌరాణికుడుగా కవిరాజు

కవిరాజు కవి, నాటకకర్త, విమర్శకుడు, సంఘ సంస్కర్త, భావ విప్లవ విధాత—ఇలా చెప్పుకుంటూపోతే యెవరికీ యేమీ అభ్యంతరముండకపోవచ్చు. కాని ఆయన పౌరాణికుడు కూడా అంటే కొంతమంది ఆశ్చర్యపడడం సహజం.

పౌరాణికుడంటే పురాణాలను ఆశ్రయించినవాడన్న మాట; పురాణాలే తన ప్రపంచంగా జీవించేవాడన్నమాట; అలాచూస్తే కవిరాజుగారు పురాణ ప్రపంచంలో జీవించ టమే కాక పురాణకర్తగాకూడ తాను పౌరాణికు డవుతు న్నాడు.

కవిరాజుగారు రచించిన పురాణము 'సూత పురాణము'. ఇది నాల్గు అశ్వాసాల గ్రంథము. పురాణమని చెప్పుకున్నంత మాత్రాన 'సూత పురాణము' పురాణ మౌతుందా అన్న అనుమానం రావడం సహజం. పురాణ మంటే యేమిటి? 'పురా అనక్తి ఇతి పురాణమ్' అంటే ప్రాచీన విషయాలను పొందించేది పురాణమన్నమాట. ఈ నిర్వచనం ప్రకారం 'సూత పురాణము' కూడ పురాణమే అవుతుంది. ప్రథమాశ్వాసంలో అబ్రాహ్మణుడైన సూతుడు

నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుడు కాగల అర్హ తను గూర్చి వ్యాస శౌనక సంవాదంలో చర్చింపబడింది. బ్రాహ్మణుడైన కౌశికునికి జ్ఞానోదయము కలిగించిన ధర్మ వ్యాధుడనే కసాయివాని కథ. భద్రాద్రి గోపన్నను రామ దాసుగా మార్చిన కబీరుదాసు అనే మ్లేచ్ఛుని కథకూడా ఈ సందర్భంలో పేర్కొబడినాయి. ద్వితీయాశ్వాసములో దేవతలనుగూర్చి, దేవలోకాన్నిగూర్చి, అసురులనుగూర్చి చర్చించటం జరిగింది. అంతేగాక ద్రౌపదీ ధృష్టద్యుమ్నుల జన్మవృత్తాంతం, శూద్ర శబ్ద విచారముకూడ యిందులో కనుపిస్తాయి. తృతీయాశ్వాసములో యదార్థ ప్రహ్లాద చరిత్రం, యదార్థరామాయణం సంగ్రహంగా చెప్పడం జరుగుతుంది. చతుర్థాశ్వాసములో కురు పాండవుల కథ, శ్రీకృష్ణుని చరిత్రం మొదలైనవి వివరింపబడినాయి. ఇవన్నీ పురాణ కథలే; అనుశ్రుతంగా ప్రజాబాహుళ్యంలో ప్రచార మౌతూ వొస్తున్న కథలే.

అయితే 'సూతపురాణము' అష్టాదశ పురాణాలలోది కాకపోవచ్చు. పురాణాల జాబితాలో చేరని పురాణాలు యింకా యెన్నో లేకపోలేదు. కాశ్మీర వైష్ణవమతాన్ని వివరించే 'విష్ణు ధర్మోత్తరము' కానీ, శివమత తత్త్వాన్ని వివరించే 'శివ ధర్మోత్తరము' కానీ, కాశ్మీర దేశ చరిత్రను, కాశ్మీర నాగుల నాయకుడైన 'నీలుడు' కావించిన బోధలను వివరించే 'నీలమత పురాణము' కానీ, కపిల, వాల్మీకి, వ్యాస, బుద్ధాదులను విష్ణువుయొక్క అవతారాలుగా వర్ణించే

'బృహద్ధర్మ పురాణము' కానీ, అలాగే 'నేపాల రాజవంశ చరిత్రము' కానీ—పురాణాలే. అయితే యివి సంప్రదాయపు ముద్ర పడని పురాణాలు. ప్రాచీన విషయాలను పొందించేదే పురాణమనుకొన్నప్పుడు - అలాంటి లక్షణాలున్న ప్రతి గ్రంథము పురాణమే కావాలి. అలాంటప్పుడు వాటి సంఖ్యను పదునెనిమిదికి పరిమితం చేయడంలో అర్థం లేదు.

అష్టాదశ పురాణాల విషయంలో నైనప్పటికి పౌరాణికు లందరూ ఏకాభిప్రాయములో లేరు. ఉదాహరణకు వైష్ణవులకు శైవ పురాణాలంటే మంట. శైవులకు వైష్ణవ పురాణాలంటే కంటు. అంతేగాక ఆ జాబితాలోని భాగవతం 'విష్ణు భాగవతమా' లేక 'దేవీ భాగవతమా' అన్న తగాదా యింతవరకు తేలలేదు. భాగవతమంటే విష్ణుభాగవతమే అంటారు వైష్ణవులు; కాదు దేవీ భాగవతమే అంటారు శాక్తేయులు. పురాణాలకు 'అష్టాదశ' అన్న విశేషణాన్ని తొలిగిస్తేతప్ప యిలాంటి తగాదాలు పరిష్కారించం కావు. ఏమైనా ఈ పురాణాలన్నీ పాత పురాణాలే.

పెద్దగా చదివిన పండితులలోనే 'పురాఒపి నవమ్ పురాణమ్' అన్న నానుడి బహుళ ప్రచారములో నున్నది. ఈ నిర్వచనం ప్రకారం - ప్రాచీన విషయాలనుగూర్చి చెపుతున్నప్పటికి నిత్యనూతనంగా వుండేదే పురాణమన్న మాట. ఈ సూక్తి నంగీకరిస్తే, కవిరాజుగారి సూత పురాణమే సిసలైన పురాణ మౌతుంది; కవిరాజుగారే అసలైన

పౌరాణికు డౌతాడు. ఎందుకంటే సూత పురాణము పాత పురాణాల మాదిరి బూజుపట్టిన సరుకు కాదు.

బూతుపురాణము కాదిది
ప్రాత పురాణమును కాదు పాతకహరమౌ
సూత పురాణం బియ్యది
పూత పురాణంబు పుణ్య పురుషావళికిన్ ॥

అని కవిరాజుగారు తన సూత పురాణాన్ని గూర్చి మొదట్లోనే చెప్పుకుంటారు. సత్యం యెప్పుడూ మారుతూ నిత్య నూతనంగా వుంటుంది. కనుక సూతపురాణము సత్య పురాణముగా నవ్యపురాణ మౌతుంది.

పాత పురాణాలన్నీ సూతుడు శౌనకాది మహామునులతో చెప్పినట్లు ఎవరో మనకు వ్రాసిపెట్టారు. అది నిజమో అబద్ధమో! వాటిలోని వైరుధ్యాలను, మత భేదాలను గుర్తించినపుడు అవి అబద్ధాలే అనుకోవలసి వొస్తుంది. కవిరాజుకు సూతపురాణాన్ని సూతుడు స్వయంగా చెప్పాడట. పాత పురాణ రచయితలది పరోక్ష సమాచారము; కవిరాజుగారిది ప్రత్యక్ష సమాచారము. పాత పురాణాలలో చెత్తా చెదారం పెచ్చు: అవి చర్విత చరణాలు. నూతనాంశం లేని రచనలంటే కవిరాజుగారికి బొత్తిగా గిట్టవు. అందుకే ఆయన,

పాయక పూర్వగాథలని ప్రత్న కవీంద్రులు సేటిదాక రా
మాయణ భారతాది కృతులన్నియు వ్రాసిరి త్రిప్పి త్రిప్పి యే
దో యొక కబ్బమంచు దలఁకొక్కటి, యక్కట! నూతనాంశ మే
ది మొకటేసియం దెలుపనోపని గ్రంథసమూహ మేటికో ॥

సూ॥ ప్ర॥ అశ్వా.

అంటూ పాత పురాణాలకు ప్రతిగా నూతన పురాణరచనకు పూనుకొన్నాడు–

'పురాణం పంచలక్షణం'. సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితములు—అనే పంచలక్షణాలు పురాణానికి ముఖ్యమని పౌరాణికులు చెపుతారు. పాత పురాణాలు పాటించిన ఈ లక్షణాలను కవిరాజుగారుకూడ తన 'సూత పురాణము'లో ఒక క్రొత్త ఫక్కీలో పాటించక పోలేదు.

సర్గ అంటే సృష్టి క్రమము – పాత పురాణాలలోని సృష్టిక్రమము అసత్యమన్న విషయము కొంచెం శాస్త్ర పరిజ్ఞానం వున్న ప్రతి ఒక్కరికీ తెలిసిందే; పైగా ఒకదానిలోని సృష్టిక్రమం మరొకదానికి భిన్నం. అందువల్ల సృష్టిక్రమం విషయంలో భౌతిక ప్రపంచసృష్టి జోలికిపోకుండ, కవిరాజు గారు 'ఆంధ్రోక్తిమయ ప్రపంచం' యొక్క సృష్టిక్రమాన్ని సూతపురాణము ప్రథమాశ్వాసములో చర్చించారు. ఈ పద్యాలు చూడండి:

మోటుమానిసి నోట మోజు చిందులు ద్రొక్కి-
పనితంపుఁ బాటలఁ బాద నేర్చి
జోలపాటలు నేర్చి యేల పాటలు నేర్చి
గొబ్బిళ్ళపాటల గుసుకు నేర్చి
తేవారములు నేర్చి ద్విపద లెన్నియొ నేర్చి
త్రిపద చొక్కపు నడ తీరు నేర్చి
రగడ లెన్నియొ నేర్చి రహినక్కరలు నేర్చి
జంగమ కథ మేలు వాలు నేర్చి

చాల గీతముల్ నేర్చి సీసములు నేర్చి
వెండిబంగారు పద్దెముల్ వెండి నేర్చి
ప్రోడపిల్లయై పాతరలాడ నేర్చె
దెలుఁగు కబ్బపుఁ గన్నియ దెలివితోడ॥

ఇంతియేకాని నన్నయ యింతగాఁగఁ
బుణికి గంటముఁ జేబట్టి కణత లదరఁ
గైతఁబుట్టించెనను మాట కల్లమాట
బోధలేని కా రవులు చెప్పుదురుగాక॥

ప్రతిసర్గమంటే ప్రళయం. జోలపాటలు, యేల పాటలు, మొదలైన గేయసాహిత్యంతో, ఆటవెలదులు, తేటగీతులు, సీసాలు మొదలైన పద్యసాహిత్యంతో వడి దుడుకులు లేకుండా పెరుగుతూ వొస్తున్న తెలుగు భాషా ప్రపంచానికి, సంస్కృత భాషా సంపర్కముతో ప్రళయం దాపురించింది. ఇలాంటి 'పతిసర్గా'నికి నన్నయలాంటివారు దోహదమయ్యారు. బ్రతికి చెడ్డ తెలుగు భాసనుగూర్చి కవిరాజుగారు యిలా అంటారు:

పడుచుఁదనముచేఁ దన యింటి పాటమాని
యిరుగువారి పాటల నేర్చి యెగిరిపడఁగఁ
జిందుసరిగాఁగఁ బడదయ్యె చిట్టచివర
కెదపు సొమ్ముల కాసింప నింతెకాదె,

సూ॥ ప్ర॥ ఆశ్వా.

సర్గ, ప్రతిసర్గలను తెలుగుభాషాపరంగా వివరించిన తరువాత కవిరాజుగారు వంశవర్ణన చేస్తారు. ఈ వంశం సూర్యవంశమూ కాదు, చంద్రవంశమూ కాదు; తనవంశమే.

ఇక మన్వంతర విషయము. ప్రాచీన పురాణాలన్నీ కాలాన్ని ఒక చక్రంగా భావించి, యుగాలను అందలి ఆకులుగా వూహించినాయి. ఈ యుగాలు నాలుగు-కృత, త్రేత, ద్వాపర, కలి. ధర్మం కృత యుగంలో నాల్గుపాదాలతోను, త్రేతలో మూడు పాదాలతోను, ద్వాపరములో రెండు పాదాలతోను, కలిలో ఒక్క పాదముతోను సాగి, కలి యుగాంతంలో ధర్మం పూర్తిగా నశించి, ప్రళయం సంభవించి, తిరిగి కృతయుగారంభంతో ధర్మపునరుద్ధరణ జరుగుతుందని పురాణాలు పేర్కొంటున్నాయి. పురాణాలలోని ఈ యుగధర్మవాదాన్ని కవిరాజుగారు చీల్చిచెండాడుతారు. తారుమారయ్యేది ధర్మంకాదనీ, చిరంతనమైన ధర్మాన్ని కాలం మార్చజాలదని కవిరాజుగారు వాదిస్తారు. అదే విషయం సూతుని నోట చెప్పిస్తారు. మతస్థుల విశ్వాసం ప్రకారం ఇది కలియుగం కాబట్టి ఈ యుగ ధర్మాలను బోధించవలసినదిగా ఆయన సూతుడ్ని అడిగినప్పుడు,

నా విని సూతుఁ డిట్లనె, సనాతన ధర్మము లార్య ధర్మముల్
గా వున నెట్లు మార్పడును ? కాలము కల్పములేని మార్పుఁగా
లేవు సనాతనం బయి చలింపక సుస్థిరమౌటచే తనే
యీ వసుధాస్థలిన్ వినుతికెక్కెను వైదిక ధర్మమెంతయున్ ॥

ఆరసిఁచూడఁ గృత యుగంబయైన త్రేత
యైన నేమి ? ద్వాపర యుగమైన నేమి ?
కలి యయిన నేమి ? ధర్మ మొక్కటియ చుమ్ము
తారు మారగుచుండిన ధర్మమౌనె ?

ఈ మాటలు సూతునిచేత చెప్పించడమే కాక తన యీ వాదాన్ని అనేక దృష్టాంతాలతో ప్రథమాశ్వాసం తొలి పలుకుల్లో ఋజువు చేస్తారు.

పోతే పురాణము యొక్క చివరి లక్షణమైన 'వంశాను చరితం' ప్రసక్తి తృతీయ, చతుర్థాశ్వాసలలో మనకు కనుపిస్తుంది. తృతీయాశ్వాసములోని ప్రహ్లాద చరిత్రము, రామాయణము, ముఖ్యంగా చతుర్థాశ్వాసములోని శ్రీ కృష్ణుని చరితము యిందు కుదాహరణములు.

అలా పురాణ లక్షణాలు అయిదూ సూతపురాణము లోను కనుపిస్తున్నాయి. ప్రతి ద్వాపరములోను ఒక వ్యాసుడు అవతరించి వేద విభాగముచేసి పురాణాలు రచిస్తూ వుంటాడని పురాణాలల్లోనే వుంది. ఈ సందర్భములో 'వ్యాస' శబ్దము ఒక బిరుదేకాని ఒక ప్రత్యేక వ్యక్తికి సంబంధించినది కాదు. ఈ పురాణ విషయాన్ని నమ్మగలిగినప్పుడు వ్యాసుని ముఖ్య శిష్యుడైన సూతుడు రామస్వామిగారికి ఒక పురాణాన్ని ప్రత్యేకంగా బోధించారంటే ఎందుకు నమ్మ కూడదో అర్థం కాదు !

ఈ అష్టాదశ పురాణాలలో కూడ ఎన్నో గొడవలున్నాయి. ఒకవైపున సాత్విక పురాణాలు, రాజస పురాణాలు, తామస పురాణాలు అన్న విభజన ఉన్నది. సాత్విక పురాణాలు మోక్షాన్ని ప్రసాదిస్తవనీ, రాజస పురాణాలు స్వర్గానికి చేరుస్తాయనీ, తామస పురాణాలు నరకానికి దారి తీస్తాయనీ పద్మ పురాణం చెపుతున్నది. మరోవైపు శివదేవ

తాకాలు, విష్ణుదేవతాకాలు, బ్రహ్మదేవతాకాలు వగైరా వర్గీకరణం కనిపిస్తున్నది పురాణాలలో. అస్తవ్యస్తాలుగా వున్న ఈ పురాణాలన్నిటిని సూతుడొక్కడే చెప్పాడని పౌరాణికులు ప్రచారం చేస్తున్నారు. ఇంతకంటె విడ్డూర మున్నదా !

సృష్ట్యాదిలో వేదాలతోపాటు వాటికి ఉపాంగాలుగా భగవంతుడు పురాణాలను గూడ కల్పించినట్లు పురాణాలే చెప్తున్నాయి. అయినా వాటిలో శిశునాగ, నంద, మౌర్య, శుంగ, ఆంధ్ర, గుప్త మొదలుగా గల రాజ వంశాల వర్ణనలు కనుపిస్తున్నాయి. భారతీయ చరిత్ర లోని నిన్న మొన్నటి ఈ రాజ వంశాల కాలాన్ని సృష్ట్యాది అనుకోవాలేమో మనము !

అంతేకాదు. ప్రాచీన పురాణాలు కొంతమంది మనుషుల గాలిసోకితేనే అపవిత్రాలైపోతాయి. అందుకనే తపస్వులు కానివారికి, శ్రద్ధలేనివారికి, అసూయాగ్రస్తులకు, నాస్తికులకు పురాణాలు వినిపించరాదన్న ఆంక్ష ఏర్పడింది. ఏమో అంధ విశ్వాసం లేనివారు వింటే పురాణాలలోని బండారం బయటపడదా మరి !

కవిరాజుగారి సూతపురాణం ఒక రకంగా విమర్శాత్మకమైన నాస్తిక పురాణం. దానిని ఆస్తికులుగాని, నాస్తికులుగాని ఎవరైనా వినవొచ్చు, చదవొచ్చు. సత్వరజస్తమోగుణ భేదాలతో నిమిత్తం లేకుండా అందరికి అది అందు

బాటులో ఉంటుంది. శివదేవతాకమో, విష్ణుదేవతాకమో మరొకటో కాక అది సర్వమానవ సమాదరణీయంగా ఉన్నది.

ఈ ... సిన విన్నను
... ను బాడిపంట పరువము సుబ్బున్
తే కువ జోక యుబ్బబ్బున్
బ్రాకటముగ లిబ్బు లుబ్బు పైరము లబ్బున్ ॥

అయితే సూతపురాణము చదివేటప్పుడు ప్రాత పురాణాల పట్ల మూఢ విశ్వాసాన్ని ప్రక్కనుంచాలి. నిర్మలమైన హేతు బుద్ధితో అధ్యయనం చేయాలి. అప్పుడే ఫలితం దక్కుతుంది. అందుకనే,

సూత ప్రోక్త పురాణ సంహితను సంశుద్ధాంతరంగంబుతోఁ
బ్రాతస్స్నాయములం బఠించు నెడలన్ బ్రహ్మాయురారోగ్యముల్
భూతప్రీతియు జిత్తశుద్ధియుఁ దమోలుంటాక వైరాగ్యమున్
నీతిప్రోత వివేచనంబు గలుగున్ నిత్యంబు సత్యంబుగన్ ॥

అని కవిరాజుగారు సూతపురాణం మొట్టమొదట్లోనే శ్రుతి ఫలంగా చెపుతారు.

సూత పురాణానికి మూలం పాత పురాణాలలోని కథలే. అయితే పాత పురాణాలలోని వ్యత్యాసాలు యిందులో లేవు. వాల్మీకికి రాముడు కథానాయకుడైతే, కవిరాజుగారికి రావణుడు కథానాయకుడు. వ్యాసునికి పాండవులు కూర్చే వారైతే కవిరాజుగారికి కౌరవులు కూర్చేవారు. ప్రహ్లాదుడు బోపదేవునిదృష్టిలో పరమ భక్తుడైతే, కవిరాజుగారి దృష్టిలో పితృద్రోహి. అలా 'అని కవివరేణ్యుల కెదురీదిన' ఘటికుడు

కవిరాజు. 'ఆర్య వాఙ్మయప్రభుత్వ పతాకలను' కదలించి ఆంధ్రలోకములో భావ విప్లవానికి పునాదులు వేసిన విప్లవ వీరుడు కవిరాజు. పౌరాణికుడుగా వినూత్న పద్ధతిలో కవిరాజుగారు రచించిన సూతపురాణము యొక్క విశిష్టతను మెచ్చుకుంటూ మా మిత్రుడు యస్. వి. బ్రహ్మం శాల కవిగా వ్రాసిన పద్యంతో ఈ వ్యాసం ముగిస్తా.

చపుకను పెట్టిదో ఎరుఁగఁ జాలని తావక భావ విప్లవ
ప్లవము పురాణ వారి దినవారిగ స్వారి యొనర్పనం తరు
ద్భవనవనూత్న రత్నములు వ్రాఁతవలంగొని. మా కమూల్యవ
స్తువులను జేర్చిపెట్టితివి సూత పురాణ విశాల విధులన్ ॥

—కొల్లా సుబ్బారావు.

# శతక వాఙ్మయము - కవిరాజు స్థానము

శతకవాఙ్మయ మతి ప్రాచీనమైనది. ప్రపంచ భాషలలో శతకములు లేవు. సంస్కృతమున మాత్రము కొన్నిగలవు. ఐనను వీనికి వృత్తనియమనుగాని, మకుటనియమముగాని కన్పించుటలేదు. స్తవములలోఁ గొన్నింటికి మాత్రమే నియమము గన్పట్టును. "లక్ష్మీనృసింహామమ దేహి కరావలంబమ్" ఇత్యాదులు. భర్తృహరి త్రిశతి, భల్లటుఁడు భల్లట శతకము, అమితగతియను బౌద్ధకవి సుభాషితరత్న సందోహము, మయూరుఁడు సూర్య శతకము, సిల్హణకవి శాంతి శతకము, అమరుకవి అమరు శతకము, గోవర్ధనుఁడు ఆర్యాసప్తశతి, విశ్వేశ్వరుఁడు రామావలీ శతకమును రచించిరి. కొన్ని నామమాత్రములై యున్నవి. శతము, శతకము, అష్టోత్తరశతములని త్రిశతి, పంచశతి, సప్తశతులని చేసి సంఖ్యలతోను గొన్ని కన్పట్టుచున్నవి.

ఇఁకఁ దెలుఁగులో - క్రీ|| శ|| 1160-80 మధ్యకాలమున మల్లికార్జున పండితారాధ్యులవారు శివతత్త్వసారమను 486 పద్యముల శతకనామమునఁ దొలుదొల్త రచించి[illegible]. వారి యడుగుజాడల ననుసరించి శైవకవులైన వారు

కొందరు శతకరాజముల విరచించిరి. జాను తెనుఁగునకు శైవకవులె శ్రీకారము చుట్టిరి. శతకవాఙ్మయమునకు వీరే ప్రారంభకులగుట గమనార్హము. వీరిని జూచి వైష్ణవ కవులును దమ యిష్టదైవమగు విష్ణువును గూర్చి వ్రాసిరి. ఇట్టివి విస్తృతి నందినవి. భక్తిరస శతకముల యనంతరము శృంగార శతకములు వచ్చినవి. మున్ముందు దైవపరముగా నుద్భవిల్లి యాపై నాత్మాశ్రయములై జుగుప్సాకరములైనవి. పిమ్మట రాజదౌష్ట్యముల, ధనవంతుల దురాగతముల వాక్రుచ్చి నవియుఁగలవు. కాళహస్తీశ్వర, ఆంధ్రదేవ మొదలగు శతకము లీకోవకుఁ జెందినవి. వర్ణాశ్రమాచార ధర్మములకు భంగము వాటిల్లెనని వాపోయిన శతకములు పెక్కులుగలవు. అందు వేణుగోపాల శతకము "గోవులన వంగఁ గోసివండుక తినే మాలమాదిగలు భూపాలురైరి" యని తన యక్కసునెల్ల వెడలఁగ్రక్కినది. ఇంతకంటెఁ బలుచనైనవి రాజశేఖర శతకము మొదలగునవి. ఇట్టిట్టిల శతకములకు మాఱొడ్డి సమకాలీనులు "దేవాలయములు భూదేవుల తృప్తికే సత్రముల్ బ్రాహ్మణజాత కొఱకె" యని ధర్మ స్వరూపమును వెల్లడించిన రామదేవ శతకాదులును గలవు.

సాంఘిక దురాచారములు మిన్నుముట్టి వర్ణ విభాగము ప్రళయతాండవ మొనర్చువేళ దాదాపు క్రీ॥ శ॥ 1540 ప్రాంతమున నుద్భవించిన వేమనమహాయోగి యీ

దు స్తంత్రమును ఛేదింపఁ దన గంటమును సారించెను. పండిత ప్రభువు లెదిరించుచున్నను సరకుఁగొనక సామాన్య ప్రజానీకమునకుఁ దన యుపదేశము లినుచుచు నిద్రాణమైన మానవత్వమును మేలుకొల్పెను. ఆపై విశిష్ట కవులైన కరుపూరు బంగారయ్య, అయ్యనకోట పార్థసారధి, వార్ల సుందరమ్మ, ఆనగారి రామానుజులు మొదలగు మహానుభావు లెందఱో సత్యధర్మ ప్రకాశకులై విలసిల్లిరి. అధర్మముల ధర్మములుగా- అసహజముల సహజములుగా- పూర్వాపర విరోధక కథల బోధనములుగా వెలయించెడు ఖలుల కెదురొడ్డి నిలిచినవా రనేకులు పూర్వమునఁ గలరు. వారి మార్గము లాదర్శములు, శిరోధార్యములై యాచంద్రార్కము నిలువఁ గలవై యున్నవి.

పుక్కిటి పురాణములఁ జీల్చి చెండాడి యాటవెలఁదికి సహజాలంకారములఁ జేకూర్చిన వేమన కవివరేణ్యుఁడు "పేరు ధర్మరాజు పెనువేఁపవిత్తయా — కనకమృగము భువినిగలదొ లేదొయను ... తెలివిలేనివాఁడు దేవుఁడెట్లాయెరా" యని భారత రామాయణముల గుట్టు బయలు పడునట్లు పలికెను. ఇంతియగాక—1. తిరుమలకును బ్రోవఁ దురక దాసరిగాఁడు—2. రాళ్ళు దేవుళ్ళయిన రాసులు మ్రింగవా—3. తల్లి శూద్రురాలు తానెట్లు బాపఁడు—4 జీవులందెకాక శిలలనేమున్నది—5. తలలు బోడులైన తలఁపులు బోడులా–6–శూద్ర తనము పోయి శూద్రుఁడుఁగానని ద్విజుఁడన కొనడెల్లఁ దెలివిలేమి- మొదలగు పద్య

రాజములు పరశ్కృతములుగా వచించి తరతరములనుండి బానిసతనమువహించి క్రుంగిపోయిన మానవజాతికి నూతన జీవమును గూర్చెను. ఇంకం గరుపూరి బంగారయ్య బంగారు పలుకులం దిలకింపుండు-1-సకల శాస్త్రము లూరక చదువం జదువం జిత్తవిభ్రమ కలిగించి వెస్తుం జేయు -2- ఒడలిపై బూదిపూసి యీ యుర్విలోనం గావివస్త్రంబులను కట్టికనుల మధ్య కుంకుమము దీర్చి తిరిగిరి కుటిలమునులు -3- రాళ్ళ బొమ్మలు చేయించి గుళ్ళలోన నునిచి పూజలు సేసెద రుర్విలోన-4- మేంక పోతుల రీతిగా లోకమందు గడ్డములు పెంచి మూరేండు; జ్ఞానులంద్రు-5-నీటికాకుల రీతిగ నీట మునింగి బూదిపూసియు జపమాల పూనుచుంద్రు - ఇట్టివి యీ శతకరాజమున నెన్నెనింగలవు. క్రీ|| శ|| 1829 సంవత్సరమునకు గ్రంథరచనము సంపూర్ణ మొనర్చితినని న దాన్ల సుందరమ్మ భావలింగ శతకమునుండి కొన్ని సూక్తులందిలకింపుడు -1- వెఱ్ఱికుక్కలట్లు వేదాల నెల్లను గూయుచుంద్రు పొట్టకూటి కొఱకు. 2- కటికివాని కాళ్ళు గడిగి మ్రొక్కంగవచ్చు సోమయాజి ముఖము చూడరాదు-3- తన్నుం దెలియువాండు తానెట్లు మేంకలం గ్రాసి సురలం గొలిచి గోడుగుడుపు -4- కట్టుం బోతులెల్లం గనులసందును బొట్టుంబెట్టి ధనము కొల్లంగొట్టుచుంద్రు-5- దవడలందు వేదతతులు పెట్టినట్టి దవడకూంత లెట్టు సమ్మంగవచ్చు, 6- నొఱుంగుచుండు వేదములను లెస్స-7-తిత్తిం గప్పుకొనుచుం దిరుగుచుండెడి వాని కర్మవలన సురలుగంద్రు

బ్రదుకు బ్రహ్మవిష్ణు ముఖుల బ్రదుకు లీపాటి వా-7-నోటఁ గూయనామె శ్రుతులు8-పురుగు కట్టెమీఁదఁ బురహరయని పేరు దాలిచె దానికేమి ఫలము దొరకె వేదతతులఁ బలుకు విప్రుల గతియిదే-9-సేతువందు రామె శ్రీశైలమున రామె కాశిలోన రామె గయను రామె కోటలోన రామె పేటలో నను రామె-ఇట్టి నవరత్నములు శతకమునఁ బెక్కులు గలవు. ధర్మమును వచించుటలో వెనుకంజ వేయని నిస్వార్థపరు లగు మహాకవులెల్ల రిట్టిమార్గముననే నడచిరి.

కవిరాజు త్రిపురనేని రామస్వామిగారును బరంపరా గతములైన ధర్మములని వచ్చు నధర్మములనెల్ల నాలించి, పరికించి యెదుర్చ సమకట్టినవారైరి. వీరికి వేమనయందు భక్తి గౌరవములు మెండు. సూతపురాణ ప్రథమాశ్వాస ప్రారంభమున — వేమనను సంస్మరించి మహాపురాణ రచనా దీక్ష వహించిరి. ఆజన్మాంతము చిత్తశుద్ధితోఁ దానేది పలికినను—ఏది వ్రాసినను సిద్ధాంత ప్రతిపాదనకుఁ గుదురే యయ్యెను. శంబుకవధ, ఖూనీ మొదలగు దృశ్య కావ్యములు. భగవద్గీత, సూతపురాణము మొదలగు శ్రవ్య కావ్యములు, సూతాశ్రమ గీతాలు మొదలగు గేయకావ్య ములు సమస్తమొకే యాదర్శమునకై నిలిచినవి. నాఁడివి పూజలందుకొన్నవి— నేఁడివి వీరపూజలందుకొనుచున్నవి. మునుముందు ప్రమాణగ్రంథములు కాఁగలవు. తన సిద్ధాంతమును వాఙ్మయములోని యన్ని శాఖలలోఁ బ్రబోధ మొనర్చిన యీ కవిరాజు శతకము నొక దానిని మనకై

వెలయించిరి. అది "కుప్పుస్వామి" శతకము. ప్రతిగ్రంథమునకు మున్ముందట జోతలు — ముత్తుకోళ్ళు మొదలగు వానిచే దేవుని దేవతా ప్రతినిధుల నపహసించురీతి నీ శతకమందును మొదటిపద్యము "గొండరులఁ దుంటరుల గుమిగూర్చి సృష్టిఁ" జేసి చీటికి మాటికి డాసివారు తన్నుకొని చచ్చుచుండఁగఁ దనియుచుండు గొప్పవానికి జేజేలు కుప్పుస్వామి" యని జేజేల నప్పగించెను. కుప్పుస్వామి యని తమ సమకాలీనుల పేరేమైన గ్రహించెనాయను సందేహము కొంతమందికిఁ గలదు. అది యీ కవిరాజు మనస్తత్త్వ మేమాత్రమెఱుంగనివారి యూహమాత్రము. వక్రముగా వచింప నెఱుఁగని పవిత్ర హృదయుఁడగు నిమ్మహాకవి ఈ పని యొనర్పఁడు. ద్రావిడులకుఁ బ్రత్యేకముగాఁ గుప్పుస్వామియను దేవుఁడు గలఁడు. వానిఁగైకొని యుండును. అబ్బువంపని శూరాగ్రేసరుఁడగు కవిరాజు పెరల మెఱమెచ్చులకుఁ బోవువాడు కాఁడు. దారిద్ర్య మెంతగా వరించినను నిబ్బరించి నిల్చెనేకాని కవితని విక్రయింపలేదు. ఈ కుప్పుస్వామి శత మాట వెలఁదులఁదేట గీతులసాగెను. మచ్చునకుఁ గొన్ని —1. గుడికిఁదఱచుపోయి గొణగుచుండెడివాఁడు॥ పెద్దపాపమేదో చేసియుండు—2. రాజు వ్యభిచారియైనచో రసికుఁడంద్రు॥ త్రాగి తందనాలాడు వోద్యాగియంద్రు॥ పాడిదప్పిన మంత్రాంగ పరుఁడటంద్రు తప్పు తెలియని మనుజులు—3. పాతకునిచేత నెప్పుడు గీతయుండు॥ మొగముపై వింతవింతగా బొట్టులుండు—4. విత్త

మన్యాయముగఁబెట్టి భయము। చేత దానధర్మములఁజేయు డేల—5. మాతృభాషయందు మాతృదేశమునందు। మమత లేనివాఁడు మనుజుఁడగునె 6. తలలు గొరిగించి కావిబట్టలను గట్టి॥ మెడలరుద్రాక్షమాలికలిడినయంత॥ ముక్తివచ్చునే— 7. చచ్చిపోయిన వెంటనే జన్మమెత్తు!' ఎకుడువఁ గర్మ మటం జెప్పుచుండు॥ రట్టలైనచో(బి త్రిలోక మెట్టువచ్చు. 8 ముక్కుమొగము చెక్కమూలవిరాట్టంచు॥ నొక్క రాయి తెచ్చియుంచి గుడుల॥ గూడుగుడ్డలిచ్చి కొల్తురు ప్రజలెల్ల గొంటెపనులుగావె—9. సంశయించుభర్త సాహ చర్యముఁ జేయు॥ సాధ్వపడునె యెట్టి సాధ్వికైన॥ సీతభూమి జొచ్చె శ్రీరామచంద్రుని॥ గూడియుండలేక—10. కైత కైదువన్న భీతిపడు జగమ్ము॥ కైదువున్నయట్లె కవిత యున్న కవుల నాశ్రయించి కడచన్న రాజులు॥ గొప్పవార లైరి—ఇట్టివి పద్యములు. కవి హృదయము కవితలోఁ గన్పట్టును. ఈ శతకమునఁగల నూటరెండు పద్యములం దును శ్రీ కవిరాజు గోచరించుచునే యుండును.

ఈ ధోరణితోడనే ధూర్తమానవా! యను సంబో ధనముతో 47 పద్యముల రచించిరి. శతకము పూర్తిగ వ్రాయలేదు. ఇందన్ని సమవృత్తములు గలవు. మకుట నియమమును పాటింపఁ బడినవి. నిత్య జీవిత మెంత యాదర్శప్రాయమైనదో కవితయు నట్టి యాదర్శము గలది. కవిరాజును గూర్చి నీ రచనాభిఘాతములు నేఁటి కపారపురాణ గోపురద్వారకవాట పంక్తులు బద్దాబదలైనవి.

అను కవిబ్రహ్మ ఏటుకూరి వెంకట నరసయ్యగారి సత్య సూక్తిని స్మరించుకొందము.

ఏని కలమ్మునందు జనియించిన సూతుఁడు నిత్యసత్యముం
బూని వచించెనో పరుల మోసము వీసమునైన దాపకే
యేని మహోదయమ్ము తపియించెడి జాతుల నుద్ధరించెనో
వానిని రామసామికవి వర్యుని గొల్చెదఁ జిత్తశుద్ధికై.

— కొండవీటి వెంకటకవి.

# ఒక జ్ఞాపకం

కొందరి ఆకృతులు వారిలోపలి ప్రకృతులకు ప్రతిబింబాలుగా వుంటవి.

కొందరిలో ఆకృతి వేరు ప్రకృతి వేరు.

కొందరిని చూడగానే వారు కవులో, లేక ఇంకే విధమైన కళాకారులో అనిపిస్తుంది.

కాని నిదానంమీద తెలుస్తుంది వారు అలాంటి వారేమీ కాదని.

మరికొందరు బయటికి కనుపించిన ప్రకారమే కవులో, కళాకారులో, వైజ్ఞానికులో అయివుంటారు.

ఇక కొందరుంటారు, చాలా సాదాగా కనిపిస్తారు. బజారులో కనుపించే నలుగురు లాంటి ముఖాలే అవి; ఆ ముఖాల్లో కవితా తన్మయత కాని, రసప్రకటన కాని, లాలిత్యం కాని ఏమీ గోచరించవు.

కాని నిదానంమీద తెలుస్తుంది ఆ కవిత్వమయం కాని ఆకృతివెనక ఎంతో కవిత్వమయ ప్రకృతి దాగివున్నదని, ఎంతో రసమాధుర తరంగాయిత మవుతూన్నదని.

కవిరాజుగారు ఇటువంటివారే.

అది ఏ సంవత్సరమో గుర్తులేదుకాని, ఏ మాసమో మాత్రం గుర్తే. అది వైశాఖమాసం. ఎండలు మండిపో తూన్నవి.

గోపీచంద్ అప్పుడు తెనాలిలోనే వుంటున్నాడు.

అదివరలో రెండుమూడుసార్లు మావూరువచ్చి వెళ్ళి నాడు గోపీచంద్.

తరువాత తమ ఇంటికి రమ్మని ఆహ్వానించాడు.

నేనూ మరో మిత్రుడూ కలసి ఆ మండుటెండల మధ్యాహ్న సమయంలో 'సూతాశ్రమం' చేరుకొన్నాం.

అదివరలో కవిరాజుగారిని చెవులతో తప్ప కళ్ళతో చూడటం జరగలేదు.

ఒకే పొడగాంటి ఇంటిలో గోపీచంద్ సగభాగం లోనూ, కవిరాజుగారు తమ తృతీయ పత్నితో కలిసి మిగతా సమభాగంలోనూ వుంటున్నారు.

అదివరకే వినివున్నాను కవిరాజుగారు కొంచెం పెడ మనిషి అనీ, ఇంటికి వెళ్ళినవారిని సరీగా పలకరించరనీ, సాంఘిక మర్యాదలను పాటించరనీ.

ఇంకా ఇలాంటి వెన్నో వారిలో వున్నవీ లేనివీ, ప్రజలు అర్థం చేసుకొన్నవీ, చేసుకోనివీ కవిరాజుగారిని గురించి ప్రచారంలో వున్నవి.

అప్పటికి నేను కవిరాజుగారి రచనలు ఏమీ చదివి వుండలేదు.

ఆ మాటకువస్తే ఇప్పటికీ చదివేనని చెపితే అసత్యం చెప్పినట్లే అవుతుంది.

గోపీచంద్ కోసం వెళ్ళితే ఆయన తండ్రి కవిరాజు గారు ఆ ఇంటిలో కనుపిస్తారేమో అని ఏదో భయంగా వుంది, వారిని గురించి వినివున్నదాన్నిబట్టి.

కనుపిస్తే బాగుండు ఎలా వుంటారో చూద్దాం అనే కుత్రతనపు కుతూహలంకూడ ఒకవైపు గిలిగింత పెడు తూంది.

ఇలాగే ఆలోచించుకొంటూ ఆ వైశాఖ మధ్యాహ్నంలో వారింటి కెళ్ళేసరికి తమ ఇంటి గడపమీద చొక్కా-లేకుండా, ధోవతి మోకాళ్ళవరకు లాగి ఒక నడి వయసుగల వ్యక్తి బట్టతలతో, నలుపు తెలుపు మీసాలతో కూచొని ఆవలిస్తున్నాడు.

ఆయనే కవిరాజుగారు అయివుంటారనిఏదోనమ్మకం.

ఎందుకో నమస్కారం చేయటం మరచిపోయాను.

నమస్కారాల్లాంటి ఆచారాలనుకూడ వీరు పాటిం చరేమో అనే నమ్మకం ఒకటి నా అధో చేతనలో దాగి వుండి వుంటుంది.

అందుకే నమస్కరించటం మరిచానేమో! .

"గోపీచంద్‌గారున్నారండీ?"

"ఆఁ, ఏమిటీ?" అని కొంచెం కఠినస్వరంతోనే అడిగేరు.

అసలే ఆ వేసవిలో చెమటపడుతూంటే కవిరాజు

గారి పలుకులతో ఇంకా చెమటలు పట్టినవి. ఓహో పరో క్షంగా విన్నదానికీ ప్రత్యక్షంగా చూచినదానికీ సరిపో యిందే అనుకొన్నా.

"గోపీచంద్ గారికోసం అండీ" అని మళ్ళీ నెమ్మదిగా అన్నాను.

చేతిని ఆ యింటి రెండవభాగం వైపుకు చూపి "వుండవచ్చు" అన్నారు.

మేము ఆ రెండవ వాకిలి వైపుకెళ్ళేవరకు నిద్ర నుంచిలేచి గోపీచంద్ కళ్ళు నులుముకొంటూ వచ్చి హార్దిక స్నేహంతో లోపలికి తీసుక వెళ్ళేడు.

ప్రాణం హాయి అనిపించింది.

"అక్కడ కూచున్నది మీ నాన్నగారేనా?"

"అవును" అని నవ్వేడు గోపీచంద్ సంగతి గ్రహించి.

"ఇంగ్లాండ్ వెళ్లి బారిస్టర్ ప్యాసయి వచ్చారు కదూ మీ నాన్న?"

"అవును, ఏం అలా కనుపించటం లేదా?"

"మీ నాన్నగారు మంచి కవులు కదూ?"

"కవులేకాదు కవిరాజు కూడా" అన్నాడు గోపీ చంద్.

"బెంగాల్‌లో కవిరాజ అనే పదం ఆయుర్వేదవైద్యు లకు వాడతారుగా" అన్నాను నేను.

"అవును. కవికూడ కవిత్వం తెలియని రోగులకు వైద్యుడే!"

సరే అంతా నవ్వుకొన్నాం.

సాయంత్రందాకా ఏవో సాంస్కృతికమైన అనేక విషయాలను గురించి మాట్లాడుకొన్నాం.

చివరకు మేము లేచిపోయే ప్రయత్నంలో వుండగా గోపీచంద్ అన్నాడు :

"కవిరాజుగారితో మాట్లాడతారా ?"

"అవును మాట్లాడాలనే వుంది" అన్నాను నేను.

మేము బయటి వరాండాలోకి వచ్చి రెండు నిమిషాలు నిలుచొన్నాం.

ఇంతలో కవిరాజుగారు, నిండు చేతులదో సగం చేతులదో గుర్తులేదుగాని, ఒక సాదాచొక్కా ఒకటి వేసుకొని లోపలనుంచి బయటికి వచ్చారు.

ఈ తడవ వారు మమ్ము చూచి కొంచెం నవ్వు ముఖం పెట్టినట్లే గుర్తు.

ఈ తడవ నమస్కరించకుండా వుండలేకపోయాను.

కూచోమన్నారు.

నాకాశ్చర్యం వేసింది. ఇంటికి వెళ్ళినవారిని కూచోమని అనరని విన్నాను !

నన్ను గురించి కవిరాజుగారికేవో నాలుగు పరిచయ వాక్యాలు చెప్పి గోపీచందు ఇంటిలోకి వెళ్ళిపోయాడు.

కూచోమని చెప్పినా నేను కూచోకుండానే నిలుచున్నా.

"ఏం, నిలుచున్నారేం?" అంటూ వారుకూడ కూచున్నారు.

"పరవాలేదు" అంటూ నేనూ కూచున్నాను.

"వేడి చాల ఎక్కువగా వుందికదూ?" అన్నారు నిట్టూర్పు విడుస్తూ.

"అవును" అని నవ్వేను.

అప్పటికి వారింట ఎలెక్ట్రిక్ పంఖాలు లేవేమో అని గుర్తు.

"మాకు పది మైళ్ళదూరంలోని తుమ్మపూడిలో వుంటూ ఎప్పుడూ కనుపించ లేదేమి?" అన్నారు కవిరాజుగారు తమ ముదురు మీసాలమీద మెరుస్తూన్న ముత్యాల లాంటి చెమట బిందువులను తుడుచుకొంటూ.

వారి మాటల్లో ఎంతో ఆప్యాయత, సౌహార్దత తొణికిసలాడినవి.

అనుకొన్నాను వినివున్న కవిరాజుగారు నిజమైన వారు కారనీ, ఇప్పుడు ఎదురుగావున్నవారు మాత్రమే నిజమైన కవిరాజుగారు అనీ.

"అలవాటు లేదండీ" అన్నాను సంకోచంతో.

"అదీ మంచిదే కాని, అదే అలవాటుగా పెట్టుకో రాదు."

"అందుకే ప్రయత్నిస్తున్నానండీ" అన్నాను కొంచెం పెద్దగా.

"అతిగా సంఘంలోనూ కలిసిపోరాదు, అతిగా సంఘానికి దూరంగాను వుండరాదు" అన్నారు వారు కొంచెం గంభీరంగా.

వెంటనే నాకు బ్రౌన్లీ మాటలు కంఠస్థం చేసుకొన్నవి గుర్తుకొచ్చినవి. అన్నాను:

"Man is not man at all unless social; but he is not much above the beasts unless more than social."

కవిరాజుగారికి చాల సంతోషం వేసింది పై ఇంగ్లీషు వాక్యం విని, అన్నారు ఉత్సాహంతో :

"అవును అదే సక్రమదృక్పథం. చక్కగా చెప్పేడు బ్రౌన్లీ. నిజంగా చాల బాగుంది.

వారు చూపిన ఉత్సాహంతో ఇక నాలో సంకోచం మాయమైపోయి వాచాలత ప్రత్యక్షమైంది. ఏమేమో మాట్లాడాను వారితో.

మాట్లాడినదంతా వారిని సంతోష పెట్టిందని చెప్పలేనుగాని అందులో తక్కువ భాగం మాత్రమే వారిని సంతోష పెట్టి వుండదని గ్రహించాను.

"ఏమి చేయాలని మీ అభిలాష?" అన్నారు ఆకాశంవైపు రిక్తంగా చూస్తూ.

నేను అన్నాను, "మానవ సంస్కృతికి కఠోరస్వరూపమూ కోమల స్వరూపమూ రెండున్నవి. మొదటిదాన్ని

మీరు చేపట్టేరు, రెండోదాన్ని నేను చేపట్ట ప్రయత్నిస్తు న్నాను."

మామూలుకంటే కొంచెం పెద్దగానే నవ్వి అన్నారు:

"చాలా బాగుంది మంచి ప్రయత్నమే. నాకు కొంచెం పని వున్నది బయటికి వెళ్ళివస్తాను. తెనాలి వచ్చి నపుడల్లా కనుపడు తుండరాదూ ?"

నేను నవ్వి వూరకున్నాను. వారు బయటికెళ్ళి పోయారు.

కవిరాజుగారిని చూడటం అదే మొదలు, అదే ఆఖరు.

రాజారామమోహనరాయలు, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, గురజాడ అప్పారావుగారు, వీరేశలింగంగారు, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు, గిడుగు సీతాపతి గారు ఇంకెందరో ఇటువంటి మహనీయుల పేర్లు స్మృతి పథంలో మెరుస్తవి కవిరాజుగారి పేరు వినగానే.

వారందరి పేర్లు వినగానే కవిరాజుగారి పేరు స్మృతి పథంలో మెరుస్తుంది.

ఒకేసారి చూచాను వారిని.

ఒకే ముద్ర చెరగంది పడింది నా మానసంపైన.

అది ఒక చెరగని జ్ఞాపకంగా నిలచిపోతుంది అజ్ఞాత భవిష్యత్‌లో.

—సంజీవదేవ్

# "ఖూసీ" నా అభిప్రాయము

వేనుని చరిత్ర భగవతాంతర్గతమైనది. అందు యిట్లు వర్ణింపబడినది :-

అంగరాజునకు సంతానము లేకపోవుట వలన ఆతడొనర్చిన యజ్ఞమున కాహూతులయ్యా దేవతలు తమతమ హావిర్భావములను స్వీకరింపరైరి. కారణ మడుగగా వారు "ఈ జన్మమున కాకపోయినను పూర్వజన్మమునందు నీవు చేసిన దుష్కృత ఫలితము వలన నీ వనపత్యుడవైతివి. అనపత్యు డొనరించిన యజ్ఞమునందు హావిర్భావములను మేము స్వీకరింపము గావున నీవు పుత్రకామేష్టి యొనరించి సంతానవంతుడవు కమ్మని" చెప్పారు. పుత్రకామేష్టి యొనరించిన ఫలితముగా తన భార్యయైన 'సునీథా దేవి' యందు కుమారుని గాంచెను. అతడే 'వేనుడు'—

వెంటనే వేనుని బాల్యము వర్ణింపబడినది. అతడు తన యీడు కుమారులను "క్రీడబోలె నెమ్మనమున భీతిలేక కృపమాలి, పశుప్రకరంబు నొంచుపోల్కిల నరికట్టి చంపుచును, గిల్బిషలుబ్ధకవృత్తిమై శరాసనములు ధరించి, మృగ

జాతి నసాధుగతిన్ వధింపుచున్''అని. ఈతడిట్లు చరించుటకు కారణము "మాతామహదోషంబునం" అని చెప్పబడినది. ఆ మాతామహుని పేరు 'మృత్యువ'ట. వేనుని యీ పాప వర్తనమును మాన్పింప తండ్రి ప్రయత్నించియు అసమర్థుడై అర్ధరాత్రి అదృశ్యుడయ్యాడు.

తరువాత 'భృగువు' మొదలైన మునీశ్వరులు'సునీథా దేవి' అనుమతి చొప్పున 'వేనుని' పట్టాభిషిక్తుని చేసినారు. ఇక్కడ బాగుగా గ్రహింపవలసిన విషయ మొకటుంది. 'వేనుడు' రాజయిన తరువాత "అంతటి మహితోగ్రశాస నుండగు-వేనుఁబట్టంబు గట్టుట విని, సమస్త తస్కరులు సర్పభీతిచేఁ దలగు మూషికముల కైవడి నడగిరి గహనము లను'' అనునది. తరువాత నేవో వేనుని కాని పనులు కొన్ని వర్ణింపబడినవి. ఇట్లు చెడ్డ కార్యములు చేయుచున్న 'వేనుని' వద్దకు ఋషులు వచ్చి "ఇట్టి రాజ చోర భయంబు పీఁ రాజ నులను బలసి యిరువంకలను బాధపరుప జొచ్చె''అని చెప్పి నారు. ఇక్కడ రాజచోర భయాంబులంటే రాజ భయము, చోర భయమూ నన్నమాట. ఈ మాటలన్న ఋషులు వేనునకు కొన్ని సలహాలిచ్చారు. "కావున నీ రాజ్యంబున మఖంబులు సేయుమని యాజ్ఞాపింపుము. నీ దేశంబునఁ జేయ బడిన యజ్ఞంబుల చేత హరికళా యుక్తంబులగు దేవగణం బులు స్విష్టంబులై,తుష్టంబులగుచు భవదీయ వాంఛితార్థం బుల నిత్తురు'' అని.అయితే వేనుడు వీరి సలహాలను వినలేదు. యజ్ఞముల వలననే సర్వ శుభములొనకూడును అన్న

మాట యందాతనికి నమ్మకము లేదు. దానితో ఋషులకు కోపంవచ్చింది. "యజ్ఞపతియైన శ్రీవిష్ణుని నిందించుచున్న వాడుగావుననిర్లజ్జుం డైనహరినిందకునిహననంబు సేయవలయు నని మునులుద్యోగించి యాత్మప్రకాశితంబైన క్రోధంబునం జేసి హుంకార మాత్రంబున నా యీశ్వర నిందాహతుం డగు వేనునిం బొలయించిరి."

## ఇదీ కథ

ఈ కథను తీసుకొని శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు 'వేనరాజు' నాటకమును రచించారు :-

వీరి కథలో అంగరాజు పిచ్చివాడుగా చిత్రింపబడి నాడు. కాని నిజంగా పిచ్చివాడు కాదు. చిట్టచివరకు పృథు చక్రవర్తిని దీవించి అడవులకు వెళ్ళినాడు.

వేనుడు మొదటినుండియు వేదబాహ్యుడు, ధర్మదూరుడు, పాషండుడుగానే చిత్రింపబడినాడు.

వేను నిట్లు పాషండుడుగా చిత్రించి దానిమూలమున నతడు హంతవ్యుడుగా నిరూపించినారు శ్రీ సత్యనారాయణ గారు.

ఇది శ్రీ కవిరాజుగారి హృదయమునకు బాధ గలిగించినది. వారట్లు బాధపడుటలో అర్థము లేకపోలేదు. భాగవత కథను చదివి, శ్రీ సత్యనారాయణగారి 'వేనర్రాజు' ను చూచినచో కొంత అసంగతి మవుతుంది. అయితే నాటక రచయితకు మూలములోని కథను కొంత మార్చుకొనుటకు

స్వాతంత్ర్యము లేకపోలేదు. పూర్వకవులు ఆ విధంగా చేశారు కూడ. ప్రసిద్ధమైన శకుంతలా దుష్యంతుల కథ భారతములో ఉన్నట్లు, కాళిదాసు 'శాకుంతలము'లో లేదు గదా! కావున కథను నాటకాను గుణముగా గాని, పామరులను దృష్టిలో నుంచుకొనిగాని మార్చుకొనుటలో ఆక్షేపణ లేదు. కాని వైదిక మతానుయాయి కాకపోవుటచేత నే వేనుడు పరమ దుర్మార్గునిగా చిత్రించుట విచారింపదగినది. వైదిక ధర్మానుయాయులు కాని ధార్మికులు యీ ప్రపంచములో ఎంతమంది లేరు? సత్ప్రవర్తన అనునది కేవలమొక మతము పైననే యాధారపడి యుండదు గదా !

ఇక్కడే ఒక విషయము శ్రీ కవిరాజుగారు తమ పీఠికలో నుడివినదే మరల చెప్పవలసి యున్నది 'వేనుడు' పట్టాభిషిక్తుడు కాగానే సమస్త తస్కరులు సర్పభీతిచేఁదలగిన మూషకముల కైవడి గహనములలో నడగిరి గదా! అనగా సమస్త దుర్మార్గులకు భయంకరుడని తేలిపోవుచున్నది. దుర్మార్గులకు భయంకరుడైనవాడు ఎటువంటివాడై యుండును? సన్మార్గ రక్షకుడై యుండును. దీనిలో నాక్షేపణ యుండదు ఆ పై వాక్యము వేనుడో, లేక వేనుని వెనుక వేసుకొని వచ్చినవారో! అన్నది కాదు. ఈ విషయమున ఋషులే సంతృప్తి చెంది యున్నారు. అట్లు సంతృప్తి చెందని పక్షమున వేనుని పట్టాభిషిక్తునిగా భృగు ముదలైన ఋషులు చేయనే చేయరుగదా! మరి వేనుడు యజ్ఞములను వ్యతిరేకించిన వెంటనే రాజచోర భయంబులు యీ భూజనులకు

బలసినవట. ఇదెక్కడి న్యాయము ? యజ్ఞముల విషయమున ఋషుల అభిప్రాయములతో వేనుడు ఏకీభవించనంత మాత్రమున వేనుడు అధర్మప్రభు వెట్లాయెనో ?—

వేను డపమార్గమున బోవుచున్నాడని ఋషులు వానిని హుంకార మాత్రంబున పొలయించిరట. అట్లైన పురాణములలోని దుర్మార్గులైన రాజు లందరిని చంపుటకు యీ యాయుధము నుపయోగించిన చాలును గదా ! ఇన్ని యుద్ధములు, ఇంత జననష్టము ఎందుకు జరుగవలసి వచ్చెనో ! అయినను వేనుడు తమకిష్టుడు కాకపోయి నప్పుడు పదభ్రష్టుని చేయనచ్చుగదా ! యజ్ఞములను వ్యతి రేకించిన వారందరూ హంతవ్యులే అగుదురేమో—

భాగవతములో వేనుని పాత్ర విషయమున కొన్ని విచారించవలసిన విషయములున్నవి. ఇక వేనుడు శ్రీ సత్య నారాయణగారి నాటకములో శుద్ధమైన దుష్టుడుగా ప్రత్యక్ష మైనాడు. ఈ వేనుని కర్మకాలి శ్రీ సత్యనారాయణగారికి ఉన్న ఆర్య ధర్మాభిరతిని వెల్లడించుకొనుటకు బాగా ఉప యోగించాడు—

ఇదే కథను తీసుకొని శ్రీ కవిరాజుగారు 'ఖూనీ' అను పేరుతో నాటకమును వ్రాసినారు. ఆర్య ఋషులచే వేనుడు అన్యాయముగా హత్యచేయబడినాడని వారు దృఢ ముగానమ్మి వారి నాటకమునకు 'ఖూనీ' అను పేరిడినారని వారి మాటల వలననే స్పష్టమయినది. వారి దృష్టికి వేనుడ హింసామూర్తిగా పొడగట్టినాడు. అందువలననే వారు వేనుని బౌద్ధమతమునకు మార్గదర్శిగా అభిప్రాయ పడినారు.

వేనుడు ఋషులను, విష్ణుమూర్తిని కాదని, తన్నే ఆరాధింప వలెనని నిర్బంధించినట్లుగా భాగవతములో చెప్పబడినది. "కొంచె మించు మించుగా ఆర్య ఋషులుగూడ నీ వాద మును అంగీకరించి యుండిరి. లేనిచో "నా విష్ణుః పృథివీ పతిః" యను లోకోక్తికి కారణమే యుండదని" శ్రీ కవి రాజు గారన్నారు. ఈ వాక్యము పరిశీలించి అన్నదేగాని తమ వాదమును సమర్థించుకొనుట కన్నదిగాదు. అయితే దానిని వేనుడు దుర్వినియోగము చేసినాడని కొందరు వాదింపవచ్చును. తమ కనుకూలము కాని పనులు నిర్వ హించునప్పుడు ఎవరి విషయమునను నిట్లే వాదింతురు గదా!

శ్రీ కవిరాజుగారు వేనుని బౌద్ధమత ప్రతినిధిగా నూహించి తదనుగుణముగా చిత్రించారు. అయితే ఆర్య ధర్మమును ప్రతిష్ఠాపనము చేయవలయునను తాపత్రయ ముతో తక్కిన మతములను దుమ్మెత్తిపోయువారికి బౌద్ధ ధర్మమన్న ఋూసడింపేగాని గౌరవ ముండదుగదా! పైగా ప్రజలను నాస్తికులను చేయుటకే విష్ణుమూర్తి బుద్ధుని అవ తారమెత్తినాడని పసిపిల్లలకు సైతము బోధింప ప్రయత్న ములు జరిగినవి—

'ఖూని' నాటకములో వేనుని పాత్రయు, 'సునీథా దేవి' పాత్రయు ఆదర్శవంతముగా, తాము నమ్మిన ధర్మ మార్గమున నిర్భయముగా ప్రయాణించి తుదకు ధర్మమునకై బలి కావలసివచ్చినను వెనుకాడలేదు వే[illegible]

అహింసామూర్తి, ఆర్ద్రహృదయుడు. సర్వప్రాణులకు క్షేమము నాశించినవాడు. సునీథాదేవి వేనునకు ధర్మ జ్యోతితో వెలుగుబాటలు తీర్చిదిద్దినది—

మరియు తమ నాటకమున శ్రీ కవిరాజుగారు యజ్ఞములు నిరుపయోగములనియు, కొందరు స్వార్థపరులు తమ ప్రయోజనముల కొరకై హింసకు వెనుదీయక సంఘమును తమ పాదాక్రాంతము చేసికొను పనులనియు నిర్భయముగా లోకమునకు చాటినారు. ఇది శ్రీ కవిరాజుగారికే చెల్లినది—

కేవలము మతైకదృష్టితో రాజ్యమును పాలింపవలయునని ఋషుల అభిప్రాయము. అట్లుకాక ప్రాణిహితైక దృష్టితో పాలింపవలయునని వేనుని అభిప్రాయము. తమ కనుకూలముగాని వేనునిపై ఋషులు కుట్రపన్ని అతని ఆంతరంగికుడు, సేనాధిపతియునైన ధృష్టవర్మతో వేనుని 'ఖూనీ' చేయించినారు. ఇట్టివి పురాణములలో యింకా వున్నాయి. అలాగే భట్టువలె తమను సంకీర్తనము చేయు 'ఇంద్రుడు' చేసే నెట్టికార్యములనైనను సమర్థించి ఆతని పదవిని నిల్పుటకై ఋషులు పడరానిపాట్లు పడినారు. అవును మరి ఇంద్రుడు శతమఖుడు గదా !—

శ్రీ కవిరాజుగారు తమనిశిత పరిశీలనముతో పురాణములను అవలోధనము చేసి 'వేనరాజు' వంటి చక్రవర్తుల అపకీర్తి పంకమును కడిగివేయుటకు కృషిచేసి తమ జీవితమును సార్థకము చేసికొన్నారని 'ఖూనీ' నాటకము చదివిన పాఠకులకు కలిగెడి అభిప్రాయము—

నిరంకుశుడు నిష్కర్ష వాదియై
మానవ సంఘపు మాలిన్యంబును
కడిగివేసె కవిరాజు చౌదరి
పురాణగాధల ఐతిహాసముల
బూటక మాటలు మాటుకు ద్రోసిన
సూతాలయమమ్మా !
నీ గీతాలయమమ్మా !

— రాటకొండ.

# కవిరాజులో భావ పరిణామం

కవు లనేకులుగా వున్నారు. అద్దంకి శాసనకాలం నుంచి కవులున్నారు. తెలుగు కవులలో నాటినుండి నేటి వరకు స్వంత కావ్యాలను వ్రాసినవారు అరుదు. అనువాద ములనో, అశ్చాదనములనో, కథలపుణికి పుచ్చి కల్పనలను అల్లుటతోనో కవుల ప్రతిభావ్యవృత్తులు పరిఢవిల్లుతూ వచ్చినవి.

రామాయణ భావుకులు, భారత భావుకులు, భాగ వత భావుకులు, కాళిదాస భారతేత్యాది భావుకులతో తెలుగు సాహిత్యం నిండికూర్చుంది. ఈ పెద్ద కృతులు పోగా, వుపాఖ్యాన పెంపరిక కృతులు జాస్తి కాజొచ్చినవి.

మొత్తముమీద అనుకరణకు, అనువాదాలకు వున్న విలువ స్వంత కృతులకు లేదు; స్వంత కృతులు లేని కారణం చేత అట్లు జరిగినది.

ముక్తక కవులలో భావుకత కలదుకాని, అది పరిణతి చెందిన రీతి కాదు. శతక కవిత ముక్తకవిత. శతక కవులలో సాంఘిక భావుకులు కలరు. శతకాలను కావ్యాలనుగా యెంచకపోయిరి.

వర్తమానాంధ్రలో చారిత్రక పురుషుల గాథల

చుట్టూ కావ్యాలు జాస్తిగా వచ్చినవి. యిది జీవిత కథల సాహిత్యం.

యివిపోతే, సమాజాన్ని వుత్తేజ పరచగలిగి, ఘూర్ణింపగలిగి, పూర్వాపరాల సమన్వయాభావంకలిగి, నూతన భావపరిధుల్ని కల్పనజేయగల సాహిత్యం కొరవడింది. సాహిత్యంలో అవ్యవస్థ మేర్పడింది. కవితా ప్రతిభగల్గి, విషయ గర్భితమై, వుత్పన్నతాశక్తి గల్గిన సాహిత్యం చాల తక్కువ.

ఆ తక్కువగావున్న వున్నతకోవలోని సాహిత్యాన్ని యెక్కువగా సృష్టించినవాడు త్రిపురనేని రామస్వామి. అందులకే ఆతడు కవిరాజు.

కవిరాజు కవితలు భావప్రధానాలు. కవితకు నిలయాలు. రచనలో ఆయన ఆగర్భ శ్రీమంతుడు. ఆద్యంతాలు, భావముమించు శైలితో, శైలినిమించు భావంతో నిండారి, పింపిస లాడుతూ వుంటవి. ఈ మాదిరి సాహిత్యమల్లినవారు లేరు; అందుకేవారు భావవిప్లవ కవులు.

వీరి రచనలకు పౌరాణిక, చారిత్రిక, సాంఘిక, నైతిక రంగాల్లో భావుకతలు కలవు. అది కురుక్షేత్రంగాని, శంబుకవధగాని, సూతపురాణములుగాని, ఖూనీగానీ, భగవద్గీతగానీ, కుప్పుస్వామి, ధూర్త మానవాశతకాలుగాని, నరకంగానీ, అంపకంగాని — మరేదైనా సరే — పై నాలుగు భావరీతులు, యేకంగాగానీ, కలగాపులగంగాగానీ త్రిపురనేనిలో తాండవిస్తవి.

పురాణ కథల్లో—కురుపాండవులు, రాముడు, ప్రహ్లాదుడు, కృష్ణుడు, ఏకలవ్యుడు మొదలైనవాటిల్లో పాతపురాణాల్లో కనబడే పక్షంగాక, అందులో తక్కువగా, నీచంగా చూడబడే పక్షంవైపు కవి మొగ్గి, పురాణాల్లో మెచ్చుకోబడే వారిలోకన్నా, వారిలోనే మంచి హెచ్చుగా వున్నదని, రెండో వైపు కథను చూపుతాగు. విలువ ప్రధానాశ్రయంగా తీసుకొన్నారు.

చరిత్రాంశంగా పురాణాలు నిలవవు. రామాయణ, భారత గాథల కాలనిర్ణయాలు చేయటంలో రామస్వామిగారు నాటికి దొరకిన చారిత్రక పరిశోధనా వరవడిలోనే పయనించారు. కావ్యగత అంశాల్ని గ్రహించారు. అంతే కాక, రామాయణగాథ యావత్తూ ఆర్య ద్రావిడ (లౌక, వైష్ణవ, శైవ) ఘర్షణగా గ్రహించారు. భారత, భాగవత కృష్ణుని ద్రావిడత్వాన్ని వుగ్గడించారు. వైష్ణవ, శైవ పోరాటాలే పలనాటి చరిత్రకూ మూలకందంగా చూపారు. వుత్తరాది కథలకు ప్రతిగా స్వీయదేశ కథను లేవదీసి, సామ్యాలను చిత్రించి, చరిత్రకు కవితావేశాన్ని కల్పించి, సాంఘికతలను వెలార్చారు.

కవిరాజులో సాంఘిక భావుకత అన్ని కావ్యాల్లో కనబడుతుంది. అది ఆయన రచనలోని విశిష్టత. ఆ సాంఘికతలో విలువలు కట్టగల గుణంకోసం, కార్యకారణ సంబంధంకోసం దేవులాడతాడు. నైతికతలు హేతుభావంతో చూడగలిగాడు.

పాతపురాణ వైరం, వేదాలమీద మొదట్లో ఆధార పడి రానురాను వాటినీ కాదనటం, మామూలు దేవుళ్లను యీసడించినా ఆదిలో కనబడే పరతత్వమహాత్మ్యాన్ని చూచిన భావం పూర్తి నాస్తికంలోకి పరిణతి వారటం, ప్రాయికమైన హేతువాద వివేశనలు, తెలుగు నుడికారం తో కమ్మని కవిత్వాన్ని విమర్శలో అల్లగలగటం అనేవి కవిరాజులో ముఖ్యంగా గమనించదగ్గ ఐదు గుణాలు. యివి వారి భావాలు. కవిరాజు ప్రభావాలు. పరిణామ శైలిలో పరిణతి నొందినవి.

పాతపురాణ వైరం : పురాణ స్మృతి యితిహాసాల బండారాన్ని ఆంధ్రలో తరచి, తెరచి చూపినవాడు కవి రాజు. రూపాయికి రెండు ప్రక్కలున్నవని నిరూపించి, రెండవప్రక్క చూపించి, యథార్థాన్ని గ్రహించమని ఆవేదనలను లోకానికి నివేదించినవాడు రామస్వామి. ఈయన భావుకతలో యిది అగ్రగణ్యమైనది.

వేద ప్రమాణం : మొదట్లో స్మృతి పురాణేతిహా సాలను కాదన్న రోజుల్లో (కురుక్షేత్రం, శంబుకవధ, సూతపురాణ) వైదిక ప్రామాణ్యతను అంగీకరించే భావాలు కలవు. వేదప్రామాణ్యాన్ని అంగీకరిస్తేనే సభకు వస్తానం టాడు శంబుకర్షి. కాని, భగవద్గీతలో పాత భవగ్గీత కుల్లి పుచ్చబడింది. వేదాలసారం వుపనిషత్తులు, ఉపనిషత్తుల సారం గీతగా యెంచబడు లోకభావనను కాదని త్రోసివేసి నాడు. గీతను గిరాటువేసి కొట్టివేశాడు. ఖూనీలో వేనుడు

'ఆ వైదిక కర్మమన్న పొరపాటున నేనియు' మెచ్చని స్థితికి వచ్చాడు. వేనుడు కవిరాజు. వేనుని వాదన కవిరాజు భావాలు. కవిరాజు భావపరిణామాన్ని పొందినవైనం వేద పరంగా చూడవచ్చు.

దేవుడు : కవిరాజు ఆదిలో నాస్తికుడుకాదు. అనేకులైన దేవుళ్ళు లేకున్నా, మూలకారణమై మహత్తర తత్వమేదో కలదన్న భావం సూతపురాణంలో కలదు. అది కవిరాజును దైవవాదిగా చేయకపోయినా, నాస్తికుడు కాదు. ప్రకృతివాది కావచ్చు. కాని ఖూనీలో వేనుని పాత్ర ద్వారానూ, పీఠికలోనూ సంపూర్ణమైన, స్పష్టమైన రీతిని వారి నాస్తికతను వెలార్చాడు. ఖూనీ నాటికి కవిరాజు పరిణతిచెందిన నాస్తికుడు.

హేతువాదం : కవిరాజు పురాణ వైరాన్ని పాటించినప్పుడు నైహిలిస్టుగా, ఐకనోక్లాస్ట్‌గా వున్నాడు. పాత దానిమీద అనుమానాన్ని పుట్టించి, పాత మానసిక పౌరాణిక చిత్రాలను ప్రజల్లో పగులగొట్టివేశారు. సూత పురాణాలనుండి గీతకు, ఖూనీకి వచ్చేసరికి, కవిరాజులో హేతువాదం ప్రకటితమై వెన్ను ముదరినది. ఖూనీ పీఠికలు, గీతా భూమికలు దీనికి ప్రత్యక్షర నిదర్శనాలు. హేతువాదిగా మారే నాటికి నాస్తికుడుగా మారినారు.

సాంఘిక విమర్శకవితలు : సాంఘిక దౌష్ట్యాలమీదిదాడి, లోపాల నెత్తి చూపుట, విమర్శించి మరో

మార్గాన్ని చూపుటలో కవిత్వస్థాయి కందుట కవిరాజు యేకైక విశిష్టత.

ఈ తీరు తెన్నులు పరిశీలిస్తే కవిరాజు త్రిపురనేని భావపరిణామచ్ఛాయల్ని స్థూల రూపంలో గ్రహించవచ్చు.

— ఏ. జీ. కె.

# భగవద్గీత

'భగవద్గీత' యనగా భగవంతుడు చెప్పిన గీత. ఇచట భగవంతు డనగా శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుడు భగవదవతారమని, పరమాత్ముడని హిందువుల అంధవిశ్వాసము, నిశ్చితాభిప్రాయమునై యున్నది.

ఎందరో మహర్షులు, మహనీయులు, యోగిపుంగవులు, పండితులు శ్రీకృష్ణ భగవద్గీతకు వ్యాఖ్యానములు రచించిరి. ఇదొక విలక్షణ గ్రంథముగా గన్పట్టుచున్నది. ఎవ్వరే యర్థము జెప్పుకొనదలచినను, యెవ్వరే భావము జూపింపదలచినను నా యర్థము, నా భావము నిందలి శ్లోకముల గోచరించుచుండును. కర్మ, జ్ఞాన, భక్తి యోగముల కిది మూలకందము. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతముల కిది మూలాధారము. యుద్ధోన్ముఖుని జేయ సమకట్టిన యీ భగవద్గీత మహాత్మాగాంధీ ప్రబోధించిన అహింసావాదమునకుగూడ మూలకారణముగా గన్పట్టుచున్నది.

'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" పాపులు చెలరేగి లోకము పాపపంకిలమయి ప్రజా పీడల జరుపుచుండ వాని నరికట్టి, తొలగించి ధర్మ సంస్థాపన జేయుటకు, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ జరుపుటకు భగవంతు

డప్పు డప్పుడు అవతార మెత్తుచుండునని హిందువుల ప్రగాఢ విశ్వాసము. శ్రీకృష్ణు డందులో నొక యవతారమూర్తి. అంతకు ముందు భగవంతు డెన్నో యవతారముల దాల్చి యున్నాడు. ఆ యా యవతారపురుషులుగూడ నిట్టి భగవద్గీతలు చెప్పియుండక తప్పదు. కాని యా యుగములు గడచిపోవుటచే గాబోలు నా యా భగవద్గీతల యావశ్యకతయు లేకపోయినది. అందుచే వానిని మనము చూడలేక పోవుచున్నాము.

ద్వాపరయుగమున నుద్భవించిన అవతారమూర్తి శ్రీకృష్ణ భగవానుని 'భగవద్గీత' ఈ కలియుగమునగూడ నుండనేల? తరువాత ఈ యుగములో అవతారపురుషు లుద్భవించలేదా? ఉద్భవించినను వారు ధర్మ సంస్థాపనకై తాము ప్రత్యేకించి యేమియు 'భగవద్గీతలు' ప్రబోధించ లేదా? లేక శ్రీకృష్ణ భగవానుని 'భగవద్గీత'యే నేటి యుగమునకు, ప్రజానీకమునకుగూడ భక్తి, ముక్తి సాధనములకు ప్రామాణిక గ్రంథమా? అను సందేహములు జనించక మానవు.

ఈ కలియుగములోకూడ అవతారపురుషు లుద్భవించినారు. బుద్ధ భగవానుడు తన అహింసాబోధతో పాపపంకిలమయిన మానవ లోకాన్ని నిర్మలమొనర్చి, పులకితం చేసి ముక్తిమార్గాన్ని సుగమం చేయగలిగినాడు. తరువాత 'చాపకూడు' తో పెడత్రోవలు ద్రొక్కిన మానవ సమాజాన్ని ఐక్యం చేయాలని బ్రహ్మనాయుడు సల్పిన కృషి మరువరానిది. కాని పండితుల ఉపేక్షచే, మహనీయుల

మూకీభావమువలననూ, మొదటిది కర్మభూమియయిన భారత భూమిని కాలూనుకొనలేక విదేశముల నాశ్రయింపవలసి వచ్చినది, రెండవది కేవలము పామర జనుల వీధి గాథగా నిలచిపోయినది. ఈ రెండవదానిని గ్రంథరూపమున వెల యించుటయే 'కవిరాజు' యాశయము.

"బ్రహ్మర్షీంద్రుఁడు బోధించిన గీతను గ్రంథ రూప మున నీ యేడెనిమిది శతాబ్దులలో నెవ్వరు వెలయించి యుండలేదు. అట్టి ప్రయత్నమయినను లేదు. పురాకృత కర్మ ఫలముగ నా కొరత దీర్చి, యానందించు మహా భాగ్యము మాకు లభించినది. దాన భుక్తి, ముక్తులు దొరికి నట్లు నిరంతర మానందించుచుంటిమి" యని కవిరాజు తమ తొలిపలుకులలో జెప్పుకొనిరి.

బ్రహ్మ భగవద్గీత ప్రవచనముల విపులీకరణమునకు ముందు శ్రీకృష్ణుని భగవద్గీతను గురించి స్థాలీపులాక న్యా యముగా రెండు, మూడు విషయముల జర్చించుట యవ సరము. సత్యాసత్యములను, విషయనిర్ణయమును విజ్ఞులు, నిష్పాక్షికులు నయిన పాఠకులే దేల్చుకొందురుగాక!

అవతారపురుషులు కేవలము భారతదేశమునకే యందును నుత్తర భారతభూమికే పరిమితమైయున్నట్లు దోచుచున్నది. అంతియెగాదు; ఆర్యులరాకతో నీ యవతార పురుషుల రాక కూడ ప్రారంభమయినట్లు గన్పట్టుచున్నది. అంతకు ముందు ద్రావిడరాజులలోగాని, తరువాత నంతటి నుంచి నింత దనుక దాక్షిణాత్యులలోగాని, దక్షిణా పథ మునగానీ నీ యవతారమూర్తుల పొడ గన్పట్టియుండలేదు.

మధ్య ఆశియానుండి క్షుద్రార్తులై భారతదేశముపై దండెత్తివచ్చిన ఆర్యులు ఉత్తర భారతమున కాలూనుకొని తమ యధికారము సుస్థిరమొనర్చుకొనుటకై యచ్చటనున్న ద్రావిడులను తరిమిగొట్ట వారు క్రమేపి దక్షిణాపథమున తమ స్థావరముల నేర్పరుచుకొనుట చరిత్రప్రసిద్ధముగదా! ఈ యార్యులే తమ యధికారమును, మతమును, జాతిని సుస్థిరమొనర్చుకొనుటకు అవతారపురుషుల సృష్టించిరి. ఆ యవతారమూర్తులే రాను రాను యావద్భారత దేశమునకు అవతారమూర్తులైరి. అచ్చటచ్చట వీరి నెదిరించిన ద్రావిడ రాజులు లేకపోలేదు. ఆర్యులచే వీరు దస్యులు, రాక్షసులు, కిరాతకులుగా వర్ణింపబడిరి.

"చాతుర్వర్ణ్యమ్ మయా సృష్టమ్ గుణ కర్మ విభాగశః" యని భగవద్గీతను చెప్పిన శ్రీకృష్ణుడే వచించినట్లు ఆర్యుల సూక్తి.

అంతకు ముందు షడ్దర్శనములలో నొకటియైన న్యాయశాస్త్రమును రచించిన గౌతమ మహాముని 'ఆర్య స్త్రైవర్ణికా' యని సుస్పష్టముగ వచించెను. తరువాత మనువు, 'నాస్తి తు పంచమ' యని, పండితులు 'పంచజనా' యని చెప్పియున్నారు.

ఇందులో ఏది సత్యము, ఏది అసత్యము? పైన ఉదహరించిన సూక్తులు చెప్పినవారందరూ మహనీయులు,

మేధావంతులు కూడాను....మానవ పరిణామవాదము నంగీక రింపని యెడల పై వాక్యములకు సమన్వయము కుదురదు.

గౌతమ మహాముని వచించిన మూడు వర్ణములు ఆర్యులకు మాత్రమే యన్వయించును. దీనివలన నా కాల మున ఆర్యులుకాని మనుజులు ప్రపంచమున, ప్రపంచ మన నేల భారతదేశముననే లేరని చెప్పగలమా?....ఉన్నారు. కాని వారు ఆర్యుల కథనం ప్రకారము మనుష్యులుగా పరి గణింప బడలేదు.

కాలం గడచిన కొలదీ జనసంఖ్య పెరుగుతూ వచ్చి నది. భారతదేశమున ఆర్యులతో బాటు మానవులుగా పరిగ ణింపని వారి సంఖ్యకూడా పెరుగజొచ్చినది. మఱి వారికి గూడ నేదో యొక ముద్ర వేయక తప్పినది గాదు. భగవదవ తారమయిన శ్రీకృష్ణునిచే నీ ముద్ర వేయించిన గాని యది శాస్త్ర సమ్మతము, ప్రజల యంగీకారము బొందజాలదు. కనుకనే భగవంతుడు 'చాతుర్వర్ణమ్ మయా సృష్టమ్' అని గట్టిగా వక్కాణించినాడు.

మొదటి మూడు వర్ణములు ఆర్యులకు సంబంధించిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు. ఆర్యులచే మనుష్యసమూ హంగా పరిగణింపని వారంతా శూద్రులుగా, వీరి వృత్తి కేవలము దానిసవృత్తిగా నిర్ణయింపబడి బ్రాహ్మణ,క్షత్రియ వైశ్యవర్ణములకు అహర్నిశలు సేవచేయుటలోనే వీరికి భుక్తి ముక్తి మార్గములు కలవని స్పష్టీకరించబడ్డది.... భగవంతుడు స్వయముగా మానవులను సృష్టించెను గదా! మఱి అట్టిభగ

వంతునకు తానుసృష్టించిన మానవులలోనే యిన్ని హెచ్చు తగ్గులను కల్పించుటకు ఏమి యవసరము గల్గెనో ?

మనువు కాలము నాటికి ఈ చాతుర్వర్ణ వ్యవస్థ అంతటితో సాగలేదు. పరిణామాన్ని యెవరడ్డుకొనగలరు? జనసంఖ్య పెరుగుచునే యున్నది. వినూతన సంకీర్ణులు బయలు వెడలిరి. మఱివీరిని ఐదవ వర్ణముగా నిర్ణయింప వలదా! సంఘ మందుల కంగీకరింప సిద్ధపడ లేదు కాబోలు. మనువు 'నాస్తితు పంచమ'యని వాక్రుచ్చినాడు. అయినను కాలచక్రము ఆగలేదు. ఆర్య ద్రావిడ సంపర్కముచేత క్రొంగ్రొత్త జాతి యుద్భవించినది. దీని నరికట్టనియెడల ఆర్య జాతి, ఆర్య మతము, ఆర్యుల అధికారము నామరూపములు లేకుండ నశించి పోవునను భయము, ఆందోళన ఆర్యుల నావరించినది. అందుకనే యీ నూతన జాతి పంచమ వర్ణ ముగ, ఛండాలురుగ వర్ణింపబడినది.

ఇచట మరియొక విశేషము జెప్పనవసరమైయున్నది. నేటివరకు హైందవులకు ప్రామాణికుడుగా నెంచబడుచున్న మనువు తన ధర్మ సంహితములో ఆంధ్రుల నన్ని కులముల వారిని వ్రాత్యులలో జేర్చెను. వ్రాత్యులన సంస్కార శూన్యులు, మ్లేచ్ఛులు. స్మృతుల శాసనముల బట్టి ఆంధ్రు లందరును నేటికిని మ్లేచ్ఛులుగానే పరిగణింపబడవలసియున్నది. అట్టితఱి నీ యాంధ్ర దేశమున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణముల వారెట్లుందురు? మఱి ప్రస్తుతము ఆ విధముగా చలామణి అవుచున్న వారెవరు? వీరు ఆర్య సంతతికి జెంది ఇచ్చటకు చేరవచ్చిరా లేక మ్లేచ్ఛులయిన ఆంధ్రుల

నుంచి వీరు తమను తాము వేరు పరచుకొనిరా ? చరిత్ర తేల్చవలసిన విషయమిది.

ఇక నొక్కమాటతో నీ చర్చ ముగించి బ్రహ్మభగవద్గీతా రహస్యమును దెలిసికొందము. ఆచార వ్యవహారములు ఏండ్లు, పూండ్లు గడచిన కొలది అలవాట్లుగా మారి జీర్ణించి నరనరాలా కెగబ్రాకి ఆశయాలుగా రూపొందుట వలననేమొ దాస్యశృంఖలాలు స్వర్ణకంకణాలుగా గన్పట్టుచున్నవి. వీనిని సడలించ నక్కడక్కడ ప్రయత్నములు జరుగుచున్నను ఐక్య కంఠముతో బద్ధకంకణు లింతవరకు ముందుకు రాలేకపోవుట విచారణీయాంశము.

నిన్న మొన్నటి చైనా దండయాత్రకు భారతజాతి సమైక్యమై ఎదిరించ బూనుకున్నది.నూటయేభై రెండు సంవత్సరాల బ్రిటిషువారి పెత్తనము తొలగించుటకు ఎంతో హంగామా చేసినగాని జాతి కన్విప్పలేదు కొన్ని శతాబ్దుల మహమ్మదీయ పరిపాలన నెదిరించుటకు మారుగా జాతిలో సగము ప్రతిపక్షముననే జేరినది. ఇక వేలకొలది సంవత్సరములనుండి అనుభవించుచున్న దాస్యము నెట్లెదిరించగలదు. అందులో మిళితమై, అదే పరమార్ధముగా భావించి, ధర్మాధర్మములను,సత్యాసత్యములను, యుక్తాయుక్తములను నిర్ణయించుకొనలేని స్థితిలో కొట్టు మిట్టాడుచున్నది.

## బ్రహ్మ భగవద్గీత

"దాయభాగమునకయి కురు పాండవులు ముఖాముఖ యుద్ధసన్నద్ధులై కురుక్షేత్రమున నిల్వ, పార్థుడు ఉభయసేనా

మధ్యమున నిల్పి ఉభయ సేనల దిలకించి యందు గల చుట్ట పక్కంబుల జూచి విక్లబ్యుడై తడపడుచున్న సమయమున శ్రీకృష్ణపరమాత్ముడు భగవద్గీత నుపదేశించి యాతని శోక మోహముల నడిగించి యుద్ధోన్ముఖుం జేసె ననారిసంగ్రామము సాగించెనని ప్రతీతి." ధర్మ సంస్థాపన కొరకు సంగ్రామహోమం తప్పదా?...."భీష్మ ద్రోణ కృప బాహ్లిక సోమదత్త చేకితాన కృతవర్మ శిఖండి ధృష్టద్యుమ్న విరాటప్రభృతుల సేమి పాత కములు చేసిరో భారతము చెప్పదు." ఇందు కొందరు పాండవ పక్షమున నిలబడి పోరాడిరి. మిగిలినవారు ప్రతి పక్షమున నున్నను పాండవ పక్షపాతులే. ధర్మము పాండవ పక్షమున నున్న వీరందరు మడియుట మేల అంతియెగాదు కురుపాండవ సమరమున పాల్గొనిన పదునెనిమిది యక్షౌహి ణుల సేనావాహిని మొత్తము మారణ హోమమునకు గురి యైనది. మిగిలినది పదునొకండుగురు మాత్రమే. తక్కినవారి నందరిని పాపుల క్రింద జమకట్టవలసినదేనా? కర్ణుడు లేనిచో మహాభారత యుద్ధము లేదని కొందరు విజ్ఞులు వక్కాణిం తురు. కాని శ్రీకృష్ణుడు లేనిచో కురుక్షేత్ర సంగ్రామ ముండెడిది కాదని ఎవ్వరయిన చెప్ప సాహసింతురా?.... ఇది భగవద్విలాసము. ఇంతకంటె మరొక సమాధానము దొరుకదు.

అదే విధముగ బ్రహ్మనాయుడు లేనిచో పల్నాటి యుద్ధము జరిగియుండెడిది కాదు. నలగామ మలిదేవరాజులు దాయభాగమున కయి కారెంపూడి సమరభూమియందు యుద్ధ సన్నద్ధులై నిల్వ బాలచంద్రుడు ఉభయ సేనల యం

దున్న తన చుట్టు పక్కలంబుల వీక్షించి శోకమోహంబుల కార్య విహ్వాలుడై యీ యుద్ధ మెందులకు ? ఎవరికొరకు? దీని ఫలిత మెట్టిది ? యని వాపోవుచున్నతటి తండ్రి బ్రహ్మనాయుడు వాని వీపు తట్టి భగవద్గీత నుపదేశించి బాలచంద్రుని శోక మోహంబుల దొలగించి యుద్ధోన్ముఖుని జేసి మారణ కర్మము సాగించినాడు. ధర్మసంస్థాపన కొరకే యుద్ధముగూడ జరిగినది. ఇదియు భగవద్విలాసమే!

బాలచంద్రుడు 'ధర్మస్థాపనకొరకు!' బంధు మిత్రుల హతమార్చ నిచ్ఛగింపడు. బ్రహ్మనాయుడు సాంఖ్య, జ్ఞాన కర్మ యోగాదికములచే బాలచంద్రునికి గలిగిన శోక, మోహంబుల, భయ సందేహంబుల నివారించి యుద్ధోన్ముఖుని జేయు ప్రయత్నమే యీ భగవద్గీతోపదేశము.

కురుక్షేత్రసంగ్రామమున పాండవమధ్యమునకు గల్గిన సందేహములకంటె నివి కొంత ముందడుగు వేసినవి. అది ద్వాపర యుగము. ఇది కలియుగము. కాలము పరిణామము చెందినది. జ్ఞానము హెచ్చినది గదా!

"మానవులందరూ ఒకటే. అందరికీ ఒకటే ధర్మము. వేరువేరు కులములు, వర్ణములవారికి వేరువేరు ధర్మములు కలవనుట స్వార్థపరుల కల్పన. వీరి ప్రయత్న ఫలితమే నేడు మానవ సమాజ మిట్టి అవ్యవస్థకు, అధోగతికి గురియగుటకు కారణభూతమైనది. ధర్మ సంస్థాపన యన దీనిని సమూలముగ నాశనముజేసి, సమాజమును పునర్నిర్మాణమొనర్చి, సజీవ మొనర్చుటయే. ఇందులకు నీవు నిమిత్తమాత్రుడవు. పాప పుణ్యంబులు నిన్ను అంటవు. మానవుడు జీర్ణ వస్త్ర

మును ద్యజియించి నూత్నవస్త్రము నలంకరించుకొనునట్లు ఆత్మ ఒక శరీరమును విడచి మరొక శరీరమును జేరుచుండును. ఆత్మకు చావులేదు. ఎవడు కష్ట సుఖములని, పాప పుణ్యములని భేదభావముజూపక సమదృష్టితో యనుభవింప గల్గునో వాడే స్థితప్రజ్ఞుడు. అట్టివానికి కార్యాచరణయే ప్రధానము. ఫలితమునకై యెదురుచూడడు. కనుక కార్యోన్ముఖుడవై యుద్ధమును సాగింపుము. వీరస్వర్గ మలంకరింపుము" అని బ్రహ్మనాయుడు బాలచంద్రున కుపదేశం చేస్తాడు.

ఒక కులమున కొక ధర్మం
బొక వర్ణంబునకు వేఱె యొక ధర్మము త
ప్పక కలవని చెప్పెడి వా
నికిఁ బురుషార్థములు గలుగనేరవు పుత్రా!

బాలచంద్రుని మనస్సులో అనేక ప్రశ్నలు రేకెత్తినవి. స్వర్గ-నరకములు, శరీరము - ఆత్మ, జన్మ - పునర్జన్మ ములు మొదలైనవానిని గురించి తండ్రిని ప్రశ్నిస్తాడు.

చచ్చిన పిదపన్ నరకమె
వచ్చునొ స్వర్గంబు యూడి పడునో చెప్పన్
వచ్చునె యెవ్వనికేనియు
నిచ్చకములఁ జెప్ప లాభమేమి మహాత్మా!

* * * *

ఆత్మయను వస్తువున్నదో యసలు లేనె
లేదొ నాకు నమ్మిక గల్గఁలేదు గాన
మొయిలులో నీరు నమ్మి యే మూర్ఖుఁడైన
జెరువు గట్టలఁ దెగఁగొట్టి చెఱుపఁగలడె?

మ ఱి యు

జీర్ణ వస్త్రంబునందలి చినుఁగ కఱలు
నందెయుండి మనుష్యుని నంటనటుల
దేహము పౌనర్భ కర్మ సందోహ మంట
దాత్మదేహంబుఁ ద్యజియించి యరుగునపుడు.

అయిన పునర్జన్మకు కారణభూత మేట్టిదని తండ్రిని ప్రశ్నిస్తాడు. అంతటితో బాలచంద్రుడు ఆగలేదు. వర్ణవ్యవస్థను గురించి, యజ్ఞయాగాదులను గురించి తన సందేహనివృత్తి కొరకు తండ్రిని ప్రార్థిస్తాడు. తండ్రి,

"వర్ణవ్యవస్థ, యజ్ఞయాగాదులు ఆర్యజాతి కల్పన. ద్రావిడజాతిని దాస్య శృంఖలాలతో బంధించడానికే నాల్గవ వర్గము సృష్టించబడినది.

"వాదములాడకుండ విను వాస్తవమున్ వినుపింతు లేవు స్పృ
ష్ట్యాదిఁ గులంబులున్ మనుజులందరు నొక్కటే తారతమ్యమున్
లేదు విశేష ధర్మములు లేవు దరిద్రులు విత్తవంతులన్
భేదములేదు నేనెకద వీనికి నెల్లను స్రష్టఁ బుత్రకా !

ఆర్యజాతికి నొకటికే యన్వయించు
బాలచంద్ర! ఈ వర్ణ వ్యవస్థ యన్వ
యింప నేరదు పెఱజాతి కెందు; స్మృతులు
వ్రాసిన ఋషులాడిరి యిట్లు పాడిదప్పి

"వైదిక ధర్మముం జెరుప స్వార్థపరాయణ చిత్తులై త్రయీ
వేదుల మంచు గొందరు వివేకమువీడి స్మృతుల్ రచించి త
ద్వైదిక ధర్మ సారమని వాకొనినారు కుమార! యిట్టి దు
ర్వాదము మాపకున్నయెడ వర్ధిలుఁ దప్పక ధర్మపీడలున్."

అని ప్రబోధించ బాలచంద్రుడు తిరిగి

"యజ్ఞ శిష్టామృతము గడుపారఁ గ్రోల
మోక్షమే వచ్చుచో మొట్టమొదటినుండి
యిన్ని ధర్మముల్ సేయింపనేల? సుతపు
కాదె యన్నిఁటి కంటె యజ్ఞములు జేఁయ."

యని తండ్రిని ప్రశ్నిస్తాడు.

బ్రహ్మనాయుడు కుమారుని విభూతియోగముచే సంతృప్తి బరచ యత్నిస్తాడు.

"సుతములై పుట్టకున్నయెడ మారణ కర్మము లిన్ని సాగునే
ప్రతి దివసమ్ము భారతధరాస్థలి? నే నిటువటు కర్మ సం
తతులను సైఁచువాఁడనె సనాతన ధర్మ మొకండె యంచు న
మ్మి తిరుగువారి కెల్లపుఁడు మేలొఁడగూర్చుచునుంటఁ బ్రేమమై."

అని చెప్పి బ్రహ్మనాయుడు, "ఈ విశ్వములో యెక్కడ జూచిన ఏ ప్రాణియందయినను, ఏ వస్తువునందయినను నా రూపమే కనబ్బగలదు. మేకముల, ఉకముల, శకటముల, మూనల, నానరుల, మీనుల, సానుల, మూకుల, ఏకుల, కాకుల, కారుల, ఏరుల, కంకుల, రంకుల, అంకెల, వంకల, వెలుగుల, పులుగుల, కలుగుల, తెలుగుల........ ఇందుగల డందు లేడననేల?" ఆదిమధ్యాంతములకెల్ల నాది కారణమ్మ నేనే యని ప్రబోధిస్తాడు.

ఏది చెప్పినా, ఏది బోధించినా బాలచంద్రుని సందేహం సందేహంగానే వుండిపోతుంది. నివృత్తి కాదు. చివరకు బ్రహ్మనాయుడు తన విశ్వరూప సందర్శనంతో బాలచంద్రుని సంభ్రమాశ్చర్య ముగ్ధుని జేసి,

"ఆంధ్రలోక క్షయార్థమై యవతరించి
నట్టి కాలస్వరూపుండ నగుదు నేను
నీవు చంపకుండిన మాత్ర నిలువఁ బోవ
రిపట ప్రోవైన యోధులం దెవగుకూడ."

అని కుమారుని హెచ్చరిస్తాడు.

బాలచంద్రుడు ఆ విశ్వరూప సందర్శనానికి తట్టుకొనలేక చివరకు బ్రహ్మనాయుని ఆజ్ఞ శిరసావహించక తప్పదా యని భావించి,

"తావక దివ్యదర్శనము తప్పక గూర్చెను గొంత శాంతి పైఁ
గావినియుంటి ధర్మములఁ గల్మష చిత్తము దేఱఁ గాని నే
నీ విలయంబు దాటఁగలనే యను శంకజనించె నందుచేఁ
దీవరమైన కయ్యమనఁ దెంపరిఁగాను బురాణ పూరుషా!"

అని అంటాడు.

బ్రహ్మ భగవద్గీత ఇంకనూ యున్నది. "ఇది ప్రథమ భాగము. భాగమున కారేసి యోగముల చొప్పున మూఁడు భాగముల వెలువరింపఁ దలంచు చుంటిమి." యని కవిరాజు తమ యుపోద్ఘాతమున వక్కాణించిరి, కాని కవిరాజు కీర్తిశేషులగుటచే తక్కిన భాగము లవతరించలేదు. మరొక "కవిరాజు" కొఱకు ఎదురుచూడవలసి యుండునా?

అంతవరకు వేచియుండనక్కరలేదు. ఈ బ్రహ్మ భగవద్గీత వెలువడినంత వరకయినను పామరజనములో ప్రచారము జేయుగల్గిన కవిరాజు ఆశయము కృతకృత్యమయినట్లే భావించవచ్చును. ఇందులకు కవిరాజు శిష్యులు, భక్తులు పూనుకొనగలరని యాశ.

ద్వాపర యుగములోని శ్రీకృష్ణ భగవద్గీత ఇప్పటి వరకు బహుళ ప్రచారములో నుండగా వర్తమానయుగము లోని బ్రహ్మ భగవద్గీత అందుకు నోచుకొనలేదేమి? అను నదే కవిరాజు విచారము. శ్రీకృష్ణ భగవద్గీతను మనసా, వాచా విశ్వసించినప్పుడు బ్రహ్మ భగవద్గీతనుకూడ విశ్వ సింపవలయును గదా? రెండవది మిథ్య అనుకుంటే మొద టిది కూడ ఎందుకు మిథ్యకాదనేది వారి ప్రశ్న. రెండూ మిథ్య అనుకుంటే వారికి ప్రశ్నింపవలసిన యవసరమే యుండదు. నిజానిజాలు నిర్ణయింపవలసినది విజ్ఞులు, నిష్పా క్షికులే గదా!

—కోగంటి రాధాకృష్ణమూర్తి.

# కవిరాజుగారి "శంబుక వధ"

భావ విప్లవనేతగా ప్రఖ్యాత చరిత్రులైన కవిరాజు త్రిపురనేని రామస్వామిగారేడు నాటకములు రచియించిరి. వానిలో "కురుక్షేత్ర సంగ్రామము" భారతకథకు సంబంధించినది. పాండవులకంటె కౌరవులే నీతిప్రౌఢవిహారులనియు భారత సామ్రాజ్య పరిపాలనార్హత వారికే గలదనియు నిందు మన శాస్త్రులుగారొక క్రొత్త వాదము లేవనెత్తిరి. "ఖూనీ" భాగవతమునందలి వేనరాజ వృత్తాంతము యజనయాజన నిరతులగు ఆర్యఋషులు కుట్రలుచేసి, కుతంత్రములు పన్ని దయార్ద్రహృదయుడును, సాధువర్తనుడునగు వేనుని ఖూనీ చేసిరని కవిరాజు గారిందు గళమెత్తి నిరూపించిరి. "శంబుక వధ" రామాయణోత్తర కాండములోని యొక ప్రాసంగిక వృత్తము. శూద్రతపస్వియగు శంబూకుని వశిష్ఠప్రేరణమున రామప్రభు వన్యాయముగ వధించెనని వర్ణాశ్రమాచార ధర్మరక్షణమను వేషము వేసికొన్న గూఢ రాజకీయమే యిందుకు కారణమని రామస్వామిగారీ నాటకమున నాకాశభాషణము గావించిరి. "రాణాప్రతాప్" దేశచరిత్ర వృత్తము. మతాంతర వివాహముల ప్రోత్సహించుచు వారిందు హిందూ మహమ్మదీ యైకమత్యమును ప్రబోధిం

చిరి. తెల్ల దొరలది పుల్లకుట్టు గదా! వారి దొరతనమున నా నాటకము నిషేధసత్కారము నందుటలో నాశ్చర్యమేమున్నది? "పల్నాటి పౌరుషము," "నరకము" "అంపకము" అను నాటకములు నేంటికిని అముద్రితములుగనే యుండిపోయినవి. "పల్నాటి పౌరుషము" చాపకూడు(సహపంక్తి భోజనము), వర్ణాంతర వివాహముల యావశ్యకతను ప్రబోధించును "నరకము"గాంధీ మహాత్ముని సత్యాగ్రహోద్యమమునందలి లోపముల నెత్తిచూపగా, "అంపకము"సమకాలీన భూస్వామ్య నాయకత్వమును తూర్పారబట్టును. ఇట్లిన్నిన్ని విధముల కవిరాజుగారు, తమ నాటకీయ కవితచే భావవిప్లవ రంగమున పరమాశ్చర్యకరముగ విశృంఖల నాట్యవిహారము సేయించినారు.

ఉత్తరరామాయణము నందలి, రాముడు జనాపవాద భీతిచే గర్భవతియగు సీతను అరణ్యముల కంపి సీతావియోగమునకు దుఃఖించుటయు,సీత వాల్మీకి ఆశ్రమమున లవకుశులను ప్రసవించుటయు, వాల్మీకి నియోగమున లవకుశులు రాముని సమక్షమున రామాయణ గాథను గానమొనరించుటయు, సీతారాములు పునఃసమావేశమగుటయు మున్నగాగల కథను స్వీకరించి భవభూతి "ఉత్తరరామచరిత" నాటకమును కరుణరస ప్రధానముగ అత్యద్భుత సంవిధాన సంఘటితముగ నొనర్చి వెలయించెను. ప్రజారాధన తత్పరుండైన శ్రీరాముడు దుష్టులనేగాదు, శిష్టులను వధింపవలసివచ్చినను, కడకు తన యర్ధాంగిని విడవలసివచ్చి

నను వెనుకాడ లేదనియు, తత్ఫలితముగ నెట్టి యప్రతిష్ఠను గాని, ఎంతటి దుఃఖమును గాని నిశ్చలముగ నిష్కంపముగ ననుభవింపగలైననియు నిరూపించు ఆ నాటకేతివృత్తమున శంబుకవధ ప్రాసంగికముగ మాత్రమే ప్రస్తావితమగును. అందదియును రాముని ధీరోదాత్తను పరిపోషించుటకు అవాల్మీకములగు శంబూక దివ్య పురుషత్వాద్యద్భుత కల్పనల కై సేసికొనియెను. భవభూతివలెనే కాళిదాసు సమకాలికుఁడగు దిఙ్నాగాచార్యుఁడును ఉత్తర రామాయణకథనే స్వీకరించి సీతారామ వియోగవృత్తమును ప్రముఖముగజేసి "కుందమాల" యను నాటకము నతి రమణీయముగ రచించెను. కాని యందాతఁడీ శంబుకవధా ప్రసంగమే తీసికొనిరాడు. కవిరాజుగారు ఉత్తర రామాయణ కథలోని ఆ శంబుకవధా వృత్తమునే స్వీకరించి యద్దానిని నాటకీకరించుచు సీతాపరిత్యాగ విషయమును సూచనా మాత్రము చేసివైచిరి. వసిష్ఠ ప్రేరితుఁడైన శ్రీరాముఁడు శంబుకవధకు కడంగి యొడిగట్టిన పాపమునువారు ప్రముఖముగ నిరూపింపబూనుకొనుటయే యిందుకు కారణమై యుండవలెను.

"శంబుకవధ" నాల్గంకముల నాటకము. 'ఆ పంచాంక మా దశాంకమ'ని—నాటకము అయిదు మొదలు పది అంకము లుండవలయునని ప్రాచీన సంస్కృత నాటక లక్షణకర్తలు నిర్దేశించిరి. ఆంధ్ర కవులు మొదటినుండియు సంస్కృతకవుల మార్గమే అనుసరించిన వారగుటచే, సంస్కృత నాటక లక్షణములనే శిరసావహించుచు, సంస్కృత నాటకములనే అనువదించుచు, అనుసరించుచు

రచనలు చేయుటపరిపాటియై పోయినది: భావ విప్లవ విధాత యగు కవిరాజుగారీ నాటకము—ప్రాచీనుల అంకిసంఖ్యాది నియమముల నుల్లంఘించి—నాల్గంకముల తోడనే ముగించి అపూర్వమును, సర్వస్వతంత్రమునగు దృశ్యప్రబంధ రచనా విధానమును ప్రదర్శించిన వారైరి. "శంబుకవధ" యని నామకరణ మొనరించి యూరకొనక, "ఉత్తర రామచరిత" యనియు దీనిని వారు పేర్కొనుట కేవలము నిర్హేతుకము కాదు. ప్రజారాధన పరాయణుండైన శ్రీరాముడు తదను రంజనమునకు తన అర్ధాంగిని పరిత్యజించి ఆ దుఃఖమును తానే యనుభవించును. తన భార్యయు ననుభవించును. కొంతవఱకు తన కుటుంబమువారును అనుభవింతురేమో! అంతే, ధీరనాయక యశోఽభిలాషియగు శ్రీరాముడు ఆక్లేశము తనకు తానై యనుభవింప బూనుకొనెను. అది స్వయంవరము స్వయంకృతము. శంబుకుని వధించుట అట్టిది గాదు. ప్రజారాధన మను మిషతో ఆ తాపసోత్తముని రాజఖడ్గముచే వధించుట మహా ఘోరమగుపాప కార్యము స్వీయభార్యా పరిత్యాగముకూడ అంతకంటె ఘోరతరము కాదని,అది ప్రజారాధన మేమాత్రమును కాదనినిరూపించు టకేకవిరాజుగారు శంబుకవధను నాటకీకరించి,"ఉత్తరరామ చరిత"యను పేరు సైతమట్లే యుంచినారు. అనగా ఉత్తర రామ చరితయందు ప్రముఖముగా చెప్పుకొనదగినది శం బుకవధయే గాని, సీతాపరిత్యాగము కాదని కవిరాజుగారి తాత్పర్యమని మనము గ్రహింపవలయును.

కవిరాజుగారు శ్రుతిప్రామాణ్యము నంగీకరింతురు.

గాని స్మృతి ప్రామాణ్యమును బొత్తిగా నంగీకరింపరు. స్మృతులు భిన్నకాలముల భిన్న ఋషిప్రోక్తము లగుటయు పరస్పర విరుద్ధాంశముల ప్రతిపాదించుచుండుటయు, అనే కావాంఛనీయ బోధల కవి యాకరములై యుండుటయు నిందుకు కారణము. వాని నాధారము చేసికొని బయల్వెడలిన పురాణములు పుక్కిటి పురాణములని, వాని నసలంగీకరింపరు. గతాను గతికములై, కార్యకారణ సంబంధ దూరములై జనులలో ప్రబలియున్న అంధ విశ్వాసములను, మూఢాభిప్రాయములను హేతువాద శాతకరాసిచే నిష్కరుణముగా విదళించి వైతురు. భావదాస్యమును పటాపంచలు చేయుదురు. తమ రచనములందన్నిటను కవిరాజుగారీ భావ విప్లవ శంఖమునే బహుముఖముల పూరించినారు—ఏతద్రచనా విధానమును వారు వ్యంగ్యధ్వని మార్గమననుసరించి పరిహాస భాసురముగా నొనర్చినారు. కనుకనే ఆ మహనీయుఁడు హేతువాదిగా, భావ విప్లవనేతగా అనన్యసామాన్యమగు ప్రతిష్ఠ నార్జించి అజరామరుడయ్యెను.

ఆర్యుల యాగమనమునకు పూర్వము భారత (అజనాభ) దేశమునందంతటను ద్రావిడులేయుండిరని, ఆర్యుల యుద్ధతికి తాళలేక ఉత్తర భారతము నందలి వారు దక్షిణ భారతమునకు తరలిపోయిరని, విజితులైన ద్రావిడులను దస్యులని, శూద్రులని పేర్లిడి ఆర్యులు వారిచే సేవలు చేయించుకొనుచు వారికి సమాజ గౌరవము, స్వత్వము లేకుండ జేసిరని, వర్ణాశ్రమ ధర్మములు, ధర్మ శాస్త్ర

ములు, పురాణములు మున్నగునవి తమ ప్రశస్తిని శాశ్వతముగా పరిరక్షించుకొనుటకు ఆర్యులు సృష్టించుకొనినవే యని, కనుక వానిని మనమంతగా గౌరవింపనక్కఱలేదని కవిరాజుగారి నిశ్చితాభిప్రాయము. సూతపురాణములందేమి భగవద్గీత యందేమి, కురుక్షేత్రాది నాటకము లందేమి, కుప్పుస్వామి ప్రభృతి శతకములందేమి, సూతాశ్రమ గీతము లందేమి, అమోఘప్రజ్ఞావిలసితములగు వారి రచనములంగ న్నింటను, ఈ సందేశమే జీవనాడిగా స్పందించుచుండును. "శంబుకవధ" యందును కవిరాజ కావ్యసారమగు నీ సందేశమే సర్వత్రా ప్రతిధ్వనించుచుండును. అంతేకాదు, వసిష్ఠ ప్రేరణమున శ్రీరాముఁడు పరమసాధువగు శంబుకుని శూద్రుడను కారణమున వధించుట క్రూరము, ఘోరము, మహాదారుణము ననుచు కవిరాజు కంఠోక్తి యిందెల్లెడ మన చెవులగింగురు లెట్టుచుండును. భవభూతి హృదయముకూడ ఈ ఘోరాన్యాయమునకు ఎంతయో క్షోభించియుండును. కావుననే యాతని రాముఁడు తప్పని విధియగుటచే. అత్యనిష్టముగ శంబుకుని వధించి అతని తపస్సునకు ఫలముగా దివ్యత్వమును, వైరాజనామక పుణ్యలోకప్రాప్తియు నొసంగి కొంతవఱకు మనశ్శాంతియు సంతోషమును బొందినవాఁ డయ్యెను.

"శంబుకవధ" యందు నాయిక లేదు. ఇది లక్షణ విరుద్ధమేగాని పూర్వ గీర్వాణ నాటకములందును నిట్టివి కానుపించును. విశాఖదత్తుని ముద్రారాక్షస నాటకమీ

కోవలోనిదే. శంబుకవధకు సీతకు సంబంధములేదు. సంబంధములేని పాత్రను బలవంతముగ రంగముపైకి రప్పించుట కవిరాజుగారి కభిమతమగు విషయముగాదు. ఆ నాటక పీఠికలో వారీ భావము నిస్పష్టముగ వెలిబుచ్చినారు. వాల్మీకి భవభూతులు వాకొనినట్లు; శంబుకవధ కేవలము వర్ణాశ్రమాచార ధర్మపరిరక్షణాసక్తి చేతను, ప్రజారాధన ప్రవణత చేతనుగాక రాజనీతి ప్రేరణచేతనే సంఘటిల్లెనని కవిరాజుగారీ నాటకమున నిరూపింప బూనుకొనిరి వారిందలి యంకములను, తత్సన్నివేశ విశేషములను తదనుకూలముగ కల్పించి ప్రబంధించినారు.

"శంబుకవధ" యందు నాల్గేయంకములున్నవను కొంటిమి గదా! ప్రచారసాధనములు బహుళముగా గల యీ కాలమున నాందీ ప్రస్తావనల మూలమున నాటక కవి, కథాప్రశంసలు చేయించుట అనావశ్యకమగు అధికప్రసంగ ముగా భావించియే కాబోలు, కవిరాజుగారును వానిజోలికి పోలేదు.

"శంబుకవధ" ప్రథమాంక ప్రారంభమున శ్రీరామ చంద్రుని ఆదేశమున అయోధ్యానగరాభిముఖుండైవచ్చు కిష్కింధ యువరాజు అంగదుండు మనకు ప్రత్యక్షమగుచు, "శ్రీరాముండెంత మంచివాండైన నేమి? జాత్యభిమానము వీడండుగదా!... మాయందప నమ్మకము గల్గినట్టు లున్న నసిః శ్రీరాముండు ద్రావిడ జాతినొక కంటం గనిపెట్టి యుండుటను దలంచి ఉమితమగు నిర్వేదము వెలిబుచ్చును.

ఈ నిర్వేదమున కథావస్తు స్వభావము సూచితమగుచు శంబుకవధకు పూర్వరంగ మూ యత్తమగుచున్నది. అంగ దుండా మెయి ప్రయోగమించి మార్గమధ్యమున కొంతవడి శంబుక శిష్యునితో సంభాషించి రామరాజ్యమున, అనార్యులు పొందుచున్న అసౌఖ్యమును అసంతుష్టిని గ్రహించి, "మేము మీవలెనే కష్టము లనుభవించుచున్నవారమే," యని సహానుభూతి ప్రకటించి, ఆతని యాహ్వానమున శంబుకుని చిదానందాశ్రమమున కరుగును. అం దంగద శంబూకులమధ్య నడచిన సంభాషణమువలన నాఁడు రామరాజ్యమునందున్న ద్రావిడాద్యనార్య జనానీకమనుభవించు బాధలు గాథలు వినవచ్చుటయేగాక, నాఁటి సాంఘిక, మత రాజకీయ పరిస్థితులు, వాని ఆంతర్యములు, శ్రీరాముని పోకడల యెడ శంబుకుని నిష్కృష్టాభిప్రాయములు, నిశ్చితాశయములు అవగతములగును.

ద్వితీయాంకమున మొదటిదృశ్యము రామరాజ్యమునందలియొక సోమయాజిగృహము. ఆర్యులతో సమానస్థితిని గోరుచున్న అనార్య జాతులను బాధల గ్రుంగజేయవలయునని, వారి యాశయములను నిర్మూలింపవలయునని, సోమయాజిగారును, చయనులును ఆలోచనలు సాగింతురు. నాఁడు ఆర్యులు చేయుచుండిన దుష్టతంత్రములకు, దురాలోచనములకు నట్టి విప్రావాసములే కేంద్రస్థానములుగనుండెడివని యిదియొక భంగ్యంతర సూచనము శంబుకుని కడ చేర్చుటకు వారు పన్నిన ఘోరవ్యూహమునకే యాజక బ్రాహ్మణబ్రువులు వసిష్ఠునితో సమాలోచింపబోవుట, అట్టి

వారందఱిపై నాయకత్వమును స్పష్టము గావించుచున్నది. హనుమద్రామాంగదుల సమావేశ మిందలి ద్వితీయ దృశ్యము శ్రీరాముఁడందు—

"..............ధర్మసంస్థాపనో చితంబు
నైనయట్టి కార్యము పట్టులందు జంక
మెపుడు రవ్వంతయేని మేమేని పెద్ద
దిగులు గొల్పెడు కష్టమే తేరనున్న."

అను తన ధీర నిశ్చయమును దెలిపి, "రాజు ధర్మ పరిరక్షణంబునకై యర్థాంగిని గారాని యడవుల కంపి నందులకై పరితపింపమ"ని, జరిగిపోయిన సీతా వివాసము సూచనామాత్రముగ నెఱింగించెను. ఉత్తర రామాయణ కథలోని శంబుక వృత్తాంతమునకు ప్రాముఖ్యము నొసంగ దలచిన కవిరాజుగారి సీతా వివాహ ఘట్టమున నీరీతి సంగ్రహణ శిల్పమును వెలార్చుటయే గాక, శంబుకవధోద్యోగమునకు దొరకొననున్న శ్రీరాముని నిష్కపట హృదయమును గూడ చక్కగా విశదమొనర్చిరి. అంతలో నటకు శ్రీరామ సందర్శనార్థియై వచ్చిన వసిష్ఠుఁడు రాముని నమస్కారము స్వీకరించి, "వర్ణాశ్రమాచార పరిరక్షణ సామర్థ్యమస్తు" అని ఆశీర్వదించును. శంబుక వధ యంతీవర్ణాశ్రమాచార పరిరక్షణ సామర్థ్యమే కపటవ్యాజముగ పనిచేసినదిగద! వసిష్ఠుని కనుసన్నచే రాముఁడంత హనుమదంగదుల నటనుండి పంపివేసి' తమ యేకాంత సంభాషణమున కవకాశము కల్పించును. వసిష్ఠుఁడాయదను జూచుకొని శంబుకుని ప్రసక్తిగొని వచ్చి యెంత దుర్బోధ చేసినను నిరపరాధుఁడగు శంబుకుని

ద్రుంపజాలననుచు తన విముఖత్వమునే చూపుచుండగా. ఆ సమయమున బాలశవంబుతో బ్రాహ్మణుండొకడు వచ్చి "శూద్రుండెవండో యెచ్చటో తన మత ధర్మముల్ విడచి తప్పు పథంబున బోవబోలెడుకొ" అనుచు, "పాలుల బ్రోవ లేని నరపాలకు లేటికి?—పాలుని బిడ్డ కిచ్చెదవా ప్రాణము! శాపమునే గ్రహింతువా!"యని బెదరించును. శ్రీరాముడు వసిష్ఠ కల్పితమగు నీ కైలాటము నెఱుంగలేక, "యీ గోలా రిష్టమునకు కారణమే"మని యాతనినే యడుగును. అడిగినదే తడవుగా, "ఏ రాజు రాష్ట్రమునందు శూద్రుడు తపస్సు చేయుచున్నాడో యచ్చటనే విప్రబాలురకు మరణము సంభవించి తీరున"ను స్మృతి వాక్యము నుదాహరించి వసిష్ఠుడు, "శంబుకుని వధతో నీ బ్రాహ్మణ బాలశవము పునర్జీవితము కాగలద"ని వాక్రుచ్చును. అంతటితో శ్రీరాముని కది యొక అగ్నిపరీక్షగ పరిణమించి కడు వేధించును లేనిపోని బ్రాహ్మణ బాల మరణమును కల్పించి శంబుకుని వధచేయించుటకు వసిష్ఠుడెంత కపట నాటకమాడెనో, శ్రీరాముడెంత అమాయికముగ నాతని దుష్ప్రేరణకు వశుడైపోయెనో, ఎంత సులభముగ ఆతని మాయావాగురలో చిక్కుకొనియెనో కవిరాజుగారిందు కన్నులకు గట్టి చూపినారు.

తృతీయాంకముచిదానందాశ్రమం. అంగదశంబూకుల సంభాషణము రామరావణులగూర్చిలోకమునసామాన్యముగ ప్రబలియున్న అభిప్రాయములు అనాలోచితములు మాత్రమే అని, శంబుకుడసందిగ్ధముగనిర్ధరించి, రావణపాత్ర ఔత్కృష్ట్య

మును, అందలి ఉజ్జ్వల గుణవిశేషములతో నిరూపించును. ఈ సందర్భమున ద్రావిడుల క్రౌర్యంతో సమానమగు స్వత్వము సాధించుటో, లేక స్వత్వముతో పాటు ప్రాణముగోల్పోవుటో తటస్థింపవలయునని శంబుకుడు ఘోషించుట ఆతని మనస్థైర్యమును భవిష్యత్పర్యవసానమును సూచించుటయే గదా! ధర్మశాస్త్ర చర్చకై జరుగు పండిత పరిషత్తుకు, స్వత్వనిరూపణ గావింప రమ్మని శ్రీరామచంద్రుడంపిన లేఖకు, శంబుకుడు తనకు గల శ్రుతిప్రామాణ్య బుద్ధియు స్మృతిధిక్కారాభిలాషయు దెల్పుచు, ప్రభువు వేదప్రామాణ్యము నంగీకరించుచో తానుసభకు రాగలనని సమాధానము నంపును. రామప్రభువిట్లు శంబుకుని శాస్త్రచర్చకాహ్వానించినను, అందు శంబుకున కనువుగాని యవకాశమే యొసంగుటకు గూడ వసిష్ఠుని వంచనా శిల్పమును దుర్వ్యాహరచనాధురంధరత్వమును కారణములని వేఱుగ చెప్పుకోవలసిన పని లేదు.

తురీయాంకమున శ్రీరామచంద్రుడు, "శంబుకుని శిక్షింపకున్న వంశ గురువగు వసిష్ఠుని కేమి యులుకవచ్చునో యనుకొనుచు, ఆ శంబుకుని వధించుటకు అశ్వారూఢుడై బయలుదేరి చిదానందాశ్రమము చేరుకొనును. అట శంబూకరామచంద్రుల సంభాషణము విని తీరవలసినదే. "శూద్రునకు వేదాధికారము లేదు"ని స్మృతిపాదనము గావించు శ్రీరామునకు సమాధానముగ శంబూకుడు "వేదములు మానవకోటి కెల్లరకు తరణోపాయములు"ని నిరూపించును. శ్రీరామచంద్రునకది పరమామోదమునే కలిగించును. కాని వసి

ష్ఠుడాతని సతిని యిచ్చుకు వదలఁడు గదా! పరిసరములపొంచి యుండి, శ్రీరాముని ఆమోదవచనము లాలించి, "అందఱకు సమానస్వాత్వము నొసంగిన మా పాల్లేమగున"ని మిక్కిలి వాపోవును. శ్రీరామచంద్రుని విడువక వెన్నాడి ఆతనిని శంబుకవధోద్యమమునకే పదింపడిగ ప్రేరేపించును. కాని, "నిరపరాధియగు శంబుకుని వధ కేంతకును మనసుపోక" ఆతఁడు తెగ పెనగులాడును. ఏమి లాభము.' గురువే తన కొంప నిట్లు కూల్చుచున్నాడని గుఱుతింపలేకపోయిన యా వెఱ్ఱిబాగుల రామచంద్రుడు చివరకు, "గురూపదేశము వ్యపగతకల్మషము గాన శంబుకుని పరలోక ప్రాప్తుని జేసెద మ"ను నిశ్చయమున కెట్లో వచ్చివేయును.

"కరుణ యొకింతలేక కులకాంతను సాధ్విని బూర్ణగర్భిణిన్
వరకు నరణ్యభూములకుఁ బంపఁగఁ జాలిన యట్టి నీకు దు
ర్భరమగునే యొకానొకని ప్రాణము తీసెడు పట్లమౌనిశే
ఖరుఁడగుఁగాక జాలి యెటు కల్గును దక్షిణ బాహుదండమా!"

యనుచు, క్రమ్ముకొనివచ్చు విషాదభరము నవలకు ద్రోసి, జాలిమాలి, శంబుకుని వధించి యొకవిధముగా తన్ను తాను వధించుకొనెను. శ్రీరామచంద్రునకు శాశ్వతమగు నప యశస్సు కూర్చిపెట్టిన ఈ గాథయందు ఆర్యర్షిసత్తముండగు వశిష్ఠుఁడు రామునిచే చేయించినది శంబుకవధ గాక రామ వధయేమో యనిపించుచుండును. శంబుక వధాంతమున - నాటకాంతమున - మహా దుఃఖముగ్నుండగు శంబుక శిష్యుఁడు రంగ ప్రవేశము గావించి, రోదించుచు,

"ఈ దోషఫలముగా నీ దేశమందు

*　　*　　*　　*

విద్యావిహీనులై విప్రులెల్లరును
సేవక వృత్తిలోఁ జిక్కిపోయెదరు
ధర్మంబు, శౌచంబు, దయయు, సత్యంబు
కొఱవడఁ దము నెల్ల కులములవార
లేవగించఁగ నుందురేమి తోచకయె

*　　*　　*　　*

ఎందాక బ్రాహ్మణులీ దోషమెల్ల
దిద్దుకో లేరొ యీ దేశంబులోన
నందాఁక నీ రీతి నల్లాడు చుంద్రు
వాలుర శాపంబు బ్రహ్మశాపంబు.

అని ఘోష పెట్టును.

నాల్గంకములతో నీ రీతిగా పూర్తియగు నీ నాటక సన్నివేశ కల్పన మత్యద్భుతముగ నుండును. విపుల ధర్మ శాస్త్ర చర్చలతో నిబిడములుగా నుండు నిందలి వాక్యో వాక్యములు, వాదప్రతివాదములు చతురములై, చమత్కార జనకములై కవిరాజుగారి ప్రతిభాసంకలితమైన బహుముఖ పాండితీగరిమకు తార్కాణములుగ నుండును ద్రావిడాద్య నార్య జాతులను త్రొక్కి-పట్టి యుంచవలయు నను వసిష్ఠుని కుటిల రాజనీతియు, "రాజ్యాంతే నరకమ్ ధ్రువమ్"మనుకొనుచు, బాధపడుచు, అత్యనిష్టముగానైన వసిష్ఠ గురువాక్యమునే శిరసావహించుచుండు శ్రీరామచంద్రుని మనోదౌర్బల్యమును, జాతిస్వత్వనిరూపణోద్యమమునఆత్మ

ర్పణము గావింపనిలచిన శంబుకుని యకలుష దృఢచిత్తమును ప్రసన్నములును అమాయిక సుందరములును నగు హనుమదంగదాది ద్రావిడ జాతి హృదయములును నిందులెస్సగ చిత్రించబడినవి.

కవిరాజుగారి వ్యంగ్యధోరణియు, పరిహాస రసికతయు చూడుడు! పెండ్లి పేరంటములు లేని బ్రహ్మచారిని వసిష్ఠుడు "పుత్ర పౌత్రాభివృద్ధిరస్తు!" అని దీవించును. కొందఱు పెద్దలు నిరంతర మీరీతి నిరర్థకములు, పరిహాస భాజనములు నగు ఆశీర్వచనములే కురియించుచుందురు గదా! క్రీడాభిరామమున శ్రీనాథుండిట్లే, టిట్టిభునిచే "విధవకు పుత్రాభివృద్ధిరస్తు" ని మిక్కిలి యుదారముగ దీవన సేయించును. "తలచిట్టి కార్యములు నా నెత్తిపయిననే పడుచుండును. శ్రీరామచంద్రుడు నన్నీ పనికి నియోగింపకుండును గాక!" యని శంబుకవధోద్యోగము నందలి యసామంజస్యమును గమనించిన హనుమంతుడు తన వైముఖ్యమును స్వగతమున ప్రకటించుకొనును. శంబుకునుద్దేశించి, "మీ నిశ్చితార్థము దురవగాహము. ద్విజులు మిమ్ము పాషండుడవనియు, మత ద్రోహివనియు దెగడుదురు. ద్విజేతరులలో విద్యాగంధము లేమిచే బ్రాహ్మణద్వేషివనియు ... గొణుగుదురు. కట్టకడకు మీ రిరు తెగలకుం గానివా రగుటయే కాక కృతాపరాధులగుచున్నా"రని అంగదుడు పల్కిన వాక్యములు జీవితము నొక యుద్యమముగా సాగించిన కవిరాజుగారికిని అన్వయించునా యనిపించుచుండును.

"శంబుక వధ" యం దీ విధముగా వర్ణాశ్రమాచార ధర్మ పరిరక్షణ వ్యాజమున ద్రావిడజాతుల నణచివేయ వలయునని వసిష్ఠాదులగు ఆర్యఋషుల రాజనీతి కౌటిల్యము గూఢముగ గూడుకట్టుకొని యున్నదని కవిరాజుగారు బహిర్గతము గావించినారు. అందుకు వలయు రీతిగ నాటక వ్యూహము నూహించి, సన్నివేశములు కల్పించి, సంవిధాన నైపుణి వెలయించి, పాత్రల మనోధర్మముల చక్కగ చిత్రించి సమర్థముగ ప్రదర్శించినారు. భరతవాక్యమగు ఫలశ్రుతిని వర్తమాన దేశ కాల స్థితితో సమన్వయించినారు. కవిరాజకృతమగు నీ యపూర్వనాటకము శ్రుతి ప్రామాణ్యానురక్తి విలసితము, స్మృతి పురాణ ప్రామాణ్య విరక్తి ప్రేరితము, భావ విప్లవ ప్రబోధానువిద్ధము. ఇయ్యది ఆ మహనీయుని ప్రజ్ఞా వైదుష్య ప్రదర్శనమునకు ప్రతివాద భయంకర వాగ్విహారమునకు విజయడిండిమము!

—ఎల్లోజు మాధవాచార్యులు

# లేటు చౌదరిగారు

నాలుగేళ్ళపాటు షుమా రొక యిరవైమందిమి పార్కులో సంపంగి పొద ప్రక్క చేరేవాళ్ళం. కనీసం రోజూ మూడు ఘంటలపాటు వొకేచోట జైఠాయించి బాతాఖానీ దంచేవాళ్ళం. ప్రాయంలో పెద్ద అయినా, అభిప్రాయాల్లో తేడాలున్నా, మా గ్రూపులో రామస్వామి గారు రెగ్యులర్ అండ్ పాప్యులర్ మెంబరు. సభికుల్లో అమాంబాపతు వుండేవారు; కాని, హెచ్చుమంది సాహిత్యోపాసకులు. సరసోక్తులతో సరదాగా కులాసాగా కాలక్షేపం చేసేవాళ్ళం. మా టాపిక్సులో హిట్లరు లగాయతు బట్లరు వరకూ, వాల్మీకి రామాయణంనుండి లోకాభిరామాయణం వరకూ, గగన విహారంనుండి గంగానమ్మ కొలుపువరకూ, కారెంపూడినుండి కారపుబూందివరకూ, ఆంధ్ర ప్రత్యేకరాష్ట్రంలగాయతు ఆవకాయవరకూవుండేవి. హిందూస్తాని కర్ణాటిక్ తేడాలు, సైగల్ సంగీతం, న్యూథియేటర్సుచిత్రాలూ, హిందీవ్యతిరేకోద్యమం, నాజీ విజయపరంపరలు, చర్చిల్ చర్చ ప్రార్థనలు—ఒకటేమిటి, అన్నీ వస్తూవుండేవి. మా పరిహాసాల్లో పన్నీటి జల్లేగాని పల్లేరుకాయ లుండేవి కావు. కబుర్లు లైటర్ వీన్ ధోరణిలో నడి

చినా Light వుండేవి; Heat కు చోటిచ్చేవాళ్ళం కాదు. మా రోజువారీ చర్చల్లో చౌదరిగారుకూడా ప్రముఖపాత్ర తీసుకుంటోవుండేవారు ఇనపనాడాలు వేసిన బూటుపెట్టి అర చేతివ్రేళ్ళు తొక్కినట్లే వుండేవి ఆయనగారి చలోక్తులు. మాటలుమాత్రం కట్టెవిరిచి పొయ్యిలో పెట్టినట్లున్నా అంతస్సు చాలా సున్నితం. ముక్కోపం లేదు, నలుగురితో mix కాగలడు ఆయనకు fixed notions వున్నా. మూతి బిగింపు లేదు. మాట అంటాడు, పడగలడు. చక్కని స్పోర్టు. సీమలో చదువుకుండే రోజుల్లో లాండ్ లేడీ అందిట 'రోమ్‌లో వున్నప్పుడు రోమన్‌లాగా వుండాలి' అని యీ స్వామి తలపాగా, దేశవాళీ పద్ధతులుచూచి. 'మరి, మీ వాళ్ళు మాదేశంలో వున్నంత కాలమైనా ధోవతికట్టరాదూ అని మాడు పగిలేటట్టు జవాబు. ఏమీ సున్నితాలూ శృంగా రాలూ లేవు. ఇనప సరసం. అయితే, ముతక పెంకు చాటున మృదుమధురమైన హృదయం. జోకు నా జూకుదైనా జోకు పుట్టించేదైనా జోకుజోకుగా తీసికొనగల సరసత ఆయనకు కలదు.

ఒక వుడుకుమోతు కుర్రకవిని మాలో కొందరు హెచ్చుగా వేళాకోళం పట్టించే వాళ్ళు. అత నీ బాధ పడ లేక deep గా ఆలోచించి వొకరోజువ వొక feeler వది లాడు,'ఇక్కడ రోజూ కొందరు పోగై అందర్నీ విమర్శిస్తు న్నారని యజమానిగార్కి తెలిసిందట; రేపో మాపో స్వయంగా వచ్చి అంతు తేల్చుకుంటాడట'అని. ఆ రోజు చౌదరిగారు

హాజరులో లేరు. సూలో కొందరు కంగారు పడ్డారు. ఇది
వుత్త stunt అని కొద్దిమందిమి గ్రహించాం. మొత్తంమీద
నాగా లేకుండా మర్నాడు అందరూ హాజరైనారు. రాము
స్వామిగారూ వచ్చారు. కొంత ఆలస్యంగా ఆరచయితా
వచ్చాడు. క్రిందటిరోజు సమాచారం చౌదరిగార్కి తెలియ
చేశారు. 'ఏమి రీ వార్త మోసుకొచ్చింది' అన్నారాయన.
కుర్రకవిని చూశారు. 'మాయిష్టంవచ్చినట్లు మాట్లాడుకుం
టాము మాకా స్వేచ్ఛవుంది. అబ్బాయీ, నీ వా యక్కుస్తో
చెప్పు. ఇక్కడకు వచ్చి మాతో జోక్యం పెట్టుకుంటే తం
తాను'యిలా గర్జించారు. అతగాడికి ముచ్చెమటలుపోసినై.
మళ్ళీ, చౌదరిగారు చిరునవ్వుతో 'ఏమయ్యా' తప్పకుండా
వెళ్ళి చెప్పు'అన్నారు. ఆరునెలలదాకా ఆ మనిషి మా
సమావేశానికివస్తే ఒట్టు, యక్కూ లేదు, గ్రైయీ లేదు.
కొన్నాళ్ళపాటు నేనూ చౌదరిగారూ యిది తలచుకొని
నవ్వుకునే వాళ్ళం. ఆయనదగ్గరనా యీ టక్కలు! పిరికి
తనం ఆయన్ని చూచి భయపడి తోక ముడిచి వురకటమే.
భయపడి జబ్బు జ్వరంతో తీసుకు చావటమే. పిరికిగుండె
లేని యోధుడు. రణోత్సాహం. రణోద్రేకం మెండు.
తంజావూరులో బొబ్బిలి మీద ఢీకొని అక్కడ జరిపిన
సాహసచర్యలు లోకవిదితమే. కారం జాస్తి. మనిషి మిలి
టరీగాని, ఆహారం మిలిటరీ కాదు. పాశ్చాత్యదేశంలో
వున్నప్పుడునుకూడా Vegatarian dish కొరకు వెతుక్కుంటు
మైళ్ళకొద్దీ నడిచే వాడనని చెప్పేవారు. మార్షల్ స్పిరిట్
మెండు. మరోదేశంలో జన్మించినట్లయితే ఫీల్డు మార్షల్గా

వుండేవాడు. సాహసం ఆయన సొమ్ము. ఆ పట్టుబడితోనే ఆయన సలిపిన పోరాటాలన్నీ. మొహమాటం లేదు, మొరటు మోటుమనిషి అనుకున్నా సరే. క్లుప్తంలో చెప్పాలంటే ఉక్కు మనిషి.

ప్రథమతః వారిని తెనాలి మునిసిపల్ ఆఫీసులో చూచాను. మద్రాసు శాసన సభ ఎన్నికల్లో అది ఒక పోలింగ్ బూత్. నేను అక్కడవుంటం సంభవించింది ఒక ఏజంటుగా. స్వర్గీయ పిల్లలమర్రి ఆంజనేయులు పంతులుగారు అక్కడ కూర్చునివున్నారు వోటుచేయటానికొచ్చి. ఇంతలో సిజర్ సిగరెట్ వ్రేళ్ళమధ్య పెట్టి గుప్పిటిలోంచి దమ్ము లాగుతూ చౌదరిగారు ప్రవేశించారు. అప్పటికి చైర్మన్ గానే వున్నారు. ఇద్దరూ కుర్రాళ్ళ మాదిరిగా సరసోక్తులు సాగించారు. ఒకాయన ప్రశ్నించాడు 'ఏమండీ, మీరిద్దరూ మునిసిపల్ వ్యవహారాల్లో పోటీ దార్లుగదా. చాలా తమాషాగా వుందే మీ దోస్తి!' అని. "రామస్వామి చౌదరి నాకు అత్యంత మిత్రులలో ఒకడు. పాలిటిక్సు వేరు" అని జవాబిచ్చాడు ఆంజనేయులుగారు. సీమకు వెళ్ళొచ్చిన మనిషికదా, టిప్‌టాప్‌గా వుంటాడేమో అనుకున్నా. ఏబ్బె, అదేమీ లేదు. చాలా సింపుల్‌గా వున్నాడు. అంతా రైతు బిడ్డ వేషం. కోరాదుస్తులు. ఏవిధమైన హడావిడీ లేదు. అక్కడ కూర్చున్న అయిదు నిముషాల్లో అర పెట్టె వూది పారేశాడు. కర్రునదగ్గ లేదు సుమండీ! ఈ జాతకుని వూపిరి తిత్తులు స్పెషల్‌గా తయారు చేశాడేమో విశ్వకర్మ అనుకున్నా.

రూపాయికి పదహారు అణాలా తెనుగుబిడ్డ. అప్పటికి నయాపైసలు పుట్టలా! గొప్ప ఆంధ్రాభిమాని. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కోరకు వుర్రూతలూగేవాడు. రాష్ట్ర సంపాదన విషయమై ఒకర్ని యాచించటం సుతరామూ యిష్టం లేదు. యాచన అనేది చరిత్రతిరగేస్తే ఆంధ్రత్వానికే లేదనేవాడు. అంతా 'కోటముట్టడించటం' వ్యవహారమే. పూర్వపు ఆంధ్ర సామ్రాజ్యపు సంగతి, ఆంధ్ర నాయకుల పౌరుషము వాళ్ళ వీర సాహసకృత్యాలు మాంచి ధీమాతో ముచ్చటించేవారు. ఒకప్పుడు మన తెనుగుజాతికున్న ఔన్నత్యాన్ని పదేపదే ప్రస్తావిస్తూ మహామురిసేవాడు. ఆంధ్రోద్యమంలో కలసి పనిచేశాం. తద్రిత్యా వారు నాకూ, మా బ్రహ్మశ్రీకి దగ్గరవారైనారు. తెనాలిలో మేము జరిపిన ఆంధ్రరక్షకసమితి సమావేశానికి యెంతో చేయూత యిచ్చారు. మాతోపాటు పాదచారియై గడపగడపా తిరిగి చందాలు ప్రోగుచేశారు. పిల్లికి బిచ్చం పెట్టని పిసినికొట్టులను కూడా ఆయన చనువుతీసికొని చీవాట్లుపెట్ట కాస్తో కూస్తో వసూలు చేశారు. ఆయన మాతో రాబట్టే గ్రుడప నూటపదహార్లు వసూలయ్యాయి. ఆ రోజున నాకు తెల్సింది ఆయన Local గా ఎంత పాప్యులరో. మున్సిపల్ కౌన్సిల్ హాల్లో సభకు యేర్పాట్లు చేయించారు. ఆ రోజు లేటు డాక్టరు పట్టాభిగారు తెనాలి యేదో సందర్భంలో రావటం సంభవించింది. జరుగబోయే సభకు చౌదరిగారి Support హెచ్చుగావుందని పట్టాభిగారు పసికట్టి, ఆయన్ని వుబకేసి లాగేస్తే అసలుమీటింగే లేకుండా పోతుందని వూహించి,

రామస్వామిగార్కి 'నీవు seasoned politician వు. నీ లాంటివారు inopportune గా రాష్ట్రంకొరకు ఆందోళన జేయువారికి దోహదం యివ్వకూడదు' అంటూ వొక personal letter పంపారు. చౌదరిగారు బోల్తాపడలా - నీతికి నిలబడ్డారు. చివరిదాకా మాకు అండగా నిలబడ్డారు. పై పెచ్చు Tactful గా పట్టాభిగార్ని సభకు ఆహ్వానించి ఆయన కళ్ళెదుటనే కార్యక్రమమంతా జయప్రదంగా జరిపించారు.

తర్వాత కొన్నాళ్ళకు ఆంధ్రప్రభ వూరేగింపు సందర్భంలో మాతోపాటు పనిచేశారు. ఆరోజు జరిగిన బహిరంగసభలో స్వర్గీయ ఆంజనేయులుగారు సగర్వంగా అన్నారు 'ఈ సభకు అధ్యక్షత వహించిన రాముడు (రామస్వామి) యీ హనుమంతుడు (తను) యేకమైతే ప్రత్యేకరాష్ట్రం రాకుండా యెవరడ్డగించగలరు? ఆంధ్ర పార్లమెంటు యాజమాన్యాన బెజవాడలో జరిగిన సభకు తెనాలినుండి మేమిద్దరం ఆహ్వానింప బడ్డాం. ఒకరోజల్లా బసలో కలిసివున్నాం. పురాణకాలంనుంచీ కూడా దాక్షిణాత్యులే గట్టివాళ్ళు గొప్పవాళ్ళు అంటూ ఎన్నిసంగతులు చెప్పారో అంతులేదు. ఉత్తరహిందూస్తాన్ వాళ్ళకు మన వాళ్ళు జోహుకుం చేయటం ఆయనకు తలనొప్పి. ఆర్యులు ద్రావిడులకు యెన్నో అన్యాయాలు చేశారని యేకరువు పెడుతూ Sincere గా బాధపడేవాడు. 'నేను బ్రాహ్మణ మత ద్వేషిని, కాని బ్రహ్మణ ద్వేషినికాను. నాహయా

ములో వుద్యోగాలన్నీ బ్రాహ్మలకే యిచ్చాను. Verify చేసుకో' అన్నారు వొకమారునాతో. మారోమాటు 'మా వాళ్ళల్లో చక్కని రచయితలు బయలుదేరాలని ఆశించి కృషిచేశాను. నాకల నిజమైంది,నాకృషి ఫలించింది. నాపై వున్న అపోహ తొలగించటానికి ఉపసంహారం చేస్తా'నని అన్నారు. ఆయుర్దాయము లేకపోయింది. వ్యక్తులపై ఆయనకు ద్వేషంలేదు. చాలా మంది పెద్దోళ్ళు గొప్పోళ్ళు చెప్పేది వొకటి చేసేది మరోటి. తా విశ్వసించింది తు.చ. తప్పకుండా ఆచరణలో పెట్టిన కొద్దిపాటి నిజాయితీ పరులలో రామస్వామిగారొకరు. ఆయనకు ఆయనేసాటి. తనకు తోచిన పంధాన జీవితాన్నిసాహిత్యసేవకు సామాజికసేవకు అంకితం చేసికొని యెదురుబెదురు లేకుండా జీవయాత్ర నడపారు. ఉద్దండుడు; గుండె మణుగుల్లో వుండేది, గ్రాముల లెక్క కాదు.

విమర్శన కత్తి పుచ్చుకొని వేదశాస్త్రాలు పురాణేతిహాసాలపై దాడి జరిపారు. ఒకమాటు శ్రీరామనవమి పందిట్లో వీరి ప్రోగ్రాం పెట్టారు. నిర్భయంగా, నిశ్చలంగా పూసగ్రుచ్చినట్లు చెప్పనారంభించాడు, అక్కడ చేరిన వేల ప్రజల సామాన్య విశ్వాసాలకు విపరీతమైన విరుద్ధమైన సంగతులయినప్పటికీ. మీరు లక్ష చెప్పండి, నవ్వులాటకైన రాముడి గొప్పతనం వొప్పుకోడు. ఒకమాటు మేము అడిగాము-'మరి, మీరు యిన్ని చెప్తారు.మీ పేరు రామస్వామిగానే వుంచుకున్నారేమి, రావణస్వామి అని మార్చుకోక'

అని. 'రామస్వామి అంటే, రాముడికి మొగుణ్ణి అన్నమాట అంటూ సగర్వంగా నవ్వాడు.

మొదటినుంచీ భల్లూకపు పట్టు. చదువుకుండే రోజుల్లో విద్యార్థుల తరఫున ప్రిన్సిపాల్‌తో పోట్లాడి, చివ రికి తన మాట నెగ్గించుకున్నాడు. విద్యార్థి దశలో మంచి sportsman. ఫుట్ బాల్ టీముకు కాప్టన్‌గా వుండేవాడు. పెద్ద వాడయ్యాక మాకు (రాళ్ళతో చాలా సోషల్‌గా వుండేవాడు. నిక్కు, నీటు, నీల్గు లేదు. భేషజాలు లేవు. కీర్తి శేషులైన గోపీచంద్ నాకు క్లాసుమేటు కాని యెంచేతనో చౌదరి గారితోనే అతిత్వరలో నాకు అత్యంత సాన్నిహిత్య మేర్ప డింది. రామస్వామిగారు మా దగ్గర కూర్చున్నంతసేపూ గోపీచంద్ పెడపెడగా కూర్చునేవాడు. వాళ్ళిద్దరూ ఎక్కు- వగా మాట్లాడినట్లే అగుపడేది కాదు. అయితే తండ్రి పను లన్నీ యెంతో భయభక్తులతో శ్రద్ధాసక్తులతో చేస్తూ వుండేవాడు. 'మహతి' ప్రారంభోత్సవం సూతాశ్రమంలో జరిగింది. మేమంతా కొద్దో గొప్పో ప్రసంగించాం. గోపీ చంద్‌ను కూడా మాట్లాడమని యెంత పిలిచినా కదలిరాడే చెట్లచాటున చేరి. చౌదరిగారు చిరునవ్వుతో 'రాకుంటే కానివ్వండి" అంటూ సభను ముగించారు. తండ్రినిచూస్తే వొకరకమైన బెరుకు. తన పిల్లలతో typical reserve. తండ్రీ కొడుకులు వుభయులు వన్నెకెక్కిన కొలది కుటుం బాలలో వీరి దొకటి.

భావవిప్లవం తెచ్చి, వివాహం తంతు సంక్షిప్తంచేసి

అచ్చ తెనుగులో అనేకమైన ప్రోజు వెండ్లిండ్లు స్వయంగా తన పౌరోహిత్యం క్రింద జరిపించారు. వది చేసిన Sensational & Historic. ఆయన చరిత్రకారుడు; చరిత్ర పురుషుడు, చరిత్రలో చిరస్థాయిగా స్థానం సంపాదించుకున్నాడు.

లలితమైన శైలిలో తన హృదయాన్ని అక్షరరూపం పొందించగలడు. గేయం అమృతవాహిని. ఈయన రచనలు కాలపరీక్షకు నిలబడి, నిల్వవుండే నేతిసరుకు. ఫ్యాక్టరీ నేయి (refined oil) తో తయారు చేస్నిచవుకబారు, కల్తీ సరుకు కాదు. రోల్డుగోల్డు కవిత్వం కాదు, అచ్చమేలిమి. రతి గుండెల్నికూడా కరిగిస్తాయి వీరిగేయాలు. 'చెన్నపురము మందేరా, చెంగల్పట్టు మందేరా, కాదని వాదుకువస్తే తంజావూరూ మనదేరా....'' ఆ పాట వింటూంటే ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మి కళ్ళకు సాక్షాత్కరించేది. వీరావేశం పుట్టుకొచ్చేది. ఒక చేత్తో కలం, మరోచేత్తో కత్తి పుచ్చుకొని ప్రజలను ఉత్తేజపరుస్తూ lead చేయగలశక్తి ఆయనకు బాల్యంనుంచీ వుంది. తెనుగువాడన్నా తెనాలి వాడన్నా అభిమానం జాస్తి; ఆయనకూ అంతే. అదో కారణం మా యిద్దరి సాన్నిహిత్యానికి.

సత్యాన్వేషి, మితభాషి, నిష్కల్మష హృదయుడు, పరోపకారి, నిగర్వి, కార్యశూరుడు; పరిహాసానికైనా, పొరబాటునైనాపొగడలేదు; పరిశోధకుడు, తార్కికుడు, విమర్శకుడు, కర్తవ్యదీక్షాపరుడు. వాలుఈత వీలు, సుళువు. ఈయనిది యేటికి యెదురీత. నిజానికి జబ్బులు పడ్డా; అలుపే;

ఒకరు చెప్తే వినేరకమా ? రణపెంకె. ఎదురీత ఆయనకే చెల్లింది. మెజారిటీది వాటం వారి !

'స్వర్గీయ' అనుటకంటె "లేటు" అనటమే ఆయనకు న్యాయం చేసిన వాడ నౌతాను. స్వర్గం, నరకం, ఏటిల్లో ఆయనకే విశ్వాసం లేకపోతే, తెల్సీ తెలియకుండా ఆయన్ని స్వర్గానికి నేనెందుకు పంపాలి ? తనలోక మేదో ఆయనే సృష్టించుకుని మరీ వెళ్ళారు.

—పుచ్చా పూర్ణానందం

# సూత్రాశ్రమ గీతాలు

మన భాషా సాంప్రదాయాన్ని గమనిస్తే యిది గేయభాష అని అందరు తప్పక తల లూపగలరు. మన ప్రాచీన సాహిత్యమంతా పదకవితే.

పాడేవారిని గాని,వినేవారినిగాని తన్మయత్వం కలుగ జేసేవి యివే. పద్యాన్ని తరువాతనే చెప్పాలి. ఎందుచేత నంటే మన గేయాలు లయతాళ బద్ధములుగా వుండి సన్నిహిత సంబంధము కలిగి యుండటమే గాక, మార్గ కవిత మాదిరి దూరాన్వయం, శబ్దాడంబరము లేక అందరకు తేట తెల్లముగ అర్థమౌతుంది. అందువల్లనే యిది ప్రజల పెన్నిధిగా పెరిగింది.

ఆధునిక కవితలో దేశాభి మానమును గురించి వ్రాయుట ఒకటి. దేశభక్తిని గురించి ఒక కవి రచనసుబట్టే అతని గౌరవం పెరగటం తరగటం.

స్వదేశోద్యమము, ఆంధ్రోద్యమము స్వరాజ్యోద్యమమునకు ఈ రచనలు తోడ్పడ్డాయి.

ఏ ఉద్యమ సిద్ధికైనా సాధారణ ప్రజల కందుబాటులో హృద్గతమగు మాటలు పాటలు అత్యవసరం. ఈ

విషయాన్ని గుర్తించిన కవిరాజు త్రిపురనేని రామస్వామి గారు సూతాశ్రమ గీతాలు రచించి చరితార్థు లయ్యారు. ఈ గీతాలు జాతీయోద్యమానికి, ఆంధ్రోద్యమానికి అధికంగా ఉపకరించినవి. భీరులను ధీరులనుగా జేసినవి. వారి ఇతర రచనలు విప్లవ భావాన్ని రేకెత్తించినట్లే ఇవి దేశ భక్తిని రేకెత్తించినవి.

కవిరాజుగారు సంఘ శ్రేయస్సుకై తమ జీవితాన్ని అర్పించిన ధీరపురుషులు, జాతీయ గేయ కవులు. ఆనాటి ఆంగ్ల ప్రభుత్వము వారికి గొప్ప పదవులను ఎరగా చూపించినా లొంగక జాతికి అండగా నిలిచి భారత మాత దాస్య శృంఖలాలను విచ్ఛేదము చేయాలని దృఢవ్రతు లయ్యారు. జాతిలో ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని కలిగించుటకు వీరగంధ మున్దెచ్చి నారము అనే గేయాన్ని వ్రాశారు.

అసహాయోద్యమములో అనేక కవులు పాల్గొనుటయేగాక అనేక రచనలుకూడా చేశారు. ఆనాడు కొల్లలు కొల్లలుగా గాంధీజీమీదను ఆంగ్ల ప్రభుత్వంపై తిరుగుబాటుగాను రచనలు సాగినవి. "కొల్లాయి గట్టితేనేమి మా గాంధీ" అనే గేయాన్ని రచించిన బసవరాజు అప్పారావుగారి పాట "మా కొద్దీ తెల్ల దొరతనము" అనే గరిమెళ్ళ సత్యనారాయణగారి గేయము దేశములో ఎంతో ఉద్బోధను కలిగించినవి. అవి కేవలము జానపద సాహిత్యములో కలిసిపోయినవి. అలాగే 1930 వ సంవత్సరములో గాంధీజీ ఆధ్వర్యాన ఉప్పు సత్యాగ్రహము ప్రారంభింపబడి

నప్పుడు కవిరాజుగారు వ్రాసిన గేయము ఆంధ్రదేశములో మారుమూలల గ్రామాలలో కూడ మారుమ్రోగింది. వారు గేయము రచించుటేగాక స్వాతంత్ర్య సమరములో పాల్గొన్నారు. వేలకు వేలు చందాలు వసూలు చేశారు. తెనాలి పట్టణ పరిసర ప్రాంతాల నుండి సత్యాగ్రహులు వేలాదిగా సాగారు. వారందరికి భోజన సౌకర్యాలు కల్పించారు. వీరగంధముతో అక్షతలు చల్లి స్వాతంత్ర్య సమరానికి సాగనంపారు. వీరరస ప్రధానమైన ఈ గీతము ఆంధ్ర జాతిని ఉద్రూతలూగించినది.

పికెటింగు సందర్భములో సత్యాగ్రహులు పాడుకోవటానికి "పిలుపు" అనే మరో గేయాన్ని కూడ రచించారు. ఆ సందర్భములోనే వారూ అరెస్టయ్యారు ఆశ్చర్యకరమైన సంగతేమంటే అనంతరం వారిని ఎవరికీ తెలియకుండానే విడుదల చేయటం జరిగింది. ఈవిధంగా స్వాతంత్ర్య సమరములో వారికి సముచిత స్థానమున్నది.

ఈ గేయ ప్రభావాన్ని గురించి దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు ఇలా కొనియాడారు :

"మా రోజుల్లో పోలీసుల జులుం బహుజాస్తిగా ఉండేది. కాంగ్రెసు వాలంటీర్లు ఎంతగా ప్రచారము చేసినప్పటికిన్ని పోలీసులకు భయపడి ప్రజలు మా మీటింగులకు అంతగా వస్తూఉండేవారుకాదు. ఒకసారి ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, కవిరాజుగారి సూతాశ్రమ గీతాలను నాకు చూపించారు. అవి నాకెంతో మహదా

నందా న్నిచ్చాయి. నలుగురు వాలంటీర్లకు వాటినిపాడటం నేర్పాము. 'వీర గంధము తెచ్చినారము....'పాట పాడుతూ వాలంటీర్లు వీధుల్లో తిరుగుతూ వుంటే, ప్రజ అసంఖ్యాకంగా వారివెంట బయలుదేరేవారు ఆ తరువాత మేము మీటింగులు చేసేవారము. చౌదరిగారి గీతాలు అందకుంటే మా వుపన్యాసం ప్రజలలోకి ఇంత త్వరిత గతిలో వెళ్ళేది కాదు. కవిగా రామస్వామిచౌదరి స్వాతంత్ర్య సమరానికి చేసిన సేవ బహుదొడ్డది."

ఆంధ్రులలో దేశాభిమానం, పౌరుషంకలిగించుటకు మన ప్రాచీన చరిత్రను గేయాల ద్వారా వుద్బోధించి ప్రజలలో ధైర్యసాహసాలు కవిరాజుగారు కలిగించారు. తెలుఁగు వారలు పిఱికివారా," "తెలుఁగు జోదులు" ఈ రెండు గేయాలు ఆ శ్రేణికి జెందినవే.

"కంచికోటల కంచు తల్పులు ఖంగు ఖంగున మ్రోఁగునప్పుడు
తంజనగరపు కోటగోడలు చెంగు చెంగున నెగురు నప్పుడు
తిరు వటంబునఁ జేర సేనలు కెవ్వు కెవ్వన నఱచు నప్పుడు
మధుర కోట యగడ్తలన్నియు రివ్వు రివ్వన దూఁకునప్పుడు,

తెలుఁగువారలు పిరికి వారలా
తెలుఁగు బిడ్డా! తెలిసి కొనుమా!"

పూర్వాంధ్ర దేశపుటౌన్నత్యాన్ని కొని యాడుతూ ఆంధ్రరాష్ట్ర ఆవశ్యకతను గురించి వారు కొన్ని గేయాల ద్వారా కూడ ప్రబోధముచేశారు. ప్రత్యేకాంధ్ర రాష్ట్రమే గాక వి లాంధ్ర నిర్మాణముకూడ వీరి మనోవీధిలో కల దని మ ము గాంచగలం.

"రెండు కోట్లకు మించి యుండిన
తెల్గు వారల నక్కటా!
చీల్చి వైచిరి, నాల్గు దెసలకు,
జిమ్మి వైచిరి నేటికిన్.

కొంతమంది నిజాము రాష్ట్రము
నందు జిక్కిరి బేలలై
కొంతమందియు కన్నడంబున
నుండి పోయిరి దీనులై.

లెమ్ము లెమ్మిక నడుము గట్టుము
తెల్గువారల నెల్లనీ
వొక్క రాష్ట్రము నందు గూర్పఁగ
గట్టి యత్నముఁ జేయుమా!"

ఇలా ప్రత్యేక రాష్ట్ర సాధనకై వారి ప్రగాఢ వాంఛను వెల్లడించారు. నాయకుల ద్వారా ఆంధ్రరాష్ట్రం రాదని గ్రహించి ప్రజలు ప్రత్యేక శ్రద్ధవహించి ప్రజోద్యమం ద్వారా సాధించాలని ఈవిధంగా ప్రబోధం చేశారు.

"తెలుఁగు వారికి దెలుగురాష్ట్రము
తేర తేరగ నూడి పడునా!
ద్రవిడ మంత్రి ముఖావలోకన
భాగ్య సంపద యబ్బినప్పుడు.

తెలుఁగు మంత్రులు మంత్రవిదులై
మూఁగ నోమునుబట్టి నప్పుడు,
తెలుగు శాసన సభ్యు లెల్లరు
తెల్ల వెఁగములు వైచునప్పుడు.

తెలుఁగు బిడ్డా!
లేవ లేవా!
వీరపానము సేయ రావా!"

మన ఆంధ్రులలో బహు నాయకత్వం హెచ్చు. అందువల్ల రాజకీయ నాయకులవల్ల ఆంధ్రరాష్ట్రం రాదని వారి మాటలు విని నిరాసపోవద్దని ఆంధ్ర జాతిని ఇలా హెచ్చరించారు.

"తోడుఁబోతుల నమ్మనేలా!
కాడు పఱచిరి యనగనేలా
తోడు తోడన్ నడుము గట్టిన
నూడి పడదే తెలుఁగు రాష్ట్రము!
మొక మొకంబుల జూడనేలా!
రక రకంబుల మాటలేలా!
ఊగు ఉకమును ఒక్కటైతే
ఊడి పడదా తెలుఁగు రాష్ట్రము!

సత్యాగ్రహం వల్లనే ఆంధ్రరాష్ట్రం అవతరించ గలదని అర మర లేకుండా ఆయన అన్నారు. తత్ఫలితంగా ప్రజలలో ఆందోళన బయలుదేరింది. కవిరాజుగారు భావించి నట్లుగానే పొట్టి శ్రీరాములుగారి పూర్ణాహుతితో ఆంధ్ర ప్రజానీకం ఏకోన్ముఖమై ఆంధ్ర రాష్ట్రం సాధించి ఆంధ్ర ప్రదేశ అవతరణకు దోహదం కలిగించింది.

ఈ విధంగా ఆంధ్రోద్యమంలోను, సత్యాగ్రహోద్య మంలోను పాల్గొని తమ గేయములద్వారా ఆంధ్రజాతికి వైతాళికు లయ్యారు.

దేశచరిత్ర ఆవశ్యకత అధికంగా కలదు. మనకు సమగ్ర చరిత్ర లేదు. సత్యదృష్టి లేదు. ప్రజలు చారిత్రక

దృష్టి అలవర్చుకోవలసిందిగా ఆయన అధికంగా వక్కాణించారు.

రామస్వామిగారు గొప్పకవులే గాదు. గొప్ప చారిత్రక పరిశోధకులు కూడ. వారు మన భారత భాగవత రామాయణాలను, పురాణాలను అధికంగా మథించారు. మనదేశ చరిత్రనేగాక ప్రపంచ చరిత్రనుకూడ కూలంకషంగా పరిశోధించారు. వారి గ్రంథాలలోని పీఠికలే ఇందుకు ప్రబల నిదర్శనములు. వారిచారిత్రక దృష్టే "ప్రతాపరుద్రీయము"ను "సారంగ ధర"ను విమర్శిస్తూ వ్రాసిన గీతాలు. ప్రతాపరుద్రీయమనునే గీతంలో వేదం వేంకటరాయశాస్త్రి గారి ప్రతాపరుద్రీయమును రామస్వామిగారు నిశితంగావిమర్శించారు. ఈ చారిత్రక నాటకాన్ని చరిత్రకు భిన్నంగా అభూత కల్పనలతో వున్నదని విమర్శించారు. ఇందులోని పేరిగాడు, యుగంధరుడు, జనార్దనుడు చారిత్రక పురుషులు కానేకారు. వాస్తవిక జగత్తుకు దూరమైన ఈ నాటకంలో చారిత్రికంగా భౌగోళికంగా తప్పులు కుప్పతెప్పలుగా ఉన్నవని విమర్శిస్తూ సరియైన తెలుగు చరిత్రను తెలుసుకోవలసిందిగా తెలుగు బిడ్డను హెచ్చరించారు.

తప్పు పాటలు పాడబోకుము. తప్పు మాటలు చెప్పబోకుము
తప్పు కథలను జదువబోకుము. తప్పు దారుల ద్రొక్కబోకుము
ప్రాత కథలను దెలిసి చదువుచు పాట పాడుము పరులు మెచ్చగ
కల్లవ్రాతలు లొలగ ద్రుమ్ముము. కల్ల కథలను బలిమి పుచ్చుము

తెలుగు బిడ్డా! తెలుగు చరితను
నేటికైనను దెలిసికోరా!

ప్రతాప రుద్రీయములో అభూత కల్పనలే గాక అసలు సత్యాన్ని కూడ మరుగు పర్చిరని కవిరాజుగారు విమర్శించారు. ప్రతాపరుద్రునియొద్ద బ్రాహ్మణేతర మంత్రులకే ఎక్కువ ప్రాధాన్య మున్నదని పేర్కొంటూ, బ్రాహ్మణేతర దండనాయకులే ఆ రాజ్యానికి పెట్టనికోటగా నిలిచారని ఉదహరించారు. అందులో ముసునూరి కాపయ నాయకుడు బహు పరాక్రమశాలై ప్రసిద్ధి గాంచారు. ప్రతాప రుద్రుని బందీనుండి విడిపించినది ఒక బ్రాహ్మణే తర దండనాథుడు. అతనికి 'రాయబంధి విమోచకుండ'ని బిరుదు కలదని అతన్ని ప్రజలు పూర్తిగా విస్మరించారని తెలియజేశారు. ఈవిధంగా సత్యాన్ని మరుగుపర్చి వ్రాసిన ప్రతాప రుద్రీయాన్ని కవిరాజుగారు చారిత్రక దృష్టితో విమర్శించారు.

ఈ విమర్శ గేయాన్ని దువ్వూరి రామిరెడ్డిగారు 'నాటకం, చరిత్ర' అనే వ్యాసంలో విమర్శిస్తూ యిలా వ్రాశారు.

"చౌదరిగారూ ఢిల్లీ ఎక్కడ ? గంగ ఎక్కడ ? అని ప్రశ్నించినారు. నాటక ప్రపంచమును యదార్థ ప్రపంచ దృష్టితో చూడజనదు. నాటకముకొన్ని కవి నియమములకును కళా నియమములకును లోబడియున్న అనన్య పరతంత్రమైన సృష్టి." అన్నారు రెడ్డిగారు.

"నాటకము చరిత్రకు భిన్నముగ నున్నదని విమర్శించుట పొరపాటు కాగలదు" అన్నారు రెడ్డిగారు. ఇటీవల 1953 ఆగష్టు భారతిలో ఈ గ్రంథమును గురించి విమర్శ

ప్రతి విమర్శలు జరిగినవి. వేంకటరాయశాస్త్రిగారి మనుమ డగు వేంకటరాయశాస్త్రిగారి సమాధానము లన్నింటిని ఖండిస్తూ కవిరాజుగారివాదాన్ని శ్రీ రంగశ్రీగారు బలపర్చారు.

నాటక కవి నాటకానికి అనుగుణ్యాంగా కొన్ని మార్పులు చేయవచ్చునేమోగాని, కేవలం చరిత్రకు భిన్నంగా నాటకం వ్రాయటం సముచితం కాదు.

## సా రం గ ధ ర

భారత కృతిభర్త రాజరాజునకు మనవారు చాలా అపచారం చేస్తున్నారు. రాజరాజుకు సారంగధరుడని కొడుకు, చిత్రాంగిఅనే భార్యకలరని అంటున్నారు. రాజ మహేంద్రములో సారంగధర గుట్ట, చిత్రాంగి మేడకల వని చెప్పుచున్నారు. ఇవి కేవలము కల్పితములు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ 'రాజ రాజు' నాటకములో చిత్రాంగిని రాజరాజు వివాహమాడి నందున, నన్నయ భారతం రాజరాజునకు అంకితం యివ్వ నిష్టంలేక భారత రచన మానివేశాడని ఒక అభాండము వేశారు. ఈ మాదిరి వున్నవి మన ఆలోచనలు.

అసలు కధ ఇది కాదంటున్నారు కవిరాజుగారు.

> "లేదు సారంగ ధరుడనియెడి
> సుతుడుఁ రాజ నరేంద్రునికున్
> లేదు రత్నాంగి యను భార్యయు
> లేదు చిత్రాంగియను వేశ్యయు
> తెలుఁగు దేశపు జరిత గాదిది.
> తెలుగు రాజుల చరిత గాదిది,

వట్టి బూటకమయ్యేనీ కథ
పిట్టకథయే: పిట్టకథయే !
తెలుగు బిడ్డా తెలుగు చరితను
దెల్పుచుంటిని దెలిసికొనుమా!

ఈ కథ మాళవ దేశానికి సంబంధించినది. మాళవ దేశాధిపతిపేరు రాజ నరేంద్రుడే, భారత కృతిభర్త రాజ మహేంద్రవరము రాజధానిగా పరిపాలించినరాజు,రాజరాజు ఈ నామ సామ్యంచేత మాళవదేశపు కథను మన రాజ రాజుకు అంటగట్టారు.

రాజరాజు కుమారుని పేరు కులోత్తుంగచోళుడు, క్రీ. శ. 1069-1113 ఆంధ్రదేశమును, తన మాతామహ స్థానమగు చోడుదేశమును పరిపాలించెను.

ఈకట్టు కథలన్నీ ఖండించి, తెలుగు దేశపు చరిత్ర చెప్పి చరితార్థులయ్యారు కవిరాజుగారు.

ఈ సూతాశ్రమ గీతాలు రాశిలో తక్కువేగాని వాసిలో యెక్కువే.

—గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

# నా కవిరాజు

The iconoclasts did not free us. They threw us into the water, and now we have to swim
—Lippmann.

In each generation the human race has been tortured that their children might profit by their woes. Our own prosperity is founded on the agonies of the past. Is it therefore unjust that we also should suffer for the benifit of those who are to come ?
—Winwood Read.

"మా నాన్నగారిని విమర్శకుడుగా, నాస్తికుడుగా, సంఘ సంస్కర్తగా ప్రచారం చేసి ఖూనీచేశారు. ఆయన ప్రాయికంగా మహాకవి." అంటూ వుండేవారు గోపీచంద్. అంటూ వుండడమే కాదు—దాన్ని రుజువుచేయడానికంటూ కవిరాజుగారి గ్రంథాలలో నుంచి హృద్యమైన పద్యాలెన్నో ఎత్తివేస్తూ వుండేవారు.

—కాని,నా కవిరాజు కవి కాడు,మహా కపి కాడు;కవిరాజు అంతకన్నా కాడు.ఆయన అలా కవిమాత్రుడే; అయి వుంటే నాభావనా విధానంలో తొలిమలుపుకు కారకుడయ్యేవాడే కాడు.

అసలు నేను రామ భక్తుణ్ణి. రాముడనేవాడు శంబుకుడి లాంటివాణ్ణి చంపుతాడనే విషయం నా వూహాకందని విషయం. తలపు సహించలేని విషయం. ఆ స్థితిలో నాకు కవిరాజుగారి శంబుకవధ యాదృచ్ఛికంగా తటస్థించింది. అది నాలో గుణాత్మకమైన మార్పుకు దారితీసింది. అంతే— రాముడు మాయమైనాడు; దేవుడూ మాయమైనాడు. నేను కూడా పాషండుడినై పోయాను. ఇలా 'శంబుకవధ' ఒక్కటే యెంతమంది పాషండుల్ని తయారు చేసిందో!

కవిరాజు మహాకవి — కవిరాజు పాషండుడు— పాషండుడైన కవిరాజే మహాకవి అయిన కవిరాజును ఖూనీ చేశాడు. ఇందులో లోకుల ప్రమేయం కాని, లోకుల్ని అనవలసిన పనికాని లేదు. అందుచేత గోపీచంద్‌గారి బాధలో అర్థం లేదు. పాషండుడుగా కవిరాజు బ్రతుకును సహించలేనివాళ్ళు కవిరాజులోని మహాకవిని బ్రతికించాలని చూస్తున్నారు. బుద్ధుణ్ణి అవతారమెత్తించి బౌద్ధాన్ని చంపగల్గిన నేర్పును గుర్తుకు తెచ్చుకొంటున్నారు. అటువంటి విశ్వామిత్రుల మాటల్లోని మంచితనానికి మోసపోయే,గోపీచంద్ గారు బాధపడే వారనుకొంటా—

ప్రస్తుతః కవిరాజు జిజ్ఞాసువు—అందువల్ల విమర్శకుడు, పాషండుడు, నాస్తికుడు, విప్లవవాది, సంస్కర్త. ఆయన భావాలుగాని, ఆ భావాలను ప్రకటించడానికి యెంచుకొన్న సాధనం కాని, తదాచరణా విధానంగాని తన పూర్వులకున్న వానికంటె భిన్నం. అందువలన సంఘ

సంస్కరణకోసం కవిరాజు త్రొక్కిన మార్గంలో మనకు విశిష్టత కన్పిస్తుంది.

సంస్కరణ అనేది ఒకనాటిది కాదు. ఒక కాలానిది కూడా కాదు. వివిధదేశాలలో, వివిధకాలాలలో సంస్కర్తలు ఆవిర్భవిస్తూనే వున్నారు. ఎవరికివారు తమ తమ పరిధుల్లో సంస్కరణ భావబీజాలు వెదజల్లి పోతూనేవున్నారు. కాని, యెప్పటికప్పుడు కరడుకట్టుకొని పోతున్న సమాజం సంస్కర్తల కృషికంతటికీ యెదురు తిరుగుతూనే వున్నది. ఎదురుతిరుగుతూనే వుంటుంది. ఎంత సంస్కరణ పొందినా సంస్కరణ—సంస్కర్తలు సమాజాని కెప్పటికప్పుడే అవసరం. సహజంగా సంస్కరణకే సంస్కరణ అవసరం! అందుచేత సంఘ "గమనం" సార్థకం కావాలంటే సంస్కరణ తప్పదు.

ఐతే అందరిదీ ఒకెత్తు—కవిరాజుగారిది మరొకెత్తు. కవిరాజుగారికి సన్నిహిత సమకాలికులతో పోలికే లేదు. వితంతు వివాహాలు కావాలనీ, రజస్వలానంతర వివాహాలు జరగాలనీ, రచనల్లో వ్యావహారిక భాషను వాడాలనీ అనే కమంది అనేక ఉద్యమాలు లేవదీశారు. కాని, కవిరాజు గారి ఉద్యమం ప్రాథమికంగా భావవిప్లవోద్యమమే—భావ సంస్కరణోద్యమమే. వేమన, బ్రహ్మంగార్ల ఛాయలు ఈయనలో కనుపిస్తైయ్. ఐతే వారివలె ఈయన వేదాంతి కాడు. ఈయన ఐహిక భావ సంస్కరణ, జీవిత సంస్కరణ బోధించడమేకాక ఐహిక జీవితాన్ని ప్రోత్సహించాడు.

వేమన రాముణ్ణి గురించి "తెలివిలేనివాడు దేవుడెట్లా యెరా!" అని ప్రశ్నించాడు. ధర్మరాజునుగురించి "పేరు ధర్మరాజు పెనువేప విత్తయా" అని వ్యాఖ్యానించాడు. అయ్యవార్లను గురించి "వెఱ్ఱికుక్కలవలె వేదముల్ చదివేరు అన్వయంబు ఎరుగ"రని తేల్చివేశాడు. ఇవి అన్నీ వేమన్నగారి మ్యూజింగ్స్. కాని, కవిరాజుగారిదొక సమగ్రమైన పథకం. తేనెపట్టులాగా గదులు గదులుగా విభజింపబడిన హిందూ సమాజాన్ని చూచాడు. అందులో రాణీ ఈగలాగ ఆధిక్యత చలాయిస్తున్న బ్రాహ్మణ్యాన్ని గమనించాడు. వారికీ ఆధిపత్యాన్ని కట్టబెట్టి, వజ్రకవచంలాగా కాపాడుతున్న పురాణాది గ్రంథ సమూహాన్ని పరిశీలించాడు. వజ్రాయుధంవంటి కవిత్వం సహాయంతో పురాణాలనూ, పురాణ పురుషులనూ, వాటికి దత్తమైన మనస్సులనూ. కకావికలు చేశాడు. గ్రహణశక్తి వున్న పురాణ వ్యాధి పీడితుల జాడ్యాలు నయంచేసి, పునరుజ్జీవితులను చేశాడు. అందుచేతనే భావ వికాసంలో కాని, తెలుగు కవితలో కాని కవిరాజు తెలుగునాటికొక యుగపురుషుడు.

* * *

హిందూ సమాజంలో పరమ పవిత్రాలుగా చలామణి అవుతున్న భారత, భాగవత, రామాయణాది గ్రంథాలలోని పవిత్ర పాత్రల దుర్గంధ భూయిష్టమైన కల్మషాన్నీ, నింద్యమైన చరిత్రనూ వ్రేలెత్తి చూపుతూ సంభవయోగ్యమైన యదార్థ పురాణ కథల్ని సృష్టించాడు కవిరాజు.

తెలుగునాడు తిమ్మిరులెత్తి పోయింది. ఐతేనేం? "లోకులు తిట్టిన నిజమే వాకోనగా గట్టిపట్టుపట్టిన వాడకొండని యెలుగెత్తి చాటాడు. పురాణ పాత్రలన్నీ రూపవిపర్యాస్తి పొందినై.

కాని, సూత్వరి ప్రోక్తాలన బడుతున్న పాత కథల్ని కాదనడానికి రుజువేమిటి? అందుకని వాచాః సూతుణ్ణే ఆశ్రయించాడు. సూతుడేమన్నాడో చూచారా?

"నాపేరన్ వెలయించి నామెడకు అంటంగట్టి తద్గ్రింథముల్
నాపై నేరము మోపగాదలచి అన్యాయంబు న్యాయంబుగా
పాపంబున్ సుకృతంబునాగ రచియింపం జాలినా రెవ్వరో
నాపై బెట్టినయట్టి యీ యగడు మాన్పంగా బ్రయత్నించెదన్."

అయితే సూతు డీ మాటలన్న విషయం నిజమేనా? ఏమో! ఎలా కాదనగలం? ఐనదాన్నీ, కానిదాన్నీ—అన్నిటినీ సమర్థించుకోడానికి సూతుణ్ణి అడ్డం పెట్టుకొంటున్నారు మన మతపోషకులు. ఆ సూతుడు చిరంజీవి అంటున్నారు. ఆ సూతుడే నాకూ చెప్పాడంటున్నారు కవిరాజు. ఇక కాదనడ మెలా? సాంఘిక శాస్త్రాన్నీ, అన్యాయాన్నీ పరిశీలించిన కవిరాజుకు పురాణాలమీాద నమ్మకం సడలింది. సత్యదృష్టి ప్రబలింది. సత్యాన్వేషణాసక్తులైనారు. పత్రశ్ఛలాలే సూత పురాణాదులు. వెనుకటిది సూతుని దివ్యవాక్కయితే, యిప్పటిది కవిరాజు సత్యవాక్కు. నిరోధించరాని శీలమున్నది అందులో.

ఐనా కాకున్నా మనం హిందువులం; హిందువులం కాము అనే హక్కు మనకు లేదు—ఇదీ మన మతం అను

కొన్న హిందూమతం మనకిచ్చే స్వేచ్ఛ. జన్మమాత్రాన్నే జాతి మతాలనుశాసించే అధికారం యితరమతాలు గుత్తకు తీసుకోకపోయినా, మతాలన్నీ దుర్మతాలే. అందుకే కవి రాజు 'మతమను మాట మోసమునుమా! యిదె మూలము ధర్మపీడకున్' అంటారు. 'మతముతె పుట్టకున్నయెడ మారణ కర్మము లిన్ని సాగునే' అని చరిత్రవైపుకు పార జూడ మంటాడు. మత సామ్రాజ్యంలో పై అంతస్థులో కూర్చున్న పీఠాధిపతి 'తాను చదువవచ్చు ననుటకన్న యితరులు చదువకూడద'ని చేసే వితండవాదాన్నిగురించి ఆలోచించమంటాడు:

> "గుడులలోనికి దేవుని కొల్వకొరకు అరుగుచున్న అద్విజు కన్ను దెరచిచూచి దేవుడూరకుండును. భూమిదేవు డూరకుండడు...."

అని కలవరపడతాడు. వర్ణవిభాగాన్ని సమర్థించడంకోసం ప్రమాణాలు సృష్టించి విశేషార్థాలు తీయడానికి సంకోచిం చని వదరుబోతుల నుద్దేశించి:

> "ప్రతి సర్గంబు తృణీకరించి మును విశ్వామిత్రుడున్ సృష్టికిన్
> ప్రతిసృష్టిన్ పొనరించెనందు రదియ బ్రంబౌనె? విప్రుల్ ప్రజా
> పతినెమ్మోమును దండకేలు తొడలున్ పాదంబులున్ బుద్ధిని
> హ్నుతిచే యోనిమయంబుచేసి రనులో కోక్తిన్ విచారించినన్."

అని ఉపాలంబిస్తాడు. 'సృష్ట్యాది కులంబులున్ మనుజులందరు ఒక్కటే' అని తీర్మానిస్తాడు. 'వర్ణములబట్టి నే ధర్మనిర్ణ యంబు చేసియున్నాడనను మాట చెనటి మాట' అని బ్ర హ్మన్న పేరుమీదుగా మందలిస్తాడు.

వర్ణవ్యవస్థ ప్రాశస్త్యాన్ని గురించి మన ప్రబుద్ధులు

లొట్టలువేస్తారు. హిందూ సమాజ వ్యవస్థ యెంత నికృష్ట మైనవో, యెంతటి పశుప్రవృత్తిగల మనస్తత్వం దాన్ని రచించిందో వూహించుకోడానికి ఒక్క నిదర్శనం చాలు– అస్పృశ్యత, పైకి 'ఆత్మవత్సర్వభూతాని' అని అరవవచ్చు. 'సర్వే జనాః సుఖినోభవంతు' అని దీవించవచ్చు. ఇవన్నీ 'అహం బ్రహ్మాస్మి' అన్న అద్వైతకర్త గారి అర్థంలేని ఆక్రందనల వంటివే. పెదవి మర్యాదనుపొందే యీ శ్రీరంగనీతులన్నీ తమకోసం కాదు: పెరవారికోసమే. అందుకే మన కులపెద్దలు మనోవాక్కాయ కర్మలకోసి అంతర్ద్వైరుధ్యాన్ని భరించలేక,

"దక్షిణాఫ్రికా యందు నిర్దయులు తెల్ల
వారు భారతీయల పెట్టు వాట్లు గాంచి
గొల్లుమని యేడ్చు ఎంతొ గగ్గోలు పడుచు
పనవు చుండును ఈనాటి బ్రాహ్మణుండు.
కాని తానుమాత్రమె అంటగారాని వాండ్ర
ముట్టరాదూ ళ్ళను ప్రవేశపెట్టరాదు
పొమ్మనుచు నుండు మాలల, బోధపడదు
తండ్రి! నేటి బ్రాహ్మణుని చిత్తప్రవృత్తి"

అంటూ బాధపడతాడు కవిరాజు.

అయితే దీనికి పరిష్కార మార్గ మేమిటి? 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం' అన్న శ్రీకృష్ణపరమాత్ముని సర్టిఫికేట్ యేమికావాలి? అది రద్దయితేకదా వర్ణవ్యవస్థ బిగువు సడలేది? అందుకని కవిరాజు,

"అతుల కిల్బిష పంకిలమగుటచేత
పంచజన సమూహము నందు ప్రబలియున్న

పూతి గంధము పోకార్చి పుటముపెట్టి
ఏను రమణీయమగు పునస్సృష్టిచేతు"

అని బ్రహ్మన్నచేత యెదురు సర్టిఫికేట్ యిప్పించాడు. అయితే అసలు బ్రహ్మన్న కవిరాజే!

"ఒక్క జాతియందుద్భవమొంది గూడ
స్పర్శదోషంబు, దృష్టిదోషం బటంచు
పతితమై పోవుచుండె ప్రభ్రష్టమగుచు
తెలుగు జాతి పునస్సృష్టి వలదె చెపుమ?"

అంటూ మానవతనే అవమానపరుస్తున్న అప్రతిష్టాకరమైన వర్ణవ్యవస్థను నిర్మూలించడానికి పునస్సృష్టే అవసరం కాదా అని ప్రశ్నిస్తాడు. అందుచేతనే తన్నిర్మూలన కవసరమైన మానసిక వాతావరణాన్ని సృష్టించడానికి సాహితీ విప్లవ ధ్వజ మెత్తాడు. నూతన సాహిత్యాన్ని సృష్టించాడు. కవిరాజు కలంనుంచి స్రవించిన గీతా ప్రవాహం పాత భగవద్గీత కొక సవాలు.

బ్రహ్మన్న వర్ణవ్యవస్థను తిరస్కరించాడు. 'చాపకూటి' సిద్ధాంతాన్ని ప్రబోధించాడు. సహపంక్తి భోజనాలు చేశాడు. కులాని కొక కన్నెను చేపట్టాడు. మాల కన్నియ ద్వారా కన్నమనీడును కన్నాడు. అందుచేతనే బ్రహన్న కవిరాజు మన్ననలు పొందాడు. కవిరాజు బ్రహ్మన్నను సంస్కర్తగా గుర్తించాడు. వర్ణవ్యవస్థ బ్రద్దలుకావాలంటే బ్రహన్న పద్ధతి తప్పదన్నాడు. వర్ణాంతరవివాహాలు జరగాలన్నాడు. ఐతే దానివల్ల వర్ణసాంకర్యం జరుగుతుందని బొబ్బలు పెడతారే, ఎలా? దానికి కవిరాజు యేమన్నారో తెలుసా?

"నేడు భారతభూమిలో నిలిచియున్న
వర్ణముల సంకరముగాని వర్ణమొకటి
కూడలేదని నిగదింతు గొంకులేక"

దీనితో ఒళ్ళు మంటలెత్తితే ప్రయోజనం లేదు. భారతీయరక్తం సంకర రక్తం! భారతజాతి సంకరజాతి! కాబట్టి వర్ణసాంకర్య సమస్య లేనేలేదు. అందుకే కవిరాజు వర్ణాంతర వివాహ వ్యతిరేకులైన ఛాందసుల నుద్దేశించి:

"ఎంత నికృష్ట జన్ములయి ఈగతి ధర్మము జెప్పినారా వ
ర్ణాంత పాణిపీడన మహాత్మకమౌననిః"

అని శపిస్తాడు. మానవులంతా వర్ణసాంకర్యం పొందినవారే. అందులో భారతీయులకి అగ్రతాంబూలం. వర్ణ సాంకర్యాన్ని గురించి మడికట్టుకునే మన ప్రబుద్ధులంతా జాతి సంకర బీజోత్పన్నులే.

* * * *

అసలు మనుష్యులమీాద పురోహితుల ఆధిపత్యం పుట్టుకకు పూర్వంనుంచే ప్రారంభమవుతుంది. బూడిద బుంగల కెత్తిన తర్వాతకూడా అంతంకాదు. చేటలో పడినప్పటి నుంచీ తతంగాలే. అందులో వివాహం, మరణం రెండూ ముఖ్యమైన మైలురాళ్ళు. పురోహితులు రిజిష్టరు చేస్తే తప్ప వీటికి గుర్తింపులేదు. అందుచేత యీ రెండు ఘట్టాల్లోను వారి దళారీతనం తొలగితేతప్ప వారి ప్రాభవం తగ్గుముఖం పట్టదు. ఊరక సిద్ధాంత రీత్యా మతాధిపతుల నిరంకుశత్వాన్ని తూర్పారపడితే ప్రయోజనం? అందుచేత

ఆ తతంగాలను జరిపించడానికి కవిరాజుగారే స్వయంగా నడుంకట్టారు.

వివాహాన్ని అష్ట విధాలుగా మనవారు వర్గీకరిం రించారు. ఆ విధానాలన్నిటికీ ఆ రోజుల్లో ఆమోదముద్ర వుండేది. శ్రీకృష్ణుడు రుక్మిణిని యెత్తుకుపోయినా, ద్రౌపది ఐదుగురు మగాళ్ళను చేపట్టినా, కుంతి ధర్మసంతానాన్ని కన్నా వాటన్నిట్కి దేవతాసంబంధమైన దీవనలు, సంఘం యొక్క ఆమోద ముద్ర వుండేవి. మనకు నేటిదాకా దేవు ళ్ళుగా చలామణి అవుతూ వచ్చిన భ్రష్టులు చేసిన 'పాడు' పనుల్లో యేవొక్క పని మనం యిప్పుడు చేసినా లోకం కోడై కూస్తుంది—సామాజికులు కాకులు పొడిచినట్లు పొడు స్తారు. అన్నీపోగా మిగిలింది ప్రాజా పత్యం. నాగరికులను కొన్న హిందువులంతా మంత్ర తంత్రాలతో పురోహితుడి మధ్యవర్తిత్వంద్వారా దంపతులు కావాలి—వికారం పొందిన ప్రజాపత్యాంద్వారా.

అయితే యీ మంత్రాలేమిటి?—సంస్కృతభాష. వాటికి అర్థంలేదా? వుంది—అంటే యేదో వుండ లేన ట్లుగా వుంది. వధూవరులకు అర్థంకాదు. పెండ్లిపెద్దలకు అర్థంకాదు. పోనీ పురోహితుడికైనా అర్థమౌతున్నదా ? లేదు—

ఒకప్పుడు యూరపు దేశాలలో కూడా వివాహాది క్రతుకృలన్నీ లాటిన్ భాషలో జరుగుతూ వుండేవి. అర్థం కాని భాషలో ఆకాండ జరగటం నిరర్థకమని వారుగుర్తిం

చారు. తిరుగుబాటు చేసి లాటిన్ మంత్రాలకు తిలోదకా లిచ్చారు. తెలుగుదేశంలో తొలిసారిగా యీ తెగులుకు మందు కనిపెట్టినవారు కవిరాజు. సంస్కృతి భాషయొక్క పవిత్రతను ప్రశ్నించడమేకాక, దాని అపవిత్రతను కూడ ఆయన బయట పెట్టారు.

"పతిత పావన భాష గీర్వాణ భాష
అంచు ఎంచు చుంటిమి కాదె? అందుచేత
పతితులకు గల్గు అక్కర పారజూడ
అన్యులకు గల్గు నొక్కారక్వంత యైన?"

గీర్వాణభాష పతిత పావన భాష! పావనులు కావలసిన పతితులకే దాని అవసరం — అంటే పతితులుకాని అద్విజులకు సంస్కృతంతో పనేలేదని వ్యాసునిచే నర్మగర్భితంగా పలికించారు కవిరాజుగారు. అంతేకాదు.

"దుర్జ్ఞేయమైన భాషయందున్న కథలెల్లను అజ్ఞులకు శిరోధార్యములగు నన్న సంగతి లోకవిదితము. ఇది యెరిగియే విప్రులు సంస్కృతము పవిత్రమగు భాషయనియు, అందలి వాక్యములు భగవదుక్తములనియు, వానిని ఇతర భాషలలోనికి పరివర్తనము చేసినయెడల వానిని అంటియున్న పవిత్రత కలుషితమగునను అభిప్రాయము లోకమున వ్యాపింప జేసిరి. సంస్కృత భాషయందలి మంత్రములను తెలుగు భాషలోనికి తెచ్చినయెడల సామాన్యజనమునకు అవగాహమై అందలి నీతులు, ధర్మమును సులభైక వేద్యములగును"

దానితో చీకటిమేడలోవున్న మంత్రాల బండారం బయట పడుతుంది. అందుచేత కవిరాజుగారు వివాహ మంత్రాలను పరిశీలించారు. మంత్రాల వెనుకవున్న గూడు పుఠాణీని గమనించారు.

సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః
తృతీయో అగ్నిష్టే పతిస్తురీయస్తే మనుష్యజాః"

అన్న వివాహ మంత్రార్థాన్నిబట్టి కేరళలో గర్భాదానం మొదటి మూడు రాత్రుళ్ళు సోమ,గంధర్వ,అగ్నుల ప్రతినిధిగా పురోహితుడు వధువు పాన్పును చేరటం పసికట్టాడు. అభంశుభంయెరుగనివధువును పట్టుకొని'అమ్మాయీ నీ మొదటి మగడు సోముడు, రెండవ మగడు గంధర్వుడు, మూడవమగడు అగ్ని, ఈ మనుష్యుడు నీ నాల్గవ మగడు మాత్రమే' అని పురోహితుడు పాఠాలుచెప్పే విధానాన్ని గర్హించాడు. అనర్థకాలు, అసహ్యాకరాలు, ప్రభ్రష్టాలు అయిన మంత్రాలను కాలదన్నాడు. వివాహకాండకు యేది ముఖ్యమో, యేది అముఖ్యమో పరిశీలించి అవసరమైన భాగాన్ని తెనుగు చేశాడు. పదిగంటల భాగోతాన్ని పదినిమిషాల కార్యక్రమంగా కుదించాడు. గీర్వాణ భాషకు గీర్వాణ మడిచాడు. అందరకూ అర్థమయ్యే విధంగా 'వివాహవిధి'ని తెనుగు లోకానికి సమర్పించాడు. మంత్రాలతో నిమిత్తం లేకుండా వందలకొలది వివాహాలను తాను స్వయంగా చేయించాడు. యెందరెందరో చేయించారు; చేయిస్తూ వున్నారు. మంత్ర బంధీకృతాలైన మనస్సుల్ని

నాటినుంచి విముక్తి చేసి, అసాధ్యాన్ని సాధ్యంచేసిన ఘనత దక్కించుకొన్నారు కవిరాజుగారు.

*　　　*　　　*

అయితే మంత్రాలు వివాహంతో సరిపెట్టుకోవడం లేదు. చచ్చినా వదలటంలేదు. అందుచేత మరణవిధికూడా అవసరమేమో!

ఈ విషయంకూడ కవిరాజు పరిశీలన చేయకపోలేదు. అలా చేసి శ్రాద్ధ కర్మలు నిరర్థకాలు గనుక దానికొక విధి వుండడం అనవసరమనే ఆయన భావించారు.

చచ్చినవాళ్లు చావగా బ్రతికిన వాళ్ళ చావుకొచ్చే వి శ్రాద్ధాలు—గో.భూ.సువర్ణ, ధాన్య దానాలతో, భోజన సదుపాయాలతో బ్రతికిన వాళ్ళ నడుములు విరుగుతై. జీవపోషణకంటె శవపోషణ ముఖ్యం. అందుకే "మనిషి వుండగా మజ్జిగ నీళ్ళులేవు—బొందమీదకు పాడిఆవా?" అన్న ప్రశ్న పుట్టింది. ఇందులో పితరులమీద ప్రేమ బలం కన్నా తృప్తిపడని పితరులు బాధపెడతారనే భయబలం హెచ్చు. ఐతే కవిరాజుగారీ భయాన్ని తీరుస్తూ,

"మృతిని పొందిన మనుజులు పితరులగుదు
రనుట పితృలోక మున్నది యనుట, పింద
ములకునై అందు పితరులు మొగమువాచి
ఉందు రంచువాకొను చెల్ల హుళి హుళక్కి"

అని గేలిచేశారు.

"ఈ పితృలోకపు విషయం
బీపింద నివాపవారి వృత్తాంతంబే
పాపాత్ములు బోధించిరి"

అని మండలించారు. ఇలా పితృలోకాల ఉనికిని నిరసించడంతో శ్రాద్ధకర్మల అసంబద్ధతను రూఢి చేశారు. కాబట్టే రేనాడో చార్వాకుడు ప్రశ్నించిన ధోరణిలో,

"పుడమి తలమ్మునందు పడ బోసిన దోసెడు మంచినీళ్ళు, గు
ప్పెడు మెతుకుల్ తమంతటనె యేపగిపన్ పితృలోకమందు నుం
డెడు పితరుల్ గ్రహింపగ వ డింజను దానిని నిల్వకుండ?...."

అని ప్రశ్నించారు. ఈ అసత్యం చాటున దాగివున్న నైచ్యాన్ని చూచే వేమన "పియ్యి తినెడు కాకిపితరులకెటు బెట్టు?" అని అసహ్యించుకొన్నాడు. కాని తమ తిక్క-వదలక చేస్తూనే వుంటారు. అందుకే ఆ తిక్కనే వాల్టేరు మహాశయుడు "Religion is what the first rogue taught to the first fool" అన్నాడు.

దాసులకు దానం చేయడానికొక స్వర్గాన్ని, పాషండులమీద బాణం వేయడానికొక నరకాన్నికూడా సృష్టించారు మతస్థులు. అయితే కవిరాజుగారి దానాలకూ బాణాలకూ వంగే ఘటంకాదు. ఖూనీలో "ఎచ్చట ఉన్నది! ఎంతదూరములో వున్నది ఆనరకలోకం? నీవుగాని, నీ గురుపరంపరలో ఎవరయిన గాని, ఎప్పుడయిన చూచి వచ్చితిరా?" అని శునశ్శేపుణ్ణి వెక్కిరిస్తాడు వేనరాజులోని కవిరాజు.

కవిరాజుకు స్వర్గ నరకాలు లేవు. మంత్రతంత్రాలు లేవు. సాధనమ్మకాలు లేవు. అందరకూ పదమూడు నిషిద్ధం. కవిరాజుకు కావలసింది పదమూడే. అందుకే బ్రహ్మన్నచేత "అంకెలలో పదమూడును వంకలలో చంద్ర

వంకను నేనే'' అనిపిస్తాడు. లోకంలో వస్తున్న అభ్యుదయ కరమైన మార్పుపట్ల తనలో ఉబికి వస్తున్న సంతోషాన్ని అర్జునుడి యేచూరితో సమ్మేళనం చేస్తాడు :

"అన్నా పూర్వాచారము
లన్నియు మనకండ్ల యెదుట అతివేగముగా
మన్నయి పోవుచు నుండెను
భిన్నా భిన్నంబులగుచు చెప్పగనేలా?"

పాచికంపుకొట్టే బూతుపురాణాలలోని జుగుప్సాకరమైన సంగతులు మాసిపోతున్నందుకు కూడా అర్జునుడీ విధంగా విషాదగానం చేస్తాడు :

కానీను డన్నచో కసరి కొట్టుటెకాని
  కొమరాండ్రు సరిపుచ్చుకొనరు నేడు
క్షేత్రజుండన్నచో కేరడింపులెకాని
  ప్రోయాండ్రు తలలూచ బోరు నేడు
మరి సహోఢజుడన్న మండెమేలమెకాని
  పడుచుకత్తె యలిష్ట పడరు నేడు
జార, గూఢోత్పన్నుడన్న దూరుటెకాని
  మగనాండ్రు మొగమిచ్చి మనరు నేడు

తారుమారయ్యె జగమెల్ల తండ్రి. వింటె?
ఎట్టి విడ్డూరములు నేడు పుట్టుచుండె?
కాలమెంతలో తలక్రిందు కాగ నయ్యె
కలి ప్రవేశించినట్టి ఆ క్షణమునందు :"

పాత పురాణాలన్నీ బూతులతో నిండివున్నై. ఆ బూతుల్ని కాదన్నవారు గాని, ప్రశ్నించినవారు గాని లేరు.

అందరూ ఆ బూతుల్ని తిరగవ్రాస్తున్నారు. సంస్కృతంలో వున్న భారత రామాయణాది రచనలకు తెలుగు తర్జుమాలు వచ్చినై. వున్నవి చాలవన్నట్లు మరీమరీ వ్రాస్తున్నారు. అదంతా కవిత్వమే నంటున్నారు. క్రొత్తగా చెప్పవలసిన దేమీ లేదనుకొంటున్నారు. అందరూ కవులమే ననుకొంటు న్నారు. ఇలాంటివారిని గురించే అయి వుంటుంది—కవియను నామంబు నీరుకాకికి లేదే - అని ఒక పూర్వకవి అన్నది. ఇలాటివారు వ్రాసే చెత్తను గురించే కవిరాజుగారు,

"పాయక పూర్వ గాథలని
ప్రత్న కవీంద్రులు నేటిదాక రా
మాయణ భారతాది కృతు
లన్నియు వ్రాసిరి త్రిప్పి. త్రిప్పి ఏ
దో ఒక కబ్బ మంచు తల
కొక్కటి ఆక్కట : నూతనాంశ మే
దో ఒకటేనియుం దెలు ప
నో పని గ్రంథ సమూహ మేటికో ?

అని ప్రశ్నిస్తాడు. ప్రాచీనులు బూతులు వ్రాసి నీతులుగా స్వీకరించమన్నారు. సాంఘికదౌష్ట్యాన్ని స్థాపించటానికీ, సమర్థించటానికి, జిజ్ఞాస రేకెత్తకుండా వుండటానికీ, రేకెత్తిన జిజ్ఞాసను నిర్మూలించటానికీ వారా బూతుల్ని నీతులుగా ప్రబోధించారు. దాన్ని పసిగట్టిన కవిరాజు వూరకుండలేక పోయ్యాడు. దానివెనుక దాగివున్న స్వార్థచింతనను కడిగి వేశారు. ఆ బూతులన్నిటికీ వాతలు పెట్టాడు. సత్యదృష్టి కల్గించాడు. పునస్సృష్టి చేసాడు.

సంఘంలో జరుగుతున్న మోసాన్ని, సంఘం అనుస

రిస్తున్న మూఢాచారాలనూ గమనించి బాధపడ్డారు. తిరునా ళ్ళకు పొయ్యే జనాన్ని చూచి,

"తీరుబాటు కల్గి తిరునాళ్ళకై పోవు
వింత లుండుననెడి వెర్రిచేత
శక్తిచేత కాదు ప్రాకృత లోకంబు"

అని జాలిపడ్డారు. గడ్డాలలో చీరపోతుల్ని పెంచుకొనే వారిని చూచి

"తిరిపెము నెత్తి యెత్తి అతి
దీనత తిర్గుచు జోలె బట్టుచున్
తిరుపతి కొండమీది కెగ
దేకుచు అచ్చట చెప్పుదెబ్బ లీ
వారవుగ దిన్న లేశము ప్ర
యోజన ముండదు"

అని నిష్కర్షగా చెప్పాడు. "బొచ్చు నొసంగి యెల్లు పరిపూర్ణ మనోరథసిద్ధి పొందగావచ్చును ?" అని ప్రశ్నించాడు. గుడిగోపురాలకు పొయ్యే వారి నుద్దేశించి,

"గుడికి తరచూ పోయి గొనుగుచుండెడివాడు
చెడ్డ పాపమేదో చేసియుండు.
అదియె వాని బట్టి అట్టిట్టు పీడింప
గుడికి పోవునతడు........"

అని తీర్మానించాడు. కొలుపులను నిరసించాడు. 'వేటతల చూచిగాని మోమాటబడని దేవతల, లంచగొండితనాన్ని విమర్శించాడు. ఏటా దేవుళ్ళ పెళ్ళిళ్ళు చేసేవాళ్ళను చూచి

"ప్రతి వర్షంబును నా వివాహమును పే
రన్ పెక్కు చందాల దు
ర్మతి చందాలు పసూలు చేసి ప్రతి యూ
రన్ గజ్జె కట్టింతువే ?
గతి యీ మాత్రము లేదు నా కరరె : నే
గావించు కోలేనె ? యీ
గతి నన్నివు పరాభవించుటకు సం
కల్పింతువే మానవా ?

అని దేవుడుచేతనే ప్రశ్న వేయిస్తాడు.

అందుచేతనే నా కవిరాజు కవిరాజుకాడు. కవిగా ఆయ నను నేనుగుర్తించలేదు. నిజానికి కవిరాజు కవిరాజు మాత్రమే కాదు. కవిరాజరాజు. కాని సంస్కర్తగా, భావవిప్లవోద్యమ కర్తగా ఆయన స్థానం తెలుగునాటికి తేజాన్ని యిచ్చింది. ఆయన అందించిన జ్యోతిని వాడవాడలకూ తీసుకొని వెళ్ళ డము మన విధి.

—రావిపూడి వెంకటాద్రి.

—oo:oo—

# కవిరాజు - ఆయన ఉపోద్ఘాతములు

స్థూలంగా కవులను రెండు విభాగాలు చేయవచ్చు. ఒకరు అందంకోసం వ్రాసేవారు. మరొకరు ఆదర్శంకోసం వ్రాసేవారు. అందం,ఆదర్శం సమ్మిళితంచేసి వ్రాయకలిగినవారు అరుదుగా ఉంటారు. అందంకోసం వ్రాసే కవులు రచనలలో తమ అభిప్రాయాలను ఎక్కడైనా ప్రకటిస్తే,అవి వారివా, లేక ప్రత్యేక సందర్భంలో పాత్రలు చెప్పే మాటలా అనిపిస్తవి. నవలయితే నవలాకారుడు తన అభిప్రాయాలను పాఠకునకు నేరుగా చెప్పవచ్చు. నాటకమయితే రచయిత కొన్ని పాత్రలద్వారా తన అభిప్రాయాలను పాఠకులకు వ్యక్తపరచాలి. అభిప్రాయాలు రచయితవి అవునా కాదా అని విమర్శకులు సందేహిస్తే, సరియైన సమాధానం ఒక్కొక్క మారు దొరకటం కష్టమవుతుంది.

షేక్స్పియరు టెంపెస్ట్ నాటకంలో ప్రోస్పెరో ద్వారా తన అభిప్రాయాలను చెప్పాడా అంటే నిశ్చయమైన సమాధాన మివ్వటం కష్టం. మిల్టన్ పారడైజ్ లాస్ట్‌లో సైతాను ఆదాము ఉపన్యాసాలలో తన భావాలను వ్యక్త

పరచాడా అన్న విషయం విమర్శకులకు చేతినిండా పనిని కలిగించింది. షేక్స్పియరు, మిల్టన్ వంటి మహాకవులు కావ్యాలలో ఫలానాదైన తమ అభిప్రాయాలను వెల్లడిస్తున్నామని చెప్పలేదు. కనుక మనం ఈ విషయంపై ఊహాగానం చేయవలసి వస్తుంది.

బెర్నార్డ్ షా నాటకాలలో మాత్రం ఈ సందేహస్థితి ఉత్పన్నంకాదు షా ప్రతి నాటకానికి ముందు దీర్ఘమైన ఉపోద్ఘాతం వ్రాసాడు. కొన్ని నాటకాలకంటెవాటి ఉపోద్ఘాతాలే దీర్ఘమైనవి ఈ ఉపోద్ఘాతాలలో షా నాటకీయవస్తువు గురించి, ఇతర విషయాలగురించి తన అభిప్రాయాలను స్పష్టంగా చెప్పాడు. షానాటకాలముందుఉపోద్ఘాతాలనుప్రవేశపెట్టడం ద్వారాఒక నూతనమార్గాన్నిసృష్టించాడు. తెలుగు కవులలో మొట్టమొదటగా ఈ మార్గాన్ని అవసరం దృష్ట్యా అవలంలంబించిన వారు కవిరాజు త్రిపురనేని రామస్వామిగారు.

కవిరాజుగారికి రామాయణ, భారత పురాణాలమీద నిర్దుష్టమైన అభిప్రాయాలున్నవి. ఇవి విప్లవాత్మకమైనవి. పాత పురాణాలను హేతువాదానికి, పరిశీలనకులోను చేసారు. ఆర్య మత గ్రంథాలకు ద్రావిడ భాష్యాన్ని రచించారు. వారి కాలంలో కావ్య రచన పండిత లోకంలో సామాన్యముగ సాగుతూండటం వలన ఆ మార్గాన్నే అవలంబించారు. వారు కేవలం తమ దృష్టితో కావ్యాలను, నాటకాలను వ్రాసి, వాటికి ఉపోద్ఘాతాలను వ్రాయకపోతే, వారితాత్విక దృష్టికి తీరని అపచారం జరిగి ఉండేదిది. కవిరాజుగారు కేవలం రచన కోసం వ్రాసారు కాని, వారి పాత్రలలో

వారి అభిప్రాయాలను చూడకూడదని విమర్శకులంటే వారి అనుయాయులు ఇరుకాటంలో పడేవారు. కాని కవిరాజు గారు తమ విప్లవాత్మకమైన అభిప్రాయాలను ఉపోద్ఘాతా లలో వివరించారు. ఈ తాత్త్విక దృష్టిని ఆధారంగా చేసి కొని కావ్యాలు, నాటకాలు రచించారు. వారి కావ్యాల లోని రమణీయమైన శైలినే పొగడుతూ, శైలికి ప్రాణమైన వారి సిద్ధాంతాన్ని మరచిపోతే వారికి అపచారం చేసినట్లే. వారి విమర్శ వెనుక సాంఘిక సమానత్వం, సత్యాన్వేషణ, నీతి, ధర్మం ఉత్తమ ఆదర్శాలుగా ఉన్నవి. ఈ ఆదర్శా లను దృష్టిలో పెట్టుకొని అందంగా రచనలను సాగించారు. ఒకమారు ఈ ఉపోద్ఘాతాలను చదువుతే పాత విశ్వాసాల లోని లోటుపాట్లు తప్పక తెలుస్తాయి. ఈ ఉపోద్ఘాతాలను చదవడమే భావ విప్లవం.

రామాయణ, భారతపురాణాలను,అంధ విశ్వాసాన్ని వదలిపెట్టి, వారికి పాశ్చాత్య విజ్ఞానం ద్వారా వచ్చిన హేతువాద దృష్టితో పరిశీలించారు. వీరు బారిష్టరు కనుక న్యాయశాస్త్రాన్ని అభ్యసించారు. వీరు బారిష్టరుగా తమ వాదనను అతి సమర్థవంతంగా సాగించారు. వీరి వాదన ఒక మహా సౌధం వంటిది. వివరాలను సేకరించి వాటిని పటిష్ఠ ముగా అమర్చి వాదనను తిరుగులేనిదానిగా ప్రతిపాదిస్తారు. పౌరాణిక విషయాలను చర్చిస్తున్నపుడు పాశ్చాత్య సంఘం లోని సామ్యాలను, భేదాలను చూపుతూంటారు. పాఠకుని న్యాయాన్యాయాలను విచారించమంటారు. అంధవిశ్వాస ముతో విషయాలను చూడవద్దంటారు. వీరి విమర్శ ఎంత

సునిశితమో అంత వినయ యుత మైనది. శ్రీరామ చంద్రుని రాజ్యకాలమును పరిశీలిస్తూ శంబుకవధలో విధంగా అన్నాడు. "పాఠకుడా! యాశ్రేయములగు గ్రంథ ములను ధిక్కరించి ప్రజ్ఞా విశేషమును జూపించుటకు యత్నించు చున్నారమని భ్రమపడకుడు. ఋషి భక్తియందు మే మెవ్వరికిని దీసిపోము కాని బహుళ గ్రంథావలోకనమునఁ గ్రోడీకరించిన కొన్ని సంగతులను నీకు నివేదింతుము. గ్రాహ్యంబులయిన గ్రహింపుము. అగ్రా హ్యంబులని తోఁచినఁ ద్రోసిపుచ్చుము. ఇంతియే మేము గోరునది."

తమ వాదనలో తప్పులేమైనా ఉంటే దిద్దుకోడానికి సిద్ధంగా ఉంటారు. వితండ వాదనను, కువిమర్శనను సహిం పరు. శ్రీకాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు శంబుక వధపై చేసిన విమర్శనను వీరు గౌరవించారు. 'ఇది సత్యమే" అని అంటూ తమ అభిప్రాయాలను స్పష్టంగా చెప్పారు.

సింహాళం లేని రావణుని గాథల గురించి తగిన పరి శోధన సల్పవలెనని చెప్పారు. చారిత్రక పరిశోధన పట్ల వీరికి గౌరవం మెండు. ఇంకా విషయాలపై పరిశోధన చెయ్యాలి అన్నప్పుడు తను అభిప్రాయాలను చెప్పుతూ ముందుకు త్రోవచూపిస్తారు.

వీరి విమర్శలో అక్కడక్కడ హాస్యం తొణికిస లాడుతూంటుంది. హేళన విమర్శలో భాగమే. కాని హేళన ఉత్తమస్థాయిలో హేతుబద్ధంగా ఉంటుంది. వ్యక్తిగత

దూషణ ఉండదు. హేళనలో సునిశిత హాస్యం జోడింప బడింది.

వీరి వచనశైలి ప్రస్ఫుటంగాను, పటిష్ఠంగాను బెర్నార్డ్ షా ఆంగ్ల శైలివలె ఉంటుంది కవిరాజుకు షాకు చాలా సామ్యాలున్నవి. షా వలెనే వీరు విమర్శకులు, సమతా వాదులు, మానవతావాదులు. హేళన హాస్య రచనలను తమ అభిప్రాయాలను ప్రచారం చేయుటకు సమర్థవంతంగా ఉపయోగించుకొన్నారు. వీరి రచనలలో ఉపోద్ఘాతాలు అతి ముఖ్యమైన స్థానాన్ని అలంకరిస్తవి. గుండ బద్దలుకొట్టి నట్లు చెప్పడంలోను, తమ వాదనను ప్రత్యర్థులకు నచ్చ జెప్పడంలోను విశేష ప్రజ్ఞ ప్రదర్శించారు. షా వచనవిశేష నాటకాలను మెచ్చుకుంటూ కవిరాజుగారు శంబుక వధలో ఇలా అన్నారు. 'నేడు బెర్నార్డు షా వచన నాటకములం జూచి మెచ్చని వారెవ్వరు? ఈ మహాకవి నాటక ప్రదర్శనముం గాంచు భాగ్యము మాకు గల్గినది. ఒకానొక సందర్భమున మేము తన్మయత్వముఁజెంది, కంటియెదుట జరుగుచున్నది ప్రదర్శనమును మాట మఱచితిమి" వచన నాటకాల గురించి సదభిప్రాయాన్ని వెల్లడించారు.

వీరి శైలిలో తెలుగుదనం ఉట్టిపడుతూంటుంది. తెలుగు దనం కవిరాజు మతం అంటే అతిశయోక్తి కాదు. సంస్కృత భాషాదాస్యాన్ని అంగీకరించలేదు. ఈ తెలుగు దనమే పల్నాటి వీర చరిత్రను మహాభారతం కంటె మిన్నగా పరిగణించుటకు కారణమైనది. ఈ విషయమున శ్రీనాథకవి నాథలేఖినీ మాహాత్మ్యము ద్వైపాయనుని లేఖినీ మాహాత్మ్య

మును దలంచన్నినదని చెప్పవచ్చును" అని భగవద్గీతలో ఉద్ఘాటించారు.

వ్యభిచారము, మాంసాహారము, మద్యపానము, దేవతలలో ఉన్నా, ఆర్యులలో ఉన్నా విమర్శకు గురిచేసారు. భారత దేశంనిలో వర్ణవ్యవస్థను విమర్శిస్తున్నప్పుడు, అమెరికాలోను దక్షిణాఫ్రికాలోను శ్వేతజాతుల అహంకారాన్ని దుయ్యబట్టారు. అమెరికాలోని నీగ్రోల బాధలను వివరించారు. సాంఘిక సమానత్వమే కవిరాజుగారి ఆదర్శం.

బహుగ్రంథ పరిచయమున్న పండితులు కవిరాజుగారు. అక్కడక్కడ అవసరమని తోచినపుడు వంశ వృక్షాలను ఉదహరిస్తారు. సూతపురాణం ప్రథమాశ్వాసంలో యుగ విభజనలోని అసంబద్ధ స్థితిని బయటపెట్టారు, యుగాలకు. ధర్మం నడకకు సంబంధం లేదని నిరూపించారు. నాలుగు యుగాలకు పట్టిక లేసి వాటి లక్షణాలను విమర్శించారు. సూత పురాణం తృతీయాశ్వాసంలో రామాయణ గాథను విమర్శించారు. వర్ణమంటే ఒంటి రంగు అని చాతుర్వర్ణ్య వ్యవస్థను పరిశీలించారు. ఆర్యులు తమ దమన నీతితో ద్రావిడుల నెటుల దక్షిణాపథానికి తరిమినారో పేర్కొన్నారు. రాముడు పితృవాక్య పరిపాలకుడేనా, ఏక పత్నీవ్రతుడేనా అని విమర్శించారు. "రావణుడు, రాక్షసుల గురించి వీరు వ్యక్తంచేసిన అభిప్రాయాలు మౌలికమైనవి. రావణుడు వేద వేత్త, బ్రహ్మజ్ఞాని, మహాభక్తుడు, మహావీరుడు, సుందరాకారుడు, అతులరాజనీతిజ్ఞుడు, మహాకవి, భాతృప్రియుడు,

జాత్యుద్ధారకుడు, వివేకి, తెలుగు వైయాకరణుడు" అని ప్రశంసించారు.

సూతపురాణం చతుర్థాశ్వాసంలో యాదవులు, కృష్ణుని గురించి విపులంగా చర్చించారు. శ్రీకృష్ణుని వంశ వృక్షము, ద్రుపద కృపాచార్య వంశ వృక్షము, చంద్రవంశ మును గురించి పేర్కొన్నారు. కర్ణుడు సూతుడేనా అన్న విషయం చర్చించారు. భీష్ముని అంతటి కపటి, పక్షపాతి భారత యోధులందు మరొకరు కన్పట్టడన్నారు.

శంబుకవధ, ఖూనీ వీరి నాటకాలు. శంబుక వధ ఉపోద్ఘాతంలో ఆర్య ద్రావిడ నాగరికతలను పరిశీలించారు. రామాయణకాల హిందూదేశ వ్యవస్థను వర్ణించారు. వానరులు, రాక్షసుల ఆచారాలు, అలవాట్లు పేర్కొన్నారు. యక్ష నాగ లోకముల గురించి ప్రస్తావించారు. బుద్ధునికి పూర్వం 1844 సంవత్సరముల క్రిందట శ్రీరామచంద్రుడు సింహళంపై దండెత్తినట్లుగా సింహళ ద్వీప చరిత్ర యగు రాజావళిలో వ్రాయబడిన విషయంతో కవిరాజుగారు ఏకీభ వించారు.

ఖూనీ ఉపోద్ఘాతము విశిష్టమైనది. శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారి 'వేనరాజు'లో వేనరాజునకు మహాపచారం కలిగిందని భావించి, దానికి సమాధానంగా వీరు ఖూనీ వ్రాసారు. ఈ ఉపోద్ఘాతంలో కవిరాజుగారు నాస్తికత్వంపై తమ అభిప్రాయాలను విశదీకరించి, సమర్థించారు. వేనుడు బౌద్ధమతమునకు మార్గదర్శియని యభిప్రాయపడ్డారు. నాస్తికులలో లోక కంటకులు కాని, లోక ప్రతారకులు కాని,

వారు పెక్కురున్నారుఅన్నారు. 'నేనుసిఅభిప్రాయములన్నియు నాస్తికత్వమునకే దారి చూపుచున్నట్లు పొడకట్టక మాన దన్నారు. 'ఆస్తికత్వము ప్రపంచ పరిణామమునకు నాటంక ములు గలుగజేసెనుగాని, తోడ్పడలేదని గట్టిగఁ జెప్పవ చ్చును.'' అని ఉద్ఘాటించారు. హిందువులు, మహమ్మదీ యులు, ప్రోటస్టాంటులు, కాథలిక్కుల మధ్య యుద్ధాలను పేర్కొని, మతం పేరిట, దేవుని పేరిట జరిగిన క్రూర కృత్యాలను ఉదహరించి 'భగవంతుడున్నచో' దనపేర జరుగుచున్న యత్యాచారములనైన మాన్పనొల్లడా? అని ప్రశ్నించారు.

మతము ప్రతి దేశమునందు సౌజన్యము, సౌభ్రాతృ త్వము, సమానత్వమును జిందరవందరజేసి, మానవుల నల్ల కల్లోలముజేసి, ప్రపంచ శాంతిలేకుండ జేయుటయే కాకుండ మహా పురుషుల నెందరినో తన పొట్ట పెట్టికొన్నద''న్నారు. ఇందుకు కొపర్నికస్‌ను ఉదహరించారు. ''మానవుడు మృగ దశలో నున్నప్పుడే కొండగానో, యే వేరుగానో వెలసిన దేవుడు, మానవ విజ్ఞానము పరిణామముఁ బొందుచున్న కొలంది, భగవంతుఁడేరు, కొండ రూపము వదలి, మృగమై, మృగమునుండిమనుష్యుఁడై, మనుష్య దశనుండి యదృశ్య రూపుఁడై నిరాకారుఁడై, నిరంజనుఁడై నిర్వికల్పుడయ్యెను. ఇక దరువాతి దశ యేమి? శూన్యత్వము అనగా నాస్తిక త్వము. ఇదియే మూఢ మానవ ప్రతిపాదితుఁడైన భగవంతు నకు సేఁ.. వాటిల్లుచున్న దశ.'' అని కవిరాజుగారు స్పష్టీ కరించా.. రష్యాలోని విప్లవాన్ని ప్రస్తావిస్తూ చిన్న దేవుడు

జారు 'రష్యారాజు చావగా పెద్ద దేవునికి గతిలేక పోయెనని చమత్కారంగా చెప్పారు. "ఈ ప్రార్థనలు, ఈ సేవలు, ఈ కైంకర్యములు స్వాతంత్ర్యమును గోల్పుచ్చి, పురుషకారమును నశింపజేసి మానవులను నంబేదలగు బానిసలుగాఁ జేయుట కుపకరించును గాని మఱెందులకుఁగొఱగావు." అని నాస్తికత్వాన్ని సూత్రప్రాయంగా పేర్కొన్నారు. ఉపోద్ఘాతంలో వారి మొగ్గు నాస్తికత్వం వైపేనని ప్రస్ఫుటం. కవిరాజు ఆస్తికుడా, నాస్తికుడా అన్నవారు ఖూని ఉపోద్ఘాతాన్ని జాగ్రత్తగా పరిశీలించాలి.

భగవద్గీత ఉపోద్ఘాతంలో కురుక్షేత్రం కారెంపూడి యుద్ధాలలోని పోలికలు, తేడాలను వివరించారు. భారత వీరులు, పల్నాటి వీరులు, ద్రౌపది, నాగసాని, శ్రీకృష్ణుడు బ్రహ్మనాయుడు, భీమన్న, పెద్దన్నలు మొదలగు పాత్రలలోని సామ్యాలను, విభేదాలను పరిశీలించారు. వర్ణ వ్యవస్థను శాస్త్రీయ దృష్టితో పరిశీలించి, ఖండించారు. వర్ణాలు మూడై, నాలుగై, ఐదై, ఏ విధంగా హిందూ సంఘాన్ని ఛిన్నాభిన్నంచేసాయో విమర్శించారు. ఆంగ్లేయులు హైందవ వార్యుల మధ్య రాజకీయము, సాంఘికము, మతము, విద్య విషయాలలో విభేదాలను ఒక పట్టికలో విశదీకరించారు. అరవింద యోగి భగవద్గీతమీద వ్యక్తంచేసిన అభిప్రాయాలతో కవిరాజుగారు ఏకీభవింపలేదు. గీతోపదేశమునకు రణరంగము తగిన క్షేత్రము కాదన్నారు. గీతను ఒక్కరు

వ్రాయలేదు, క్రోడీకరణమన్నారు. గీతా శ్లోకములకు ప్రతి శ్లోకములు ప్రతిబింబ శ్లోకములు, వికార శ్లోకములు, శ్లోక పాదములు గీత కన్నముందున్న గ్రంథములనుండి ఎత్తి చూపించారు.

కవిరాజుగారు తమ సిద్ధాంతాలను కేవలం ఉపోద్ఘాతాలలోనే ప్రతిపాదించారు. వాటినిగురించివిపులంగా గ్రంథాలను వ్రాసిన యెడల తాత్త్విక చర్చకు హెచ్చుగా దోహదం చేసేవారు. వారిని కేవలం కవిగా మాత్రమే లోకంచూస్తే, వారి హేతువాదానికి, తాత్త్విక దృష్టికి అపచారం జరుగుతుంది. వారి పాండిత్యానికి, విమర్శనా జ్ఞానానికి నాటకాలకు, కావ్యాలకు వ్రాసిన చిన్న ఉపోద్ఘాతాలు కేవలం మచ్చుతునకలు. కనీసం ఈ ఉపోద్ఘాతాలన్నీ బెర్నార్డుషా ఉపోద్ఘాతాలవలెనే ఒక పుస్తకంగా ప్రచురించటం అవసరం.

—గోపరాజు సాంబశివరావు

# తెనాలిలో కవిరాజు

కవిరాజు త్రిపురనేని రామస్వామిగారి 21 వ వర్థంతి ఫిబ్రవరిలో విజయవాడలో కవిరాజ సాహితీ సమితి వారి ఆధ్వర్యమున జరుగునని విన్నంతనే హృదయమానంద సంభరితముగా నున్నది. కవిరాజ వర్థంత్యుత్సవముల సందర్భములో "కవిరాజ దర్శనము"ను పేర వినూత్న రీతులలో గ్రంథము వెలార్చుచున్న సందర్భములో కవిరాజుకు, నాకున్న సహచర్యమును పురస్కరించుకొని కవిరాజు గారిని గురించి నాలుగు మాటలు వ్రాస్తున్నాను.

సంఘంలో, సాహిత్యరంగంలో, నిత్య మానవజీవితములో ఉన్న లోపాలను ఎదిరించాలనే దీక్షతో - కవిరాజు క్రొత్తమార్గాన్ని త్రొక్కారు. ఎక్కడ అధర్మం, అన్యాయం మూఢాచారం, కల్పిత ఆధిక్యత, సాంఘిక పైశాచికత, కుల జాడ్యం, తలెత్తినదో-కవిరాజు తన అసమాన ప్రజ్ఞాదురంధరతలో ఎదురొడ్డి నిలిచినారు. సంఘసేవ, సారస్వత సేవతో పాటు సాంఘికవిమోచన ఉద్యమం ప్రారంభించారు. పీఠాధిపతుల్ని, ఉపన్యాస చక్రవర్తుల్ని, ముఖాముఖి ఎదుర్కొని వారి వాదాన్ని పూర్వపక్షం చేసేవారు. కవిరాజు తన సిద్ధాంతాన్ని వూరూరు తిరిగి ప్రచారం చేసారు. ఒంటరి

గానే నిలబడి తన వాదాన్ని నెగ్గించుకొనేవారు. వీరి వాగ్ధాని కెదురొడ్డి తట్టుకోలేక శంకర పీఠాధిపతులు సైతం పలాయనం చిత్తగించారు.

1926లో కృష్ణాజిల్లా వీడి తెనాలి పట్టణంవచ్చారు. అందుకు కారకులు శ్రీ పాములపాటి వెంకట కృష్ణయ్యచౌదరిగారు. శ్రీ కృష్ణయ్యచౌదరిగారు "రైతు" దినపత్రికను తెనాలినుండి ప్రచురించాలనే ఉద్దేశ్యంతో కవిరాజును ఎడిటర్‌గా ఎంచుకొని తెనాలికి పిలిపించుకొన్నారు. కానీ, అవాంతర పరిస్థితులవల్ల పనిసాగలేదు కానీ-కవిరాజు తెనాలిలోనే స్థిరపడి ప్రాక్టీసు ప్రారంభించారు, తెనాలి పురపాలక సంఘాధ్యక్షులై, 9 వత్సరములు ఏకగ్రీవముగానగర పాలనను కొనసాగించి, అనేక ప్రజా సమస్యలను పరిష్కరించి తెనాలి నగర చరిత్రలో సువర్ణాక్షరములతో వ్రాయదగు "మురుగు నీటి పథకమునకు (under ground drainage) నిధిని ఏర్పాటు గావించారు. నాటి ఏర్పాటువల్ల నేడీ పథకము అమలుకు సులువై రాజమార్గ మేర్పడుటకు ముఖ్య కారకులు శ్రీ కవిరాజు. తానీ పదవి స్వీకరించిన నాటినుండి స్థానిక ప్రజల దైనందిక జీవితంలో సన్నిహిత సంబంధాలు ఏర్పరుచుకొన్నారు. బాల్యంనుండి అహింసాపరులు. హింసా విధానమును సహింపలేరు. అందుకు కవిరాజుగారి పట్టుదలను, కార్యదీక్షను చూడండి.

తెనాలిలో ప్రతి సంవత్సరం గంగానమ్మకు, పోతురాజుకు కొలుపులు చేస్తూయుండేవారు. కవిరాజు ఛైర్‌మన్‌గా యున్న రోజులలో కొలుపులు వచ్చినవి. తెనాలి పెద్ద

బజారులో అనాదినుండి ఆచారంగా వస్తున్న కొలుపులు కొలుచుకోవలెనని ప్రజలు పర్మిషన్ కోరగా "నేనీవిధంగా (జంతుబలికి) పర్మిషన్ ఇవ్వనని" చెప్పివేశారు. అందుకాగ్ర హించి కౌన్సిలర్లు అవిశ్వాస తీర్మానం పెట్టారు. అందుకే మాత్రం లెఖ్ఖచేయక జంకక పర్మిషన్ ఇవ్వలేదు. అంతట పట్టణ ప్రజలు పర్మిషన్ కొఱకు, జిల్లా కలెక్టరు వద్దకు వెళ్ళారు. అందుకు కలెక్టరు అట్టి పర్మిషన్ ఇచ్చుటకు తనకు అధికారము లేదనియు, అది పూర్తిగా చైర్మన్ ఇష్టమేనని సమాధానం చెప్పారు. అంతట ప్రజలు కౌన్సిలర్లు ఏమియు చెయజాలక హింసావిధాన కొలుపులనువిరమించుకొన్నారు.

వారి కొన్నాళ్ళకుమారీస్ పేటలో బ్రాహ్మణులుయజ్ఞ మును చేయుటకు పూనుకొన్నారు. యజ్ఞయాగాదులు హింసా మార్గమున చేయరాదని, హింసించుటకుకట్టియుంచిన మేకను వదలించి, యజ్ఞగుండమును భగ్నపరచిరి(ఖూనీ నాటకమున వేనరాజ పాత్ర యిట్టిదే) అంతటితో యజ్ఞముచేయుట ఆగి పోయినది.

కొంతకాలానికొక అష్టావధానిగారు కవిరాజుయొద్దకు వచ్చి తను అష్టావధానము చేయుదునని చెప్పగా, సరే నన్నారు. అష్టావధానము ఆరంభమైనది. తలొక ప్రశ్న అడుగుచున్నారు.... రాముడు - సీతకు జరిగిన సంవాదమును గురించి ఒక పద్యం చెప్పుమనినారు కవిరాజుగారు. కవిరా జును చూస్తూ చెప్పలేక "యిప్పుడది చెప్పుటకు వీలుగాని సమయముని" నిష్క్రమించారు అష్టావధానిగారు.

రామస్వామిగారు తెనాలిలో యున్నంతవరకు ఎవరు పురాణగాథలుగానీ, మతసంబంధమైన ఉపన్యాసములుగాని చెప్పుటకు జంకెడివారు. తెనాలిలో జరుగు శ్రీరామనవమికి ఆహ్వానించి, ఉపన్యాసమివ్వమని రామస్వామిగారిని కోరగా "రాముడు ప్రతిసంవత్సరం పెండ్లి చేసుకొంటాడేమిటి ? ఇతనికి సీతిని యములు లేవా ఏమి ? అనుచూ, రామునిలోగల లోపాలన్నియు చెప్పి,ఇవియన్నియు బ్రతుకు తెరువు కొరకు బ్రాహ్మణులు కల్పించినవేనని ఉపన్యసించి సభికులను ఆలోచనాపరులను చేసారు.

1930 లో ఉప్పు సత్యాగ్రహ సమయంలో తెనాలి పట్టణమునకు చైర్మనేగాయుంటూ, జంపనినుండి తెనాలికి కాలినడకన బయలుదేరిన 30 మంది సత్యాగ్రహ దళమునకు చినరావూరు పొలిమేరలకు వెళ్ళి రామస్వామిగారు స్వాగతం చెప్పి —

"వీరగంధము తెచ్చినారము
వీరుదెవ్వడో తెల్పుడీ
పూసిపోదుము
మెడను వైతుము
పూలదండలు భక్తితో"

అని గీతముపాడి వారి ను త్తేజపరచి తమ స్వగృహామునకాహ్వానించి వారికి భోజనాది సౌకర్యములు కలిగించినారు.

రామస్వామిగా రిల్లెప్పుడూ సాహిత్యవాదోపవాదములతోను, సంస్కర్తల పదధ్వనులతోను ప్రతిధ్వనిస్తూవుండేడిది. వారిల్లొక సూతాశ్రమం. ఆస్తికులు,నాస్తికులు, రాజకీయవేత్తలు, లౌకికవ్యవహర్తలు, అలౌకికివాదులు,

పండితులు, పామరులు, కవులు, గాయకులు, జ్యోతిష్కులు మరెందరో ప్రముఖవ్యక్తులు ఎప్పుడో ఒకప్పుడు సూతాశ్రమంలో కాలుపెట్టకుండ యుండేవారుకాదు. విప్లవాత్మకమైన ప్రతి ఉద్యమంతోను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో రామస్వామిగారికి సంబంధం యుండేది. ఎక్కడ ఏ నూతనాంశము కనిపించినా, కవిరాజుగారు ఆసక్తితో గమనించేవారు. మెచ్చుట ఎలాంటి నూతనోత్సాహం మోసులెత్తినా దానికి వారి దోహదం ఉండేది. ఎన్నో హృదయాలలో వారు జ్ఞానజ్యోతులను వెలిగించారు. సాంఘికంగా అధమాధమ స్థితిలోయుండి దిక్కుతోచక బెంబేలు పడుతున్నవారి కెందరకో చేయూతనిచ్చి వీపు తట్టి;

"తెనాలిలో నేనున్నానుగా నాయనా, భయపడకు. ధైర్యముతో ముందడుగు వెయ్యి" అంటూ ధైర్యాన్ని స్థైర్యాన్ని కలుగజేసారు రామస్వామిగారు. ఆకాశమంత మనిషి, సముద్రమంత ధైర్యం తమకు గలవన్న సంతోషం వారిని పునర్జీవితులను జేసెడిది.

రామస్వామిగారు శతావధానులు, బహుగ్రంథకర్త. అపారమైన పాండితీప్రతిభ కలవారు, చక్కని మాటకారి. తడుముకోకుండా సూటిగా జవాబుచెప్పేశక్తి వారిలో అపారంగాయుంది. అందుచేతనే సంభాషణలో ఎంతటివారికైనా జ్ఞాపకం ఉండేలా జవాబివ్వటం వారికి వెన్నతోపెట్టిన విద్య.

మద్రాసులో 1929 సంవత్సరములో రామస్వామి గారికి ఆంధ్రమహాసభ "కవిరాజు" బిరుదునిచ్చి తనకుతానే గౌరవించుకొన్నది. అదే సందర్భంలో ఆంధ్రమహాసభ "కవికోకిల" బిరుదును ప్రసాదించి దువ్వూరి రామిరెడ్డిగారిని సత్కరించింది.

గుడివాడ పౌరులు కవిరాజును 1941 లో చిత్రభాను సంవత్సర వైశాఖమాసంలో గజారోహణోత్సవంతో ఘనంగా సన్మానం జరిపి - వారి సంస్కారనోద్యమంపట్ల తమ గాఢానురాగాన్ని తెలియజేసుకొన్నారు. వివిధ ప్రాంతాల నుండి అనేకమంది ప్రముఖులు వేలాదిస్థానిక ప్రజలు నాటి సన్మానంలో పాల్గొని కవిరాజుకు బ్రహ్మరథం పట్టారు.

బెజవాడ రామచంద్రారెడ్డిగారి ఆధిపత్యంలో చల్లపల్లి సంస్థానాధీశ్వరులున్నగు మహామహుల సమక్షంలో పండితాశీర్వాదములతో అఖండవైభవోపేతంగా ఆ సన్మానం జరిగింది. ఆనాడు సాహితీ సమరాంగణ సార్వభౌముడైన కృష్ణదేవరాయుల ఆస్థానంలో పెద్దనాది మహాకవులకు జరిగిన సన్మానాల నతిశయించిన యీ కవిరాజు సన్మానాన్ని జూచిన ఆంధ్రలోకం హర్షోత్పులకితమైంది. సన్మానసంచికలో మొత్తముగా ఎనుబదియిద్దరు కవులు, రచయితలు కవిరాజు ప్రతిభను సాహిత్య సాంఘిక సేవలను ప్రశంసించారు.

కాలచక్రం గిరున తిరిగి కొన్నిమాసాలు గడిచాయి. ఆహ్వానించబడిన ప్రతి సాహిత్యసభకు వెళ్ళడంతో రామస్వామిగారికి అస్వస్తతకలిగింది. అది మారణ విష

జ్వరానికి దారితీసింది. ఆరోజు కారోజుకూ రామస్వామి ఆరోగ్యస్థితి ప్రజానీకంలో అమితాందోళనము కలుగ జేసి నది. ఆంధ్రుల దురదృష్టముకొద్ది యుగపురుషుడు, మహా కవియైన మన రామస్వామిగారు తెనాలిలో వారి స్వగృ హంలో 1943 జనవరి 16 రాత్రి 1-30 గంటలకు మరణిం చారు. ఈ ఆకస్మికవార్త యావదాంధ్ర ప్రజానీకాన్ని దుఃఖసాగరములో ముంచివైచినది. అప్పటికి వారి వయస్సు 56 సంవత్సరములు. మరుసటిదినము జనవరి 17న కవిరాజు నిర్వాణంపట్ల నిరసనచూచకముగా యున్నట్లు రవి ఆల స్యంగా ఉదయించాడు. తెనాలి పట్టణప్రజలు, పరిసర గ్రామీణ ప్రజలు తుదిసారి కవిరాజు భౌతికదేహాన్ని తిల కించి ఆదరముతో పుష్పగుచ్ఛాలనుంచి కన్నీరు మున్నీ రుగా విలపించారు.

—కన్నెగంటి జగ్గయ్య

# వికాసపథాన్ని వెలిగించిన విప్లవజ్యోతులు

"ప్రార్థించినంతమాత్ర, సేవించినంతమాత్ర, కైంకర్యములు చేసినంతమాత్ర, భగవంతుడు ప్రీతుడై, సిరిసంపత్తులనిచ్చి, పరలోకసౌఖ్యముల గల్పించుననుట నమ్మదగినదేనా ? ఇట్టివి యెన్నడు, నెచ్చటను జరిగియుండలేదు. ఇయ్యవి మానవహృదయ దౌర్బల్యమును సూచించక తప్పదు. ఈ ప్రార్థనలు, ఈ సేవలు, ఈ కైంకర్యములు స్వాతంత్ర్యమును గోల్పుచ్చి, పురుషకారమును నశింపచేసి, మానవులను సంబేదలగు బానిసలనుగా జేయుట కుపకరించునుగాని, మరెందులకు గొఱకావు ...... భగవంతుని ప్రేమించుటకన్న తోడి మానవుల ప్రేమించుట పరమోత్తమంబు"

ఈశ్వరారాధనమీద విప్లవధ్వజాన్ని లేపి, మానవుణ్ణి జీవితరంగంలో ప్రధాన కార్యకర్తగా నిరూపించబూనే ఈ విప్లవ శంఖారావం, ఒక నవ్య మానవతావాది పూరించిందికాదు. అది కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి తన ఖూనీనాటకంలో, ఉపోద్ఘాతంలో వ్రాసిన సుభాషితము :

దేవుణ్ణి ఆవలకునెట్టి, మానవుణ్ణి కేంద్రంలో సుస్థాపి

తం చేయడానికి ఆంధ్రదేశంలో కవిరాజుదే మొట్టమొదటి గట్టిప్రయత్నం. కవిరాజుగారి ఆ ప్రయత్నం వారి భగవద్గీతా రచనలో పరాకాష్ట నందుకొన్నది; పతాకస్థాయిని చేరుకొన్నది. కవిరాజు రచించిన భగవద్గీతలోని మొట్టమొదటి పద్యమే ఒక విప్లవజ్యోతి.

"శంకరుని యంతవేదాంత శాస్త్రవేత్త
యనియెగా 'అహమ్ బ్రహ్మాస్మి' యనుచుగాన
నాకు నేనె నమస్సు లొనర్చుకొందు
నాది మధ్యాంత శూన్యుండ నైతినంచు."

వర్ణాశ్రమ ధర్మాన్ని కాసట బాసట చేయడంతో ప్రారంభించి, మూఢవిశ్వాసాలతో యుద్ధం నడిపి, చివరికి అన్నిటికీ ప్రాతిపదికయైన ఈశ్వరవాదాన్ని ధిక్కరించి, మానవ ప్రయత్న ప్రాశస్త్యాన్ని చాటిచెప్పిన కవిరాజు ఆంధ్రకవితా జగత్తులో అద్వితీయుడు.

అయినప్పటికీ, కవిరాజు తన తార్కిక ప్రజ్ఞతో, తన హేతువాద పటిమతో వెలిగించిన వికాసమార్గాన్ని ఆయనకుముందు సుగమంచేసిన భావుకులు, తాత్త్వికులు, సంఘనాయకులు కొంతమంది వున్నారు. అందరిలోను కవిరాజు ఆలోచనా విధానాల్ని ఉత్తేజపరచినవాడు గౌతమ బుద్ధుడు.

ఆమాట కవిరాజే చెప్పుకున్నాడు. సూతపురాణం మొదటిభాగంలో కవిరాజు గౌతమబుద్ధునకు చేసిన ప్రణామము:—

"భారత భూత ధాత్రితల భాగము సర్వము సొంత యిల్లుగా
నారసి సర్వ భూతముల యందు సమత్వము విజ్ఞిరాల్చి నే

వా రమణీయ భూతదయ వర్థిలజేసి ప్రపంచమందు బెం
పారిన బుద్ధదేవుని పదాబ్జము లెందల దాల్చుటొప్పదే !"

గౌతమబుద్ధుడు యజ్ఞయాగాదుల యెడ చూపిన తిరస్కృతి, ఆస్తికభావము నెడల చూపిన ఉదాసీనత, మానవుల యెడల, ప్రాణకోటి యెడల చూపిన ఆసక్తి, కరుణాభావము కవిరాజును కదిలించినవి – ఉత్తేజపరచినవి.

తెలుగునాడులో భావవికాసమూర్గాన కవనమల్లిన మొదటి కవి వేమన. వేమన ఈశ్వర వాదాన్ని అంగీకరించినవాడే అయినప్పటికి మతప్రాబల్యాన్ని తీవ్రంగా నిరసించిన ధీరుడు. ఆనాటి మతాడంబరాన్ని, ప్రజలను గగ్గోలుపరిచే దురాచారాలను, మూఢవిశ్వాసాలను, తన కవితాఖడ్గంతో వేమన చీల్చి చెండాడాడు. వేమన రచన చేసినది, కవనమల్లినది 14 వ శతాబ్దపు మధ్యభాగంలో. ఆనాటి సంస్కృత ప్రాబల్యాన్ని ధిక్కరించి, జాను తెలుగులో ప్రతి తెలుగువానికి సుగమంగా తెలిసే శైలిలో, తెలుగు చంధస్సులో, సత్యప్రచారం చేసిన ప్రగతిశీలి వేమన. వేమన భావప్రచారం కవిరాజులో ఉద్యమరూపాన్ని పొందినది.

"కాశిపోదునంచు గడకట్టగానేల ?
వాశితీర్థములను వగవనేల
దోషకారికెట్లు దొరుకురా యా కాశి.
విశ్వదాభిరామ.........
పాపమనగ వేరే పర దేశమున లేదు
తనదు కర్మములను దగిలియుండు
కర్మ - తంత్రిగాక, గనుకొని యుంటొప్పు
విశ్వదాభిరామ....

వేమన నైన ఈ భావాలు, ఈ శైలి కవిరాజుదే నన్నా నమ్మవచ్చును.

శివకవులంటే కవిరాజుకు ఎనలేని అభిమానము. సంస్కృత భూయిష్టమైన ఆనాటి ఆంధ్రకవిత్వానికి, తెలుగు నుడికారం ప్రసాదించినవారు శివకవులు. సంస్కృతం అమరభాషనీ, తెలుగు ఎందుకూ కొరగాలినదనీ తలచే భావదాస్యాన్ని కవిరాజు త్రోసిపుచ్చారు.

"ఒక భాష ప్రియంబు కొండొక్క భాష
విప్రియమ్ము నాకనుమాట వెగటు మాట
యయిన నేసొక్కు చుండెద నాంధ్ర భాష
యతి మనోహర మగుటచే నాలకించి."

అన్న కవిరాజు ఆంధ్రభాషాభిమానానికి, నాంది వచనం పలికినవారు శివకవులు.

తిరిగి భారతభూమిలో భావవికాసోద్యమం 19 వ శతాబ్దంలో రేకెత్తింది. రామమోహన్‌రాయ్, కేశవచంద్ర సేన్, దయానంద మొదలైన భావుకులు, తాత్వికులు దురాచారాల వెనక, మూఢవిశ్వాసాల కంచుకోటల లోపల పెత్తనం చెలాయిస్తున్న మతదౌర్జన్యాన్ని ఎదుర్కొన్నారు. సంస్కరణాభిలాషులై, వారు నూతనభావాలను, నూతన నిర్వచనాలను, ప్రచారంలోకి తెచ్చారు. ఈ సంస్కర్తల కృషితో, భారతప్రజలలో చైతన్యజ్యోతి వెలిగించబడ్డది.

ఆ చైతన్యజ్యోతిని ఆంధ్రలోకానికి మున్ముందుగా అందజేసినవాడు స్వామినీన ముద్దునరసింహనాయునింవాడు. ఆయన 19 వ శతాబ్దపు మొదటి అర్ధభాగానికి చెందినవాడు. గవర్నమెంటు ఉద్యోగి. ఆయన కవి కాదు. వచనంలోనే రచన సాగించాడు. ఆయన వ్రాసింది ఒకే ఒక

గ్రంథం. దాని పేరు 'హితసూచని'. దానిని వారి కుమారులు 1862 లో అచ్చువేయించారు. ఆనాడు అనగా షుమారు 150 సంవత్సరాలకిందట అంధవిశ్వాసాలపై, దురాచారాలపై ఆంధ్రభూమిలో ధ్వజమెత్తినవారు నరసింహనాయనింవారు. మంత్రతంత్రాలలో మహత్తులు లేవని, వర్ణవ్యవస్థలో న్యాయము లేదని, భూతప్రేత పిశాచాలు నిజంగా ఉండవని, బాల్యవివాహాలు కూడదని, స్త్రీస్వాతంత్ర్యము కావాలని నరసింహనాయనింవారు ఆనాడే ప్రచారం ప్రారంభించారు.

ఆ పిమ్మట ఆంధ్రదేశంలో నూతన చైతన్యాన్ని ఉద్యమరూపంలోకి తెచ్చినవాడు కందుకూరి వీరేశలింగం. వీరేశలింగం మహావీరుడు. ధీరుడు. ప్రజా జీవితంలోని ప్రతి భాగాన్ని సంస్కరించ బూనిన ధీరోదాత్తుడు. రాజకీయ స్వాతంత్ర్యాన్ని సార్థకం చేయాలంటే, ఫలవంతం చేయాలంటే, ముందుగా ప్రజలలో భావవిప్లవం, భావచైతన్యం ముఖ్యావసరమని గుర్తెరిగిన ద్రష్ట వీరేశలింగం. ప్రజలలోని పిరికితనాన్ని రూపుమాపి, వారిలో నూతన శక్తిని, ఆలోచనాశక్తిని, నెలకొల్పడానికి వీరేశలింగం అహర్నిశాలు కృషిచేశాడు. మానవులను అణిచే, బాధించే, కృంగదీసే అన్ని వ్యవస్థలమీద, వీరేశలింగం వీరవిహారం చేశాడు. రచనను అందుకు ఆయుధంగా ఉపయోగించుకున్నాడు. వీరేశలింగ సాహిత్యం, ఆయన వికాసోద్యమానికి, ప్రధానమైన పరికరం. రచనలో హేళన(satire) హాస్యం(humour) వ్యంగ్యం (Irony); వికటప్రజ్ఞ(witt) వజ్రాయుధాలుగా

ఉపయోగించినవాడు వీరేశలింగం సర్వాంధ్రవికాసోద్యమానికి పునాదులువేసిన వీరేశలింగం, కవిరాజుగారికి జీవితంలో కొంతకాలం సమకాలికుడే అయినా, ఉద్యమ నిర్వహణలో కొంత పూర్వీకుడు. వీరేశలింగం 1919 లో మరణించాడు. దాదాపు ఆకాలంనుండి ఆవిష్కృతమైనది కవిరాజు విప్లవ లేఖిని.

ఈ కోవకు చెందినవాడే గురజాడ అప్పారావు. ఆయన రచన స్వల్పమే అయినప్పటికీ, శక్తివంతమైనది. ప్రజలకు అందుబాటులోవుండే భాషతో, రచనాశిల్పంతో గురజాడ అప్పారావు, తన కన్యాశుల్కం మొదలైన రచనలతో సంస్కరణ భావాలను గట్టిగా ప్రచారంచేశాడు. దేశమంటే మట్టికాదు, మనుష్యులనే మానవ వాదాన్ని చాటాడు. గేయరచనకు తీరుతెన్నులు దిద్దినవాడు అప్పారావు. గేయరచనా విధానాన్ని అవలంబించి, ఉత్తేజవంతమైన గేయ సాహిత్యాన్ని, కవిరాజు, సూత్రాశమ గీతాల ద్వారా ఆంధ్రలోకానికి అందించాడు. గురజాడ అప్పారావు 1915 లో మరణించాడు, కవిరాజు చెప్పుకోదగ్గ మొదటి రచన, కురుక్షేత్ర నాటకం 1914 లో విరచితమైనది.

సంస్కృత ప్రభావాన్ని త్రోసిపుచ్చి, తెలుగులో, వ్యావహారిక భాషకు గౌరవస్థానాన్ని తెచ్చిపెట్టినవారు గిడుగు రామమూర్తి. వ్యావహారిక శైలిలో కవిరాజు రచన చేయకపోయినా, తెలుగు భాషా ప్రచారంలో, దానిపై

సంస్కృత ప్రాబల్యాన్ని సన్నగిల జేయడంలో గిడుగు రామమూర్తి, కవిరాజు లిద్దరు తోటి యోధులు.

. కవిరాజు గురువులు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు. సులభ శైలిలో పద్యాన్ని నడిపేవైనం, తిరుపతి వెంకట కవులదీ, కవిరాజుదీ ఒకటే.

కవిరాజు అధిక్షేప రచనకు అందెవేసిన చెయ్యి. ఆ తీరులోనే నడచినవి తిరుపతి వెంకటకవుల 'గీరతం,' పానుగంటి వారి 'సాక్షి' మొదలైనవి.

తెలుగులో రచన సాగించకపోయినా, ఆంధ్రావనిలో వికాసోద్యమానికి గొప్పగా తోడ్పడ్డ వారిలో రఘుపతి వెంకటరత్నం నాయుడుగారొకరు. తన ఔదార్యంతో మానవత్వంతో, అభ్యుదయ భావాలతో, ఒక తరాన్నే ప్రభావితుల్ని చేశారు వెంకటరత్నం నాయుడుగారు.

వీరందరు కవిరాజు కంటె వయస్సులో పెద్ద వారు కాగా, కవిరాజుకు సమకాలికులై, తోటివారై కృషిచేసిన ప్రతిభావంతులు కొందరున్నారు.

అందులో మొదటగా చెప్పుకోవలసినవారు ఉన్నవ లక్ష్మీనారాయణగారు. లక్ష్మీనారాయణగారు రచన విరివిగా సాగించారు. అనేక రూపాలలో వారి రచన సాగింది. వారు పరిపూర్ణమైన ఆస్తికులు. అయితే వారి ఆస్తిక భావం వారి ప్రగతి శీలత్వానికి ఎట్టి ఆటంకము కలిగించలేదు. తెలుగు ప్రజలలో నూతన తేజస్సును సృష్టించడానికి, వారిలో మంచితనాన్ని పెంచడానికి లక్ష్మీనారాయణగారు చేసిన

కృషి, అమోఘము. సమకాలికులైన రచయితలలో, ప్రముఖులలో, లక్ష్మీనారాయణగారు కవిరాజుగారికి అతి సన్నిహితులు, ఆత్మీయులు. ఉన్నవ వారి ప్రోద్బలంతోనే కవిరాజుగారి, అద్వితీయమైన 'భగవద్గీత' ఉద్భవించినది.

కవిరాజుగారి సమకాలికులలో, కవిరాజుగారివలె పురాణాలకు, ముఖ్యంగా భారత రామాయణ గాథలకు నూతన నిర్వచనాలు చెప్పినవారు పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. మత ప్రాబల్యానికి ప్రాతిపదికలుగా ఉపయోగించే, పురాణాలను, పురాణగాథలను, పురాణ స్త్రీ పురుషులను క్రొత్త దృక్పథాలలో చిత్రించటం ద్వారా భావ చైతన్యానికి క్రొత్తదారులు త్రొక్కిన వారిలో,కవిరాజుతో పాటు, పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ప్రముఖులు.

కవిరాజు సమకాలికులలో, భావోద్దీపనమైన రచన చేసిన వారిలో, తాపీధర్మారావుగారు ఒకరు. సంప్రదాయాలకు, పాత వ్యవస్థలకు అట్టడుగున దాగివున్న మర్మ సత్యాలను బయటకు లాగి ప్రజలముందు ఉంచడానికి, తాపీవారి రచనలు బాగా ఉపకరిస్తవి. వాడియైనవారి కలం అందుకు చాలా ఉపయుక్తంగా ఉంటుంది.

కొప్పరపు సుబ్బారావుగారు, ఆనాటి చెప్పుకోదగ్గ రచయితలలో మరొకరు.

కవిరాజు మొదలైన తేజోమూర్తుల వలన ప్రభావితులై, చైతన్య స్రవంతులను తమ లేఖినుల ద్వారా, కార్యకలాపాల ద్వారా సృష్టిస్తున్న భావుకులు,రచయితలు

నేడు చాలామంది ఉన్నారు. వారిలో ప్రథములు గోరా గారు. ఆయన కవిరాజుకు సమకాలికుడు; నాస్తిక దృక్పథంలో వారసుడు.

కవిరాజువలె కలం నడపగలిగిన వాడు ఏటుకూరి వెంకట నరసయ్య. ఆయన అకాల మృత్యువు వాత పడకుండా ఉంటే, కవిరాజు వెలారించిన శక్తి సంపదలకు, పునః ప్రతిష్ఠ చేసి ఉండేవాడు.

కొండపేటి వెంకటకవి రచనలు, కొత్త సత్యనారాయణగారి రచనలు కవిరాజు వారసత్వాన్ని అందుకున్నవి. వీరిద్దరు కవిరాజుకు కొంత సమకాలికులే అయినా, వారి రచనలు, ప్రధానంగా, కవిరాజు అనంతరమే బహుళ ప్రచారంలోకి వచ్చినవి.

ఇంకెందరో వికాసమార్గాన్ని వెతుకుతూ, వెలిగిస్తూ రచన సాగిస్తున్నారు. అట్టి రచన ఈనాడు సుగమం, బహుళ ప్రజారంజకం.

అయితే, ఆ దినాలలో, విప్లవధ్వజాన్ని ప్రతిష్ఠించి, భారత చరిత్రకే, భారత సంస్కృతికే నూతన నిర్వచనాన్ని ప్రవచించి, సాహసించి, తెగించి, నవచైతన్య పథాలకు పునాదులువేసి, రహదారులు నెలకొల్పిన తేజోమూర్తుల, మానవసేవ అసమానమైనది. అట్టి తేజోమూర్తులలో కవిరాజు అగ్రగణ్యుడు.

—ఆవుల సాంబశివరావు

# సూతపురాణము

"బూతుపురాణము గాదిది
ప్రాంతపురాణమును గాదు పాతకహరమౌ
సూతపురాణం బియ్యది...."

అంటూ సూతపురాణకర్త తమ పురాణాన్ని పరిచయం చేస్తూ, 'లోకంబునపురాణము లార్షేయములనియుఁ దత్కారణమునఁ బూజ్యములనియు దదంతర్గత ధర్మములు, నీతులు, కథలు శిరోధార్యములనియు విశ్వసించుచున్నది. ఈ విశ్వాసము వలనఁ గలిగిన ప్రతిఫల మాత్మద్రోహముగాఁ బరిణమించుటఁ జేసి పురాణము లెంతవఱకుఁ బ్రతికూలములో, ఎంతవఱకు నీతి బాహ్యములో యెంతవఱకుఁ బక్షపాత భూయిష్ఠములో మోడ్పుగన్నులతో నున్న విద్వల్లోకమునకుఁ జూపించు తలంపుతో సూతపురాణము రచింపఁ బడినది.' అని సూతపురాణ కారణ జన్మత్వాన్ని నివేదించారు.

పురాణములు దశములో అష్టాదశములో యైనను, రామాయణ భారత భాగవతములే ప్రశస్తములు; పురాణములకెల్లనూ మూలములు. ఏకమైన వేదమును, ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదము, అథర్వణ వేదములని నాలుగుగా జేసినవాడు. వ్యాసుడు. కాని, 'స్త్రీ శూద్ర ద్విజ

(బ్రహ్మ) బంధువులకు వేదములు శ్రవణ గోచరములు కారానివగుట, కర్మమూఢులగు వారికి శ్రేయస్సు కలుగుటకై యితిహాస, పురాణముల రూపమున శ్రుతి, స్మృతి ధర్మములను విపులీకరింప జేసిరి.

ఈ వ్యక్తీకరణ వృత్తిలో, పైలుండు ఋగ్వేదమును, జైమిని సామవేదమును, వైశంపాయనుండు యజుర్వేదమును, సుమంతుడు అధర్వణవేదమును వంతులు వేసుకొని, వానిని ధరించిరి. వ్యాస శిష్యుండగు రోమహర్షణుడు యితిహాస, పురాణముల వ్యక్తీకరణ భారము వహించెను.

ఆ రోమహర్షణుని పుత్రుడే నిఖిలపురాణ వాఖ్యాన వైఖరీ సమేతుడైన యుగ్రశ్రవసుండను పేరుగల సూత మహర్షి. ఆయన పేరనే మన సూతపురాణము వెలసినది. నైమిశారణ్యమున శ్రీ విష్ణుక్షేత్రమునందు శౌనకాది మహామునులును, విజ్ఞానధనులు, మానవ శ్రేయస్కాములు అష్టాశీతి సహస్ర సంఖ్యాకులు (88,000 ల మంది) సమావేశమై సూతర్షి ముఖమున భాగవత మహిమలను వినిరి. అదియే భాగవతము. వ్యాసనందనుడు శుకమహర్షికి వినిపించిన దానికి, భాగవత గ్రంథ ప్రసక్తిని, సూతుడు శౌనకాదులకు జెప్పెను. భాగవతము పురాణము, యితిహాసము కూడా.

ఇక మహా భారతము. అ కథకుడైన సూతర్షి, శౌనకాది మహామునులకు జెప్పినట్లు, వ్యాసుని పంపున వైశంపాయనుడు, అభిమన్యు కుమారుడు పరీక్షిన్మహారాజు

కుమారుడు జనమేజయునికి చెప్పబడిన కథ. కథను చెప్పించు కొన్నవాడు పాండవుల మునిమనుమడు జనమేజయుడు. అందులకే కథ పాండవ పక్షపాతముగనుండి, కౌరవులకు చుక్కెదురుగా తయారుచేయబడినది. నిగమసారవేది, కుల పతి అయిన సూతుని నోటికి తగిలింపబడినది.

పోగా, మూడవది, పాతది అయినది రామాయణ కథనము. 'వేదోపబృంహణార్థాయ', 'వేదైశ్చ...' ... నియు, వేదవేద్యే పరే పుంసి, జాతే దశరథాత్మజే.

వేదః ప్రాచేతసాదాసీ, త్సాక్షాద్రామాయణాత్మనా"

యని చెప్పబడు అపరవేదమే, వేదార్థ వివరణమే రామా యణము అది ఆర్షమాని వాల్మీకి కృతము. ద్రావిడుల కపకారహేతువు.

రామాయణము వేదార్థ వివరణ కాగా, భాగవత, భారతములు పంచమవేదములైనవి. వేదార్హత లేని వారి కివే వేదములు, వేదతుల్యములు. ఈ గ్రంథత్రయి, త్రయీ ధర్మముల 'స్త్రీ శూద్రద్విజ బంధువులకు' పుగ్గడించు గ్రంథ రాజములు.

కవిరాజు కురుక్షేత్రం ధర్మవధాక్షేత్రమన్న ఆక్రం దనపొంది 'కురుక్షేత్ర' నాటకాన్ని వ్రాశారు. రామరాజ్యం శూద్రవధారాజ్యమని ఘూర్ణిల్లి 'శంబుకవధ'ను వెలువరిం చారు. ఆనాటి హరి ఇల్లు 'శంబుకాశ్రమము' తరువాత వచ్చిన భావ విపరిణామముతో, 'సూతాశ్రమముగా' తన యింటిని మార్చి, సూతపురాణాన్ని గ్రంథించారు. పురాణ

ధిక్కారము, అధిక్షేపణలు పరాకాష్ఠ చెందిన రూపమే సూతపురాణము. భావపటిమ యేర్పడినది. రచనకు కుదురు చిక్కినది. లోకవృత్తములో పరిణామ చ్ఛాయలు పొడ చూపినవి. కవి పరిణతమతియైనాడు. కవిత నిగారింపులు తీర్చిదిద్దికొని, తిక్కన పాకం, పోతన వరవడి, రామరాజ భూషణుని పదనిబద్ధత, నన్నెచోడుని తెలుగు దనం, చేమ రకూ వెంకటకవి శబ్దసూత్రి, వేమన తేట తెలుగులు మేళ వించుకొని, కళాధినాథుడుగా, కవిరాజుగా మూర్తీభవిం చాడు.

అప్పుడు తన పురాణాన్ని విప్పిచెప్ప మొదలు పెట్టాడు. అదే సూతపురాణము. తానే సూతుడు. తానే అక్కథకుడు. వివేక పురాణగాథల ప్రవంతీ భారాన్ని వహించి, బూతుపురాణాల్ని దుల్లిపుచ్చ నారంభించాడు.

ఏది పాతది ? ఏది క్రొత్తది ? వివేకమునకు ప్రశ్న మూలము. ప్రశ్నతో ప్రారంభించినది సూతపురాణము.... ఎందుకీ పురాణం? వేదాలమీద వేదాలు వ్రాశారు. పురాణాలమీద పురాణాలు, స్మృతులమీద స్మృతులూ వ్రాశారుగదా ! తిరిగి యీ పాతపాట యెందుకు ? సూత పురాణ కారణజన్మ, ఏమిటది ?

లోకం, టక్కునేర్పెడి కవులగంటాల వ్రాతలను తిరస్కరించి, గతాన్ని చారిత్రక దృష్టితో, సత్యదృష్టితో చూడడం నేర్చుకోవాలి. వ్యత్యాసదృష్టిపోయి, న్యూనతా భావాలు సమసిపోయి, మానవతా విలువలను నిలబెట్టుటకై కృషి ప్రారంభించవలసి వుంది. వేమనాదులు కదలించి

వదలివేశారు. కందుకూరి ఒకరంగంతడివారు. కార్యభారం యెవరో ఒకరు సమగ్ర పరిశోధనకు తలదాల్చవలసి వుంది. సూతునిపేర కవిరాజు పూనుకొన్నాడు. సూతపురాణం ఆవిర్భవించింది.

సూతపురాణం 1925 లో ప్రారంభమైనది. ద్వితీయాశ్వాసం 1929 లో వెలువడినది. పురాణములు సాంగముగా భయభక్తియుక్తులతో జదివి, సందియములు హెచ్చి, చిత్తశాంతిలేక, పలువురజేరి, సందేహనివృత్తికి ప్రశ్నలు వేసి వేసి, విసిగివేసారి, తనకు తానే సమాధానములను యోగ్చి కూర్చినాడు; పూర్వులు వ్యాజముతో పురాణములను వ్రాసిరి. తద్విరుద్ధము విందు బ్రాజిలును. కావున-

మనసు నచ్చునెడల మన్నింపఁగా వచ్చు
మనసు నొచ్చునెడల మానవచ్చుఁ
గాని వివరమేమి కనకుండ వినకుండఁ
బరులఁ బ్రువ్వఁదిట్ట ఫలము కలదె?"

అని శ్రోతులకు నిగ్రహ కర్తవ్యతాబోధచేసి, యిష్టాసిష్ట దేవతాస్తుతి చేసి, పూర్వం సూతుడు యెట్టి పురాణములు చెప్పలేదు, అట్టి వ్యత్యాసపూరిత, సంకర కథలను చెప్ప నేవగించును. సూతుని దర్శించగా, యీ వైనం చెప్పినాడని కవిరాజు చెప్పదొడగిరి.

సూతుడిది చెప్పుట బూటక మందురా? పూర్వ పురాణములు సూతుడు చిరకాల జీవియని చెప్పినవి. వారిని కవి త్రిపురనేని త్రిపురములు గావించి, త్రిపురాంతమున

చూచివచ్చి, వారి ముఖమున, కవితావేశము నొంది, పూర్వ కథల నిజానిజములను గాలింప మొదలుపెట్టినాడు. యీ కథలను నమ్మనివారు నమ్మకపోవచ్చును, కాని, నమ్మకుండుటకు హేతువులు చెప్పవలసివున్నది. అదే కవి శ్రోతల నుంచి, చదువరులనుండి కోరునది.

సూతపురాణము తెలుగులో యెనలేని హేతువాద యుగారంభ సాహిత్యం. కవితలో విమర్శచేస్తూ యింత మహోదాత్త కవితను వెలార్చటం నాన్యతో దర్శనీయమైన విషయం. భారతావనిలో యీ రీతి రచన మరొకటి యే సాహిత్యంలోనూ లేదు. యింగ్లీషులో డ్రైడెన్, పోప్‌లాంటి వారి రచనలూ దీనికి దీటుకావు. సూతపురాణ విశిష్టత - కాదు త్రిపురనేని విశిష్టత- తెలుగునాట అదే.

కవిరాజు మరోవిశిష్టత వారి పీఠికలు. జార్జి బెర్నార్డ్‌షా వీరికిందులో సాటి. మరొకరు లేరు. స్వపర కావ్యాల లోని వీరి పీఠికలను ప్రత్యేకంగా ముద్రించవలసి వుంది. అది తెలుగుల రినైజాన్సు వుద్యమపంట కాగలదు.

సూత పురాణములలో వీరేమి సాధించిరి? అది మన ప్రశ్నలకు ప్రశ్న.

ప్రథమాశ్వాసము :

విద్య ప్రాకృతజన దుర్లభమై, భారతలోకము అజ్ఞాన గాఢాంధకార బంధురముగానున్నది. దానివల్ల అక్షరాస్యుల ప్రభ చెల్లినది; పూజలనందిరి; సంస్కృతము పవిత్ర వంశముగా భావింపబడినది. ఆ ప్రభావము వ్యక్తితో

మొదలిడి, శిష్యులకు వ్రాకి, కులాధీనమై కూర్చున్నది. కాలవాహినిలో కేవల కులమాత్రమై వెలసినది. వ్యక్తిగత మైన నాటి ప్రజ్ఞాధురీణత మంటగలసి,పుట్టువు నాశ్రయించి బ్రతుక మొదలిడినది. అది,మన విజ్ఞానం అజ్ఞానంగా మారిన చరిత్ర. కామక్రోధ లోభ మోహ మద మాత్సర్య గ్రస్తమై నిలచినది. సత్యనిరతి కృశించినది ధర్మచ్యుతి యేర్పడి,చిత్త శుద్ధి లుప్తమైనది. చిత్తసంస్కారములేని శుష్కాచారమే ప్రధానమై, గాథలు, కథలు, దానిచుట్టూ ఆ స్వార్థంకొరకు కల్పన చేయబడినవి. అవియే పూర్వపురాణ, యితిహాస, స్మృత్యాదులు. వాటి భాండారావలోకనమే సూతపురాణ కర్తవ్యము

ఇక పూర్వనుడుల పరిశీలన ప్రారంభమైనది. ముందుగా యుగాల కథనం. కృతయుగము 17,28,000 ల వర్షములు. త్రేతాయుగము 12,96,000 ల సంవత్సరములు. ద్వాపరయుగమునకు 8,64,000 హాయనములు. కలియుగమునకు 4,32,000 ల యేండ్లు పెట్టిరి. మొత్తం 43,20,000ల ఏండ్లు.

మనుష్యులు యీరోజుల్లోకన్నా దీర్ఘకాలం బ్రతికే వారు కారు. మానవుని శారీరక నిర్మాణం అట్టిది. కాలాన్ని యుగాలుగా విభజించి, యుగాలకు అనంతంగా సంవత్సరాల్ని సంతరించారు. బలిచక్రవర్తి కృతయుగంలోననీ, ఆయన కూతురు కూతురు వజ్రజ్వాల త్రేతాయుగంలో కుంభకర్ణుణి వివాహ మాడెననీ, కాని, ఆయన కొడుకు కూతురు

ఉపాకన్య ద్వాపరాంతంలోని కృష్ణుని మనుమడు అనిరుద్ధుని వివాహ మాడెననీ వ్రాసిరి. ఏమి యుగములు !

కాగా, వసిష్ఠుడు త్రేతలోవాడు. వ్యాసుడు ద్వాపరాంతంలోవాడు. వ్యాసుడు వసిష్ఠుని మునిమనుమడు. ఏమి యుగాలు ?

అందులకే కవిరాజు యుగాల్ని విమర్శించి, ఆర్ష బండారాన్ని బయటపెట్టాడు. ఇక పౌరాణికులు, యుగధర్మమని వృగ్గడించుట, కృతనుండి కవికి ధర్మచ్యుతి అయ్యేనని వాపోవుట చూచి, ఆయా యుగధర్మాల్ని క్రమానుగతంగా పరిశీలించారు.

కృతయుగము : సార్వభౌములు లేక, వీరుల పాలన సాగెడిది. జాతిమత వివక్షతలు లేవు. వావివరుసలు లేక, జాత్యంతర వివాహములునుకలవు. స్వైరవిహారముమెండు. స్త్రీలు ఆడు వస్తువులు. బ్రాహ్మణులకు క్షత్రియులు లోబడి నను తిరుగుబాట్లును కలవు.

త్రేతాయుగము : స్వైర విహారముతగ్గి ప్రజలకు స్థిర నివాసము ఏర్పడెను. తపస్సు పెరిగెను. ఆముష్మికము హెచ్చెను. స్త్రీలకు కట్టుబాట్లు మొదలాయెను. గోమాంస భక్షణ విపరీతము కాదు. యిల్లాండ్రు వెలయుచుండిరి; భార్యా భర్తృ సంబంధములు రాజొచ్చెను. కులద్వేషము మోసులెత్తెను. బ్రాహ్మణుల ఆధిక్యము పెరుగజొచ్చెను.

ద్వాపరము : రాజ్యతృష్ణ హెచ్చెను. గోమేధ,

నరమేధములుతగ్గి, గోమాంస భక్షణము తగ్గి, బహుపతి త్వము హేయముగ జూడబడ నారంభింపబడెను. విప్ర ముఖముననే విద్య ప్రవర్తిల్ల వలయునను వాదము సాగెను. వివాహము కుదురుకొన్నది. వావివరుసలు రాజొచ్చినవి.

కలియుగము: విద్య ద్విజులసొత్తు. స్త్రీ స్వాతంత్ర్యము నిర్మూలింపబడినది. యజ్ఞయాగాదులు ఆగినవి. నర గో, అశ్వమేధాదులు పోయినవి. బలులు తగ్గినవి శుల్క సంభావిత వివాహము తలయెత్తినది. పెండ్లి, మాతాపితల సర్వస్వామ్యమైనది. బ్రాహ్మణోమ ముదేవతమైనది. రాజులు బ్రాహ్మణాధీనులైరి. బహుపతిత్వము గర్హ్యమైనది; బహు పత్నీత్వము అంతే. భిన్నమతములుత్పన్నమైనవి; కుత్తుకలు మొసవుకొన మొదలిడిరి కుమారిలభట్టు, శంకరులు బౌద్ధమును హరింప ప్రయత్నించిరి. వావివరుసలు మిగుల కట్టుదిట్టములకు లోబడెను. ప్రజాసామాన్యము తమ స్వత్వముల నెరుగక గోడుగోడనజొచ్చిరి. బ్రాహ్మణవాక్యముతే మణిమంత్రౌషధములయ్యెను కులాల ధర్మములు వచ్చెను. యిది ఆర్య జాతిపతన హేతువయ్యెను.

ఇది యుగధర్మ పురావృత్తము. పురాణములను పరిశీలన దృష్టితో చూచిన పద్ధతి వర్తమానము పూర్వయుగములకన్నమిన్నయని కవిరాజు భావము.

యుగముల గాథలు తారుమారుగ నున్నవని పురాణములే సాక్ష్యములని కవిరాజువాదన. యుగాలు, యుగ ధర్మాలను పరిశీలించినచో, పూర్వపురాణ, స్మృతి, యితి

హాసములు పనికిరానివని, పాఠకులే గ్రహింతురని వారి భావము. అదియే వారికృషి.

తరువాత వీరి పురాణ కృత్యాదులు పరిశిష్టాలు. యిష్టానిష్ట దేవ తాస్తుతికలవు. మత దేవుళ్ళు అందరూ తల క్రిందాదురు. దేవుళ్ళలోని లంచగొండి తనము గాంచిరి. దైవపాలనలోని ద్వంద్వ ప్రభుత్వమును చూచిరి. పూజారి రగడనెంచిరి. బ్రాహ్మణ మత ఫలిత సాంఘిక దౌష్ట్యాన్ని గర్హించిరి.

ఆదికవి భరతముపట్టిరి, నన్నయ్య ఆదికవి కాదని, తెలుగు భాషాఘోష క్రమ పరిణామమును చారిత్రక, భాషాదృష్టితో నర్గించిరి. తన యిష్టకవులైన నన్నెచోడుడు వేమన, రామరాజ భూషణుడు, చేమకూర వెంకటకవు లస్మరించిరి. నన్నయ్యకు పూర్వపు తెలుగు కవితను యేరి కూర్చిరి. పొట్టకూటి, ఆశ్రయింపు కవిత్వాన్ని గర్హించి, కవుల స్వాతంత్ర్య దీప్తికావలెననిరి.

వారి గ్రామ, కుటుంబ ఔన్నత్యాల సంప్రదాయ బద్ధంగా చెప్పికొనిరి. కవిది పండిత, కవి కుటుంబము.

కవి పూర్వపురాణ పఠనవల్లకల్గిన నిర్వేదమును బాపుకొనుటకై, చిరకాల జీవి సూతునిచూడ పయనమై నదులు, కొండలు, దాటి ధూర్త గోపాలుని లీలా విలాస స్థలాలు చూచి, సూతసైని చూచును. సూతునికి రాక మునుముందే 'వ్యాసుడు చెప్పి, వారిసందేహానివృత్తి చేయును. దానివల్ల లోకకల్యాణమగు'నననెనట. కవిరాజు రాక వ్యాసుని

గమనగోచరములకెక్కి, సూతుని చెవిసోకినది. సూతర్షి చెప్పిన సమాధానములే, లోక సందేహ నివృత్తికిగా సూత పురాణమైనది.

మొదటి సూతోక్తి. శౌనకాదులు మున్నొకనాడు సూతుని నైమిశారణ్య సత్రయాగ సమయమున వేదపారీణు నిగా నెంచి, అక్కునకునిగా తీసికొనిపోవ, దుర్వాసుడు ధిక్కరించి "సభికులు వేదవేత్తలు, ద్విజన్ములు. భావమొ! సంస్కృతంబనేకభవహారాఢ్య నైమిశము కాఁగలక్షేము, కాలమన్ననో శుభతర సత్రయాగమెటు సూతుఁడు నిర్మల ధర్మవైదుషీ విభవము గల్గియున్నను, వివేకము కల్గిన నర్హుఁడయ్యెడుఁ." అంటాడు. అప్పుడు వ్యాసుని పిలిచిరి. వ్యాసుడు: 'జ్ఞానులెప్పుడ జ్ఞానుల చెంతజేరి యిది కాదా యానని నచ్చచెప్పి సుజ్ఞానుల జేయుటే విధి' అనీ, అందు లనే సూతినికి 'స్మృతి రహస్యముల్ శ్రుతిజ్ఞానముల్ విదితా చార విశేషముం తెలిపి ధీవిస్తారనిఁ' జేసిత మన, సభికు లందరు సూతర్షి నంగీకరించిరి. ధర్మవ్యాధునికడకు కౌశికుడు పోవు వృత్తాంతము చెప్పిరి.

కవిరాజు యీ కథవలన, విజానానికి కులగోత్రాలు లేవని చెప్పనెంచారు, చెప్పారు.

విప్రుడగు గోపన తెలుగునాట మ్లేచ్ఛుడగు కబీరుని యొద్ద జ్ఞానార్జన కథకమును సూతుడు చెప్పను.

యుగాంతరాలతో నిమిత్తము లేక ధర్మమొక్కటి యేనని సూతుని బోధ. ధర్మము మారదు. చమపులసారం,

సత్య, శౌచ, వృత్తశీలములు పెంచుటకేగదా! సూతుని ముఖమున తెలుగు భాషా ప్రాశస్త్యమును జెప్పించి, కబీరు కథ వినును, యిది ప్రథమాశ్వాసము.

ద్వితీయాశ్వాసము: మహోజ్జ్వల జోతలు, పురాణగ్రంథ విషయములపై సూటి ప్రశ్నలు. దేవతాలోకం, దేవతలు, దేవేంద్రుడు--వీరి వృత్తాంతమునుగూర్చి మీమాంస. టిబెట్ త్రివిష్టపమనీ, హిమముచేగప్పబడిన కొండ రజతాద్రియనీ, స్ఫటికలింగాలు కన్పించినవనీ, భిల్లజాతివారినే శాంభరీభిల్లునిగా నెంచిరనీ వివరించిరి.

శివుని జటాజూటమునుండి గంగానది దిగెననీ, సగర సంతతి సాగరములకు కారణులనీ చెప్పు కథలలోని కల్లను బొల్లిని వివరించాడు :

గగనంబులోనుండి గంగమ్మ శివు మస్త
మున దూఁకెనను మాటముఱతమాట
అతితపోనియతిచేనల భగీరదుడు గం
గను దెచ్చెననుమాట కల్లమాట
గంగాజలంబుచేఁ గంధి నిండింపఁగాఁ
బడియె సుమ్మనుమాట బడుగుమాట"

అన్నాడు. గంగామూలాన్ని కనుగొన్న భగీరథుని పేర లోకం యీ యితివృత్తాన్ని కల్పనగావించి, గంగనే భాగీరథిని చేసిరి. లోకమునకది భగీరథ ప్రయత్నమైనది.

కవి త్రివిష్టపము చూచి, ముందుగా సూర్యశిని పొడగాంచి, రిత్తవడి, అటునిటు తిరుగాడుచూ ఆ సీమలోని

'నగ్నవైరాగ నిర్మగ్నులైన వారిని, సోమరాజుల రంకు చరితలను, ఇంద్రుని చూస్తారు. యింద్రుని యందు :

"వేయి గన్నులు నాకు గన్పింపలేదు
పొడలు మాత్రము గన్పించె నొడలినిండ"

అంటారు. ఆ పొడలు, కామరోగుల కుండు పొడలు.

కప్పకు మాండూక్యముని పుట్టుట, శుకయోగి చిలుకకు పుట్టుట, శౌనకుడు శునిగర్భమున పుట్టుట. అశ్వత్థామ గుఱ్ఱమునకు బుట్టుటలు తడవబడినవి. మనువు గోచరింప, స్మృతి కథనములు వచ్చెను : మనువునకు వేసిన ప్రశ్న:

"జాతులఁ బట్టి మేము స్మృతి సంహితలన్ రచింప లేదిటన్
జాతులఁ బట్టి తప్పులు విచారణఁ జేయము శిక్ష చెప్పఁగన్
జాతులఁ బట్టి ధర్మము ప్రచారము సేయుము బందుకట్టి నీ
భూతదయాగుణంబునకు మోదమునందితిఁ జెప్పనేటికిన్."
"..........."ఋషివి యెట్లైతి వేగతి స్మృతిని వ్రాసి
ధర్మ నిర్ణయమ్మను జేయఁ దగితివయ్య"

అని కవి మనువును పృశ్చించును.

తరువాత కవి నందనోద్యాన మరసి, మనోజ్ఞ తెలుగు కవితలు వెలార్చి, దానిని భోగభూమిగా చూచి, "వుండరాదిందు మావంటి యోగులకును" అని నిర్ణయిస్తారు.

తరువాత నారద సూతుల సంవాదము. త్రివిష్టము, స్వర్గము టిబెట్ అని రూఢి చేసిరి. కవి నారదునితో గోష్టి చేయును. సురాసుర విచారము జరిగి :

సురయనంగ మద్యంబు తత్సురను దాల్చి
వినుతి కెక్కిరి సురలను పేరిచేత
సురను నొక్కనాఁడేని యూచూడ కున్న
కారణము చేనసురులైరి కడమ వారు

అని తేల్చుకొనిరి. రాక్షసుల విషయమై:

ఆర్తరక్ష పరాయణు లవుట చేత
వాసిఁగాంచిరి రాక్షస ప్రవరులనఁగ
యాతనా ప్రాణి వితతుఁ గాపాడుకతన
బూతు ధానులనంగఁ బ్రఖ్యాతిఁ గనిరి.

అని నారదుడు కవికి చెప్పెను. వుదాహరణకు, తత్వవేత్త వృత్రాసుర వృత్తాంతము, నీతిశాలి స్వర్ణనేత్రుని కథనము, వదాన్యమూర్తి బలిచరిత్ర, వేదవేత్త విశ్వరూపులు రాక్షసులుగదా, వారెంత ప్రసిద్ధ చరిత్రులని నారదుడు చెప్పెను.

తరువాత ముజ్జగంబుల దొర ములుచతనము వలన వేల్పులువలసపోవలసిన వృత్తాంతము జెప్పిరి.ఆర్యావర్తము జొచ్చి, మూడు పూవు లారు కాయలుగా నుండెను. అది వేల్పు లాక్రమించిన భూమి. ఆదిమవాసులైన ద్రావిడులు సమావేశమై, యీ ఆక్రమణలను చర్చించి:

"బొల్లి మొగము మీఁ దయ నిల్వు బొట్టుఁ బెట్టి
రాలు కప్పల కెల్లరు గేలు మోడ్చి
గంద్ర గోళంబుఁ గావించు కల్ల రీంద్ర
దౌష్ట్యమును మాన్పకుండుట ధర్మ మనునె?"

అని విసర్జించిరి ద్రావిడభూమి రక్షణకు సమాయత్తులైరి. కాని ఆర్యులు ద్రావిడులను వింధ్యదాకా వెంటాడిరి. ఆ జాలి వృత్తాంతము వినిపింతురు. వోడిన ద్రావిడులను - కాడు చేసి

కలుషితాజ్ఞాన గాఢాంధకారమునకు
ముంపయత్నముల్ చేసిరి తెంపుతోడ.'

ఆర్యకుల పతియైన వసిష్ఠుడు తంత్రములు పన్నును.

"నూతన వైఖరిన్ మిగుల నూతన ధర్మము లుగ్గడింపఁగా
నా తరి బ్రాహ్మణోత్తముల నందఱికిం బిలిపించి చెప్పఁగా
నాతతశేముషీవిభవమచ్చుపడన్ దలలూచి వారలన్
గైతవ బుద్ధి మాటుపడఁగాఁ దెగ వ్రాసిరి ధర్మసూత్రముల్."

"గుడుల లోనికిఁ బోవుట కూడ దనిరి
బజీలలోనికిఁ బోవుట పాపమనిరి
మడులఁ గట్టుకొనుట ధర్మ మార్గ మనిరి"

యీ విధంగా ఆర్య ధర్మాలను స్మృతి, పురాణాదులలో క్రుమ్మరించిన కథను హృదయ విదారకంగా నివేదించిరి.

"మంచి కాలంబునకు లేచి పొంచి పొంచి
యార్య మందిరంబు లందు నణఁగి మణఁగి
చివికిపోయిన మనసుతో నవసి నవసి
యుత్తరానికి ద్రావిడు లున్నయంత."

దక్షిణాపథానికి వచ్చిన ద్రావిడులు, దానినే స్వదేశంగా తలపోసి, దానిని బాగుచేసి, నివాసయోగ్యంగా చేసి, వ్యవసాయాది వృత్తులఁజేవ పొందిరి.

"వింధ్య దక్షిణ భాగ విశ్వంభరను నొక్క-
గొడుగు క్రిందికిఁ దెచ్చి విడచినారు."

ఇట ॥ "అన్నమో రామచంద్రా యంచు నారాట
పడి యంలార్చెడి వారు లేరు."

ద్రావిడ సీమ, పాడిపంటల కాకరమై, ఫలప్రదంగా వర్ధిల్లుచున్నదనిరి. పొగడిరి.

కాల వైపరీత్యమున, ద్రావిడావని చీలి చిన్న చిన్న సీమలు గాఁజొచ్చెను. ద్రావిడులు తమిళులు, తెలుఁగులు, కన్నడులు, మలయాళులు మొదలగు జాతులుగ జీలి, దక్షిణాపథము నాల్గు చెరగుల నాక్రమించిరి. పాలనాదులు వనరులతో సాగుచుండ, ఆర్య కుట్రదారులు, అగస్త్యుని పంపిరి. అతడు మతమును బోధసేయు మిషతో భేదోపాయములచేత భేదము పుట్టించినాడు.

"కులము లేనట్టి వారికిఁ గులము నిచ్చి
పేరు లేనట్టి వారికిఁ బేరు నిచ్చి....
పనిని సాగించెను గులనాపకులఁ జేసి"
కుల గోత్రములఁ కొన్ని క్రొత్తగాఁ బుట్టించి

విప్రులటంచును పేరు పెట్టి, నూతన ప్రబోధముల జేసి.
గంగ గుడులు మాని సీతారాములకు, పోతురాజా

దులను, భద్రునికి, గొంతెమ్మ దేవతలవదలి బ్రహ్మ విష్ణు మహేశ్వరులను, పోలేరమ్మను విడచి యజ్ఞములకు మలిపినాడు. మాతృభాషాభిమానాల వదలి సంస్కృతంబు శ్రద్ధగా చదివించినాడు. అదిగాక :

బ్రాహ్మణులను శూద్రులును మాత్రంబె కలరు
క్షత్రియులు వైశ్యులును లేరు కలియగమ్మ
నందు నంచు సిద్ధాంత వాక్యములు వ్రాసి
పెట్టి పోయి స్మృతులు ద్రావిడుల కొఱకు.

స్మృతిపురాణాలకు గౌరవములు పెంచినాడు.

యిది యిట్లుండ, అసురుల వలసలు సాగినవి. అసురులు నేటి పారశీకాద్యులైరి. యవనులు పారశీలైరి. అసుర వాస భూమి పారసీక మయ్యెను.

యిది కాగా, ద్రౌపదీ ధృష్టద్యుమ్నుల కథనము సూతుని వల్ల కవి వినును. వారలయోనిజలనిగదా భారత గాథ! పాంచాలరాజునొద్దకు ద్రోణాచార్యుడేగును. వారలు పూర్వ సహచరులు. ద్రోణుని పలుకరించమి, వారాగ్రహించి వెడలిపోయిరి. సూటిగా హస్తిణపురికి బోయి, భీష్మునిగాంచి వారితో మాటాడి, కురు కుమారులకు నొజ్జలైరి. ద్రోణుని పంపున అర్జునుడు ద్రుపదిని బట్టితెగ, వానిని అవమానింతురు పరాభవాగ్ని ద్రేల్చగా, కసితీర్చికొను యత్నములో, సంతాన విహీనుడైనందున, కసిదీర్చగల తనయులు లేమికి వగచి, చాదుల వల్ల ద్రౌపది, ధృష్టద్యుమ్నులను బిడ్డల తెప్పించి,

పెంచి, పుత్రకామేష్టి జేసి, యజ్ఞంపుహాగలు దిశలు గ్రమ్మ యీా బిడ్డలను యజ్ఞగుండమునకు దెచ్చి, వారలందుద్భ వించి నారనిరి. వారే ద్రౌపది, ధృష్టద్యుమ్నులు.

యివీ సూత పురాణ ప్రథమ, ద్వితీయాశ్వాసములు. వీనిలోని కవితా శిల్పం జోలికి నేను పోలేదు. పురాణ కథా నిర్మాణమే ప్రాయకంగా తడవితిని.

పూర్వకథలనేకములకు, ప్రతి కథ లిందులో గలవు. పది వొప్పు ? యేది తప్పు ? పురాణములు చరిత్రలు కావు కాని, కొన్నికొన్ని చోట్ల చారిత్రక సంఘటనల మూలాలు తగులుతవి. దాని విషయిక పరిశోధన వేరే జరుగుతుంది.

పూర్వ కథలు కట్టుకథలు. కవిరాజు కథలు కొన్ని అదే మాదిరి కట్టు కథలు. పోతే, కవిరాజు కథలనే కట్టుకథ లని, పూర్వపు కథలు నిజాలన వీలులేదు. వీలులేదనే కవి రాజు వాగన. 'అవీ యివీ కార్యకల్పనలే గదా, రెంటినీ పురాణాలేననీ తీసివేస్తామంటే కవిరాజుకన్నా సంతోషించే వారుండరు.

ముఖ్యంగా గమనించదగ్గది, హేతు త్వదృష్ట్యానిల్వ గలిగిందే సత్యం; కానిది కాదని వారి వాదన. శాస్త్ర పద్ధ తికి వివేకానికి మించిన కొరముట్టులేదు. కవిరాజు హేతు వాదంమీాద నిలచినంతగా,చరిత్రమీాద నిల్వ లేదు. కారణం పురాణ మీామాంస పౌరాణికంగానే జరిపారు.

లోకం విజ్ఞమై గ్రుడ్డి నమ్మకాలను, గూని కథలను

స్మృతిపురాణ, శ్రుతివచనాలలోని మాధుర్యాన్ని పదలటమే వారి ధ్యేయం. ఆశయసిద్ధి పొందే రచనలివి.

సూతుడు లోగడ శౌనకాదులకు చెప్పాడనగా, సూతుడు నాకూ చెప్పాడన్నారు. యిది సూనర్షి వాక్య సంహిత. యిది షష్ఠమవేదము. 'ఋషి భక్తియందు మే మెవ్వరికిని దీసిపోము' అంటారు కవిరాజు. అవును.

—ఆవుల గోపాలకృష్ణమూర్తి



# సూతపురాణము - తృతీయాశ్వాసము

శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి వైరివర్గములకు త్రిపురవైరి. నెయ్యురపాలిటి తియ్యమామిడి తోట. సూతాశ్రమ వాసి సుఖోల్లాసి. శతావధాని. శతముఖ ప్రజాశాలి. నవ నవోన్మేషధిషణాధురంధరుడు. కవికంఠీరవుడు హలము నెట్టగలడు. కలము పట్టగలడు. రసము చిప్పిలగలడు. విసము మియగలడు. న్యాయస్థానము కవితా సంస్థానము వీరి యునికి పట్టులు. పురపాలనము సాహితీ పరిపాలనము వీరి ఖేలనము.

కవిరాజు నెరుగనివాడు తెలుగునాట లేడు. భీతి నెఱుగడు. నీతి వదలడు. రీతి విడువడు. ఖ్యాతి దరుగడు. అబద్ధము వినడు. అసత్యము పలుకడు. అవకతవక లాడడు; అసలుపట్టు వీడడు. ఏకధాటి మాటాడగలడు. ఎవ్వానిని లెక్కసేయడు. ఎదురొడ్డి నిలువగలడు. ఏనుగునెక్కి యూరేగ గలడు. దోసము సేయడు. బాస తప్పడు.కవితల కమ్మదనము జిమ్మగలడు. కారము నెగజిమ్మగలడు. సంస్కృతాంధ్రాంగ్ల భాషాకోవిదుడు. స్వదేశ విదేశ బహుదేశాటనపరుడు. విమర్శకాగ్రణి. విపశ్చిన్మణి. కండగల కాయము నిండయిన హృదయము.అనుభవ సముద్రుడు. అమరజీవి నేను

చౌదరిగారికి జాను తెనుగన్న మిక్కిలి మక్కువ. కవిరాజు కృతులు పెక్కులు. అందొక్కటి 'పాతని హారము' 'సూతపురాణము.' అందలి తృతీయాశ్వాస పరిశీలనము ప్రస్తుత కర్తవ్యము.

'యదార్థ ప్రహ్లాద చరిత్రము' – 'యదార్థ రామాయణము' నిందనుసంధానితములు. ముప్పది పుటలను మించిన 'తొలి పలుకుల'లో కవిరాజు ఈ కథాద్వయమునందలి యాథార్థ్యమును సహేతుకముగ నిర్దేశించి, సరస పద్య రచన సాగించి, 'పీఠిక జాగరూకులై చదువ జదువరుల మరిమరి ప్రార్థించుచుంటిమి' అని నివేదించినారు.

పురాణగాథలను, కాదన లేదుగాని, ప్రచారములో నున్న ప్రగాఢ ప్రజా విశ్వాసమునకు విభిన్నమగు భావ ప్రకటన మీ కావ్యములో కాన్పించినారు. సత్యద్రష్టలగు సద్విమర్శకులకు ఉద్దీపనము గావించినారు. పరంపరాగతమైన గాథల బరిహసించుట కాక, పక్షపాతము వదలి పరిశీలింప ప్రబోధించుటయే వీరి ఆశయము.

> చదివితిఁ బుణ్య భూమి యని శాస్త్రములన్ మన భారతంబు నే
> డది విపరీతమై జనుల కందరికిన్ బొడ కట్టుచుండె నే
> విదముగ, సత్యశౌచములు లేవు దయారతి లేదు ధర్మ సం
> పదయును లేదు. ఘోర కవి మాయురె! ఈ గతి యేమి యీశ్వరా!

అని భారత దేశ పతనస్థితికి గడుపగనంది కవిరాజు సూత ఋషి ప్రోక్త రీతి నీ కథాక్రమముల నిర్వహించెను.

*　　*　　*　　*

"వేదవేత్త, బ్రహ్మజ్ఞాని, మహాభక్తుడు, మహావీరుడు సుందరాకారుడు, అతుల రాజనీతిజ్ఞుడు, భాతృప్రియుడు, జాత్యుద్ధారకుడు, వివేకి, తెలుఁగు వైయాకరణుడు" ఇట్టి విశిష్ట గుణసంపన్నుడు రావణుడని పీఠికలో కవిరాజు నిదర్శన పూర్వకముగ నివేదించెను.

ఆర్య ద్రావిడ సంఘర్షమే రామరావణ సంగ్రామమని చౌదరిగారి తలంపు. ఔత్తరాముడగు రాముడు దాక్షిణాత్యుడగు రావణుని సంహరించుటయే రామాయణ కథాంశము.

'దస గీవ' శబ్దము దశగ్రీవగా, రావన - రావణగా, చుప్పనాక - శూర్పణఖగా, రక్కసి - రక్షస్సుగా జేసి, వాల్మీకి దురర్థ ప్రతిపాదక శబ్ద సృష్టి గావించెనని త్రిపురనేని వారి యారోపణ. ఇందలి సత్యము పండిత మండలి పరికింప దగును. పరిశీలింప నగును. పరిపాటిని పరిహరించి, పరమార్థము ననుసరించుట లెస్స!

"ఆర్యులు కార్య సాఫల్యమునకు గాను నెట్టి కొఱముట్లనయిన నుపయోగింప వెనుదీయనివారు. పెక్కుమారులు స్త్రీల నుపయోగించి కార్యము నెఱవేర్చుకొనిరి. తఱచు ద్రావిడరాజుల పదభ్రష్టులను జేయుటయందు కుటుంబకలహంబులను గల్పించియు, రాజద్రోహుల సృష్టించియు కార్యంబుల నెగ్గించుకొనుచు వచ్చిరి. సుగ్రీవునిఁ జేబట్టి వానిని సంహరించి, వానర రాజ్యంబును సామంతంబుగాఁ జేసికొనిరి రాజ్య తృష్ణఁ గల్పించి విభీషణుని దగ్గరకు దీసి రావణుని గూల్చి లంకా రాజ్యమును హరించిరి.

శ్రీరాముడు చెట్టుమాటున దాగి, తమ్మునితో మైమఱచి యెక్కటికయ్యంబు జేయువానిని, వాలిని జంకు గొంకు మాలి చంపెను. రావణునితోం బోరి పోరి, డస్సి, వ్రస్సి, యధర్మంబని యెఱింగియు, సైన్యాభిముఖంబున నమృతంబున్నదని సాకు గల్పించి, శ్రీరాముడు రావణుని బొడ్డుపైఁ గొట్టి మడియించెను." కవిరాజు చారిత్రక దృష్టికి, పరిశీలనాపాటవమునకు సత్యాన్వేషణాపరత్వమునకు నీ వాక్యములు పరమ దృష్టాంతములు.

"శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడేనా? యని సూటిగ ప్రశ్నించుచు కవిరాజు: 'రాముడవతారపురుషుడు. సీత యాయన యర్ధాంగి. సీతతో సమానమగు దాంపత్యసౌఖ్య మనుభవించిన వారెవ్వరున్నార రీ ప్రపంచమందు?' పెండ్లి యయినది గోలె శ్రీరాముడు ప్రతి నిముషమును నామె యీలువును శంకించుచునే యుండెను. రామునకు మనశ్శాంతి యెన్నడున్నట్లు తోఁచదు. పైకిమాత్రము శంకించుచున్నట్లు కన్పట్టక యే చాకలిమీఁదనో, నెపము వైచి, నిందమోపి, యది నిజముకాదని ఋజువుచేయు భారము సీత నెత్తిపైఁ బెట్టుచుండును? ఔరా రా! ఇది యా యేకపత్నీవ్రతుని లక్షణము?" ఈ హేతువాదము నెదుర్కొనుట సులభము కాదుకదా!

లంకలో అగ్నిపరీక్ష. నిండు చూలాలను ప్రవాసగించి కారడవిలో వదలిపెట్టించుట. ఇవి యుచిత కార్యము

లగునా? అయోధ్యకు దెచ్చిన పిదపకూడ అనుమాన పిశాచము రాముని వీడలేదు. శంకానివృత్తి సేయ సీతను గోరెను. సీత మనస్సు చివుక్కుమన్నది. నిత్య శంకితుడగు భర్తతో, గాపురము గోసి, భూవివరంబునఁ బ్రవేశించి భూజాత నశించినది. శ్రీరామచంద్రుని ఏకపత్నీవ్రత మిట్టిది!

"ఆర్య లోకమునకు రావణుండు కంటకుండు. రక్షో లోకమునకు రాముండు కంటకుండు. వీరిలో నెవ్వరు ధర్మ పరులని యెవ్వరు నిర్ణయింపఁగలరు?" అవును. ఎవరు నిర్ణయింపఁగలరు?

"ఔరంగజేబు హిందూ లోకంబునకుఁ గంటకుఁడు. ఛత్రపతి శివాజి మహమ్మదీయ లోకంబునకుఁ గంటకుఁడు. రావణుఁడు సర్వలోక కంటకుం డనుట విజ్ఞులొప్పుకొనరు.

లంకారాజ్యము సమస్తైశ్వర్యంబులతోడను దుల దూగుచుండెను. రావణుని ధ్వజపటంబు క్రింద ద్రావిడ లోకంబు కడుపులో చల్ల కదలకుండ కాలక్షేపము జేసెను. ఆర్యులెరుంగని ఆకాశ విమానముల నిర్మించు నైపుణ్యము ద్రావిడ శిల్పు లెరుంగుదురు. రావణునకు, పది మొగములు, పది కంఠములు—నున్నవానికి సిరువది చేతులను గవులేల సృష్టింపఁ గూడదు?

కవిరాజు సిద్ధాంత ప్రకారము రావణుడు లంకనేలిన కోయదొర. కోయలు యుద్ధమునకు బోవునప్పుడు శాత్రవ భయంకరముగా బొడకట్టుటకయి కృత్రిమ వికృత ముఖాచ్ఛాదములు ధరించుట యాచారము. రామాయణములో

వర్ణితములయిన రాక్షస వికార రూపములకు నిదియే కారణము. రావణుడు కోయవారలను క్రిమికీటకములనుగా జేసి, ధర్మమార్గమును ద్రొక్కించి, యుచ్చస్థానమునకుఁ దీసికొని వచ్చెను. ఈ యుచ్ఛదశ వ్రేళ్ళు వారి నిలువ ద్రొక్కుకొనుటకుఁ జిరకాలము వీలుచిక్కలేదు. రావణ వధముతోఁ దజ్జాతి పతనము తటస్థించినది. కుక్షింభరుడైన విభీషణుని కిది పట్టలేదు. కాన నాగరక ప్రపంచమునఁ గోయలు పూర్వస్థానమునకు బోయిరి.

రాజద్రోహి యైన విభీషణుడు, రాజ్య తృష్ణచే జాతి విరోధి యైన రాముని పాదపద్మములను బట్టి శత్రు స్కంధావారమును జేరినను—లంకలోనున్న యాతని కుటుంబమును (భార్యయగు సరమను, పుత్రియగు త్రిజటను) పల్లెత్తు మాటయైన నెవ్వరుండఁ గాపాడెను. ఈ భాతృ ప్రేమయే వీనిని కూకటి వ్రేళ్ళతో బెకల్చి పారవేసెను.

సరమ యంగదునకుఁ శాంతాళ హోమము జేయుచున్న రావణుని జూపించెను. లంకలోని గుప్తి కర్మమును సీత కెరింగించెను. విభీషణుని కూతురగు త్రిజట యెప్పటి కప్పుడే లంకగుట్టెల్ల సీత చెవింబడవేసెను. పర్యవసానము రావణ పరాజయము. లంకాపురీ నాశనము. విభీషణుని పట్టాభిషేకము!

ఇది తోసిపుచ్చరాని యదార్థ కథనము కదా!

రావణుని యర్థాంగి మండోదరి యసురశిల్పి యగు

మయుని కుమార్తె. మయునకు నచ్చరలేమ యగు హేమ యను నామెయందు జనియించెను. అందుచే నీమెయందు సమగ్ర ద్రావిడత్వము చూపట్టుచున్నది. భర్తయగు రావణునకు సంధియని యెన్నిమారులో నీతులు చెప్పుచు సమర పరాఙ్ముఖుని జేయఁ బ్రయత్నించెను. "నీమరదలి బన్నమేగతిని మానిని ఈగుదు సంధి జేసినన్" అని లంకేశు డామె మాటలం బెడచెవిం బెట్టెను.

కుంభకర్ణుడు వజ్రజ్వాలయను నామెను బెండ్లి యాడెను. ఈమె వదాన్య శిరోమణియగు బలిచక్రవర్తి కూతురు బిడ్డ. అందుచే జాత్యభిమానమునకునికిపట్టులు. భర్తకు నీతి యను నెపమున నెన్నడు నడ్డము చెప్పి యుండ లేదు.

విభీషణుడు సరమయను నామెను వివాహమయ్యెను. ఈమె గంధర్వస్త్రీ. అందుచే ద్రావిడ జాత్యభిమానము సుంతయు లేక భర్తను రాజద్రోహునిం జేసి, ఇంటిగుట్టు విరోధులకుం దెలియజేసి, సర్వనాశనము జేసెను. సరమచే విభీషణుని కుటుంబ మంతయు రాజ్యతృష్ణా పీడితమును, రాజద్రోహ పూరితమునై లంకను రామునకు గట్టఁబెట్టి, జాతిద్రోహము గావించెను. ద్రావిడజాతి యేదుర్గతి పాల యినను సరకు సేయక, తన భర్తను రాజును చేయుట యొక్కటియే ఈమె మనస్సునందుంచుకొని, మిగుల హేయ మగు కార్యముఁ జేసెను"

ఇందలి సత్యాసత్యములు, వంశ పారంపర్యముగా వచ్చు పక్షపాత కథను వదలి కొంచెము విమర్శన దృష్టిని కలిగించుకొని షరించినచో తెలియ గలము.

—శ్రీ అద్దేపల్లి నాగగోపాలరావు

# సూతపురాణ కృష్ణుడు

## ( చతుర్థాశ్వాసము )

వేద సంప్రదాయానికి చెందిన హిందువులకు రామాయణ, భారత, భాగవతాలు మిక్కిలి పవిత్రగ్రంథాలు.

వానిలో "అంతా రామ మయం ఈ జగమంతా రామమయం" అని చిరుగజ్జెలు చిటితాళాలతో చిందులు త్రొక్కుతూ మైమరచి పాడుకొనే ఈహిందువులకు రామాయణము పారాయణ గ్రంథము కాగా, కవులకు ఆదికావ్యమయినది. అపౌరుషేయాలుగా ఆరాధింపబడుతున్న వేదాల సరసనుచేరి భారతము పంచమ వేదముగా తాంబూలం స్వీకరించగలిగింది. "పలికెడిది భాగవతమట, పలికించెడు వాడు రామభద్రుండట..." అని భాగవత రచనా కర్తృత్వమే తనపై వేసికొనటానికి భక్తపోతన సాహసింపజాలనంతటి అతీత గ్రంథము భాగవతము.

వేదాలలో ద్వితీయ శ్రేణికి (Rank) లేదా ఆ తరువాయి శ్రేణికి చెందిన త్రిమూర్తులు పైమూడు గ్రంథాలలో ప్రథమశ్రేణికి చేరుకోగల్గారు. తిరిగి ఆ ముగ్గురిలో

మిక్కిలి పలుకుబడిగల దేవుడు విష్ణువు. అతని దశావతారా లలో రామ కృష్ణావతారాలు ముఖ్యమైనవి. ఆ ఉభయు లలో గూడ మాయామానుష విగ్రహుడైన రామునికంటె లీలామానుష విగ్రహుడైన కృష్ణునికే హిందూ ఓటర్లు ఏ కొంచెమో ఎక్కువ ఓట్లు వేస్తారు. అతడు నాడూ నేడూ హిందువుల గొప్ప సినిమాతార.

వాల్మీకి తన రామాయణ కావ్యములో రాముని వైకుంఠమునుండి దింపి కౌసల్యా గర్భములో ప్రవేశపెట్టే వరకు దివ్యాంశముగా వర్ణించినను మాతృగర్భమునుండి పొత్తిగుడ్డలపై బిడ్డ తీరునుండి అతని నొక ఉదాత్త నాయ కునిగాను, మానవోత్తమునిగా చూపించి వాస్తవికతకు దూరముకాని కౌవ్యగౌరవాన్ని కాపాడినాడు. రామకథా శ్రవణానికేకైక కావ్యమైన రామాయణాన్ని బట్టియే తరువాత వచ్చిన కవులు, గాయకులు భారతీయ భాషలన్ని టిలోను ఆ రాముని మనలోనుండి చీల్చి మన మనో వాక్కులకందని దేవునిగా జేసి సప్తసముద్రాలుదాటించి అగోచరునిగా జేశారు. అట్టివారిలో అగ్రతాంబూల మందు కొన్నవారు రామచరిత మానసకర్త హిందీ కవి తులసీ దాసు.

ఇక కృష్ణకథ ఆజన్మాంతం ఆపాదమస్తకం తెలియు వలెనన్న అందుకు రామాయణమువలె ఏకైక ప్రమాణ గ్రంథమేది లేదు. బ్రహ్మపురాణం, భాగవతం, భారతం– ఈ మూడు గ్రంథాలలోను మూడు భాగాలుగా అతికి

అతకపడియున్న ఆ (Disproportionate) ఆ కథాంశా లను ఏరితెచ్చుకొని సరూపాతయనము చిత (Proportionate) చిత్రంగా తయారుచేసి ప్రాణ ప్రతిష్ఠ చేసి మన యెదుట అసలు కృష్ణుని నిలిపారు కవిస్రష్ఠ కవిరాజు రామ స్వామిగారు.తన సూతపురాణ చతుర్థాశ్వాసములో.

పై మూడు గ్రంథాలలో ముఖ్యంగా భాగవతము లోను వర్ణింపబడిన కథనుబట్టి చూడగా వైకుంఠములోను, దేవకీ గర్భములోను, పొత్తిలి గుడ్డలలోను, ద్వారక మధు రలలోను,బృందావన కురుక్షేత్రాలలోను కృష్ణుడు ఎక్కడా మానవుడుగా వర్ణింపబడలేదు. మాటలు, చేతలూ మాన వత్వాని కంటె దిగజారిపోయినా "లోకంబులు లోకేశులు, లోకస్థులు తెగిన తుదిన లోకంబగు పెంజీకటి కవ్వల" ఏకాకృతితో వెలుగు వానిగ జేసి ఆ వెలుగు మనకంద కుండగా జేశారు. ఈ విషయములో సంస్కృత వ్యాసుని తెలుగపోతన, అతనిని హిందీ సూరదాసు త్రోసిరా జన్నారు.

అసాధారణ ప్రజ్ఞా ప్రాభవాలు చూపిన మానవుని మానవాతీతమైన దివ్యాంశముగాను,దైవముగానుచిత్రించుట మతములలో నురూఢమైన సంప్రదాయమై యున్నది. అట్టి వాని వాక్కులన్నీ ధర్మసూక్తులుగాను,అతనిచేతలన్నీ దివ్య లీలలుగాను విశ్వసిస్తూ అతని మంచిచెడ్డల విమర్శించుట అజ్ఞానముగా నిందించుట కూడ కలదు. అందుకు కృష్ణజీవి తమే పరమోదాహరణమని కవిరాజుగారు స్పష్టముచేస్తు

న్నారు చూడండి. మర్త్యలోకములో మర్త్యులైన దేవకీ వసుదేవులకు మర్త్యుడుగానే పుట్టినవాడు; అట్లే గిట్టినవాడు నైన కృష్ణుడు ఆదిమధ్యాంత రహితుడు కాజాలడు. పైగా కామక్రోధాది షడ్వర్గానికి వశుడైనవాడు. భాగవతములో కవిపూసిన పంచదార పూతలను తొలగిస్తే ఈ విషయమే స్పష్టంగా కనుపిస్తుందంటారు కవిరాజుగారు. ఆయన కృష్ణుని జారుడు, చోరుడు, దుండగీడుగా నిర్ణయించారు.

## భాగవతము—దశమస్కంధము

### 1. జారుడుగా కృష్ణుడు :

గోపికావస్త్రాపహరణంలో-నీటిలోనున్న గోపికలు కృష్ణునితో

"చెంతదాసులమై చరించెదము మాచేలంబు లిప్పింపవే"

కృష్ణుడు గోపికలతో : "తోయంబులు వెడలిరండు తొయ్యలులారా అంత్రట తనుమధ్యలు తోయ మధ్యంబులుపెడి....

........కర సంఛాదిత పంచాయుధ గేహులగుచు పడతులు వరుసన్" నిల్చిరి.

కృష్ణుడు తిరిగి వారితో-"ఇంతులెల్లఁ జేతులెత్తి మ్రొక్కి చేరి పుచ్చుకొనుడు చీరెలు" అనిన విని మానవతులు

"ఫాలతట న్యస్తకరాబ్జలై సరసలీలన్ మ్రొక్కి రట్లంచఱున్"

శరద్రాత్రిని గోపికలతో కృష్ణుని రతిక్రీడలు :-

"స్తనమర్దంబుల - నఖాంక వ్యాప్తులన్ - అధర సుధా
పానంబులన్ - రతి కేళిన్ - కాంతం గరగించెన్"

ఇది విని జుగుప్సితుడై శాబోలు "ఏమిది" అని ప్రశ్నించిన పరీక్షిత్తునకు శుకమహర్షి యిచ్చిన సమాధానము చూడండి.

"జారుడనుచున్ భావించియుం జొక్కి పొందిరి ముక్తిన్
గుణ దేహమున్ విడిచి ప్రీతిన్ బంధ నిర్ముక్తలై"

రాసక్రీడ జలక్రీడలలో - కామ శాస్త్ర పారంగతుడైన కృష్ణుడు బహువిధ రతిభంగిమలలో—

"కుంభికరేణు యూథములతోఁ గ్రీడించు చందంబునన్ ..... .....
... ....సుఖోన్నతుడై కృష్ణుడు క్రీడలందనిపె నా నారీలలామంబులన్."

ఇట్లు "వెన్నుం డింద్రియస్ఖలనంబు సేయక గోపికల తోడ రమించె."

2 చోరుడుగా కృష్ణుడు :-

గోపికలు యశోదతో మొరలు,

"అడఁజని వీరల పెరుఁగోలఁ నీసుతుడు ద్రావి యొకయించుక తాఁ
గోడలి మూతం జరిపినఁ గోడలు మ్రుచ్చను చునత్త గొట్టె లతాంగీ॥"

"వారలు సొచ్చి కడవలఁ దోరంబగు నెయ్యిద్రావితుది నాకడపల్!
వీరింట నీ సుతుండిడ వారికి వీరికిని దొడ్డవాదయ్యె సతీ॥"

"ఇట్లు సేసి వెనుక నెక్కడ బోవునో కానరాడు రిత్తకడవలుండు"

"ఓ యమ్మ నీ కుమారుడు, మా యిండ్లను, బాలుఁ బెరుఁగు
మన నీడమ్మా పోయెద మెక్కడి కైనను....

3 దుండగీడుగా కృష్ణుడు - గోపికల - మొరలు

"వేలుపులకెనా కంచెను, వేలుపు మరియెవ్వగనుచు వికవికనవి మా
వేలుపుల గోడపైనో లీలాపతి పీ తెమూఁ దెఁగిలిఁ జేసెన్

"నమ్మి నిదురవోవ నా పట్టిచుంచు మా లేగ తోకతోడ నెలగట్టి
వీధులందుఁ దోలె వెలఁది నీ కొమరుండు——"

"తెఱవ యొకతె నిద్రింపఁగ నెఱిఁగట్టిన వలువ వీడ్చి నేటగు తేలుం
గఱపించి నీ కుమారుడు వెఱచుచు నవి పఱవ నగియె విహితమె సాధ్వీ"

"మా మగవారటు వోవఁ జూచి మంతనమునకుం దగ జీరి పొందనడిగెను"

"తరుణి యొకతె పెరుగుఁ ద్రచ్చుచోఁ దుదివంగి వెన్న దీయ నొదిగి వెనుక
గదిసి మగువ నీ సుతుండు మగపోడుములు సేయ సాగినాడు తగదె
చక్కఁ జేయ"

"నా కొడుకును నా కోడలు నేకతమున బెనగ దాము నీతడు దైవం
బోకలెఱుంగక పాఱిన గూకలిడెన్ నీ సుతుండు గుణమె గుణాఢ్యా"

## 4 బాల్యక్రీడలు భగవల్లీలలుగా చిత్రించుట

"అడుగులు వే గలిగియు రెండడుగులనే మన్ను మిన్ను నలమిన
బాలుం డడుగిడ దొడగెను——...."

"———ముచ్చిర కవ్వలవెలిఁగొందు పరము దర్శకుడై యా
యవ్వలకు సంతసంబుగ నవ్వా యవ్వాయనంగ నల్లన నేర్చెన్"

"చిక్కఁడు సిరికౌఁగిటిలో జిక్కఁడు సనకాది యోగి చిత్తాబ్జములం
జిక్కఁడు శ్రుతిలతికావలి జిక్కెనతఁడు లీలఁ దల్లిచేతన్ ఱోలన్"

"తజ్జనని బోగిటం గల రజ్జు పరంపరల గ్రమ్మఱన్ సుతుఁగట్టన్
బొజ్జ దిరిగి రాదయ్యె జగజ్జాలము లున్న బొజ్జగట్టన్ వశమే"

5 ఈ విధముగా కృష్ణునికి చెందిన మాట, చేత మొదలైన దేదైనా మంచిచెడ్డలతో పనిలేకుండా భగవన్మహిమగానే వర్ణించుతూ అడుగడుగునా అతని మానవత్వాన్ని మధ్య పెట్టి దివ్యత్వాన్ని దీపింపజేయుటానికి శతధా సహస్రధా ప్రయత్నాలు జరిగినవి. విష్ణుని పర్యాయ పదాలైన వెన్నుడు

శ్రీ రాఘుడు, హరి మున్నగునవన్నీ కృష్ణుని పర్యాయపదాలుగ ప్రయోగింపబడినవి. ఇంతేగాక -

అసంభవాలు :- దావాగ్ని మ్రింగుట, తృణావర్తునితో మింటికెగురుట, శకటాన్ని మింటికెగురదన్నుట, గోవర్ధనగిరిని చిటికిన వ్రేల నిల్పుట"

అసంగతాలు:- కృష్ణుడు చంపిన లేగ దూడ, కొండచిలువ, గార్దభము, వృషభము మున్నగునవన్నీ కామరూపులైన రాక్షసులుగా మారుట -

ఈ అసంభవాలన్నీ సుసంభవాలుగా, అసంగతాలన్నీ. సుసంగతాలుగ చిత్రింపబడినవి. ఈ అంశాలనే యీ గ్రంథాల ఆధారముతోనే కవిరాజు తన నిష్పాక్షిక దృష్టిని నిర్భీకమనస్సును సునిశిత ప్రతిభావ్యుత్పత్తులను ఉపయోగించి సత్యమును వెలికి దీసినాడు. కృష్ణుని నిజస్వరూపాన్ని మన కట్టెదుట నిలిపినాడు.

కవిరాజుగారు కృష్ణుని రెండు దృక్పథాలతో పరిశీలించినారు. ఒకటి వ్యక్తిగతాభిరుచి, రెండు సామాజికాభిరుచి.

i వ్యక్తిగతాభిరుచి :-

సాహసోపేతులు, స్వతంత్రబుద్ధి గలవారు తనకు న్యాయమని తోచినదానికై పోరాడువారు. ఇట్టివారన్న కవిరాజు గారికి మిక్కిలి ప్రీతి. అందుచేత కృష్ణుని యందాయనికి ఆసక్తి మెండు. ఆనకెంతో యిష్టమైన ఫుట్ బాల్ (foot-ball) ఆటలో తన పక్షాననుండి ఆడుటకు రాముడూ, కృష్ణుడూ

యిద్దరూ వస్తే కృష్ణుని రంగాని కాహ్వానించి రాముని పోపప్పు రామన్నా "ఇది శంబుకుని పీక నరకటం కాదు" అని మొగాన మాడ్చి పంపుతారు.

కృష్ణునిలో ఉన్న యీ కొద్ది సుగుణాలకు సంతోషిస్తూ అతనిలో ఉన్న అనంత దోషాలకు కవిరాజుగారు చాల బాధపడినారు. లోకానికి తెలియకుండ దాగిఉన్న అతని గుణ మేదైనా ఉన్నదేమో అని అన్వేషణ సాగించారు: తత్ఫలితమే రాధల కథ.

## రా ధా కృ ష్ణు లు

సూత మహాముని వలన కృష్ణుని కథ వినగోరి శ్రోతగా కవిరాజు:

"మౌనీశ్వర ! చెప్పంగదె ! బోనము తినలేని పాల బుగ్గల నాడే
తా నత్త మిల్లె నందుకు మేనత్తగు రాధగూడి మేలతికమునన్"

అని అడుగగా సూతుడు కృష్ణుని పైగల అపవాదు తొలగించుచు రాధ లిరువురని, అందొక రాధ మేనత్త; ఆమె మేనల్లుని పెంచి పెద్దవాని జేసె, అతనియం దనురక్తురాలైన రాధ యీడుజోడైనది మరొక్కతె,

"రాధయను గోప బాలికా గత్న మొత్తు నవ్యతారుణ్య లావణ్యదివ్యగాత్రి.
నందు మందఁగీలారి తనమ్ముగనందు మెలఁగుచుండును సర్వదా మిట్టి పడుచు॥"

"కాలగతి వ్రేపల్లెలో నందుని యాలమందలో నొకరితో నొకరికి బొత్తు
కుదుర రాధాకృష్ణు లిద్దరు నీడుజోడై ....నిరంతరంబు ప్రొద్దులు
పుచ్చుచున్న కతంబునఁ బరస్పరాను రాగంబంకురించి...."

అని చెప్పి పృచ్ఛకుని అపోహను తొలగించినాడు.

ఈ అవకాశ ముపయోగించుకొని కవిరాజుగారు కృష్ణునితో పొత్తుగల రాధ లిర్వురికధ చక్కగా వివరించినారు. మేనత్తరాధ మేనల్లు నెంత వాత్సల్యముతో పెంచినదో చూడండి :

"ఆవువెన్నతో నొడలెల్ల నలమితోమి। గోరువెచ్చని నీర్వోసి కోకదుడిచి।
యగురుసాంబ్రాణి పొగవెట్టి యప్పుడపుడె। రారనాయన్న యని చెప్పి రాధయంత॥
ఆవునేతిలో బోరవించినట్టి కూరగాయ లాఉరసంబులు గల్గుమేలు।
వంటకము సిద్ధపరచి సాపడగ బెట్టి కడను గూర్చుండు గృష్ణుండు గుడుచునపుడు"

ఇంక ప్రియురాలు రాధ—

"ప్రొద్దు పొడుపు మొదల్ పొద్దుగ్రుంకు వరకు జిన్నికృష్ణ రాధల కట్టెచెలిమికల్గి యొకరినొక్కరు విడనాడి యుండలేక తనిసి ఎంతసుద్దులు చెప్పుకొనుచు నుందురి"

"ఊరములను దూరి యేటితీరము జేరి చెట్టునీడ నిక్కి గట్టులెక్కి।
ప్రణయమగ్నులగుచు రాధికా శ్రీకృష్ణులాడుకొందురెవరు చూడకుండ॥"

ఈవిధముగా ఆరంభించి ప్రేయసీ ప్రియురాలైన రాధాకృష్ణుల ప్రణయ లీలలను కవిరాజుగారు ఇరువది పద్యాలలో మిక్కిలి మనోజ్ఞముగా వర్ణించినారు. ఇందులోని ప్రతిపద్యమునా ఉత్తమ ప్రమాణ మందుకొన్న శృంగార రసమధువునిండి వున్నది. ఆలంకారికులకీ పద్యాలు ఆణిముత్యెములవంటి ఉదాహరణములు. అంతేగాక ఇక్కడి కవితాపాకము రసజ్ఞులకు చవులూరిస్తుంది. విమర్శకుల తల పంకింప జేస్తుంది.

కృష్ణుని పెంచి, ప్రేమించిన రాధ లిర్వురని తెలియక భక్తులు మేనత్త రాధతో కృష్ణునికి చెడుపొత్తు

భ్రమించి దానిని భక్తిగా సమర్థించుకొన్నారు. వేదాంతులు జీవాత్మ—పరమాత్మల సంబంధముగా తికమకబడి తేల్చినారు.

2. సామాజికాభిరుచి :

కృష్ణునిగూర్చి వ్రాసిన పురాణాలన్నీ యేవిధముగా చిత్రించినవో కవిరాజుగారు కన్నుల వత్తుల నిడికొని పరిశీలించారు. లోకమేమంటుందో పరికించి చూచారు. సిసలైన న్యాయవాది కనుక వకాల్తా పుచ్చుకొని వాదించాలనుకొన్నారు. ఆలోచించి తుదకు తానే న్యాయమూర్తిగా న్యాయపీఠ మధిష్ఠించి కృష్ణుని మంచిచెడ్డపై కచ్చితమైన తీర్పు ఇచ్చారు. ఆ తీర్పును సూతునిచేత క్రింది విధముగా చెప్పించారు–

1 కృష్ణుని వంశ క్రమానుగతి
2 అతని కాలమునాటి సామాజికస్థితి
3 అతని రాజకీయ జీవితము
4 అతని ధార్మిక జీవితము
5 అతని జన్మ సార్థకత

ఈ అంశాలన్నీ కవిరాజుగారు ఏఒక గ్రంథాన్నుండీ గాక బ్రహ్మపురాణము, భాగవతము, భారతము అనే ఈ మూడు గ్రంథాలనుండి స్వీకరించారు. అయితే వీనిలో ఒక్కొక అంశము ప్రధానంగా ఒక్కొక గ్రంథమునుండి

స్వీకరింపబడినది. వంశ చరిత్ర బ్రహ్మ పురాణమునుండి, ధార్మికజీవితము భాగవతమునుండి, రాజకీయ జీవితం భారతమునుండి, మిగిలిన రెండు అంశాలు భారత భాగవతాల రెంటినుండి స్వీకరించారు.

1. వంశక్రమానుగతి :

ఒకేజాతికి చెందిన "యదు, వృష్ణి, భోజ, అంధక, సాత్వత" అనే తెగలలో యదువు మూల పురుషుడుగాగల యాదవ తెగకు చెందినవాడు కృష్ణుడు. ఈ తెగకు రాజ్యాధికారము లేదు. అట్టి అధికారముగల భోజ తెగలో యాదవులు చుట్టరిక మందినారు. కంసుడు భోజ తెగకు చెందినవాడు. కృష్ణుని తల్లి దేవకీదేవి. కంసునికి వరుసకు చెల్లెలుగాని సోదరికాదు. బలరాముడు—కృష్ణుడు ఒక తల్లి బిడ్డలు కాదు. సాత్యకి ఆ వంశములోని జ్ఞాతి. సుభద్ర బ్రహ్మపురాణమునుబట్టి బలరామునికి, భాగవతమునుబట్టి కృష్ణునికి చెల్లెలు. యాదవులు రాజ్యార్హతలేసి సాటి తెగలైన చెంచు, బోయ, శబర, ఎరుక మున్నగు ఆటవిక జాతులతో సమానులుగ ఎంచబడి మ్లేచ్ఛులుగా కూడ వ్యవహరింపబడుతుండేవారు. ఇందులోనివాడే ఏకలవ్యుడు. ఇతడు కృష్ణుని పినతండ్రి కుమారుడు. ఈ యాదవకృష్ణుడు గోపకుడైన నందునింటే పెరిగి గోపాలుడు లేక గోపకుడూ అయినాడు.

## 2 సామాజిక స్థితి :

కృష్ణుడు జన్మించునాటికి ఆర్య ద్రావిడ సంఘర్షణ హెచ్చుగా నుండుటచేత దేశము చాల అల్లకల్లోలముగా వుండెను. పూర్వులైన ద్రావిడులు దండెత్తివచ్చిన ఆర్యుల ధాటిని తట్టుకోలేక పోయారు. అంతట ద్రావిడ మన్నీలంతా ఉత్తర భూములు విడిచి మధ్యప్రదేశం ప్రవేశించి అక్కడ చిన్న చిన్న రాజ్యాలేర్పరచుకొని అన్యోన్యసహకారముతో బ్రదుకుతుండిరి. కాని ఆర్యులు వీరినక్కడ కూడ బ్రతుకనియ్యరని తెలిసి తమ కోటలు, సేనలు మొదలైనవి మరింత గట్టిపరచుకొని శత్రువుల నెదిరించటానికి సిద్ధమై ఉండిరి. అట్టివారిలో యదు, వృష్ణి, భోజ, అంధకులు ముఖ్యులు. వీరిలో రాజవంశీయులై భోజులతో చుట్టరికమున్నా యాదవులకు రాచకులములోని గౌరవ సత్కారాలు లేక హీనముగా ఎంచబడుతూ వుండేవారు. అందుచేత తాముా బలపడి ఉన్నత స్థితి దొరికే అవకాశముకోస మెదురు చూస్తుండేవారు. పైగా కృష్ణుని కాలము నాటికి సాంఘిక పరిస్థితులు మరొక రూపముతో తారుమారు కాసాగినవి. అదివరకున్న నీతి నియమ శృంఖలాలు తెగిపోవుటకు సిద్ధంగా వున్నవి. అనులోమ, ప్రతిలోమ వివాహాల వలన ఎల్లచోట్ల కులవ్యవస్థలో మార్పులు రాసాగినవి. ఆర్య-ద్రావిడ జాతులమధ్య కూడా వివాహ సంబంధాలు సాగినవి.

### 3. శ్రీకృష్ణుని రాజకీయ జీవితము :

సాటివారిలో తమకులానికి గౌరవ ప్రతిపత్తులు లేనందుకే బాధపడుతుండగా, తన తలిదండ్రుల చెరబట్టి తన్ను చంపజూస్తున్న భోజకులీనుడైన కంసుని తలచి కృష్ణుడు మరింత బాధ పడసాగెను. ఈ స్థితిలో తాను కంసుని చంపి ఆత్మరక్షణ చేసికొనుటేగాక రెండవ ప్రయోజనముగా తాను బలసంపన్నుడై రాజ్య చక్రము చేబట్టి భారతావనిలో తన యేకచ్ఛత్రాధిపత్యం సాగింప నిశ్చయించాడు. ఇందుకు వ్యూహాలు పన్నసాగినాడు. అతనికి లక్ష్యసిద్ధి ప్రధానము. అందుకై యే సాధనమైనా అవలంబిస్తాడు. తనకు అడ్డువచ్చిన తనవారినైనా హతమార్చుటకు గాని, కలిసివచ్చిన పరవారినైనా కలుపుకొనుటకు గాని వెనుకాడడు. ఈ విధానమనుసరించి అతడు మొదట తన ద్రావిడ జాతిలోగల అంతశ్ఛిద్రాలు తొలగించు కోటానికి సాటి తెగలు భోజాంధకాదులవారి కన్నెలను పెండ్లాడుట ద్వారా కొంతగా కృతకృత్యుడైనాడు కాని, స్వజాతిలోని వారే కంస జరాసంధాదులు ప్రబల శత్రువులై హతమార్చటానికి శతధా ప్రయత్నిస్తుండుట వలన ఆదమరచి నిద్రపోలేకుండెను. అందుకై ఆర్యుల చెంతజేరి వారిలో చీలికలు తేగలిగినాడు. కురు పాండవులమధ్య అసూయా ద్వేషాలు రగుల్కొలిపాడు. ఆ వ్యూహంలోనే రాజసూయ యాగము పాండవులచేత చేయించదలచి అందుకు నారదుని చేత ఇట్లు అబద్ధమాడించినాడు.

"మొన మొన్ననె త్రిదివమునకు జనివచ్చిన వాడ నేను జనపాలా మీ జనకుని నటగాంచితి....

అని ఆరంభించి స్వర్గమునఉన్న తండ్రి పాండురాజు కోరికగా

"నాకుం గూర్పుము సత్యలోకము మహానందంబు వాటిల్లగా
సాకల్యంబుగ రాజసూయమను యజ్ఞం బొందు గావించుచున్"

అని నారదుడు ముగించి పాండవుల రాజసూయానికి సిద్ధంచేశాడు. ఇక్కడనుండి నానాటి అన్నదమ్ముల క్రోధాగ్నిని ప్రజ్వలింపజేసి రాయబారము నాటికి ద్రౌపదిచే

"పామైన మఱచిపోవును భామిని మరవంగబోదు పగ నెన్నటికిన్"

అనిపించి రాయబార తతంగములో కుదురని అయిదూళ్ళ షరతుతో సంధిని చెడగొట్టి కురుక్షేత్ర యుద్ధము సిద్ధముచేశాడు. అస్త్రసన్యాసంచేసిన అర్జునునికి గీతామద్యము త్రాగించి ఉభయపక్షాల తన కడ్డువచ్చిన వారిని అతనిచే నిర్దయగా అధర్మముగా హతమార్చచేసి తన రాజనీతి చతురతకు కార్యసాఫల్యానికి ఉబ్బి తబ్బిబ్బై వికటాట్టహాసము చేసినాడు.

## 4. కృష్ణుని ధార్మిక జీవితము:

సూతపురాణశ్రోత సూతమహర్షిని—

"శ్రీకృష్ణు చరితంబుఁ జెప్పవే సర్వంబు పుట్టుపూర్వములన్ని పొందుపరని"

అని అడుగ నారంభించి

"పోకముడి విప్పనీయని పోకలాడి రైకముడి విప్పనీయని సాకులాడి
బళిర యుండరైరంట వ్రేపల్లెయందు గృష్ణ పోకిళ్ళచే నదియెంత నిజమొ"

"వరుస వావులులేక వ్రేపల్లెనున్న యట్టి మగనాండ్రు రంకుటాండ్రైరటంచు
సాటిలోకులు వాయెత్తి చాటుచుండ్రు కృష్ణుపోకిళ్ళచే నిదియెంత నిజమొ"

అని ప్రశ్నోత్తరముల రెంటిని గలిపిన ప్రశ్నలను వెలికి తీస్తాడు. తెలిసి అడుగుతున్న ప్రశ్నలని గ్రహించి సూత మహర్షి సంగ్రహంగా జవాబిస్తాడు.

"తెలినట యమునలో జలకమాడెడి గోపికల కోకలను మూటగట్ట నేర్చె"
"కొండాటముం గోరికొంపకొంపలు దూరి మిసిమి వెన్నల ముద్దమెసవ నేర్చె"

బట్టవిప్పిన భంగి భాగవతములో కనబడుతున్న యీ అసభ్య విషయాల తిరిగి ఏకరువు బెట్టుట కవిరాజు కిష్ట మున్నట్లు లేదు. కృష్ణునికంటె ధర్మభ్రష్టు డింకొకడు పురాణ పురుషులలో లేడని కవిరాజు భావము.

## 5. కృష్ణుని జన్మ సార్థకత:

రాజకీయ జీవితము రెండు తెరగులు. ఆత్మరక్షణకై అవసరోచితముగా చతురుపాయాల నుపయోగించి కృత కృత్యుడగుట ఒకటి, తన ఆధిక్యస్థాపనకై మంచిచెడ్డల మరచి పరుల అణచివేయుట రెండవది. ఇందు మొదటి తెరగుకు చెందిన కృతకృత్యుడైన రాజనీతివేత్త చాణక్యుడు రెండవ తెరగుకు చెందిన వ్యర్థాయాసం పాలైన రాజనీతి వేత్త కృష్ణుడు. స్వపర భేదం పోనాడి ఆర్య ద్రావిడ జాతుల రెంటిని సర్వనాశనంచేసి కురుక్షేత్ర యుద్ధముతో భారతభూమిని స్మశానంగా మార్చినాడు. పదమూడేళ్ళ

యుద్ధశిక్షణపొంది యుద్ధంలో గెల్చిన పాండవవీరులంతా రాజ్యంచేయించలేక పోగా వారు విరక్తులై రాజ్యం విడిచి మహాప్రస్థానం సాగించారు దానితో వీరరస ప్రధానం కావలసిన భారతేతిహాసము శాంత రస ప్రధానమయింది. అధర్మంగా తొడలు విరుగగొట్టబడి నేలగూలిన సుయోధనుని అవసాన వాక్యాలు వినండి.

"సేతువుగొట్టి సీత నగసీమల దాకనుగల్గు భూతధా
త్రీతల భాగమంతయును రేగిన తీరని యాడు కూయిచే
స్రోతలు మ్రోగుచున్న గనుమూసిన రాత్రులు నిద్రపట్టునే
నీ తల వ్రాత ఈవిధము నీకొడ గూర్చె దురంత దుఃఖముల్"

"చెల్లదు. సత్యమున్ వినుము చెప్పెద మాధవ. సర్వ ధారుణీ
వల్లభులున్ నశింప యగు వంశమె యే లెదునన్న మాట. నీ
వల్ల నొనర్పబడ్డ బహు పాతకమూలక ధర్మపీడలున్
వల్లిడి గూర్చి కూర్చి యదు వంశము బీలిచి పిప్పి జేయవే"

అన్నట్లుగానే యుద్ధంవల్ల దేశం పీనుగుపెంటలు కాగా, దేశంలో శాంతిభద్రతలు, నీతి నియమాలు మటుమాయం కాగా స్త్రీ బాలవృద్ధులకు రక్షణ లేకపోయింది. తుదకు తన యాదవ జాతి అంతఃకలహాలతో తాను చూస్తుండగా నరుకుకొని చచ్చింది. జాతిద్రోహి అన్న కారణంగా పగ బూనిన ఆటవిక జాతులవారు తనవారిని చంపి స్త్రీలనపహరిస్తుండగా గ్రుడ్లప్పగించాడు. తానుకూడ ఒక ఎరుకని అమ్ము పోటుచే దిక్కులేని కుక్కచావు పాత్రైనాడు.

కృష్ణు డీవిధముగా వ్యర్థజనుండై భారత వ్యాఖ్య

యుగాలపర్యంతం తీరని అపకారం పాల్జేసినాడు. కవిరాజు గారు ముగింపులో అన్నట్లు ఇతడు "జగన్నాటక సూత్ర ధారుఁడే" గాని యితడాడించిన నాటకం మాత్రం విషాదాంతంగా ముగిసింది.

—శోభనరావు

# కవిరాజు శబ్దసృష్టి

కవిరాజు కన్నా భాషా పండితులు చాలమంది వారి సమకాలికులే కలరు. కాని, కవిరాజు శబ్దవైచిత్రిని కవితలో చూపుటయేగాక, మహత్తర కవితాసృష్టిని చేయుటయేగాక తెలుగునుడికారపు పదును చూపుటయేగాక, తెలుగు దనపు తీరుతెమ్మెల సొగసు సంపదలను దీపించుటయేగాక, నూతన శబ్దములను ప్రౌఢిమవార విరచించి సృష్టించినారు.

కవిరాజుకేగాదు, చరిత్రలో ప్రతి నూతన వుద్యమా నికీ కొన్ని నూతన శబ్దాలు రాకతప్పదు; రానిది కథ సరిగా నడవదు కూడా. తమ అవసరం కొద్దీ నూతన పదజాలాన్ని త్రిపురనేని ప్రయోగించు కొన్నారు.

కురుక్షేత్రంలో ఆ అవసరం రాలేదు. శంబుకవధతో అక్కర ప్రారంభమైంది. గ్రంథాల వారీగా, వారి నూతన శబ్ద సృష్టిని, అర్థ విశ్వాసాన్ని చూద్దాం.

శంబుకవధ :

1. వానరులు : అనగా కోతులు. అది లోకం గ్రహించే అర్థం. అందుకే 'వానరు' లనగానే తోకల్ని

తగిలించారు. కాని, వానరులనగా వికృతనరులని, సౌందర్యహీనులని అర్థము. 'సవరు'లో 'అరసి' అను జాతి కలదు. 'అరసి' యనగా కోతియని యర్థము. వీరినే 'లంబోలంజ్' అందురు. అనగా దీర్ఘవాలములు, లేక, కౌపీనములు కలవారని యర్థము.

యింతేకాని వానరులకు తోకలులేవు. వాల్మీకి తోకలు పెట్టలేదు. వ్యాసుడు కృష్ణునిభార్య జాంబవతికి తోక తగిలించలేదు. మనుజులకు వానరులకు వివాహాములగుచుండ, తోకలెట్లుండును? యీ తోకలు లోకులు తగిలించినవే!

౨. యోజనము: అనగా 'ఆమడ' అనగా ఎనిమిది మైళ్ళు. దీనినిబట్టి లంకాద్వీపము హిందూదేశమునకు 850 మైళ్ళదూరము సిలోను అంతదూరము లేదు.

౩. యక్షులు: యిది సంస్కృత శబ్దము. ప్రాకృతమున 'యెక్కలు' అనియు, తెలుగున 'జక్కులు' అనియూ అర్థము. వీరు తెలుగు దేశవాసులు.

## సూతపురాణము :

4. ప్రాచీనబర్హి: యిది సంస్కృతము. తెలుగున 'పాతనెమలి' యిది యింద్రునికి బిరుదనామము. వేయి కన్నులు కలది. యిందురినికి కన్నులు లేవుగాని, కామవికారుల కుండు పొడలు గలవు.

5. రావణుడు: యిది సంస్కృతము. బొబ్బపెట్టువాడని యర్థము. కోయభాషలో రావ—అన=రావణ అని

కలదు. 'రవ' మనగా నేర్చుట. తెలుగులో నది 'రవ్వ' గను, కన్నడమున 'రావ' గనున్నది. అనగా, యితరుల నేడ్పించుటయందు పరాక్రమము కలవాడని యర్థము. తెలుగులో 'రావన్న' అంటాము.

6. దశగ్రీవుడు: సంస్కృతము. పది తలలవాడని అర్థము. కోయభాషలో "దసగీవ" కలదు. 'దస' యన 'బాధ'. 'గీవ' యనగా 'కలుగజేయుట.' 'దసగీవ' యనగా బాధ కలుగజేయు వాడని యర్థము. సంస్కృతీకరించి, పది తలలవానిని జేసిరి. ఆర్షబుుషులు చేయునిది యేమి కలదు.

7. త్రివిష్టపము: దీనిని టిబెట్‌గా గుర్తించిరి. స్వర్గ మనగా గూడా నిదియే ననిరి. స్వర్గములోని పురాణస్థ ఆచారములు టిబెట్‌లోని యాచారము లొకటిగా నుండె ననిరి.

8. దశాస్యుడు: యిది సంస్కృతము పది మొగముల వాడని యర్థము. కోయభాషలో దశ + అసి = దశాసి బాధ కలుగజేయువాడని. దశాసి = దశాస్యః = దశాస్యుడుగా జేసిరి.

9. రాక్షసులు: దీనికి సంస్కృతము అంగీకృత శబ్దము లేమిచే, నైఘంటికులు భిన్నపదముల వాడిరి. రాక + అసి = రాకాసి, లేక రక్క + అసి = రక్కసి. దీనిని సంస్కృతీకరించి రక్షస్సుగా జేసిరి. రక్షస్సులు రాక్షసులైనారు. శూర్పనఖ: సంస్కృతము. కోయ భాషలో "చుప్పనాక". సంస్కృతీకరించి చేట గోరల దానిగా జేసినారు.

10. కోయలు యుద్ధమునకు బోవుచు, కృత్రిమ వికార వేషములను వేసుకొనుచుండుటచే, రాక్షస వికార రూపములకు ఆ వేషములు కారణములైనవి. రాక్షసులకు వాడబడు నాయక నామములన్నియు కోయభాషలో గలవు.

యివి ముఖ్యమైన పదములు. వాద్యములనేకము లేవనెత్తితి. ఈ పద సారళ్యమును వాదనా పటిమ తేల్చును. కాబట్టి ప్రతియుగారంభమునకు, వాదారంభమునకు ఇట్టి నవ్యపద జాల ముత్పన్న మగును.

కవిరాజు ఒకానొక యుగారంభకుడౌటచేత యీ విధంగా పదప్రయోగ, అర్థ పరిణామములను వివరించుచు, నూతన ప్రయోజనములను సంతరించు కొనెను.

—'యమ్'.

—()—

# కవిరాజు చలోక్తులు

సంభాషణల చమత్కారానికి కవిరాజుకు పెట్టింది పేరు. వేదికలమీద వుపన్యాసమన్నా, తమ పద్యాలు తాము చదవాలన్నా కొంచెం గొగ్గిరిగా వుండేది. పద్యాల్ని రానివాడు మంత్రాల్ని చదివినట్లు చదివేవారు. వుపన్యాసాల్లోనూ, ఒజ్జు తక్కువ; విషయ ప్రాధాన్యతవున్నా, ముక్కలు ముక్కలుగా వుండేది.

కాని, సంభాషణల్లో యెంతో చమత్కారం, ఎంతో హాస్యం జాలువారేవి.

ఒకనాడు, తోటలో అరటిమొక్క పాదు చేస్తూ వుండగా, విశ్వనాథ సత్యనారాయణగారు సూత్రాగ్రహానికి వచ్చి, "కవిరాజుగారూ అరటిగెల ఈశాన్యపు మూల వేయరాదంటారు, కోయించివేయండి" అన్నారట. వారి మాట ముగియకముందే "అవును, సత్యనారాయణగారూ యింకొక వారానికి పక్వాని కొస్తుంది, అట్లాగే కోసివేస్తా"నన్నారట.

ఒక నాడొక సభలో కవిరాజు వారి విప్లవాత్మక భావప్రసంగాలు చేసిన తర్వాత, అక్కసు పట్టలేని ఒక శ్రోత "మీరింతగా రాముణ్ణి ఆడిపోసినా, మీ పేరు రామస్వామి యేగదా" అన్నాడట. "అవును, నేను రామునికి మొగుణ్ణి కనక నాపేరు రామస్వామి" అని చటాలున అనేసరికి పృశ్ఛకుడు మూర్ఛిల్లినంత పని అయినదట.

అంగలకుదురు లో ఒక ఉపన్యాసక చక్రవర్తి కవిరాజుతో ఢీకొన్నప్పుడు, "మీరు మ్లేచ్ఛులు గదా" అని కవిరాజుగారు వారిని అంటే వారు హుంకరించి "నేను స్వచ్ఛమైన బ్రాహ్మణ్ణేసుమా" అన్నారట. "మీరు మను

స్మృతి నంగీకరిస్తారా?" అని కవిరాజు వారిని అడుగగా, వారు "మహాప్రసాదంగా" నన్నారట. మనుస్మృతి గత శ్లోకాన్ని విసరి, అర్థాన్ని వివరిస్తూ "వింధ్యదాటి దక్షిణానికి వచ్చినవాడు మ్లేచ్ఛుడ"న్న వాక్యాన్ని చెప్పగా, సభికులు గొల్లుమన్నారట. వుపన్యాసక చక్రవర్తికినక్కెళ్ళుపడినవట.

* * *

కొల్లూరు ఆరోజుల్లో వేటభూమి. ఒక దీక్షితులు "కమ్మ", "కుమ్మర" శబ్దసామ్యము వారిరువురు ఏకోదరులనిపించున" న్నారట. గభీలున "అవును, దీక్షితులుగారూ విప్ర వుప్పర" శబ్దసామ్యమునుబట్టి యేక గర్భజనితులుగా నున్నారనగా సభలో హర్షధ్వానాలు మిన్నుముట్టినవట. దీక్షితులుగారు దిగ్భ్రమ చెందారట.

* * *

రాజకీయ చర్చల్లో ఒకనాడు ఒక గాంధేయుడు "నూలువడికితే స్వరాజ్యం వస్తుంది" అంటే "నూలువడికిన రోజుల్లోనే ముందుగామన స్వరాజ్యం పోయింది. తిరిగినూలు వడికితే యెట్లా వస్తుంది" అని కవిరాజు దుబాళించారట.

* * *

ఈగర గోపయ్యగారు శ్రీచౌదరిగారిని ఇలా ప్రశ్నించారు :

"రామస్వామిగారు ! దేవుడు విషయం—మీరు వున్నాడనా లేక లేడనా: ఏమంటారు?" వారు ఇలా సమాధానపరచిరి. దొంగతనం చేస్తే కోర్టుకు వెళ్ళాలి అనే సంగతి తెలుసుగదా! మానవుడు సరియైన ప్రవర్తన అలవరచుకుంటే దేవుడుతో ఏమిపని?" అని అన్నారు.



# కవిరాజు జీవిత రేఖలు

| | |
|---|---|
| 15-1-1887 | జననము |
| 15-7-1895 | విద్యాభ్యాసము |
| 15-1-1900 | ఆంగ్ల విద్యాభ్యాసము |
| 15-1-1905 | ఉన్నత పాఠశాలా ప్రవేశము |
| 15-1-1913 | బొంబాయిలో న్యాయశాస్త్రము |
| 1-11-1914 | డబ్లిన్ ప్రయాణము |
| 1-11-1917 | బందరు బారిష్టరు ప్రాక్టీసు |
| 15-6-1922 | తెనాలిలో ప్రాక్టీసు ప్రారంభము |
| 1942 | గుడివాడలో సన్మానము |
| 16-1-1943 | మరణము |

# పగవారు

పగవారు మనపైకి వచ్చిపడ్డారు
కోయంచు మనయూళ్ళు కొల్లగొట్టారు
గూటిలో పిట్టల్నికూల్చివైచారు
పొలములో పసిలేళ్ళ పొడిచివైచారు

మరచి పోవద్దోయి మరచిపోవద్దు
మనజాతి యగచాట్లు మరచిపోవద్దు

కారుకోనలు దూరి కలిగి పొయ్యారు
దుంపకూరలతిండి క్రుంగి పొయ్యారు
గోచిపాతలు కట్టి క్రుంగి పొయ్యారు
ప్రొద్దెల్ల మనవారు పొగిలి పొయ్యారు

మరచి పోవద్దోయి మరచిపోవద్దు
మనజాతి యగచాట్లు మరచిపోవద్దు

పంగిళ్ళ కయ్యాల పంట్రించినారు
పసిపాప యుయ్యాల పార దన్నారు
నిదురపోనీకోయి నీచేతికత్తి
త్రాగించు పగవారి రక్తంబు నెపుడు

మరచి పోవద్దోయి మరచిపోవద్దు
మనజాతి యగచాట్లు మరచిపోవద్దు

—కవిరాజు



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 106 B 123 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 349 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 8, 62B |
| లేని పేజీలు | 1to6 |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Prasanna |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిసితి | Good |